ప్రచురణ - నవంబర్, 1999

ప్రతులు - ఐదువందలు

టైటిల్ డిజైనర్ - శీలావీర్రాజు

లేజర్ టైప్‌సెటింగ్ - శ్రీ సత్యాగ్రాఫిక్స్, దిల్‌సుఖ్‌నగర్.

వెల - రూ॥ 175/-



ప్రచురణ - శ్రీ బాలాజి ఆర్ట్ ప్రింటర్స్, చిక్కడపల్లి, హైదరాబాద్

ప్రతులకు :

1) నవోదయ బుక్‌హౌస్
ఆర్యసమాజ్ మందిర్ ఎదుట
కాచిగూడ, హైదరాబాదు.

2) "సంస్కృతి"
35-67/1,
జి.కె. కాలనీ, పోస్టు - సైనిక్‌పురి,
సికింద్రాబాద్ - 500 094.
ఫోన్ : 7113117

# అంకితం

తెలుగు వెలుగుల
జిలుగు మెరిసీ
మనక లెరుగని
మమత కురిసీ
నన్ను నన్నుగ
తీర్చి దిద్దిన
నాకు 'నాద'ను
తీవి పెంచిన
నా
తెలంగాణకు -

**డా॥ మారంరాజు ఉదయ**

# ఆకాంక్ష

నిజాంరాష్ట్ర మండలి తెలంగాణ ప్రాంతమున నెలకొని యున్న ప్రజాజీవన విధానమును ప్రతిబింబింపజేయు నవలలను సమగ్రముగా పరిశీలించి, పరిశోధనా గ్రంథముగ వెలయించి డాక్టరేటు పట్టమును పొందిన డా॥ ఉదయగారు అభినందనీయులు.

నిజాంరాష్ట్రమున కొక ప్రత్యేకత యున్నది. ఆసఫ్జా వంశజులైన హైదరాబాదు రాష్ట్రపాలకులు, పాలన విషయములందు స్వతంత్రులై, తంతి, తపాలా, రైల్వే, ఆర్.డా.డి. సిక్కాలను ప్రత్యేకముగ కలిగి యుండిరి.

ఏడవ నిజాం అలాహజ్రత్ మీర్ ఉస్మానలీఖాన్ బహద్దూర్ క్రీ॥శ॥ 1911లో రాజ్యాభిషిక్తుడై క్రీ॥శ॥ 1936 వరకు చక్కని పరిపాలన మొనర్చెను. ఈ 25 ఏండ్ల పాలనాంతమున రజతోత్సవములు రాష్ట్రమంతట ఘనముగ నిర్వహించబడినవి.

నిజాంరాష్ట్రము ఔరంగాబాదు, గుల్బర్గా, మెదక్, వరంగల్ సుబాలు కలది. ఈ రాష్ట్రమున 1. ఔరంగాబాదు 2. బీడ్ 3. పర్భిణి, 4. ఉస్మానాబాదు, 5. నాందేడ్ అను మరాఠా జిల్లాలు. 1 బీదరు, 2. గుల్బర్గా, 3. రాయచూరు అను కర్నాటక 3 జిల్లాలు. 1. ఆదిలాబాదు, 2. కరీంనగర్, 3. వరంగల్, 4. నల్లగొండ, 5. మెదక్, 6. నిజామాబాదు. 7. మహబూబ్‌నగర్, 8. అత్రాఫ్ జిల్లా అను 8 తెలంగాణ జిల్లాలు మొత్తము 16 జిల్లాలలో నిజాం రాష్ట్రము కూడి యుండెను.

తెలంగాణ స్థితిగతులను వివరించుచు, ప్రజలమనిషి, గంగు, చిల్లర దేవుళ్ళు, మోదుగు పూలవంటి అనేకానేక నవలలు పోలీసుచర్య తరువాత వెలువడినవి. అనాటి తెలంగాణమున దేశ్‌ముఖ్, దేశ్‌పాండ్యాలు జాగీర్దారులు, వతన్‌దారులు చేసిన దురంతములు, ప్రజల దుర్భర జీవన

విధానము, వెట్టిచాకిరి, బలవంతపు పన్నులు వసూళ్ళు, ఆడపాపల, సేవకుల, సేవకురాండ్ర జీవితములు. దొరల, దొరసానుల విలాసమయ జీవితములు, జాగీరుదార్ల దౌర్జన్యములు. అవినీతి పనులు. ప్రభుత్వాధికారుల పలుచతనము, దుర్మార్గపు చర్యలు. షేరీదార్ల ప్రవర్తన, మాలమాదిగల, గిరిజనుల దురవస్థలు, దొరలకు వారొనర్చు సేవలు, స్త్రీల ఆక్రందనలు, నిజాం వ్యతిరేక పోరాటములు, ఆంధ్రజనసంఘము, గ్రంథాలయోద్యమము, ఆంధ్రమహాసభలు మున్నగు విషయములతో కూడిన నవలలను క్షుణ్ణముగ నధ్యయనమొనర్చి డా॥ ఉదయగారపురూపమైన పరిశోధనా గ్రంథముగా **తెలుగు నవలల్లో తెలంగాణ జనజీవనంను** రచించినారు.

ఈ పరిశోధనా గ్రంథము ఐదు అధ్యాయములలో రచింపబడినది.

**1) తెలంగాణ ప్రత్యేక పరిస్థితులు**

**2) పల్లె జీవితం**

**3) నగర జీవితం - రాజకీయ సంబంధాలు**

**4) గిరిజనుల జీవిత పరిస్థితులు**

**5) తెలుగు నవలల్లో తెలంగాణ స్త్రీలు**

**మొదటి** అధ్యాయమున పోలీసు చర్యకు పూర్వము తెలంగాణమున నెలకొని యున్న ప్రత్యేక పరిస్థితులను డా॥ ఉదయగారు సంక్షిప్తముగ రచించినారు. ఇది నిజాం రాష్ట్ర ప్రజల దుర్భర స్థితిని తెలుసుకొనుటలో తోడ్పడును. ఇందు, నిజాం రాజ్యవ్యవస్థ, ముస్లిం పాలనావిధానములు, దేశ్‌ముఖ్, దేశ్‌పాండ్యా, జాగీర్దార్ల, వతందార్ల పాలనలో ప్రజలు గడిపిన దురవస్థల జీవితములు వెల్లడింపబడినవి.

**రెండవ** అధ్యాయము పల్లెజీవనమునకు చెందినది. గ్రామ ప్రజల జీవన విధానము, రైతులు, కౌలుదార్లు వ్యవసాయ కూలీలుగా మ్రగ్గిన విధానము, ఆనాటి సాంఘిక, రాజకీయ, ఆర్థిక, స్థితిగతులు నిజాం

వ్యతిరేకోద్యమమును ప్రతిబింబించు నవలలలోని అపూర్వ సంఘటనలు, విశేషములు తెలుపుటలో రచయిత్రి తమ ప్రతిభాపాటవములను మేధాసంపత్తిని ప్రదర్శించినారు.

**మూడవ** అధ్యాయము నగర జీవితము, రాజకీయములకు సంబంధించినది. హైదరబాదు నగర సంస్కృతి, ఉరుదూభాషా ప్రభావము, తెలుగు భాష దీనస్థితి, కార్వెపండితుని సభలో తెలుగువారికి జరిగిన పరాభవము. ఆంధ్రజనసంఘ ఆవిర్భావము, గ్రంథాలయోద్యమము, ఆంధ్ర మహాసభల నిర్వహణ, ప్రజలలో చైతన్యమేర్పడుట, నిజాం వ్యతిరేకోద్యమములు, తెలుగాభాషాభివృద్ధి, నీలగిరి తెనుగు, మీజాన్, గోలకొండ, రయ్యత్ వంటి పత్రికల ఆవిర్భావము, శ్రీయుతులు మాడపాటి హనుమంతరావు, కొండా వెంకటరంగారెడ్డి, డా॥ బూరుగుల రామకృష్ణారావు, మందుముల సోదరులు, రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, సురవరం ప్రతాపరెడ్డి, జమలాపురం కేశవరావు, ప్రభుతుల నిస్వార్థసేవ, కాంగ్రెసు, కమ్యూనిస్టు పార్టీల ఉద్యమములు, శ్రీ రాజబహుద్దూర్ వెంకటరామరెడ్డి గారి సహాయ సహకారములు విద్యాసంస్థల స్థాపనము వంటి అనేకానేక కార్యక్రమములు రూపొందించుటలో నగరములు, పట్టణములు ప్రధానపాత్ర వహించినవి.

నిజాంరాష్ట్రమున ముఖ్యముగా తెలంగాణ మండలి, గిరిజనుల జీవితము, భూస్వాముల దౌర్జన్యములు, బంజారాలు, కోయలు, కోలాములు, గోండులు, చెంచులు, మాధురాలు తదితర గిరిజనుల అస్థిర జీవన విధానమును తెలుపు అధ్యాయము **నాలుగవది.** ఇందు అదిలాబాదు జిల్లా అసిఫాబాద్దు తాలూకా కెరమిరి ప్రాంతమున భూసంబంధ పోరాటములు, పన్నుల నిరాకరణ, కొమరంభీం విప్లవము, పోరాటములు, నిజాం

అధికారుల, పోలీసుల, దమనకాండ క్లుప్తముగ వ్రాయబడిన ఈ అధ్యాయము ప్రధానమైనది.

నిజాంరాజ్యస్థితిగతులను వివరించుచు వ్రాయబడిన నవలలోని స్త్రీల జీవితము, స్త్రీలు – ఆచారవ్యవహారములు, బానిస బ్రతుకుల, ఉంపుడుకత్తెల జీవితము, సేవకపురాంధ్రపైన ఆడపాపలపైన, దొరల, దేశ్‌ముఖ్‌ల వతందార్ల వారి బంధువుల, స్నేహితుల దౌర్జన్యములు, అఘాయిత్యములు, కన్నెచెరబాపుట, భోగము మేళములు, జోగినులు, బసివిలు, తదితర స్త్రీమూర్తుల చరిత్రలు తెలుపబడినవి.

భారతదేశము స్వాతంత్ర్యమును పొందిన తరువాత 1947 ఆగస్టు 15 నుండి 1948 సెప్టెంబరు 18 వరకు నిజాం రాజ్యమున రజాకార్ల, ప్రభుత్వాధికారుల, పోలీసుల, మిలట్రీవారల దురంతములు అనూహ్యమైనది.

ఏడవ నిజాం ఆలాహిజ్రత్ మీర్ ఉస్మానలీఖాన్ నిజాం రాష్ట్రమును ఇస్లామిక్ రాజ్యముగా రూపొందింప దలచినాడు. ఆయన రహబరెదక్కన్ అను ఉరుదూ దినపత్రికలో

"బందేనాఖాన్‌హువాసున్కే
నిదాయెతక్బీర్
జలలా ఆవేగయారిషైయే
జున్నార్సేభీ" అని ఖురాన్ మొదటి కల్మాను ప్రకటించినాడు.

ధ్వనిని వినినంతనే శంఖనాదమాగిపోయినది. హిందువుల మతచిహ్నముల పైనను జందెములపైనను భూకంప మాచ్ఛాదింపబడినది. ఇది ఖురాన్ మొదటి కల్మా భావము.

నిజాం రజాకార్లకు, అధికార్లకు, పోలీసులకు మిలట్రీవారికి సర్వాధికారములనొసంగి వారొనర్చు దురంతములకు సహకరించు చుండెను. హైదరాబాదు రాజ్యము ఇస్లామిక్ రాజ్యముగ స్వతంత్రముగ, వంశపారంపర్యముగ, పాలింప బడవలెనని ఉస్మానలీఖాన్ ఆకాంక్ష.

రజాకార్లు, పోలీసులు, మిలట్రీవారు, కట్టర్ ముస్లింలు తెలంగాణమున భీభత్సకాండను సృష్టించినారు.

అమాయకులైన ప్రజలను వరుసగా నిలిపి కాల్చి చంపెడివారు. షాహె ఉస్మాన్ జిందాబాద్, నినాదముతో నిర్దాక్షిణ్యముగ ప్రజలను హతమార్చెడివారు. కొందరు నరరూప రాక్షసులు, తల్వార్‌లతో యువకుల కంఠములను తెగనరికెడివారు. కొందరిని జంజాలతో పొడిచి చంపెడివారు. మానవత్వమునకు సమాధికట్టి వయసు తారతమ్యము లేకుండ, పట్టపగలు వందలాది స్త్రీలను బంధించి, అవమానించి, మానభంగములొనర్చెడివారు.

తల్లిదండ్రులముందు పసిపిల్లలను నేలకు విసిరికొట్టి చంపెడివారు. ప్రజల ఆస్తిపాస్తులను ధ్వంసము చేసి, ధనకనక వస్తు సంపదను దోచి, గడ్డి వాములను, పూరిగుడిసెలను, ఇండ్లను దహనముచేయుచు ప్రజలు ప్రాణభీతిచే పరువెత్తుచుండ వారిని వెంటాడి బంధించి పొడిచి చంపి తగులబడు ఇండ్లలోనికెత్తి పడవేసెడివారు.

రైలుబండ్ల నాపి, బోగీలలో నున్న వారిని దోచి నానాహింసలకు గురిచేసి రైలుపెట్టెలకు నిప్పంటించి, తగులబెట్టెడివారు.

ప్రతిదినము లారీలలో తమకు నిర్దేశించిన గ్రామములను చుట్టుముట్టి దోపిడీలు చేసి స్త్రీలను చెరబట్టి బీభత్సకాండను సృష్టించెడివారు.

ఈ దుర్మార్గపు చర్యల వలన తెలంగాణ ప్రజలు ప్రాణము లరచేతబెట్టుకొని జీవితములను గడిపినారు. అధిక సంఖ్యాకులైన హిందువులు, నిజాం రాష్ట్రమునుండి యూనియన్ ప్రాంతములకు తరలి పోవునట్లు చేయుట నిజాం అభిమతము. వారి స్థానమున యూనియన్ ప్రాంతములనుండి ముస్లింలను రావించి వారికి సమస్త సదుపాయము లేర్పరచి నిజాం రాజ్యమిస్లామిక్ రాజ్యముగ రూపొందింపవలెనని ఉస్మానలీఖాన్ ఆకాంక్ష.

పోలీసుచర్యకు పూర్వము తెలంగాణ గ్రామ ప్రజల పరిస్థితులను తెలుపునట్టి అనేక నవలలను, అధ్యయన మొనర్చి శ్రీమతి ఉదయ అపురూప పరిశోధన గ్రంథముగ దీనిని రూపొందించినారు. దేశ్‌ముఖ్, దేశ్‌పాండ్యాల వంశమున జన్మించి, బూర్జువాలకు వ్యతిరేకముగ పోరాటము సాగించిన నాయకులకు సహకరించిన కీ॥శే॥ శ్రీనాథరావు గారి తనయ డా॥ ఉదయ గారు ప్రజల మనోభావములను బాల్యమునుండియే ఆకళింపు చేసుకొని, చక్కని అవగాహన కలిగిన వనితామణి. ఆమె తెలంగాణ ఆంధ్రోద్యమ పితామహుడగు మాడపాటి హనుమంతరావు గారి జీవితము - రచనలపై ఎం.ఫిల్ పట్టా నిదివరలో పొందియుండిరి. వారిసమ్యక్భావములు యిట్టి గ్రంథ రచనకు ప్రేరకములైనవని తెలుపుచు వారింకను అపురూపమైన పరిశోధన గ్రంథములు వెలయించవలెనని ఆకాంక్షించుచున్నాను.

సరస్వతీనిలయం
3-4-245/1,
లింగంపల్లి, కాచీగూడ,
హైదరాబాదు-27.

బి.ఎన్. శాస్త్రి
3-12-1999

# కృతజ్ఞతలు

నేను 'మాడపాటి హనుమంతరావుగారి జీవితం - రచనలు' అనే అంశంపై (ఎమ్.ఫిల్) పరిశోధన చేస్తున్నప్పడే 'తెలంగాణ నవలలు'గా పేరున్న వాటిని చదవడం జరిగింది. సహజంగా అదే ప్రాంతానికి చెందిన దాన్ని కావటం వల్లనేమో చాలాచోట్ల నాకళ్లముందు జరిగిన సంఘటనల్ని లిఖిస్తున్నానేమో అన్పించింది. అందుకే పి.హెచ్.డి. పట్టాకోసం 'తెలుగునవలల్లో తెలంగాణ జనజీవనం' అన్న అంశంతో హైద్రాబాద్ యూనివర్సిటీలో పరిశోధనాంశంగా గ్రహించాను. ఆ విశ్వవిద్యాలయంవారు 1991 (ఆగస్టు)లో నాకు డాక్టరేట్ పట్టా ఇచ్చారు. ఆ సమయంలో నాకు పర్యవేక్షకురాలిగా తన అమూల్య సలహాలను అందించిన (నేను విసిగించినా సరే) డా॥ ఆనందలక్ష్మిగారికి,

పరిశోధన తొలిదశనుంచి సిద్ధాంతగ్రంథం సమర్పించే వరకు నా సందేహాలను తొలగించి సహకరించిన దాశరథి రంగాచార్య గారికి ధన్యవాదాలు.

సమాచార సేకరణలో ఎందరో మిత్రులు నాకు సహాయ పడ్డారు. ముఖ్యంగా

డా॥ వరవరరావు,

డా॥ ఏటుకూరి ప్రసాద్,

నిఖిలేశ్వర్,

వాసిరెడ్డి నవీన్ గార్లకు,

నా కృతజ్ఞతలు.

ఈ సిద్ధాంత గ్రంథ ముద్రణ నోచుకుంటున్నప్పడు నాకు సహాయంగా ఉన్న డా॥ వెలుదండ నిత్యానందరావుకు,

అందమైన ముఖచిత్రాన్ని చిత్రించిన శీలా వీర్రాజు గారికి, సకాలానికి గ్రంథాన్ని అందంగా అచ్చువేసి ఇచ్చిన శ్రీ బాలాజీ ప్రింటర్స్ యజమానికి, కార్మికులకూ నా ప్రత్యేక ధన్యవాదాలు.

డా॥ యం. ఉదయ

తెలంగాణ జనజీవితపు లోలోతుల్లోకి, సుఖదుఃఖాలతో మీరు (మీ పరిశోధనకోసమే అయినా) మమేకం కాదలుచుకున్నారు - నాలాంటి రచయిత ఏ వెలుగు నీడలను ఎత్తి చూపాలనుకున్నాడో - ఆ వెలుగు నీడల్లోకి మీరు పోవడమే కాక - ఇతరులకు దారికల్పిస్తామంటున్నారు... అందుకు నాకు మీరు మీకు నేను కృతజ్ఞత గలిగి ఉండేకన్న - సృష్టికర్తలైన తెలంగాణ జనం మీకు కృతజ్ఞత తెలుపు కుంటారు...

-అల్లంరాజయ్య

# ఆముఖం

సమాజమెప్పుడూ ముందుకే సాగుతుంది. అయితే నిన్నటి స్థితిని, జరిగిన సంఘటనలను, కలిగిన అనుభవాలను విస్మరించి వెళ్లదు. అలా వెళ్లడం అసంభవమే కాక అసాధ్యం కూడా! సమకాలికుల కోసం భవిష్యత్తరాలకోసం సామాజికాంశాలను, జరిగిన సంఘటనలను యథాతథంగా రికార్డుచేసి భద్రపరిచేవాడు చరిత్రకారుడైతే కళాత్మక దృష్టితో వ్యాఖ్యానించేవాడు సృజనాత్మక రచయిత.

బ్రిటిష్ పాలనలోని ఇండియాలో జరిగిన స్వాతంత్రోద్యమానికీ, నిజాం పాలనలోని తెలంగాణాలో తలెత్తిన ఉద్యమానికి ఎంతో అంతరం కనిపిస్తుంది. సిపాయిల తిరుగుబాటు (1857) నాందిగా, స్వాతంత్రోద్యమం (1947) భరత వాక్యంగా సాగిన భారత స్వాతంత్ర్య సంగ్రామానికి ప్రధాన గమ్యం ఒక్కటే. అది ఆంగ్లేయులు ఈ దేశం విడిచి వెళ్లాలని మాత్రమే. కాని, తెలంగాణాలో వచ్చిన పోరాటానికి కారణాలనేకం. ఈ పోరాటాల లక్ష్యం నిజాంని గద్దె దించడం లేక గోల్కొండ ఖిల్లా కింద అతడిని సమాధి చేయడం ఒక్కటే కాదు. అది ఒక భాగం మాత్రమే. భూస్వాములు, జమిందార్లు, దేశ్‌పాండేలు, దేశ్‌ముఖ్‌లు, పటేల్, పట్వారీలు మొదలగు దోపిడీదార్ల కబంధ హస్తాలనుండి విముక్తి పొంది స్వేచ్ఛా వాయువులు పీల్చాలనుకోవడం –

జీవనోపాధికి మూలమైన "భూమి"ని సొంతంచేసుకొని ఆత్మగౌరవంతో బ్రతకాలనుకోవడం – తెలంగాణా ప్రజల చిరకాల వాంఛ.

తరతరాలుగా నరనరాలలో బానిసభావం నిండుకొని అన్ని రకాలుగా నిలువుదోపిడి చేయబడి అణగారిపోయిన జాతిలో కలిగిన ఆవేదనకు – గుణాత్మకమైన ప్రగతిశీలమైన పరిణామమే తెలంగాణా పోరాటాలు.

ఫ్యూడలిజానికీ భూస్వామ్య దోపిడీ విధానానికి వ్యతిరేకంగా ఉవ్వెత్తున ఎగసిన తెలంగాణ పోరాటాన్ని, ఆర్యసమాజం, ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టు, కాంగ్రెసుల పాత్ర – రజాకార్లు, నిజాం తదనుయాయుల పాత్ర – సామాన్య ప్రజలు నలిగిపోయిన తీరు – కదలి తిరగబడిన విధం – పోలీసుచర్య పోరాట క్రమాలు పరిణామాలు మొ॥ విశాలాంధ్ర సిద్ధించాక, ప్రజారాజ్యం పరిఢవిల్లాక గ్రామ జీవనంలో కలిగిన మార్పులు – మారిన దోపిడీ విధానాలు, కార్మికోద్యమాలు, గిరిజన పోరాటాలు, నక్సలైట్ ఉద్యమాలు మొ॥ వాటన్నింటిని ఎంతో శక్తిమంతంగా తెలుగు నవలాకారులు తమ నవలల్లో చిత్రీకరించారు. ఆ పరిస్థితులకు దర్పణం పట్టారు. వట్టికోట అళ్వారుస్వామి ప్రభృతులు ఆ పోరాటాల్లో ప్రత్యక్ష భాగస్వాములై కారగార క్లేశాలు, అజ్ఞాతవాసాలు, అనుభవిస్తూ ఉద్యమాలు నడిపిన వారుకావడంతో వారి నవలల్లో వాస్తవిక దృక్పథం, ఉద్యమ శీలం ప్రతిభావంతంగా ప్రభావ వంతంగా చోటుచేసుకుంది.

వట్టికోట "ప్రజల మనిషి" గంగు; దాశరథి "చిల్లరదేవుళ్ళు", "జనపదం", "మోదుగపూలు", "మాయజలతారు"; సరిపల్లి కృష్ణారెడ్డి "యుగసంధి"; అల్లం రాజయ్య "ఊరు", "కొలిమంటుకున్నది", "అగ్నికణం"; ఇంకా జాతశ్రీ "సింగరేణి మండుతోంది", బోయజంగయ్య "జాతర"; పవన్‌కుమార్ "నల్ల వజ్రం"; తిరుపతయ్య "బతుకు" బి.యస్. రాములు "బతుకుపోరు"; అల్లం రాజయ్య, సాహు "కొమురం భీం" మొ॥ నవలలు ఉద్యమ శీలంతో తెలంగాణా జనజీవితాన్ని చిత్రించిన నవలలు. ఇంకా కొన్ని ఉన్నా, ఇవి ప్రధానంగా ఆ దృక్పథంలో వచ్చినవి. కనుక నేను వీటినే ముఖ్యాధారాలుగా గ్రహించాను. తెలంగాణ పరిస్థితులను పరిశీలిస్తూ పోలీసు చర్యకు ముందు ప్రజా జీవితాన్ని ఆనాటి రాజకీయ సామాజిక స్థితిగతులు–పోలీసు చర్య తదనంతరం వచ్చిన ఉద్యమాలను–వాటి రాజకీయ

సామాజిక స్థితిగతులు పైన పేర్కొన్న నవలల్లో ఏ విధంగా ప్రతిఫలింపబడ్డాయో గుర్తించడం గమ్యంగా నా సిద్ధాంతం గ్రంథం సాగింది.

నేను ఈ నవలలు వెలువడ్డ కాలక్రమాన్ని గ్రహించలేదు. చరిత్రలో భాగమైపోయిన తెలంగాణ పోరాటంలో వివిధ దశల కాలక్రమాన్ని ప్రాతిపదికగా స్వీకరించి, ఆ సంఘటనలు ఏ నవలల్లో ఉంటే వాటిని ఉదహరించుకొంటూ ముందుకు సాగిపోయాను.

నేనీ సిద్ధాంత వ్యాసాన్ని ఎన్నుకున్నప్పుడు పరిశోధన కోసం చాలా నవలలు చదవడం తటస్థించింది. నా పరిశోధనాంశానికి అవసరమైన రీతిలో వాటిని పరిశీలించడం జరిగింది. ఆ నవలల శైలి – ప్రసిద్ధి – యిలాంటి అంశాల జోలికి పోలేదు. వేటినీ పొగడటం – తెగడటం లాంటి పనులు చేయలేదు. ఇది నాపని కాదు కాబట్టి. ఆయా రచయితల రచనలకు – సందర్భాలు – సన్నివేశాలు సంఘటనలు – వారి వారి ఊహాపరిధి యివన్నీ కారణాలు కాబట్టి – నాకెంతసేపూ నా పరిశోధనాంశానికి అవసరమైన విషయమే నాకు ప్రధానం కాబట్టి నా పరిశోధనకు వాటిని ఆకోణంలోనే ఉపయోగించుకున్నాను.

నా సిద్ధాంత గ్రంథం **ఐదు అధ్యాయాలుగా** విభక్తమైంది. భూమికా ప్రాయమైన **ప్రథమాధ్యాయంలో** తెలంగాణాలో నెలకొన్న ప్రత్యేక పరిస్థితులను విహంగవీక్షణ ప్రాయంగా సమీక్షించాను.

తెలంగాణకే కాకుండా అసలు భారతదేశానికే ఆయువు పట్టు అయిన పల్లె సీమల్లో పాదుకొని పోయిన అజ్ఞాన దురహంకార దౌర్జన్య సంస్కృతిని నిర్మూలించడానికి చేసిన పోరాటాన్ని **ద్వితీయాధ్యాయంలో** సవిమర్శకంగా పొందు పర్చాను.

**తృతీయాధ్యాయంలో** పెట్టుబడిదారి సంస్కృతి ఫలితంగా పెరిగిపోయిన నగరాలలోని కీనీడలను–కూడుకోసం, కూలీకోసం, పట్టణంలో

బతుకుదదామని వచ్చిన రిక్షాలాగే బడుగువారి "బతుకు"లను ఆరోగ్యాన్ని బలిపెట్టి బొగ్గుతీసి యజమానులను బలిపించే "నల్లవజ్రాల" సింగరేణి కార్మికుల గుండెల మంటలు" ప్రదర్శింపబడ్డాయి.

నాగరికత లేశం సోకని కారణాన వ్యాపారుల, అరణ్య పాలనాధికారుల మోసాలకు, పీడింపులకు బలైపోయే అడవి తల్లి ముద్దుబిడ్డలైన గిరిజనుల జీవితంలో కల్గిన పరిణామాన్ని తలెత్తిన చైతన్యాన్ని **నాల్గవ అధ్యాయంలో** విశదీకరించాను.

దేవదాసీలపేర, వేశ్యలపేర, ఆడబాపలపేర ఇంకా రకరకాలుగా స్త్రీలను లైంగికంగా దోపిడీ చేయడమే గమ్యంగా సాగిపోయిన ఫ్యూడల్ సంస్కృతిని ఎదిరించి నిలవడమే కాకుండా పురుషులకే స్ఫూర్తిదాయినిలై తెలంగాణ పోరాటంలో, ఉద్యమాలలో క్రియాశీలక పాత్రలు వహించిన మహిళల చైతన్య శీలాన్ని **ఐదవ అధ్యాయంలో** ప్రస్ఫుటీకరించాను.

తెలుగు నవలల్లో జనజీవిత చిత్రణను నాకు ఉన్న పరిమిత పరిధుల్లో యథాశక్తిగా విశ్లేషించే ప్రయత్నం చేశాను. తెలంగాణా జీవితాన్ని "బహుభంగుల" రాజకీయ, సామాజిక, ఆర్థికరంగాలలో నిష్ణాతులైన వారు ఆయా కోణాల్లో విశ్లేషించి చూడటానికి ఎంతో ఆస్కారం ఉంది. ఈ నా ప్రయత్నంలో ఎంతవరకు సఫలీకృతురాలనయ్యానో! చదివిన సహృదయులే ప్రమాణం.

**- రచయిత్రి**

# విషయ సూచిక

# తెలంగాణ ప్రత్యేక పరిస్థితులు

ప్రతి జాతికి తరతరాలుగా భిన్న వారసత్వంగా భిన్న భిన్న అనుభవాలను పొందుపరుచుకొంటూ వస్తున్న చరిత్ర ప్రతి జాతికి వెన్నెముక లాంటిది. చరిత్రను బట్టే వర్తమానం, భవిష్యత్తు ఆధారపడి ఉంటాయి. దేశమాత దాస్యశృంఖలాలను తెంచటానికి ఎందరో మహానుభావులు ఉద్భవించారు. వారుచేసిన త్యాగాలు, వారు చూపిన కార్యదీక్ష దక్షతల వల్లనే మనకు స్వాతంత్ర్యం లభించింది. స్వేచ్ఛ దొరికింది. యావద్భారతం స్వాతంత్ర్యం వచ్చిందన్న ఆనందంతో పులకిస్తుంటే హైద్రాబాదు సంస్థానంలో మాత్రం నిజాం ప్రభువు భారత పతాకాన్ని ఎగురవేయరాదని, హైద్రాబాద్ సంస్థానం స్వతంత్రంగా ఉంటుందని ప్రకటించాడు. నిజాం రాజు వైఖరి స్వతంత్ర భారతావనికి ఒక జటిల సమస్యగా రాచపుండులా తయారైంది.

స్వాతంత్ర్యానికి పూర్వం తెలంగాణ ప్రాంతం నిజాం దాస్య శృంఖలాల్లో నలిగింది. చాలా దయనీయ స్థితిలో ఉండిన ప్రాంతం. హైద్రాబాద్‌లో "పోలీసు చర్య" జరగక ముందు అప్పటి నిజాం రాష్ట్రంలో అంతర్భాగమైన తెలంగాణ ప్రాంతంలో కొన్ని ప్రత్యేక పరిస్థితులు నెలకొని ఉండేవి. పోలీసు చర్యకు పూర్వం తెలంగాణ ప్రాంతంలో అధికార రూపంలో వున్న చిల్లర దేవుళ్లు గ్రామ గ్రామాల్లో వెలిసారు. వారి అధికార దర్పానికి ఎందరో అమాయక ప్రజలు నామ రూపాలు లేకుండా నశించిపోయారు. ఈ నిరుపేదలు ఆ అధికారుల సంతోషాలకు, భోగ విలాసాలకు ఉపకరణాలుగా మాత్రమే ఉపకరించారు[1].

1951 లెక్కల ప్రకారం 90 లక్షలు తెలుగు మాట్లాడే ప్రజలు తెలంగాణాలో 8, మహారాష్ట్రలో 5, కర్ణాటకలో 2, జిల్లాల ప్రాంతాల ఈ

సంస్థానాధీనంలో ఉండేవి. హైద్రాబాదు సంస్థాన వైశాల్యం 82,698 చదరపు మైళ్ళు. ఇది ఇంగ్లాండ్, స్కాట్లండ్ కలిపిన వైశాల్యాన్ని మించింది. ఈ సంస్థానానికి పేరుకు సర్వాధిపతి నిజాంప్రభువు. అయితే ఇంత విస్తీర్ణం కలిగిన రాజ్యమంతటా ఆయన పరిపాలన నేరుగా లేకపోవడం ఆశ్చర్యంగొలిపే సంగతి. నిజాం రాజ్యం మూడు భాగాలుగా ఉండేది. నిజాంప్రభువు సొంత ఖర్చులకోసం 8,100 చ॥ మైళ్ళ ప్రాంతం ఉండేది. దీన్ని సర్ఫేఖాస్ అనేవాళ్ళు. నిజాం బంధువులు అనుభవించడం కోసం 3,262 చ॥మైళ్ళ ప్రాంతం కేటాయించబడింది. దీనికి **పాయెగా** అనేవాళ్ళు. ఈ నిజాం బంధువులు తమ విలాసాల కోసం ప్రజల నుండి పన్నులు రాబట్టేవారు. నిజాంకు జవాబుదారీ వహించవలసిన అవసరంకాని కప్పం చెల్లించ వలసిన అవసరం కానీ లేదు. ఇక రాష్ట్రవ్యాప్తంగా 11,000 చ॥ మైళ్ళ ప్రాంతాన్ని 1,167 మంది జాగీర్దార్లు, సంస్థానాధీశులు ఏలేవారు. ఈ ప్రాంతాన్ని **జాగీరు ఇలాకా** (మహ్మదీ యుల సంస్థానం) అని వ్యవహరించేవారు.

ఈ ఇలాకా అధికార్లకు సర్వాధికారాలుండేవి. హైద్రాబాద్ రాష్ట్రం వైశాల్యంలో జాగీరు ఇలాకా వైశాల్యం మూడొంతులుండేది. ఈ ఇలాకాలో పన్ను వసూలు చేయడానిక రెవెన్యూ అధికారులు నియమింపబడేవారు. సంస్థానాధీశులు నిజాం ప్రభుత్వానికి ప్రతి నిధులుగా ఉంటూ "పేష్కష్" (సమర్పణ) పన్ను చెల్లించేవారు. చిన్న జాగీర్దార్లకు, మఖ్తాదార్లకు తమ ఇలాకాల్లో గ్రామాల్లో భూమి శిస్తు వసూలు చేసే అధికారం ఉండేది. వీరే కరణాలను, పటేళ్ళను నియమించుకొనేవారు.

నేరుగా ప్రభుత్వాధీనంలో ఉన్న ప్రాంతాన్ని (నిజాం గవర్నమెంటు ప్రాంతం) **ఖాల్సా** ఇలాక అనేవారు. వీరిలో తహసిల్దారు,

సబ్ ఇన్స్పెక్టరు మొ॥ వారుండేవారు. తహసిల్‌దార్ పర్యటన అట్టహాసంగా ఉండేది. వారం రోజుల ముందే డేరాలు వేసేవారు. ఆ ఊరి కరణం, పటేళ్ళు తదితరులందరూ బాజా బజంత్రీతో ఊరి పొలిమేర వద్ద హాజరై స్వాగతం చెప్పేవారు. తహసీల్ దారుతో పాటు భార్యా పిల్లలు, బంధువులు, స్నేహితులందరూ ఉండేవారు. వచ్చిన వారందరికీ భోజన వసతుల్ని తక్కిన సదుపాయాలను కల్పించడం అంతా పటేండ్లది, కరణాలది. వర్తకులు వారికి కావల్సిన వస్తువులన్నీ సరఫరా చేయాలి. దీన్నే **సరూ బరాహి** అనేవారు.[2]

హైద్రాబాద్ సంస్థానానికి రాజైన ఏడవ నిజామ్‌కు డబ్బుపై ఎక్కడా లేని ఆశ! ఇతనికి నజరానాలంటే మోజు. ఇతని ఆధ్వర్యంలో క్రమశిక్షణ, కిందినించి పై హోదాకెళ్లే అర్హతలు, నిబంధనలు, నియమాలు ఏవీ ఆచరణ యోగ్యానికి కాకుండా పోయాయి. ఏ అధికారి వల్ల తనకు నజరానా ఎక్కువ ముడుతుందో ఆ అధికారి ప్రభువు అనుగ్రహానికి పాత్రుడయ్యేవాడు. తన తండ్రి హయాంలో ఉన్న సాలార్‌జంగ్‌ను మంత్రి పదవి నుండి తొలగించి తనే స్వయం ప్రభువు, స్వయం ప్రధానిగా పరిపాలన సాగించాడు. సమర్థత అర్హతలు అన్నీ నశించి నజరానాలు సమర్పించుకునే కొలత బద్దను ఒకటి పెట్టుకొని అదే మెరిట్‌గా ప్రభుత్వోద్యోగులను నియమిస్తూ, ప్రమోషన్లు ఇస్తుండేవాడు. ఈ పదవులు ప్రభువుగారి ఫర్మానా ద్వారా నియమించబడేవి. ఈ రకంగా నియమింపబడ్డ అధికార్లు ఏ క్రమ శిక్షణకు లోబడి ఉండక తాము ప్రభువుకు మాత్రమే బాధ్యులమని భావిస్తూ, డబ్బును సంపాదిస్తుండే వారు. ఈ నజరానాలు ఆరవ నిజాం కూడా తీసుకునేవాడు, కాని వాటిని తను ఉపయోగించుకునే వాడుకాదు. ఏడవ నిజాం మాత్రం తన ఇష్టం

వచ్చినప్పుడు ఏ అమీర్ లేక జాగీర్దార్ దేవిడీకో వెళ్లడం, నజరానా పేరుతో డబ్బును హస్తగతం చేసుకునేవాడు. ఒక ఇంటి యజమానే కాకుండా కుటుంబ సభ్యులంతా నజ్‌రానాను చెల్లించవలసిందే. ఈ రాజు అంతటితో ఆగకుండా వారిదగ్గర ఏవైనా విలువైన ఆభరణాలు, వెలగల నగలూ ఉంటే నజరానా పేరుతో వాటిని కూడా కాజేసేవాడు. ఈ రకంగా ఎన్నో కుటుంబాలు బాధలు పడవలసివచ్చేది.[3]

పాలకుడైన నిజాంకు ప్రజా సంక్షేమ కార్యక్రమాలపట్ల ఏమాత్రం ఆసక్తిలేదు. ప్రజల సౌకర్యాల నిమిత్తం ఖర్చుచెయ్యవలసి వస్తే సంస్థానం సాధారణ ఆదాయం నుండి ఖర్చు చెయ్యాల్సిందే తప్ప నవాబు ఏ బాధ్యతా తీసుకోడు. దానికొక చిన్న ఉదాహరణ! "ఒకసారి సర్ఫెఖాస్ **జిల్లాలో జిల్లా సంఘ సభ్యులు కొండా వెంకట రంగారెడ్డి గారు ప్రాథమిక పాఠశాల స్థాపించే నిమిత్తం నిజాంగారి అనుమతి కోసం రాసుకున్నారు."** అప్పుడు నిజాం జాగీరు ఆదాయం జాగీర్దారు కుటుంబం ఖర్చులకు నిర్దేశింపబడ్డది.కనుక ఆ డబ్బుతో పాఠశాల ఏర్పరచటానికి వీలులేదు. అందుకొరకు "**దివానీకి ప్రభుత్వానికి, వ్రాసుకొన వలెను**" అనే ఫర్మాను నిజాంరాజు ఉత్తర్వు జారీచేశాడు. ఈ ఆధారంతో విద్యాశాఖాధికారికి వ్రాసుకోగా ఆ గ్రామంనుండి "**మాకు ఎలాంటి ఆదాయం రావటంలేదు. కాబట్టి పాఠశాల నెలకొల్పుటకు వీలు పడదు**[4]" అనే జవాబు వచ్చింది. ఇదేకాక నిజాంకు సంవత్సరానికి సొంతఖర్చుల నిమిత్తం 70 లక్షలు సంస్థానపు ఖజానా నుంచే ముట్టచెప్పేవారు.

హైద్రాబాద్‌లో తప్ప మిగిలిన ఏ సంస్థానంలోను, ఉర్దూ మాట్లాడే ప్రజలు అధిక సంఖ్యలో లేరు, ఉన్నా పదిశాతానికి తక్కువ వుండేవారు. తెలుగు మాట్లాడే హిందువులు ఒకకోటి నలభై లక్షలు ఉండగా ముస్లింలు పదిహేను లక్షలు మాత్రమే ఉండేవారు. నిజాం

రాజ్యం కావడం మూలాన ఉర్దూనే అన్ని స్థాయిల్లో కోర్టు భాషగా, పరిపాలనా భాషగా చేశారు. తక్కిన అన్ని భాషలు అణచి వేస్తే ప్రాథమిక దశనుండి బోధనా భాషగా ఉర్దూను ప్రజలపై రుద్దారు. నిజాం పరిపాలన నిర్వాహకుల నుండి పాఠశాలలు ప్రారంభించాలన్నా, గ్రంథాలయాలు నెలకొల్పాలన్నా నిజాంరాజు అనుమతిని పొందాల్సిందే. అంతేగాక పాఠశాలల్లో ప్రార్థనా గీతాన్ని ఒకటి పఠింపచేయాలని నిజాం ఆదేశించాడు.

"తా అబద్ ఖాలిఖె ఆలంయె రియాసత్ రఖ్తే

తురుఖకో ఉస్మాన్ బసద్ ఇజ్లాల్ సలామత్ రఖ్తే

ప్రపంచ సృష్టికర్త ప్రళయం వరకూ ఈ రాజ్యాన్ని ఉంచనీ ఓ ఉస్మాన్! నిన్ను నిండు దర్పంతో క్షేమంగా ఉంచనీ" [5] అని ఈగీతం భావం. దేశభాషను అణగదొక్కుతూ, పాఠశాలలనైనా పెట్టుకోనివ్వని, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉర్దూ బోధనా భాషగా పెట్టి అధిక సంఖ్యాకుల తెలుగు భాషను అణగదొక్కుతూ ప్రాథమిక పాఠశాలలను సైతం పెట్టుకోనివ్వని నిజంప్రభువు ఏకంగా ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉర్దూనే బోధనా భాషగా నెత్తిన రుద్దడాన్ని యువకులు భరించలేకపోయారు. అటువంటి స్థితిలో నిజాం క్షేమాన్ని కోరడం, అతన్ని చిరస్థాయిగా ఉండాలని ప్రార్థించటం ఆత్మవంచన అని ఆ యువకులు గుర్తించి మన జాతీయ గీతమైన వందేమాతరం గీతాన్ని ఆలపించారు.

జాగీర్దార్ల పరిపాలన చాలా ఘోరంగా ఉండేది. న్యాయ నిర్వహణ పోలీసు అధికారులు కూడా వీరితో కలిసి వారందరూ ఆ ప్రాంతానికి సర్వాధికారులుగా చెలామణి అయ్యేవారు. చాలాజాగీర్లలో

భూమి ఒప్పందాలు జరిగేదికాదు. దున్నుకునే వాడికి భూమిపైన పట్టాహక్కులేక కేవలం శాశ్వత కౌలుదారుగానే ఉండేవాడు. హైద్రాబాద్ సంస్థానంలో ముఖ్యంగా జాగిర్దారీ ప్రాంతాల్లో దోపిడీకి హద్దు అదుపు లేకపోయేవి. ఈ దోపిడికి పైన బ్రిటీష్ ప్రభుత్వం, వాళ్లకింద నిజాంనవాబు, ఆ నవాబు కింద జాగీర్దార్లు, జమీందార్లు, దేశ్‌పాండేలు, దేశ్‌ముఖ్‌లు, పటేళ్లు, పట్వారీలు, వీళ్లంతా ఒక దొంతరగా ఉండేవారు. అట్టడుగున మగ్గుతున్న నిజాం సంస్థాన ప్రజలందరూ ఈ భారాన్ని మోసేవారు. వీరి జీవితాల్ని చూసిన శ్రీ రావినారాయణరెడ్డి గారు "**ఈ తొత్తుల కను సన్నలలో మెలిగే స్థానికాధికారులు కూడా ఒకరిని మించి ఒకరు పోటీ పడేవారు**" అన్నమాటలు అక్షర సత్యాలు!6

వీరేకాక దేశ్‌ముఖ్‌లు, దేశ్‌పాండేల అమానుష చర్యలు చెప్పనలవికావు. వీరు తప్పుడు పద్ధతులద్వారా సామాన్య ప్రజల భూమిని లాక్కొని వారిని కౌలుదార్లకింద మార్చివేశారు. వారికి సేరీదార్లు, గుమాస్తాలు ఉండేవారు. ఈ సేరీదార్లు దౌర్జన్య పూర్వకంగా పంటల వసూలు, గ్రామానికి సంబంధించిన సమాచారాలు అందజేస్తూ, దొరలకు అన్ని రకాల సేవలు చేసే బంట్లు. తెలంగాణాలో వ్యవసాయకూలీలను నానాహింసలు పెట్టివారిచేత వెట్టిచాకిరీ చేయించుకునే వారు. ఈ వెట్టి తెలంగాణ ప్రజల రక్తంలో ఎలా ఇంకిపోయిందో క్లుప్తంగా వివరిస్తాను.

## వెట్టి :

తెలంగాణా ప్రాంతం వెట్టిచాకిరీకి పుట్టినిల్లు. వెట్టి విధానమంటే నిర్బంధ చాకిరి. ప్రతిఫలం ఏమాత్రం లేకుండా నిర్బంధంగా పనిచేయటాన్నే వెట్టిచాకిరి అంటారు. ఈ వెట్టిచాకిరి అన్ని వర్గాల ప్రజలందరికీ వర్తించేది. ఈ వెట్టిచాకిరీకి అప్పుడప్పుడు నామ మాత్రపు

డబ్బు కొంత ముట్టజెప్పేవారు. నిర్బంధ వెట్టి అన్నప్పుడు అది వంతుల వారీగా ఉండేది. దీనికి గురిఅయ్యేవారు నోరులేని నిరుపేదలు. గోచీగుడ్డకు కూడా నోచుకోని నిర్భాగ్యులు. పొరుగూరి బంధువులకు రాసిన ఉత్తరాలను తీసుకొని వెళ్ళి అందజేయడం ఉద్యోగుల సామాన్లు మోయడం, భూస్వాముల ఇళ్లలో దీపాలు వెలిగించటం, పక్కలువేయడం, కాళ్లుపట్టడం ఇవన్నీ వెట్టిలో భాగాలే. వీరిలో హరిజనులే ఎక్కువ. గ్రామాలలో మాల మాదిగలు, చాకలి, మంగలి, కుమ్మరి, కమ్మరి మొ॥గు వృత్తి పనివారంతా వెట్టిచాకిరీ చేయవలసి వచ్చేది. వంతు పనివారు ఆ సమయానికి ఇంట్లో లేకుంటే అతని భార్యగాని, తల్లిగాని, మొత్తానికి ఆ కుటుంబంలో ఎవరో ఒకరు ఆ వెట్టి చేయవలసి వచ్చేది. చాకిరీ చేసినందుకు వారికి ఏ విధమైన ప్రతిఫలం ముట్టేది కాదు. ఈ పద్ధతిని బేగారీ (వెట్టి) అనేవారు.

ఇంతేగాక పై అధికారులు గ్రామానికొస్తే ఈ వెట్టి మరింత ఎక్కువ. వీరు గ్రామాలకొస్తేకోళ్లు, గొర్రెలు తెగాలి. అవి ఉచితంగా రావాలి. దుకాణాల నుండి అధికారులకు సామాను ఉచితంగా సరఫరా కావాలి. తినగలిగినంత తిని మిగిలినవి ఇళ్లకు తీసుకు పోయేవారు.

దొరగారు కట్టుకునే బంగాళాలు, కొనేకార్లు, చేసుకునే పెళ్లిళ్లకు అయ్యే ఖర్చు మామూళ్ల పేరుతో గ్రామ ప్రజల నెత్తిన రుద్దబడుతుంది. ఎవరింట్లో బిడ్డపుట్టినా పెళ్లి జరిగినా కోడలింటికి వచ్చినా పిల్ల కాపురానికెళ్లినా కుటుంబాలలో తగాదాలు వచ్చి తిరిగి సఖ్యపడాలన్నా అపరాధమో బహుమానమో, నజరానాగా దొరగారికి కొంత రుసుము చెల్లించుకోవాలి. అలా ఇవ్వకుంటే ఏవో చిక్కులు, ఏదో సమయంలో దెబ్బలు తగలక మానవు. పోలీస్ స్టేషన్ల కీడ్చి కేసును నమోదు చేస్తారు. బలాత్కారంగా వసూలు చేయడం ఎలాగూ మానరు. తిట్లు, తన్నులు

కొసరుగా వడ్డిస్తారు. ఈ దుర్భర జీవితాన్నుంచి శాశ్వితంగా విముక్తి పొందినా అంటే మరణించినా బూడిద పన్ను పేరుతో మరికొంత లాగేవారు.

దొరలు ప్రయాణం చేసేప్పుడు బండిముందు పరిగెత్తించడం, కోళ్ల గుదిపెట్టడం, వంగబెట్టి బండలెత్తడం, ఎండలో నిలబెట్టడం వంటి ఎన్నో క్రూర శిక్షలు విధించేవారు. తెలంగాణాలో గుర్రపు ప్రయాణాలు చాలా అరుదు. తహసీలు కార్యాలయానికి సర్కారు పనిమీద పోతున్నప్పుడు పటేల్ పట్వారీలు గుర్రాల మీద పోయేవారు. తమవద్ద గుర్రాలు లేనప్పుడు ఇవి ఎవరిదగ్గరున్నా వెట్టికి తెప్పించుకునే హక్కు వీరికి ఉండేది.

ఈ వెట్టిని స్త్రీలుకూడా అనుభవించారు. స్త్రీలకు మంచి బట్టలు కట్టుకోవడానికి, పూలు పెట్టుకోవడానికి ధైర్యంచాలేదికాదు. దొరైనా దొరసానైనా పిలిస్తే కంచంముందు కూర్చున్నా లేచి వెళ్లాల్సిందే. ఆడబాపలుగా, బానిసస్త్రీలుగా భూస్వామి అవసరాలను, ఆతని కుటుంబ, అవసరాలను, తమచాకిరీతో తీర్చేవారు. పొలాల్లో పనిచేస్తున్నంతసేపూ ఆడవాళ్లను చంటిపిల్లలకు పాలిచ్చేటందుకు కూడా వెళ్లనిచ్చేవాళ్లు కారు. ఆడవాళ్లను చెరచడం ఆ నాటి భూస్వాములకు సర్వ సాధారణం. వీరిని ఎదిరించే, అడిగే ధైర్యం ఎవరికీ ఉండేదికాదు. నిజాం ప్రభుకు వీటి గురించి తెల్సినా పట్టించుకునే వారుకాదు.[7]

అగ్రకులాలమని చెప్పుకునే బ్రాహ్మలు కూడా ఈ వెట్టిచాకిరీ నుంచి తప్పించుకోలేక పోయారు. దొరగారి దివాణాకి విస్తళ్లు కుట్టి పంపడం వారు చేయవలసిన పని.[8]

ఆనాడు బ్రిటీష్ ఇండియా ప్రజలే పౌరహక్కులు లేక అంధకారంలో పడి ఉండే వారంటే, అంతకంటే హీనంగా దేశీయ సంస్థానాల ప్రజలు ఉండేవారు. కాని మరీ నికృష్ట జీవితాన్ని గడుపుతూ

స్వేచ్ఛ లేక అడుగడుక్కి నిర్బంధాలకు గురి అవుతూ నిజాం ప్రభుత్వంలో నున్న ప్రజలు హక్కులంటే ఏమిటో తెలియని జీవులు. జాగిర్దార్లకు, పెత్తందార్లకు ఊడిగం చేయటమే తమ విధి అనుకునే జీవచ్ఛవాలు.[9]

ఈ విధంగా వెట్టి బానిసత్వంలోకి నెట్టింది. నీ బాంచను దొర అన్నది తెలంగాణా రైతుకు ఒక ఊతపదంగా మారి, ప్రజల జీవిత విధానాన్ని అట్టడుగు స్థాయికి దిగజార్చింది ఈ వెట్టి విధానం.

ఇటువంటి పరిస్థితులను ప్రజలు ఎదుర్కొంటున్న సమయంలో నిజాం సంస్థానంలో "**ఇత్తెహాదుల్ ముసల్మాన్**" అన్న సంస్థ నిజాం ఏర్పాటు చేశాడు. ఈ సంస్థ మొట్టమొదట రాజకీయేతర సంస్థగా ప్రారంభమైనది. ముస్లింలందరిలో ఐక్యతను కలిగించడమే ఈ సంస్థ ఆశయంగా పేర్కొన్నారు. హిందువులు ముఖ్యంగా హరిజనులను ఇస్లాం మతంలో చేర్చడం కోసం **అంజుమన్ తబ్లీగులిస్లామ్** అనే సంస్థ ఉండేది. దీనికి నిజాం 20 లక్షలు కేటాయించేవాడట. నిజాం **అనల్ మలిక్** (ప్రతి మహ్మదీయుడు ప్రభువే) అని నినాదాన్నిస్తే, ఆర్య సమాజం వారు ప్రపంచాన్ని **కృణ్వంతో విశ్వమార్యం** అని ప్రతినినాదం ఇచ్చారు.

ప్రపంచంలోని అన్ని మతాలకన్న ఆర్యమతమే ఉన్నతమైనదని చెప్తూ, హిందూ మతాచారాలను, హిందూ సంస్కృతిని, హిందూ మతాన్ని నిజాం నవాబు నాశనం చేస్తుండగా దానికి వ్యతిరేకంగా ఆర్య సమాజం ప్రారంభమైంది. నిజాం ప్రభుత్వమత తత్త్వ విధానాలకు వ్యతిరేకంగా భారతదేశంలోని వివిధ ప్రాంతల నుండి హైదరాబాదుకు వచ్చి ఆర్య సమాజ కార్యకర్తలు ఉపన్యాసాలిచ్చేవారు. ముస్లిం పక్షపాత విధానాలను బట్టబయలు చేస్తూ, మత హక్కులను సాధించడం కోసం వీరు పెద్ద ఎత్తున సత్యాగ్రహం చేసారు.

ఆర్య సమాజ సంస్థ ప్రజల్లో చైతన్యం కల్గిస్తున్నప్పుడే ఆంధ్రమహాసభలు ప్రారంభమయ్యాయి. తెలంగాణాలో ఆంధ్రమహాసభ ఒక చిన్న సంఘటనతో అంకురార్పణ జరిగింది. 1921 నవంబర్ 12వ తేదిన జరిగిన హైదరాబాదులోని వివేకవర్ధిని థియేటర్‌లో కర్వె పండితుని అధ్యక్షతలో హిందూ సంస్కార సభ జరిగింది. ఒక వక్త తెలుగులో. మాతృభాషలో ప్రసంగిస్తుండగా సభలో కొందరు చప్పట్లు చరిచి వేళాకోళం చేశారు. దాంతో వేదిక పైనున్న సభ్యులు మాడపాటి హనుమంతరావు మొ॥ వారు ఆంధ్రజాతికే అవమానం జరిగినట్లు భావించి 11 మందితో కలిసి అదే రాత్రి ఆంధ్ర జన సంఘాన్ని స్థాపించారు. ఈ ఆంధ్రజన సంఘ శాఖలు వెలిసి వెట్టి చాకిరిని, ఉచితంగా సరుకులివ్వడాన్ని వ్యతిరేకిస్తూ ప్రజలను సమీకరించాయి. ఈ ఆంధ్రజన సంఘాలన్నింటిని ఒక వేదిక మీదకు తీసుకుని వచ్చి ఆంధ్ర మహాసభను ఏర్పరచారు మాడపాటి వారు. ఆంధ్ర మహాసభలు మొత్తం 12 జరిగాయి. మొదటిది 1930లో జోగిపేటలో జరిగింది. 6వ మహాసభలో అతివాదులు, మితవాదులు బయటపడ్డారు. 11వ మహాసభతో ఆంధ్ర మహాసభ రెండుగా చీలిపోయింది. తర్వాత ఈ సభలు స్టేట్ కాంగ్రెసులో లీనమైపోయాయి. ఆ నాటి హైదరాబాదు సంస్థానంలో ప్రజలకు రాజకీయ స్వేచ్ఛ లేదు. ప్రజలు చైతన్యవంతులై ఎదురుతిరుగుతారనే భయంతో ప్రతి ఉద్యమాన్ని నిజాం మొగ్గలోనే తుంచి వేసేవాడు. ఏలాంటి రాజకీయ వేదికనైన అభివృద్ధి చెందనిచ్చేవాడు కాదు. రాజకీయ కార్యకలాపాలపై నిషేధం వున్నందుకు ప్రజలు సాహిత్య సాంస్కృతిక మత పరమైన సంస్థలు స్థాపించుకునే వారు.

ఆంధ్ర మహాసభలు ముఖ్యంగా తెలుగు భాష పరిరక్షణ, గ్రంధాలయోద్యమం వంటి సాంస్కృతిక కార్యక్రమాలకు ఎక్కువ

ఆంధ్ర మహాసభలు ముఖ్యంగా తెలుగు భాష పరిరక్షణ, గ్రంధాలయోద్యమం వంటి సాంస్కృతిక కార్యక్రమాలకు ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చాయి. వెట్టి వంటి సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా ఆందోళన జరిగింది. క్రమక్రమంగా జాగిర్దారీ వ్యవస్థ రద్దు కావాలని, ఫ్యూడల్ రాచరికానికి చిహ్నమైన నిజాం గద్దె దిగాలనే రాజకీయ నినాదాలను లేవదీసింది.

ఈ ఆంధ్ర మహాసభ గ్రంధాలయోద్యంతో ప్రారంభమైనా రానురాను ప్రజలతో సాన్నిహిత్యం ఏర్పరుచుకుంది. మహాసభ లో చీలిక లేర్పడటం వల్ల గ్రామీణ ప్రాంతాల్లో ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలు, వాటి మూలకారణాలైన భూసంబంధాల విషయంలో కమ్యునిస్టు పార్టీ ఉద్యమాన్ని తలపెట్టింది. మానవుడు కేవలం జీవిక కోసమే కాక అస్తిత్వం కోసం, గౌరవప్రదమైనజీవనం కోసం, ఆత్మగౌరవం కోసం, ప్రతిష్ఠ కోసం పోరాటాన్ని జరుపుతాడు. అతడు తన నిరంతర అన్వేషణలో ఆరోగ్య ప్రదమైన స్వేచ్ఛా వాయువులు పీల్చాలని పరితపిస్తాడు. అందువల్లనే మానవుడు పీడన పై తిరుగుబాటు చేస్తాడు. ఆత్మ గౌరవం కల్గిన, వ్యక్తులు, కానీ, జాతులు కానీ పరాధీన స్థితికి ఇష్టపడవు. ఆ జాతులు ఎంత గొప్పవైనా, ఎంత మహిమాన్వితమైన వైనా సరే. హైదరాబాదు ప్రజలు అటువంటి పీడనను ఎదుర్కొదలచి నిజాంతో పోరాడి, హైదరాబాద్‌ను ఇండియన్ యూనియన్‌లో చేర్పించారు. సంవత్సరం పాటు జరిగిన ఈ సంగ్రామమే తెలంగాణా పోరాటాలు. ఆంధ్ర మహాసభలు జరుగుతున్నప్పుడే ప్రజలు సాంస్కృతికంగా, రాజకీయ పరంగా కార్యోన్ముఖులవుతున్న సమయం అది.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం ప్రజా పోరాటాలు దేశమంతా వ్యాపించాయి. వివిధ రాష్ట్రాలలో రైతాంగ జనసామాన్యం అనేక తిరుగుబాట్లు చేసింది. 1944లో హైదరాబాదు సంస్థానంలో పోరాటం

తీవ్రరూపం దాల్చింది. నిజాం రాజు బ్రిటీషు ప్రభుత్వ సహకారంతో హైదరాబాదును వేరు పరచాలన్నది నిజాం ఆశయం. బ్రిటీషు ప్రభుత్వానికి తాబేదార్లు అయిన నిజాం సంస్థానధీశులు, తమ పెత్తనాన్ని, రాచరికరాన్ని శాశ్వతంగా కొనసాగించాలని కలలు కన్నారు. ప్రజలను బానిసలుగా చేసికొని సంస్థానంలో జాతీయ భావాలు పొడచూపకుండా అనేక కట్టుదిట్టాలు చేసుకున్నారు. స్టేట్ లోనికి రానీయకుండా బయటి వారికి నిర్బంధాలు, నిషేధాలు జారీ చేశారు. ఎట్టి రాజకీయ, సాంస్కృతిక సంస్థలను ఏర్పడనీయకుండా, స్వతంత్ర భావాలు వ్యక్తం చేయనీయ కుండా వారి నిరకుంశపాలన సాగించారు.

సైనిక దాడులనైన అరికట్ట వచ్చేమోగానీ, ప్రజల హృదయాంతరాళాల నుండి వెల్లుబికి వచ్చే స్వతంత్రభావ తరంగాలను ఆపజాలరనేది చరిత్రలో రుజువైన సత్యం అని ప్రఖ్యాత స్వాతంత్ర సమరయోధులు మాదాల వీరభద్రరావు ఆనాటి ప్రజా పోరాటాన్ని తమ గ్రంథములో వివరించారు.[10] వెట్టికి, ధాన్యం లెవికి వ్యతిరేకంగా పోరాటం జరిగింది. ఈ కాలంలో భారత కమ్యునిస్టు పార్టీ సంపూర్ణ స్వాతంత్రం కోసం రాజీ లేని పోరాటాన్ని బ్రిటీషు వాళ్ళకు వ్యతిరేకంగా చేపట్టింది.

ఏడవ నిజాం పరిపాలన లో రాష్ట్రం ఆర్థిక పారిశ్రామిక రంగాలలో అభివృద్ధి సాధించినా వేళ్ళూనుకుని పోయిన ఫ్యూడల్ వ్యవస్థ వల్ల సామాన్య ప్రజానీకానికి పెద్ద లాభం కలుగలేదు. "పటేల్ పట్వారీలనబడే గ్రామాధికారులు వందలాది ఎకరాలు సంపాదించుకుని, ఫ్యూడల్, భూస్వాములుగానే ఉండిపోయారు. ఈ విధంగా వాస్తవంగా దున్ని పండించే రైతు కౌలుదారి స్థితికి దిగజార్చబడ్డాడు. వీరి పుణ్యం వల్ల యావత్తు తెలంగాణ ఎండిపోయిన గడ్డివాములా తయారైంది. అది మంటలు లేపటానికి ఒక అగ్గిపుల్ల కోసం ఎదురుచూసింది. అగ్గిపుల్లను ఎవరు గీసి పారవేసినా గడ్డివాము భగ్గుమంటుంది."[11] ఆ అగ్గిపుల్ల గీసిన

వాళ్ళే కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు. ఈ పార్టీవాళ్ళు గ్రామాలను రక్షించుకొవటానికి ప్రజలందరికీ శిక్షణ ఇచ్చారు. కర్రలు, రాళ్ళు, ఉపయోగించటం నేర్పారు. భూస్వాముల గుండాదాడుల నుండి ఎన్నో గ్రామాలను రక్షించారు.

నిజాం తన సంస్థానాన్ని భారతదేశంలో విలీనం చేయకుండా స్వతంత్రంగా ఉంటుదని నిర్ణయించడాన్ని అధిక సంఖ్యాకులు జీర్ణించుకోలేక పోయారు. ఈ నిజాంను సమర్థించే రజాకార్లు పెద్ద ఎత్తున దోపిడీలకు, హత్యలకు, అత్యాచారాలకు పాల్పడ్డారు. నిజాం ప్రభుత్వం పోవాలని నిజమైన ప్రజల ప్రభుత్వం రావాలని ప్రజలు తీవ్రస్థాయిలో ఉద్యమించారు. ప్రజల ప్రతిఘటన గమనించి ఏడాది గడవక ముందే యూనియన్ సైన్యాలు నిజాం సంస్థానంలో ప్రవేశించాయి. 1948 సెప్టెంబర్ 13న పోలీస్ చర్య జరిగింది. 13 నుండి 17 వరకు (ఈ నాల్గురోజుల) ఈ జరిగిన ఈ పోరాటంలో నిజాం లొంగాడు. కాళోజి వ్రాసిన **"మన కొంపలార్చిన, మన స్త్రీలను చెరచిన, మన పిల్లలను చంపి మనల బంధించిన మానవాధములను, మండలాధీశులను కండ కండగ కోసి కాకులకు వేయాలె, కాలంబురాగానె కాటేసి తీరాలె."**[11] అన్న మాటలకు కార్యరూపాన్నిచ్చారు.

నిజాం పతనమై సైనిక ప్రభుత్వం ఏర్పడిన పిదప కూడా రాష్ట్రంలో కమ్యూనిస్టుల సాయుధ పోరాటం కొనసాగింది. ప్రజల ప్రతిఘటనకు తట్టుకోలేక భయపడి పారిపోయిన గ్రామాధికారులు సైన్య సహాయంతో తిరిగి గ్రామాల్లో ప్రవేశించారు.కమ్యూనిస్టులు నిజాం వ్యతిరేక పోరాటం లోనే కాంగ్రెసు కార్యకర్తలపై దాడులు చేయటం ప్రారంభించారు.[12] నెహ్రూ ఈ విషయంపై చర్చలు జరపడానికి వచ్చినప్పుడు పార్టీ వారు దానిని నిరాకరించారు. రావినారయణరెడ్డి గారు

"ఆ సందర్భములో కేంద్ర ప్రభుత్వంతో చర్చలు అసంభవమై యుండేవికావు. ఇటువంటి చర్చలు జరపటానికి పండిత నెహ్రూ ప్రత్యేక ప్రతినిధి శ్రీ ద్వారకానాథ్ కట్జూ ఇక్కడికి వచ్చిరి. ఐతే నెహ్రూ ప్రభుత్వాన్ని కూలద్రోయడమే ఆ నాటి కమ్యునిస్టుల ప్రధాన అవగాహన అవడం వల్ల ఆయనతో చర్చలకు నిరాకరించారు"[13] అని తమ గ్రంథంలో తెలియజేసారు.

"ఈ సాయుధ పోరాటం ఐదు సంవత్సరాలు కొనసాగింది. కమ్యూనిస్టులు ప్రాణరక్షణ కోసం అడువుల్లోకి వెళ్ళాల్సి వచ్చింది. చాలా మంది కమ్యూనిస్టులు చనిపోవడంతో పోరాటం సన్నగిల్లింది. గ్రామస్థులను వీరి ఆచూకి తెలుపమని బాధించేవారు."[14] గ్రామస్థులు నలిగి హడలిపోయారు. జాతీయ ప్రభుత్వమునకు వ్యతిరేకంగా పోరాటం జరుగుతుందనే సమాచారం జనానికి తెలిసింది. ఆ రకంగా ప్రజలు కమ్యూనిస్టుల్ని నిరసించారు. పోలీసు చర్య అనంతరం పోరాటంలో ప్రజల పాత్ర సన్నగిల్లటం ప్రారంభమైంది. వారు స్వయంగా పాల్గొనటం మానివేశారు. అందువల్ల ఆ పోరాటానికి గల ప్రజాస్వభావం పోయి చివరకు అది కొద్ది మంది దళ సభ్యులు సాగించే వ్యక్తిగత హింస కిందికి జారింది. "పోరాటం సాగించనలెన్న అభిప్రాయం కొందరు వ్యవసాయ కూలీలు, బీద రైతులకు ఉండేది. ధనిక వర్గం, మధ్యతరగతి రైతుల వ్యతిరేకత వలన వారు ఏమి చేయలేకపోయారు" అని రావినారాయణ రెడ్డి గారు తమ గ్రంథంలో తెల్పారు[15] ఆ రకంగా 1951లో పోరాటం ఉపసంహరించుకోబడింది.

1952లో తెలంగాణాలో పరిస్థితి మారింది. జనరల్ ఎలక్షన్స్‌లో కమ్యూనిస్టులు అధిక స్థానాలని సంపాదించారు. కాంగ్రెసు పార్టీ వారు ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసి జమిందారీ జాగిర్దారీ వ్యవస్థలను

రద్దు చేసారు. 1954లో భూములు లేని వారికి భూములు పంచే కార్యక్రమాన్ని వినోభాజీ భూదానోద్యమం పేరుతో ప్రారంభించారు. కొంతవరకు మాత్రమే ఇది ప్రయోజనాన్నిచ్చింది. లేనివాళ్లు లేనివాళ్లు గానే ఉండిపోయారు.తెలంగాణా ఉద్యమాలు ఇంకా కొనసాగుతున్నాయి. ఫ్యూడల్ భూస్వామ్య సంబంధాల నుండి విముక్తి పొందడానికి ప్రయత్నాలు ఇంకా కొనసాగుతూనే వున్నాయి.

ఈ ఉద్యమాల్లో పేర్కొనదగింది నక్సలైట్ ఉద్యమం. 1968 పశ్చిమబెంగాల్‌లోని నక్సల్బరీతో తలెత్తిన ఉద్యమంతో **"దున్నేవాడిదే భూమి"**అన్న నినాదానికి మళ్ళీ ప్రాచుర్యం వచ్చింది. రాజ్యాధికారాన్ని తుపాకీ గొట్టం ద్వారా సాధించుకోవల్సిందే తప్ప పార్లమెంటరీ ద్వారా వీలు కాదని (Power comes out of the barrel) నక్సల్బరీ పోరాట ఉద్దేశ్యం. మధ్యలో 1969-1972 ప్రాంతంలో తెలంగాణాలో వేర్పాటు ఉద్యమం జరిగింది. ఆ ఉద్యమం లోపభూయిష్టంగా తయారయి చప్పగా చల్లారిపోయింది. ఈ రైతాంగ పోరాటం శ్రీకాకుళం, ఖమ్మం, వరంగల్, కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాల్లోని రైతాంగ పోరాటాల్లో పునరుజ్జీవనాన్ని పొందింది. రైతాంగాన్ని సంఘటితం చేయడానికి భారత కమ్యూనిస్టు పార్టీ 1972లో తెలంగాణ జిల్లాల్లో రైతు కూలీ సంఘాలను నిర్మించింది. ప్రజల భూమి మీద హక్కుకోసం పోరాటాలు చేస్తున్నారు. దొరల ఆధీనంలోవున్న పట్టా భూములను ఆయా వృత్తుల వాళ్ళు సాగుకు తెచ్చుకోవటం, బంజర భూముల పట్టాలకోసం పోరాటం, దొరలను, గూండాలను ప్రతిఘటించటం, కూలీరేట్లు పెంపుదలకు సమ్మెకట్టడం, మొదలైన విప్లవాత్మక చర్యలకు పూనుకున్నారు. ప్రత్యర్థుల దాడులకు గురి అవుతూ తమ అంతిమ విజయం కోసం పోరాటాలు సాగిస్తూనే ఉన్నారు.

తెలంగాణా రైతాంగ పోరాటానికి మరొక ముఖం గిరిజన రైతాంగ పోరాటం. 1858లో గోండు తిరుగుబాటుతో ప్రారంభమై 1940లో కొమరం భీంని ఉరి తీసి చంపడంతో అణచివేయబడింది. తిరిగి 1975 తర్వాత సి.పి.ఐ. (ఎం.ఎల్) సహాయంతో రైతుకూలీ సంఘాలుగా సంఘటితమై ఇంద్రవెల్లిలో 1981 ఏప్రిల్‌లో సభను పెట్టుకొంది. కొందరి ఆదివాసుల మరణంతో పోరాటం ఉధృతమైంది.

ఈ పోరాటాల క్రమాన్ని చూస్తున్నప్పుడు కె.వి. రమణారెడ్డి గారు **"తెలంగాణా పోరాటం దీర్ఘకాలిక పోరాటం. భారత పీడిత ప్రజల లాంగ్ మార్చ్"**16 అన్న మాటలు అక్షర సత్యాలనిపిస్తాయి. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం లో 1946-51 వరకు ఈ ఐదు సంవత్సరాల కాలంలో ఇదివరకెన్నడు లేనంతగా ఏ ఉద్యమకాలంలో కూడా లేనంతగా సాహిత్య సాంస్కృతిక సంచలనం ప్రజాజీవితాన్ని ప్రభావితం చేసింది.17

తెలంగాణాలో నెలకొన్న ప్రత్యేక పరిస్థితులను ప్రజల జీవనాన్ని, మార్పులను, సంఘర్షణలను ప్రతిబింబిస్తూ కొన్ని నవలలు వెలువడినాయి. ఆ నాటి సంఘటనలు, పోరాటాలు, యధాతథంగా చిత్రింపజేయడం ఈ నవలల్లోని విశిష్టత. వీటిలో రాజకీయోద్యమాలు, సాంఘీక సంఘర్షణలు పుష్కలంగా కన్పిస్తాయి. వీటిలో కొన్ని నవలలు స్థూలంగా సామాజిక స్వరూపాన్ని కల్గి ఉన్నా, చాలామటుకు రాజకీయాల్ని ప్రాధాన్యం చేసుకుని వెలువడ్డవి. ఈ నవలల్లో పోరాట కాలం నాటి తెలంగాణా సమాజాన్ని కథావస్తువుగా తీసుకుని కథ నడిపించినవి కొన్నయితే తెలంగాణా పోరాట కాలం తర్వాత నున్న పరిస్థితులను, నాటి గ్రామీణ జీవితాన్ని, కార్మిక జీవితాన్ని విశ్లేషిస్తూ, రాసిన నవలలు మరికొన్ని. నవల పుట్టుకకు దోహదమైన సమకాలీన సమాజాన్ని వాస్తవిక దృక్పథంతో రచయిత విశ్లేషించడం వల్ల **"సమస్యను**

విశదీకరించడానికి, లోతుగా చిత్రించడానికి అనువై చారిత్రక, రాజకీయ, ఆర్థిక, సామాజిక, నైతిక, తాత్త్విక విషయాల్ని ఆఖరికి మనసత్వాన్ని కూడా చిత్రించకల్గి, సమగ్ర సామాజిక చైతన్య ప్రతిబింబీకరణ మాధ్యమంగా విశిష్టతను సంపాదించు కుంది నవల. గొప్ప నవలను ఆధునిక మహాకావ్యం అనీ, గద్య రూపంలో ఉన్న మహేతిహాసం అని అంటారు విమర్శకులు[18]" అని నవలను పరిచయం చేసిన పి. సంజీవమ్మ గారి మాటలు ఈ తెలంగాణా నవల లన్నింటికి సరిగ్గా అమరుతాయి. ఆంగ్లేయుల ప్రభావం వల్ల వచ్చిన ప్రక్రియలల్లో నవల ఒకటి. ఈ నవలల్లో వస్తు వైవిధ్యం వుంది. సామాన్య మానవుడు కథానాయకుడు అయ్యాడు. సామాన్య స్త్రీ కథానాయిక అయింది. నవలల్లో సామాజిక పరిస్థితి నిక్షిప్తమయి వుంది. నవల సమాజ జీవిత చిత్రీకరణను సమర్థంగా ప్రతిబింబించే సాహిత్య ప్రక్రియగా నవల ఉన్నత దశను చేరుకుంది.

తెలంగాణా జనజీవనాన్ని రచయితలు ఎంతో ప్రతిభావంతంగా తమ నవలల్లో చిత్రీకరించారు. ఈ నవలాకారులు స్వయంగా ఉద్యమాల్లో పాల్గొన్నారు. కారాగార శిక్షలు అనుభవించినవారు కావడం వల్ల ప్రజల స్థితిగతులను వాస్తవానికి దగ్గరగా చిత్రించగలిగారు.

కొందరు తమ జీవితాలను, సమకాలీన వ్యక్తులను పాత్రలుగా కొన్ని నవలల్లో చిత్రించారు. చిల్లరదేవుళ్ళులో నేరుగా మాడపాటి హనుమంతరావు గారు కనిపిస్తే ప్రజల మనిషిలో కంఠీరవం పేరుతో రచయిత ఆళ్వారు స్వామి దర్శనమిస్తారు.

జమిందార్ల పెత్తందార్ల పాత్రలను తీసుకురావటానికి గ్రామీణ వాతావరణంతో పాటు గ్రామ ప్రజల్ని పాత్రలుగా చేసి నవల అంతా

ఏర్పడం ఈ నవలల్లో విశేషం. 1938-1940 ప్రాంతాల మధ్య తెలంగాణాలో నిజాం ప్రభుత్వాని కి వ్యతిరేకంగా జరిపిన పోరాటాలు, ఉద్యమాలు భూమి సమస్యలు నవలల్లో చిత్రించబడ్డాయి. ఆ పోరాటాలు భూస్వాముల దౌర్జన్యాలు, మతం మార్పిడి, గ్రంధాలయ ఉద్యమాల స్వరూపం గురించి **ప్రజల మనిషి, గంగు, చిల్లరదేవుళ్లు** నవలల్లో చూస్తాం. వర్గ సంఘర్షణ, కార్మికుల సమస్యలు, వాళ్ల బాగోగులను గురించి **యుగసంధి, మాయాజలతారు,** మొ॥ వాటిలో చూడవచ్చు.

పురాణగాథలు నవలలు కాకూడదని వీరేశలింగం పంతులుగారు ఆనాడే చెప్పారు. **ఎవరు నమ్మినను, నమ్మక పోయినను వాస్తవమును మరుగుపరచక చెప్పుట చరిత్రకారుని విధాయక కృత్యము; పురాణగాధలందు వలె మనుష్యులు లేడి రూపము ధరించిరని కాని, పురుషులు కేవలం స్త్రీలు గానే మారుతారని గాని అసాధ్యమైన సంగతి యిందేదియు దెలుపబడలేదు**[19] అన్నారు. కాబట్టి పంతులు గారి ఉద్దేశ్యం చరిత్రకారులంటే నవలాకారులని మనం అన్వయించు కోవాలి. తెలుగు నవలా వస్తువు సమాజమంత విస్తృంతగా సమాజ జీవితమంతా చిత్రిస్తూ, సామాజిక చైతన్యకారకంగా వుంది.

వట్టికోట ఆళ్వారు స్వామి **ప్రజల మనిషి** లో తెలంగాణాలో ఆంధ్రమహాసభ, గ్రంధాలయోద్యమము, 1938లో కాంగ్రెసు పుట్టుక, రాజకీయ పోరాటాలను చూస్తాం. సంభాషణల్లో పాత్రల చేత తెలంగాణా సర్వ సామాన్యమైన భాష ప్రయోగించటం వలన నవల శిల్పం దృష్టితో సజీవంగా ఉంది. వీరి రెండో నవల *గంగు*. ఇది అసంపూర్తి నవల; **ప్రజల మనిషి** వలెనే *గంగు* కూడా తెలంగాణా రాజకీయ ప్రజా ఉద్యమాలను చిత్రించింది. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో రైతాంగ సాయుధ పోరాటాన్ని ప్రారంభించడానికి ముందు దశ ఈ నవలల్లో

కన్పిస్తుంది. ఈ రెండు నవలల తర్వాత మహీధర రామ్మోహనరావు **ఓనమాలు** (1956), **మృత్యువు నీడల్లో** (1957) నవలలను తెలంగాణా ఉద్యమాన్ని చిత్రిస్తూ రచించారు. వీరు స్వయంగా ఆ సమయంలో తెలంగాణాను చూడలేదు. ఉద్యమంలో పాల్గొనలేదు. పార్టీ పత్రికల్లో పని చేయడం వలన పరిచయమైన వ్యక్తుల అనుభవాలతో సంఘటనతో ఈ నవలలను రాసారు. **ఓనమాలు** నవల్లో నిజాం ప్రభువు చేతిల్లోంచి తెలంగాణాకు విమోచనం కల్గించాలని, జమిందారీ, జాగిర్దారీ వ్యవస్థ రద్దై దున్నే వాడిదే భూమి కావలన్న కమ్యూనిస్టు ఉద్యమం కన్పిస్తుంది. దీని కొనసాగింపే మొదట **దావానలం** పేరుతో వచ్చిన **మృత్యువు నీడల్లో** అన్న నవల ప్రజాకార్యకర్తలు ముఖ్యంగా కమ్యూనిస్టులు రహస్యంగా కార్యకలాపాలను సాగిస్తూ వాళ్ళు వేసే ప్రతి అడుగు మృత్యువునీడల్లో లాగా ఉన్నదని సూచించడానికి రచయిత ఈ పేరు పెట్టాడు.[19]

తెలంగాణ విమోచనోద్యమాన్ని గురించి వరవరరావు గారు 1956 పూర్వం కొనసాగింపే అయిన 1962 దాకా వెలువడిన ఆరు ప్రధాన నవలలను గ్రహించి పరిశోధించారు. ఆ నవలలు-**ప్రజలమనిషి, గంగు, ఓనమాలు, మృత్యువు నీడల్లో, మృత్యుంజయులు,** సింహగర్జన. వీటిని రాజకీయ నవలలుగా భావించి మార్క్సిస్టు దృక్పధంతో వారు పరిశోధించారు. నేను ఆ ఆరు నవలలతో పాటు మరికొన్ని నవలలను అదనంగా గ్రహించి జన జీవనాన్ని స్థితిగతులను ప్రధానంగా పరిశీలించడానికి యత్నిస్తాను.

ప్రజల మనిషి నవలలో 1935-1940 వరకు తెలంగాణ ప్రజా జీవితం కన్పిస్తుంది. 1940-45 వరకు **గంగులో**, 1947 నుంచి **ఓనమాలలో, మృత్యువు నీడల్లో, మృత్యుంజయులు** నవలల్లో తెలంగాణ ప్రజా జీవనం కన్పిస్తాయి. వెట్టితో పాటు వివిధ సమస్యల్ని చిత్రించడంతో

పాటు యూనియన్ మిలటరీ పోలీసు ప్రవేశం తర్వాత కూడా చిత్రించిన నవల సింహగర్జన.

తెలంగాణా రైతాంగ పోరాటాన్ని చిత్రించిన మొట్టమొదటి నవల 1947లో బొల్లిముంత శివరామకృష్ణ రచించిన **మృత్యుంజయులు.** ఈ నవల నిజాం పాలనలో ఆంధ్రమహాసభలు, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో చైతన్యవంతమవుతున్న రైతుల ఉద్యమాలను రచయిత పేర్కొన్నారు. నవల చివరిలో సాయుధులైన మిలటరీని ఎదరించడానికి సాయుధ పోరాటమే జరగాలని రచయిత సూచించాడు. **"భూస్వామ్య దోపిడీ వ్యవస్థ ప్రజల పాలిట మృత్యువని చాలా కాలంగా మృత్యువు కోరల్లో చిక్కుకున్న ప్రజల్లో మృత్యువును జయించాలనేది రూపం ధరించి శక్తిగా మారిందని సూచించడానికి రచయిత ఈ నవలకు ఈ పేరు పెట్టాడు."**[20]

తెలంగాణా రైతాంగ పోరాటం గురించి వచ్చిన నవలల్లో **సింహగర్జన** రెండు విధాల ప్రత్యేకమైన నవల. పోలీసు చర్య తర్వాత యూనియన్ పోలీసులకు మిలటరీకి వ్యతిరేకంగా రైతాంగం చేసిన పోరాటం ఈ నవలల్లో చిత్రించారు రచయిత.

ఉద్యమం జరుగుతున్నప్పటికన్నా తర్వాత కాలంలో ఆ ఉద్యమాన్ని గురించి సంపూర్ణమైన అవగాహన, సక్రమమైన ఆలోచన ఏర్పడుతుంది. అందువల్లే ఉద్యమ కాలంలో కన్నా దాని తర్వాత ఉద్యమాన్ని వ్యాఖ్యానిస్తూ, విశ్లేషిస్తూ, క్రమస్వరూపాన్నిస్తూ కొన్ని నవలలు వచ్చాయి. ఈ నవలలు ఉద్యమాన్ని అవగాహన చేసుకోవటానికి తోడ్పడతాయి. 1946-48లో జరిగిన తెలంగాణా ఉద్యమ పోరాటాన్ని చిత్రిస్తూ, 1950 తర్వాత చాలా రచనలు వచ్చాయి. దానిలో భాస్కరభట్ల

కృష్ణారావు రచించిన **యుగసంధి** ఒకటి. ఈ నవలల్లో ఆంధ్ర మహాసభలు, రజాకర్ల దురాగతాలతో పాటు దేశ రాజకీయాలు కూడా చోటుచేసుకున్నవి.

దాశరథి రంగాచార్య రచించిన "**చిల్లరదేవుళ్లు**" అన్న నవల 1943కు పూర్వం భూస్వాముల పాలక వర్గాల దౌర్జన్యాలను చిత్రిస్తూ 1970లో వచ్చింది. ఈ చిల్లరదేవుళ్ళు నిజాం పాలనలో వున్న దేశ్‌ముఖ్‌లు, పటేళ్లు, పట్వారీలు. వాళ్ళ అధికారంలో, దౌర్జన్యంలో సామాన్య ప్రజలు నలిగి పోయిన విధానాన్ని రచయిత ఈ నవల ద్వారా మన కళ్ల ముందుంచారు. వీరు తెలంగాణా ప్రజా జీవితాన్ని వారి నవలల్లో చూపించారు. వీరి **మోదుగుపూలు** (1971) నవల ఇతివృత్తం కూడా నిజాం పాలనలోని దౌర్జన్యమే. ఈ నవల్లో రజాకర్ల దురాగతాలు, ఉద్యమాలు వివరించబడ్డాయి. వీరిదే మరొక నవల **మాయజలతారు**. ఈ నవల ముఖ్యంగా నగర జీవితాన్ని ప్రతిబింబిస్తుంది. **మోదుగుపూలు** కొనసాగింపే **జనపదం** (2వ భాగాలు)అని చెప్పుకోవచ్చు. 1948-68 దాకా తెలంగాణా జీవితంలో వచ్చిన మార్పుల్ని, పరిణామాలన్ని, ఉద్యమాల్ని జనపదం వివరించింది. రంగాచార్య తెలంగాణా ప్రజా జీవితాన్ని తన నవల్లో దర్శింపచేశారు. తెలంగాణా ప్రజల విరాట్ రూప దర్శనమే వీరి నవలకు మూలం. కమ్యూనిస్టు పార్టీ తర్వాత నక్సలైట్ పోరాటం ఉధృతం దాల్చింది. అప్పుడే తెలంగాణా వేర్పాటు ఉద్యమం **ప్రత్యేక తెలంగాణా** కోసం మొదలైంది. అవగాహన లోపం వల్ల ఏర్పడిన ఆ ఉద్యమాన్ని ఇతివృత్తంగా తీసుకుని నవీన్ **ముళ్ల పొదలు** రచించారు. ఈ నవల్లో నిరుద్యోగ సమస్యను చిత్రిస్తూ యువకుల్లో ప్రబలిన అసంతృప్తిని కూడా పేర్కొన్నారు.

ఈ వేర్పాటు ఉద్యమం సాగుతున్నప్పుడే పోరంకి దక్షిణామూర్తి గారు **ముత్యాల పందిరిని** రచించారు. ఈ నవల తెలంగాణా

మాండలికాన్ని తీసుకుని వ్రాసిన ఒక ప్రణయగాథ అయినా దీన్లో పద్మశాలీల జీవితం, వేర్పాటు ఉద్యమ ప్రసక్తిని కూడా మనం గమనించవచ్చు.

నక్సల్బరీ పోరాటాన్ని ఇతివృత్తంగా **దున్నేవాడిదే భూమి** నినాదాన్ని సాహిత్యంలో ప్రవేశపెట్టి కొందరు రచనలు చేసారు. గ్రామాల్లో జరుగుతున్న పోరాటాలను మనం ఈ నవలల్లో చూడవచ్చు. రైతాంగ జీవితానికి సంబంధించిన నవలల్లో సరిపల్లి కృష్ణారెడ్డి రచించిన **ఉప్పెన**, తిరునగరి రామాంజనేయులు **సంగం**, అల్లంరాజయ్య వ్రాసిన **ఊరు**, **అగ్నికణం**, **కొలిమంటుకున్నది**, అన్న నవలలు గ్రామ జీవితాన్ని చిత్రిస్తూ స్త్రీ పాత్ర ప్రధానంగా ఉన్న నవలలు బోయ జంగయ్య **జాతర** సి.హెచ్. మధు **తూరుపు ఎరుపులో మహిళ**.

మన దేశంలో పారిశ్రామిక ఉద్యమాలు ఎన్ని వచ్చినా పకడ్బందీగా ఉన్న పారిశ్రామిక నవల తెలుగులో ఇంతవరకు రాలేదు. కార్మిక సమస్యలను గురించిన నవలలు ఇప్పుడిప్పుడే వెలుగులోకి వస్తున్నాయి. సింగరేణి కార్మికుల గురించి జాతశ్రీ **సింగరేణి మండుతోంది** అన్న నవల రాయగా, పవన్ కుమార్ **నల్ల వజ్రం** అనే నవలను రచించారు. ఈ రెండే కాక బీడి కార్మికుల పోరాటం గురించి బి.యస్. రాములు **బతుకుపోరును** నవలీకరించారు. నగర జీవితాన్ని ప్రతిబింబింప చేస్తూ తిరుపతయ్య **బతుకును** రచించారు.

తెలంగాణ నగరాలలో పట్టణాలలో కాంగ్రెసు కమ్యూనిస్టు ల రచయితలు పోరాటాలను దృష్టిలో పెట్టుకొని రాసిన నవలలు కొన్నైతే గ్రామాల్లో గిరిజ ఉద్యమాలను అడవిలో గిరిజనులు తమ భూముల కోసం జరిపే పోరాటాన్ని చిత్రించే నవలలు మరికొన్ని.

వీటిలో అల్లం రాజయ్య, సాహు రచించిన కొమురం భీం అన్న నవల, వసంతరావు దేశ పాండే అడవి సాధన అడవిలో అన్నలు పులి ఆనంద మోహన్ **వసంతగీతం** అన్నవి ప్రధానమైనవి.

ఆదిలాబాద్ జిల్లాలో ఇంద్రవెల్లి గ్రామంలో 1981లో జరిగిన రైతుకూలి ఉద్యమాన్ని గత చరిత్రలో మరుగుపడిన గిరిజనుల పోరాటాలకు సమన్వయాన్ని కుదురుస్తూ, ప్రస్తుత పోరాటానికి ఒక కొత్త అర్థాన్నిస్తూ, ఈ రచయితలు చారిత్రక దృక్పథంతో ఈ నవలలను రాసారు.

ప్రతి రచయితకి కొన్ని సిద్ధాంతాలు, దృక్పధాలు ఉంటాయి, తాను ఒక సిద్ధాంతానికి కట్టుబడి ఉన్న తన సిద్ధాంతాలను ప్రత్యక్షంగా చెప్పుకోవడానికి, సిద్ధాంత ప్రచారానికి సాహిత్యాన్ని వాడుకున్నట్లుగా కన్పించదు. వాస్తవాన్ని అరటిపండు ఒలచి ముందు పెట్టినట్లుగా చిత్రిస్తారు. అయితే నవల అన్నప్పుడు కొంత కల్పితం లేకపోతే రాణించదు. ఈ విషయాన్ని ఆకళింపు చేసుకున్న రచయితలు వాస్తవ ఘటనలకు పేర్లు పెట్టటంలోనే, స్వల్ప మార్పులను ప్రవేశ పెట్టడం చేస్తారు. ఈ రచయితలు ఒక ఘటన వెనకు ఉన్న చారిత్రక సత్యాన్ని ఎంతో వివరంగా అందంగా కళ్లకు కట్టేటట్లుగా చిత్రీకరించారు.

జరుగుతున్న దౌర్జన్యాల్ని కళ్ళకు కట్టించడం వల్ల ఆశించిన ప్రయోజనం పరోక్షంగా నెరవేరితే, వాటి పరిష్కారానికి చేసే ప్రయత్నాలు ప్రత్యక్షంగా ఫలితాలు చూపిస్తాయి. వీటిలో కొన్ని నవలలు (**జనపదం, మోదుగుపూలు, కొలిమంటుకున్నది**) దౌర్జన్య నిరసనతోనే సరిపెట్టుకోక దౌర్జన్య ప్రతిఘటనను కూడా నిరూపిస్తాయి[21]

తెలంగాణా ప్రజల జన జీవనంలోని వైవిధ్యాన్ని, పోరాటాలను, సంస్కృతి సంప్రదాయాలను, కట్టుబాట్లను, తెలంగాణా నవలలు ఏ విధంగా చిత్రించాయో ముమ్ముందు అధ్యాయాల్లో సవిస్తరంగా పరిశీలిద్దాం.

# పాదసూచికలు

## ఒకటవ అధ్యాయం

1. దాశరధి రంగాచార్య-చిల్లరదేవుళ్ళు (నవల)
2. మందుముల నర్సింగరావు-యాభై సంవత్సరాల హైద్రాబాద్
3. మందుముల నర్సింగరావు-యాభై సంవత్సరాల హైద్రాబాద్
4. వెల్దుర్తి మాణిక్యరావు-హైద్రాబాద్ స్వాతంత్రోద్యమ చరిత్ర
5. వెల్దుర్తి మాణిక్యరావు-హైద్రాబాద్ స్వాతంత్రోద్యమ చరిత్ర
6. రావి నారాయణ రెడ్డి-వీర తెలంగాణ-నా అనుభవాలు-జ్ఞాపకాలు
7. వెల్దుర్తి మాణిక్యరావు-హైదరాబాద్ స్వాతంత్రోద్యమ చరిత్ర
8. పుచ్చులపల్లి సుందరయ్య-వీర తెలంగాణ విప్లవ పోరాటం
9. వెల్దుర్తి మాణిక్యరావు-హైదరాబాద్ స్వాతంత్రోద్యమ చరిత్ర
10. మాదాల వీరభద్రరావు-జాతీయ స్వాతంత్ర్యసమరంలో ఆంధ్రుల ఉజ్జ్వల పాత్ర
11. జి. వెంకటరామారావు-ఆంధ్రదేశ చరిత్ర-ఆధునిక యుగం
12. మాదాల వీరభద్రరావు-జాతీయ స్వాతంత్ర సమరంలో ఆంధ్రుల ఉజ్జ్వల పాత్ర
13. మందుముల నర్సింగరావు-యాభై సంవత్సరాల హైద్రాబాద్
14. రావి నారాయణ రెడ్డి-వీర తెలంగాణ నా అనుభవాలు-జ్ఞాపకాలు
15. రావి నారాయణ రెడ్డి-వీర తెలంగాణ-నా అనుభవాలు-జ్ఞాపకాలు
16. కె.వి. రమణారెడ్డి-తెలంగాణ పోరాట పాటలు
17. కె.వి. రమణారెడ్డి-తెలంగాణ పోరాట సాహిత్యం
18. పి. సంజీవమ్మ-తెలుగు నవలల్లో సామాజిక విశ్లేషణ
19. వ్యాస సంకలనం-కలం బొమ్మలు
20. యం. సుజాతా రెడ్డి-తెలుగు నవలానుశీలనం
21. యం. సుజాతా రెడ్డి-తెలుగు నవాలానుశీలనం

# పల్లె జీవితం

అప్పటి తెలంగాణ గ్రామీణ జీవితం, వాళ్ళు పడిన కష్టాలు, కార్చిన కన్నీళ్ళు డేగ కాళ్లలో చిక్కుకు పోయిన కోడిపిల్ల ల్లాంటివి. జమిందార్ల పంజాలో నలిగి పోయే గ్రామజీవితం బహు దుర్భరంగా ఉండేది. జాగిర్దారు ప్రజలకి నిజాం రాజుకి మధ్య వారధిలాగా పరిపాలన యంత్రాంగంలో పని చేయాలి. కాని ఆ బాధ్యతని వీళ్ళు పూర్తిగా విస్మరించి వారధుల్లా కాక దళారుల్లాగా వ్యవహరించే వారు. సమయం వస్తే వీళ్లు అటు నిజాం మాటను లెక్కజేయక, ఇటు ప్రజల యోగ క్షేమాలు పట్టించుకోక ఇద్దరినీ దోచుకునే వారు.

గ్రామాల్లో సర్వాధికారం కరణాలు దొరలదే. రైతులంతా వీరి చెప్పు చేతల్లో ఉంటుండేవారు. గ్రామాల్లో భార్యాభర్తలు, తండ్రి కొడుకులు, అన్నదమ్ముల మధ్య వచ్చే తగువులన్నింటిలో దొరలు జోక్యం కల్గించుకొని లంచాలెక్కువ ఇచ్చినవారికి లేదా వారి అడుగులకు మడుగులొత్తే వారికి అనుకూలంగా తీర్పునిచ్చేవారు. ఇవ్వలేని కుటుంబాల మధ్య తగాదాలు సృష్టించి ఉభయుల నుండి లంచాలు లాగడం లేదా వాళ్ళకు ఉన్న భూములనుండి కొంత భూమిని లాక్కోవటం చేసేవారు.

ఆళ్వారుస్వామి ప్రజలమనిషి నవలలో ఇటువంటి సంఘటననే చూస్తాం. రఘునాథాచార్యుల వద్ద భూమిని తిరిగి గుంజుకున్న రాంభూపాల్‌రావు దొర తనకు ఎందుకు కొరగాకున్న అతని కొడుకు వెంకటాచారిని చేరదీసి ఆ కుటుంబాన్ని చీలదీసాడు.

ఒకసారి ఆర్య సమాజ నాయకుడు విజయదేవ్ వినయంగా **"మీకు ఆస్తిపాస్తులున్నాయి, హాయిగా కాలం గడుపుతున్నారు. మీరు పరిస్థితులను ప్రజల మనస్తత్వాన్ని దృష్టిలో పెట్టుకొని లంచాలు, మామూళ్ల మానుకుంటే ఎంతో బాగుంటుంది"** అని రాంభూపాల్‌కు

హితభోద చెయ్యడానికి సిద్ధపడ్డాడు. "మేము పెట్టె ఖర్చుల కింద ప్రజలిచ్చే మాముళ్లు మొ॥ నవి చెమట కిందికి రావు" అంటూ ఐనా ఇటువంటి వాటిలో జోక్యం కలిగించుకోవద్దనే కటువైన సమాధానం వస్తుంది.

ప్రజల మనిషి, గంగు నవలల ద్వారా ఆ కాలంలో పోలీసు, అటవి, ఎక్సైజు, విద్య, వ్యవసాయం, రెవెన్యూశాఖలుండేవని తెలుస్తుంది. ప్రజల మనిషి కథాకాలం నాటిలో ముందు ప్రజల్లో బానిసతనం పేరుకు పోవడంతో సంస్థాన ప్రభుత్వం, నిరంకుశత్వం రాజ్యం చేసింది. దాని వల్ల ప్రజలకు ఉండే చట్టాలేమిటో, వారికి గల హక్కులేమిటో పరిపాలన ఎలాగుండేదో కూడా పట్టించుకోని సామాన్యులే ఎక్కువ. కాని ప్రజలమనిషి కథాకాలం నాటి (1935-40) ప్రజలలో కొద్దిపాటి చైతన్యం పెరగగా గంగూ కథాకాలం (1940-45) నాటికి ఆ చైతన్యం జూలు దులిపింది. కనుకనే ప్రజల మనిషి కథా జీవితంలో కేవలం రెవన్యు, పోలీసు, న్యాయశాఖల పరిపాలన జోక్యాలే కనిపించగా గంగు కథాజీవితంలో మిగిలిన శాఖల పరిపాలన జోక్యాలు కూడా అడుగడుగునా ద్యోతకమౌతాయి. ప్రజల మనిషిలో ప్రభుత్వోద్యోగుల పాత్ర మితమైతే గంగులో వీరి పాత్ర అపరిమితం. అక్కడ పాఠకులు వెదికి పట్టుకోవలసిన ఉద్యోగ పాత్రలుంటే ఇక్కడ ఉద్యోగులే వెదికి పట్టుకోవలసిన పాత్రలుగా ప్రజలున్నారు. దీనికి కారణం ప్రజల అవసరాలు పెరగడంతో పాటు చైతన్యం కూడా కొందరిలో నైనా తగినస్థాయిలో పెరగడంతో ప్రభుత్వ జోక్యం అడుగడుగునా కనిపిస్తుంది. ఈ అధికార్లకు ప్రజల బాగోగుల గురించి ఏ మాత్రం పట్టించుకోకుండా ఉండడం మొదటి నుంచి అలవాటు. దానికి భిన్నంగా వీరిలో ఏ పొరపాటు వచ్చిన సహించరు. పరిస్థితుల్ని అర్థం చేసుకోరు. వీరెప్పుడూ

ప్రజల సుఖసంతోషాలుగాక తమ లాభనష్టాల గూర్చి ఆలోచించేవారు. వీరికి ఏ వ్యక్తితో అవసరం వస్తే ఆ వ్యక్తి తో వెట్టి చాకిరి చేయించుకునే వారు. ఎన్నడైనా ప్రజల వద్ద నుండి వస్తువు తీసుకున్నా వెల చెల్లించకుండానే మీ డబ్బెక్కడికి పోదు అనే వారు. చివరకు ఎదురు తిరిగిన వారి ఇళ్ళు దోపిడి చేయించడానికి కూడా వెనుకాడే వారు కాదు. **గంగు** నవలలో ఆ విధంగా నాగభూషణం ఇంటిని జగ్గయ్య దొర అతని మీద కక్షతో స్వయంగా దోపిడి చేయించాడు. వారికి ఒక్క పైసా బాకి ఉన్నా పంట కుప్పల దగ్గరే వసూలు చేసుకునే వారు, లేదా ఇవ్వని వారి భూమి, ఇల్లు తాకట్టు పెట్టుకునేవారు. వడ్డీలకు, వడ్డీలు కట్టి వ్యాపారం కూడా చేస్తుండేవారు. అంతే గాక నాగులకు వడ్లు ఇచ్చేవారు. ఈ నాగులచే పద్ధతి కూడా ఒక రకమైన వడ్డీ వ్యాపారమే. డబ్బుకు బదులు ధాన్యాన్ని ఇస్తారు. నాగులు వడ్లను వెంటనే చెల్లించాలని హుకుం జారీ చేస్తాడు దొర. (గంగు) ఇచ్చిన ధాన్యాన్ని రెండింతలుగా వసూలు చేస్తారు. అంటే నూటికి నూరుశాతం వడ్డీ అన్న మాట.

ప్రజలందరు తమకి అణగి మణిగి ఉండాలనుకున్నారు. ఈ జాగీర్దార్లు. లేకుంటే సహించరు. తమకెవరైన ఎదురైదండం పెట్టుకుంటే **గాడ్డె కొడుకు, దండం లేదు, దస్కం లేదు, (116 గంగు)** అనుకుంటూ దానిక్కారణం వాళ్ళకు భయభక్తులు సన్నగిల్లుతున్నాయనీ అందుకు వారిని అదుపు ఉంచండానికి తగిన పథకాలు వేసేవారు. తమ దగ్గర పని చేసే వారికి ఇష్టం వచ్చినట్లు హింసించేవారు. జమిందారు భార్య రమణమ్మ ఆడ బాప నీలవేణిని పోరకతో కొట్టింది. హరిజనుల వీపుపై బండలుంచి ఎండలో నిలబెట్టాడు వెంకట్రావ్. ఈ వెంకట్రావ్‌కున్న అధికారాలతో, హద్దు పెట్టుజాలని అరాచకాలకు అవకాశమిస్తూ, ప్రభుత్వం యావత్తు అతనికి సంక్రమించినట్టు అహంభావంతో ఆరాటంతో ఉంటాడని రచయిత వివరిస్తూ, ఇటువంటి వాళ్ల ప్రతి

ఊళ్లో ఒక పెత్తందారో, కరణమో, పటేలో, ఇంకెవరో మొత్తానికి ఒక ఇంద్రజిత్తు ఉంటాడు. మొత్తం గ్రామాన్ని ఆడిస్తుంటాడు. (197-గంగు)

విరు శిస్తుల మొదలైన పన్నులను తమకు వీలయినపుడు ఇష్టమొచ్చినంత వసూలు చేస్తుంటారు. ఎవరైనా ఎదురుతిరిగి డబ్బు ఇవ్వకపోతే వారిని పంట కుప్పలదగ్గర పట్టుకొని ఆ కుప్పలను దోచుకునేవారు. పైకం ఇస్తేనీ కుప్పదగ్గరికి నేను రానని అందరి ముందూ బెదిరించేవారు. (40-గంగు) వారు ఇవ్వలేకపోయిన పక్షంలో **వసూలు చేసే శక్తినాకు లేదనుకున్నావా? మేము గాజాలు తొడుక్కొని కూర్చున్నామా** అని కూడా ప్రతీకారం చేయగల సమర్థులు.

వీళ్ల ఆగడాలకు అంతుండదు. దీనికితోడు ప్రభుత్వోద్యోగులు ఎప్పటికప్పుడు ఆలోచనలు చెప్తూ, అన్నింటికి అండగా ఉంటాయి. దాంతో గ్రామ పెత్తందార్లకు పట్టపగ్గాలుండవు. (57-గంగు). ఇలా వీరు శివమెత్తినట్లు ప్రవర్తించేవారు. గ్రామాల్లోని భూమంతా వీరి ఆధీనంలోనే ఉంటుంది. ముఖ్యంగా చెరువు కట్ట కింద సారవంతమైన భూమే ఉంటుంది. దాన్ని ప్రజలు ఈ దొర తంద్రోతాతో చెరువును ఏపించిండంట. ఇగ దానికింద ఆ కట్టంతా ఆల్లదిగాకపోతే ఇంకెవరి కుంటది (55-గంగు) అని చెప్పుకొని సమాధాన పడేవారు. గ్రామంలో దొర పొలాలు తడిసిన తదుపరే మిగిలిన వాళ్లకు నీరులభించేది. ఇతరుల కుండేది కూడా ఒకటో, అరో ఎకరం ముక్క మాత్రమే. అది కూడా ఈ దొరల తండ్రో, తాతో ఏబ్రాహ్మణునికో, ఇంకెవరికో దానమిచ్చినదయి ఉంటుంది. కంఠీరవం తాత కాలంలో భుజంగరావు దానమిచ్చిన చెరువుకింద నిక్షేపంలాంటి పొలాన్ని కొడుకు రామ భూపాలరావు తిరిగి తీసుకున్నాడు ప్రజల మనిషిలో (పేజి-12).

వీళ్ల భూమిని వీళ్లు దున్నుకోరు సరికదా దున్నించుకోరు కూడా! లంబాడీలకో, ఇంకెవరికో కౌలుకిస్తారు. అదీ వాళ్లు తమ అదుపు ఆజ్ఞల్లో ఉన్నంతవరకే! మాటచెడినా మాటకు మాట ఎదురు పలికినా గుడిపేరు తోనో మసీదు లేక బడి పేరుతోనో దాన్ని లాక్కుంటారు. గంగులో జగ్గయ్య దొర లంబాడీలనుండి ఈ విధంగానే లాక్కోవడానికి ప్రయత్నించి ప్రజల ప్రతిఘటన వలన విఫలుడయ్యాడు. చివరకు పెనుగులాటలో ఎవరికీ జోక్యంలేకుండా **ఈ పొలాలన్నీ ప్రభుత్వ స్వాధీనంలో ఉంటాయి** అని మెజిస్ట్రేట్ ప్రకటిస్తాడు (242 పేజి).

ఈ దొరలు, ప్రజలు అధికార్ల వద్దకు పోయి ఫిర్యాదు చేయడం కూడా సహించరు. అది వారికి అవమానంగా భావించేవారు ఇక ముందు నుండైనా వొళ్లుకాపాడుకొని మెలుగు, ఫిర్యాదుకొచ్చిర్రు, ఫిర్యాదుకు! ఆకాశం మీన్నుంచి దిగొచ్చినా యీ మొనగాండ్లకు ఊళ్లో న్యాయం చెప్పేటోడు చాలక అధికార్ల దగ్గరకు వచ్చినార్! నోరు మూసుకొని చక్కగ ఇంటితోవ బట్టుర్రి (పేజి - 109) అంటూ వెంకట్రావ్ వంటి వాళ్లు తీవ్రంగా బెదిరిస్తుండే వాళ్లు. గ్రామ ప్రజలకు మద్దతుగా పక్క ఊర్నుంచి వచ్చి నిలిస్తే వాళ్లతో "మర్యాదగ చెప్తున్న! ఇక మీదట మీరు మా ఊరు శివారు దాటితే మర్యాద దక్కదు" అని వారిని కూడా హెచ్చరించేవారు (పేజి-109).

ఈ జాగీర్దార్లు ఎంత క్రూరంగా హింసించినా ఎంత దారుణంగా దోచుకున్నా ప్రజలు కిమ్మనకుండ ఊర్కొనేవారు. పైగా **ఎవరు చేసిన పాపం వారే అనుభవిస్తారు** (పేజి-59) అనుకొని సమాధాన పడేవారు. అజ్ఞానంలో ఉన్న ప్రజలకి మూఢ విశ్వాసాలు కూడా తోడై నిలుస్తాయి. అందుకే ప్రజలు దొరలు అన్యాయం చేస్తున్నా కష్టాలకు గురిచేస్తున్నా వాళ్లను మాత్రం ఏం అనరు. జమిందార్ దౌర్జన్యాలు వాళ్లకి తెలిసినా, జమిందార్లు చచ్చిన తర్వాత అనుభవిస్తారనే అమాయక మూఢ నమ్మకం

కల్గి ఉంటారు. (పేజి - 59) ఈ మూఢ నమ్మకాన్ని ఆసరా చేసుకొని పెత్తందార్లు జమిందార్లు గ్రామాల్లో మకుటంలేని మహారాజుల్లాగా వెలిగిపోతుంటారు. ప్రజలు సైతం వారే సర్వస్వం అని తలుస్తూ **వారే ఊరు ఊరే వారు** అనే భ్రమలో వెట్టిచాకిరీ చేసేవారు. ప్రజల ఆర్థిక స్థితిగతులు, మూఢాచారాలు, అంధ విశ్వాసాలు ఈ గ్రామ పెద్దలు తమ విలాసవంతమైన జీవితం గడిపేవారు.

ప్రతి గ్రామంలోనూ ప్రజలకు తగాదాలు రావటం సర్వ సాధారణం! అయితే ఈ తగాదాల్లో ఎక్కువగా దొరలు కల్పించినవే అయి ఉంటాయి. పరిష్కారం కోసం గ్రామ పెద్దల, లేదా దొరల దగ్గరికి రావడం జరుగుతుంది. వారు తగాదా పరిష్కరించినందుకు తగువు పన్ను, లంచం ఇరు పక్షాల వారి దగ్గర్నుంచి తీసుకుంటారు. ఈ పరిస్థితిని గ్రహించి గంగులో ఆంధ్రమహాసభ నాయకులు ప్రజలకు, గ్రామ ప్రజలు పరస్పరం తగాదాలు పెట్టుకొని పెత్తందార్ల వద్దకు వెళ్లడం, లంచాలు గుప్పించి తీర్పులు చేయించుకోవడం **వద్దంటూ** సలహా ఇస్తారు (పేజి -295).

ఈ వ్యవస్థలో తరతరాలనుంచి వీరి పునాదులు బలంగా ఉన్నాయి. అవి అంతంత మాత్రం చేత పడిపోయేవి కావు. ఈ గ్రామ వ్యవస్థ, సమాజం బాగుపడాలంటే వీళ్లు లొంగాలి. **ప్రజలు గట్టిగా నిలబడి బలంగా ఎదుర్కొంటేగాని వీండ్లు లొగరు** (209)

గ్రామానికి ప్రభుత్వాధికారులొస్తే వచ్చిన అధికారులతో ఒకే పంక్తిలో కూర్చుండి, విందులారగించే దొరలను, అధికారులను చూచిన ప్రజానీకం తాము పడే బాధలను ప్రభుత్వాధికారులకు చెప్పుకున్నా ప్రయోజనం లేదనీ, అవి తప్పవనీ, వెట్టి చాకిరీ చెయ్యటానికే పుట్టినామని, వారి బ్రతుకు లింతేనని నిస్సహాయంతో కుమిలేవారు. చెప్పిన పాడుపనులన్నీ కడుపులు మాడ్చుకొని చేసినప్పటికీ దొరల, అధికారుల కోపతాపాలకు గురై తన్నులు, గుద్దులు, తిట్లు తినాల్సి వచ్చిన రోజులవి.

దొరలు ఎన్ని పనులు చెప్పినా ఎంత పని చెప్పినా నోరు మెదపక పనులు చేసిపెట్టే మధ్యయుగాల నాటి బానిస వ్యవస్థ అది!

భూస్వాములు బంజరులను, అగ్రహారాలను ఖరీదుచేసి వారికి గల పలుకుబడితో, గూండాల సహాయంతో దౌర్జన్యకాండను సాగిస్తూ, రైతాంగాన్ని దోపిడీ చేస్తూ, పీల్చి పిప్పిచేస్తూ, వచ్చారు. సర్వత్రా భూస్వాముల కోరిక కృషి ఒక్కటేలా కన్పిస్తుంది. అది గ్రామాలలో గల భూమినీ, చుట్టుపక్కల ఊళ్లన్నీ కూడా చుట్టబెట్టుకోవాలనే దొక్కటే! అదే పరమార్థంగా కృషి చేసారు.

వందల ఎకరాల ప్రభుత్వ భూములను దొరలు తమస్వాధీనంలో ఉంచుకునే వారు. దీనికి ఉదాహరణంగా ప్రజలమనిషి, గంగు నవలల్లో, రాంభూపాల్‌రావు, జగ్గయ్య దొరల చెరువుకింది పొలాలు కనిపిస్తాయి. ప్రభుత్వ భూమి ఆయా గ్రామాల్లో ఎన్ని ఎకరాలు, ఎక్కడ ఉన్నదీ ప్రజానీకానికి తెలియని రోజులవి. ప్రభుత్వానికి కూడా లెక్కలేని రోజులు కూడా! ప్రజలు దొరలిచ్చిన భూములను రుణాలు చెల్లించటం కోసం, మళ్లీ ఆ దొరలకే ఇచ్చేవారు. దానికి ఉదాహరణంగా కొమరయ్య వంటి రైతు భూముల్ని వకీలు వెంకటేశ్వరరావుకే తెలియని అతని భూమిని ప్రజల మనిషిలో దొర తిరిగిస్వాధీనం చేసుకోవడం మనం చూడొచ్చు. అయితే అప్పట్లో కొందరు కార్యకర్తల, నాయకుల పోరాట ఫలితాలుగా స్వాధీన పరుచుకున్న భూముల్ని తిరిగి ప్రజలకు ఇచ్చి వేయడం జరిగింది. కాని ఇటువంటి సంఘటనలు చాలా అరుదుగా కన్పిస్తాయి. జాగిర్దార్లకు రెండంచుల కత్తిలాంటి అధికారాలుండేవి. వారి జాగీరుల్లో న్యాయ నిర్వహణ, పోలీసు అధికారాలు కూడా వారి స్వంతం. ఆయా ప్రాంతాల్లో జాగీరులే సర్వాధికారులు. కనుకనే ఆస్తినీ, అధికారాన్ని పోత పోస్తే తయారయిన విగ్రహాలు, పల్లెల్లో పెత్తందార్లు,

భూస్వాములూనూ, బెమ్మని తిమ్మి చేసినా, తిమ్మిని బెమ్మిని చేసినా వాళ్లు ఆడింది ఆట, పాడిందిపాట అని పోరంకి దక్షిణామూర్తిగారు వారినిక అభివర్ణించారు.[2]

గ్రామ ప్రజల అవసరాలు, తీర్చడం తమకర్తవ్యం అని దొరలు తలపోయారు. కాని ప్రజలు వీళ్లకు చేసే సేవల్లో మాత్రం ఏలోటు జరగకూడదు. అందుకే ప్రజలమనిషిలో బిడ్డ పెండ్లి దిగ్విజయంగా జరిగి దొర ఘనతకు ఎలాంటి లోటురాకుండా చూసే బాధ్యత గ్రామ ప్రజల కర్తవ్యంగా నిర్ణయించబడ్డది (పేజి-15). పెండ్లికి కావల్సిన కూర గాయాలు, పాలు, వెన్న, నెయ్యి మొ॥ సామాను కాక బేగారి వాండ్లను, అతిధుల పశువుల మేతకు కూడా మనుష్యులను ఏర్పాటు చేసినాడు దొర! పెండ్లి రోజు పెండ్లి వారు వెళ్లే మార్గంలో గల ఇండ్ల వాళ్లందరూ వారి వారి ఇండ్లకు అలుకులు, సున్నాలు తోరణాలతో అలంకరించాలని రామ భూపాల్ రావు ఆజ్ఞాపించాడు (పేజి - 16) ఏ ఇంటి నుంచీ నీళ్లు బయటకు కన్పించొద్దు కాని దొర స్నానపు నీటి వరద గురించి మాత్రం ప్రజలు అడగొద్దు.

దొరల ఇండ్లలో కూడా గృహసమస్యలుండేవి. అయితే ఇవి ప్రజల నాలుకల మధ్యకు వచ్చేవికావు. కాని ప్రజల సమస్యలు మాత్రం వీధుల్లో చర్చించవచ్చు పెండ్లి **బాపతు పైకం ఈ పర్యాయం పూర్తిగా తీసికొని రమ్మన్నాడు** ప్రజలమనిషి, (పేజి - 20) అంటూ అల్లుడు కొండలరావు తన మామ రామభూపాలరావుతో తండ్రి చేసిన హెచ్చరికగా కుండ బద్దలు కొట్టినట్లు చెప్పాడు. అంతకు మునుపే ఎన్నో వాయిదాలు పెట్టాడు రామభూపాల్‌రావు. ఇంత నిష్కర్షగా అడిగినా కూడా ప్రయోజనం లేకపోగా **వరదక్షిణ పైకం వసూలు చేసుకోలేని అసమర్థుడని తండ్రికోపపడతాడని ఆరాటపడ్డాడు** ప్రజలమనిషి, (పేజి-20) కొండల రావు. ఇటువంటి సమస్యలు ప్రజలెవ్వరికీ తెలయనివ్వరు.

ఈ జాగీర్దార్లు, దేశ్‌ముఖ్‌లకు సంస్థానంలో వున్న అధికారులను ఏదోవిధంగా గుప్పిట్లో పెట్టుకున్నా, చట్టం కన్నుమూసి ఏ విధమైన అరాచకాలు చేసినా, మతాన్ని ఎవిధమైన స్వప్రయోజనాలకు వాడుకున్నా గాని ప్రభుత్వమంటే మాత్రం ఒక విధమైన భయం వుండేది. ఈ విధమైన భయం కల్గటానికి కారణం సహజంగా వీరు అవినీతి మార్గాలద్వారా చేస్తున్న ప్రజాద్రోహమే! ప్రభుత్వానికి తమ అవినీతి కరమైన పనులు తెలిసినపుడు తమకు స్వస్తి పలికే సమర్థత వుందనీ తెలుసు, కాబట్టే రామభూపాల్‌రావు వంటి వ్యక్తులు **ప్రభుత్వం తలచుకుంటె ఏమైనా అవుతుంది** (ప్రజలమనిషి, పేజి-123) అంటారు. ఇతని ప్రవర్తన, ఆలోచన ధోరణికి మనోభిన్నంగా కన్పిస్తాయి. తమ చేతుల్లో అన్ని అధికారాలూ వుండవనీ తెలిసికొని, ఆ అశక్తితోనే **చూడాలె ఆఖరికేమువుతుందో**. (ప్రజలమనిషి - పేజి - 123) అంటారు.

**తరతరాల నుంచి శిథిలంగాక బలంగా వున్న మా పునాదులు, అంతంత మాత్రంలో పడిపోయ్యేది కావు** (గంగు - 206) జగ్గయ్య ముఖం ఎర్రగా చేసుకొని గొంతు పెద్దగా చేసుకొని అన్నమాటల్లో దొరతనపు అలవాట్లు కన్పిస్తాయి. ఆ అలవాట్లు కనబడని చట్టాలు. పల్లెటూళ్లలో ఈ దొరలది మకుటం లేని రాజరికం, చట్టం ఎరగని శాసనాధికారం! అది ఒక్క కుల పెద్దరికం వలన లభించిన పెత్తనం మాత్రమువల్ల, కాక డబ్బు, కులం, దాక్షిణ్యం మొ॥ కూడా వీళ్లలో చోటు చేసుకున్నవి.

ఈ నవలలో జాగిర్దార్లు, పెత్తందార్లేకాక ఆ నాటి ఉద్యోగస్థులు కూడా అధికారదుర్వినియోగం చేసేవారు. (ప్రజలమనిషి, పేజి - 47) హైద్రాబాద్ వెళ్లేరైలు ఒక స్టేషన్‌లో ఆగినపుడు టిక్కెట్ లేకుండా ప్రయాణంచేస్తున్న ఒక ప్రయాణికుణ్ణి ఒక పోలీస్ చూసి, స్టేషన్ మాష్టరుతో కలిసి, డబ్బులు లేకపోవడం వల్ల ఇద్దరూ కలిసి ఆ ప్రయాణికుని వెండి దండ కడియం కాజేస్తారు, ఈ రకమైన సంఘటనలు ఎన్నో కన్పిస్తాయి ఈ నవలల్లో!

ఈ ఉద్యోగులు ఆనాటి నిజాం సంస్థానంలో వుంటూ, వారికి వంతపాడుతూ వాళ్ల క్షేమంకొరకే ఉద్యోగాలు చేస్తూ ప్రజలను బానిసలుగా చూస్తూ జలగల్లా పల్చేవాళ్లు! వీరు జాగిర్దార్లకు నిజమైన తొత్తులుగా వ్యవహరించేవారు. ప్రతి క్షణం అధికారం చెలాయిస్తూ పెత్తందార్లకు అండదండలుగా వుండే వారు. ఈ పెత్తందార్ల, జాగిర్దార్ల నీడల్లో బతుకుతూ వారితో చేతులు కలిసి అమాయకమైన ప్రజలను శిస్తుల పేరుతో దోచుకునేవారు.

ఒక చిన్న సంఘటన ద్వారా వీరి అమానుషత్వం, ఎట్లా వుంటుందో ప్రజలమనిషిలో తెలియ పర్చారు వట్టి కోట వారు! దిమ్మగూడెంలో జరుగుతున్న మత ఫరివర్తన మత పరివర్తన కార్యక్రమంలో అంజుమన్ నాయకుల వెంట వచ్చిన పోలీసులను చూసి **మీ వెంట ఈ పోలీసులెందుకు?** అని కంఠీరవం వేసిన చిన్న ప్రశ్నకు బదులుగా అతన్ని నిర్బంధించి నిజామాబాద్ హైద్రాబాద్ జైళ్ల మధ్య, ఉంచుతారు. అందుకే రచయిత పోలీసు శాఖ వ్యవహారాలకు సంబంధించిన ప్రభుత్వ నియమాలు, చట్టాలు మార్పులు, వివరాలు ఎంతటి విద్యావంతుడికి కూడా పరిపూర్ణముగా తెలిసికోవడము కష్టమైనపని అని (ప్రజలమనిషి, పేజి - 182) తీర్పునిచ్చారు.

ఇటు అధికారులు, అటు ప్రభుత్వం ప్రజలను తమ గుప్పిట్లో పెట్టుకోవడానికి ప్రయత్నాలు చేస్తూ, అనేక చర్యలు తీసుకుంటూ వుండేవారు. అమాయక ప్రజలను న్యాయస్థానాలవెంట తిప్పుతుండేవారు. వీరివి ప్రభుత్వ రికార్డుల్లో ఉన్నదానికంటె ఎక్కువ భూమిని దున్నుతున్నారని, వానజాలు నీళ్లు వాడుకుంటున్నారని, గెట్టులకు దున్నారని, కొలతరాళ్లు పడిపోయాయని అనుమతి లేకుండా ఇండ్లను మార్చి కడుతున్నారని, దున్నలకు ఎద్దులకు మూతాడు కట్టలేదని,

కొమ్ములకు బొడ్డెలు వేయించలేదని. ఈ విధంగా ప్రజలను ఇబ్బంది పెట్టడం మొదలైంది (ప్రజల మనిషి (పేజి 182) ఈ రకంగా బాధించేవాళ్ళు. ఇటువంటి అన్యాయాలను సహించలేక ఎప్పుడున్న ప్రజలు ఎదురుతిరిగితే గిర్దావారు, పోలీసులు, మేజిస్ట్రేట్ వచ్చి ఈ జాగిర్దార్ల సహకారంతో ప్రజలను అణచివేస్తారు (ప్రజలమనిషి 160 - 162 పేజిలు) మరీ వీలుకాని పరిస్థితుల్లో రామ భూపాల్‌రావు అనుమతితో పట్వారీ పదవిని ఇప్పిస్తాడు, హైదరరీకి! ఈ శిక్ష ప్రజలకి, దొరకి!

వీరికి వేసిన శిక్షలు కూడా వీరిని మార్చలేవు, దొంగ సాక్షాలతో ఇతరుల భూమిని ఆక్రమించి పెద్దమనిషిగా ఊరేగుతున్న రాం భూపాల్ రావుకి ఒక సం॥ మాత్రమే కఠిన శిక్ష విధిస్తారు.

ఒకసారి అధికారుల్లో ఒకరైన అమీన్‌కు ఆ ఊర్లో ఒక్కడు కూడా మంచినీళ్ళు ఇవ్వడానికి ముందుకు రాడు. అప్పుడు కొందరు అధికార్లు ప్రభుత్వానికి జీవనాడులైన గ్రామాధికారులు ఈ విధంగా ప్రజల ముందు పలుచనై పోవటం దేశసౌస్తవానికే గొడ్డలి పెట్టు గా భావించారు. అన్న సానుభూతిని వ్యక్తపరుస్తారు. అయినా ఈ ప్రభుత్వ వ్యవస్థ మర్రిచెట్టులాగా విస్తరించి పోయింది. దీన్ని పీకడం ఒకరిద్దరుతో అయ్యేపనే కాదు.

తన శిక్ష ముగిసిన తర్వాత రాంభూపాల్‌రావు తిరిగి అధికార వర్గం అండతో ప్రజల పై కక్ష కొనసాగిస్తాడు.

ఈ అధికార్లలో చిన్న ఉద్యోగులు ప్రజలపై కొంత సానుభూతిని వ్యక్తం చేసేవారు. వారి సేవలు ప్రజలకు అందించాలనుకునే వారు. అందించేవారు!

ప్రజల మనిషిలో ఒక తురక పంతులు రఘునాథాచార్యులను బడికి పిలిపించి పెద్ద కొడుకు చెడగొట్టింది చాలక, చిన్న కొడుకును

కూడా తయారు చేస్తున్నారు. అంటూ అందరికి విద్యా బుద్ధులు చెప్పి ప్రోత్సహించవలసిన మీరే మీ పిల్లల విషయంలో ఈ విధంగా అశ్రద్ధ చేస్తే మీరు నేర్చుకునేదేమిటి ? సమాజానికి నేర్పేదేమిటి? అని కటువుగా అన్న ప్రశ్నలో ఇతని సేవా దృష్టి కన్పిస్తుంది. కాబట్టే కంఠీరవం వంటి వ్యక్తుల సమాజ సేవకు తొలిపాఠాలు వీరిద్దరి వద్ద నుండి నేర్చుకున్నారు. అదే బడిలో కౌర్రం గల సాతాని పంతులు చేతిలో కంఠీరవం అన్నయ్య చేతిలో వెంకటాచార్యులు ఎందుకు పనికి రాని వాడిగా తయారువుతాడు.

ఈ నవలల్లో లంచగొండితనం మనకు కన్పిస్తుంది. లంచం తీసుకునే వాళ్ళు ఎక్కువగా రెవన్యు శాఖలో కన్పిస్తుంటారు. ఈ శాఖలో చిన్న, పెద్ద ఉద్యోగులంతా అవినీతిపరులు! చాలా నీతిగా వుంటూ, లంచం తీసుకోని వాళ్ళు చాలా తక్కువగా కన్పిస్తారు. కొందరు చాలా నిజాయితీతో వ్యవహరిస్తూంటారు. నీ బట్టల్లో లంచం వాసన వస్తున్నది. మొదట సారి చెప్తున్న, జాగ్రత్తగా వుండు (గంగు-58) అన్న అధికారులు కూడా ఈ నవలల్లో వున్నారు. గంగులో తహశీల్దారు ఒక పర్యటించినప్పుడు తనకు కావల్సిన వంటసామాను కోసం మొదలే డబ్బులిస్తారు. ఆ గ్రామంలో వెంకట్రావు దొర ఇతనికి తెలియకుండా చింతల్లోంచి చింతకాయలను కోయించి వంటవానికి పంపుతాడు. భోజనం చేస్తున్నాప్పుడు చింతకాయ పచ్చడిని చూసి తనకు తెలియకుండా తెంపిన మనిషినీ, వంటవాణ్ణి వెంకట్రావును పిలిపించి వేలం గానీ, ప్రభుత్వం చింతల నుండి అక్రమంగా చింతకాయ తెంపినట్లు పంచాయితీ చేయిస్తాడు. (గంగు-59) ఇక్కడ నిజాయితీ అధికారులు అక్కడ కూడా కన్పిస్తున్నా, వారిపై దొరలు పగ బట్టి వారికి కొద్ది రోజుల్లోనే పిచ్చి పట్టేటట్లు చేస్తారు.

ఈ లంచగొడితనానికి కారణం వారికి జీతాలు తక్కువ వుండటమే! అందుకే వీళ్ళు మీ అసువంటి మా రాజులు ఆదుకోకపోతే

ఈ జీతాలతో మేం బతికి పెండ్లిలు ఏం చేస్తాం? ఏదో మీ అసువంటి మా రాజులు అయిన కాడికి సాయం చేస్తే మా రోజులు గడుస్తాయి. (గంగు-67) అంటారు.

కొందరు అధికార్ల కింద ఉండే ఉద్యోగులు మీ ఇష్టమొచ్చిన అయిదారుగురు దొరలకు ఉత్తరాలు రాసి యిస్తే ఇన్ని బియ్యం, మేకపిల్లో, గొర్రెపిల్లో అడుకొచ్చుకుంట (గంగు-68) అని వీరిని బ్రతిమాలేవారు.

కొందరు పొట్ట గడవక ఇటువంటి సహాయాలు అడుగుతుంటే మరికొందరు విలాస జీవితాలకి అలవాటు పడి గ్రామాలకు వెళ్ళి దొరల తోటల్లో మకాం వేసేవారు. గంగులో వెంకట్రావు తోటలో మకాం వేసి ముసాఫిర్‌ఖానా (Guesthouse) కంటే ఇక్కడ బాగుందని హద్దులేని భోగ విలాసాలకు అలవాటు పడి, మంచిగా పాడే బోగం వాళ్లను కూడా పిలుపించుకుని అనుభవిస్తుంటారు మున్సిఫ్, అమీన్, తహశీల్దారు! ఇటువంటి అధికార్లు ప్రజల సమస్యలను పరిష్కరించకుండా దొరలకు లాభాలు, సంపదలు చేకూరుస్తూ, వారి క్షేమాలు కోరుతూ తమ పబ్బం గడుపుకునేవారు.

వీరిలో లంచగొండితనమే కాక, మూర్ఖం, సంస్కార హీనత్వం, కన్పిస్తుంటాయి. ఈ అధికార్లు సామాజిక జిజ్ఞాస లేని మొద్దులుగా రాజకీయ చైతన్యం లేకుండా వుండేవారు. అందుకే గంగు నవల్లో కంఠీరవం ఒక మున్సిఫ్ అధికారి నిజాయితీని చూసి హైదరాబాదు వంటి జాగిర్దారీ నిరంకుశ యంత్రాంగంతో మీ వంటి చైతన్య పూరితుడైన ఉద్యోగి ఎట్లా మునగలుగుతున్నాడా అని ఆశ్చర్యపోతాడు. మళ్ళీ అదే శాఖలో పని చేస్తున్న అహంకారంతో మిడి మిడి జ్ఞానంతో వున్న అమీన్‌ను చూపిస్తూ నవనీతం శాంతిని కాపాడే రక్షణ కలిగించాల్సిన అమీన్, ఒకడిని కొట్టి బాధ్యతారహితంగా వీధిలో పడవేసి నిశ్చింతగా వున్నాడంటే యెంత నిరంకుశుడో చూడండి (గంగు-92) అని మున్సిఫ్‌తో అంటాడు.

వారికున్న అధికారాలు వారికి తెలియవు. అవి ఎంత వరకు పరిమితమో కూడా తెలియదు. ప్రజల కుండే అధికారాలు, చట్టాలు తెలియవు. వాటిని చెప్పే అధికార్లు కూడా లేరు. వీరి నిరంకుశత్వాన్ని కొన్ని ఉదాహరణల ద్వారా చూపించవచ్చు. 1. ఎక్కువ నీల్గితే లాభం లేదు చెడిపోతావు, తల్లికి తండ్రికి కరువవుతావు జాగ్రత్త (గంగు - 112) 2. ఇహ మీదట బుద్ధి కల్గి ఉండక పోతే మొత్తం గూడానికి నిప్పంటించేస్తా (గంగు-113) ప్రజల్లో వీళ్ళ నిరంకుశత్వాన్ని ఎదుర్కొనే ధైర్యం ఎవరికి లేదు, ఎవరైనా ఎదురు తిరిగితే ఇక వాడి గతి కుక్క గతి! వారికి విధించే శిక్షలు పశువులకు కూడా వేయనివి.

1. చావడి ముందు వేపచెట్టుకు కట్టెయి ఈ పశువులను (గంగు-112)
2. మొదలే చెప్పాను నీల్గవద్దని, ఇప్పుడు నిన్ను చంపి పూడ్చి పెట్టినా దిక్కు లేదని తెలుసుకో, (గంగు-112)
3. మీసాలు పట్టి నోరు తెరచి నోట్ల ఉమ్మి వేయండి. నోరు ఎండి పోయినట్లుంది. కొంచెం తడి అవుతుంది.
4. ఈ పందిని దాట్లో వేసి కట్టి వేలాడదీయండి. చింత పండొలె నలుగ కొట్టండి.
5. ఏమైనా కాని చూద్దాం. తెలిసిపోతుంది నిజాం ప్రభుత్వం అంటే యేమిటో (గంగు-120-122)
6. బొక్క బొక్క విరుగగొట్టి కుక్కలకు వేయిస్తా. ఎవడు అడ్డం వస్తాడో చూస్తా. చేయని నేరాలకు ఈ రకమైన శిక్షలు విధిస్తూ దొరల మెప్పు కోసం ప్రజలపై అధికారాలు చెలాయించే వారు.

వారి దృష్టిలో మనిషి ద్విపాదపశువుగా, నోరు లేని యంత్రముగా కన్పించేవాడు. సంపన్న వర్గాల సుఖసంతోషాలకు భోగవిలాసాలకు ఉపకరించడమే ఆ నాటి తెలంగాణా నిరుపేదల పరమార్థం.

## దళితుల వెట్టి-మాలమాదిగల జీవితం:

తెలంగాణా గ్రామాల్లో రెడ్డి, కరణం, రైతు, కోమటి, చాకలి, మంగలి, మాల, మాదిగలు ముఖ్యులు. గ్రామ వ్యవస్థకు వీరు మూలస్తంభాలు. గ్రామల్లో రెడ్డి మకుటం లేని మహారాజా అయితే అతని సహచరులు కొందరు పటేలు పట్వారీలుగా నియమింపబడేవారు.

నైజాం ప్రభుత్వ బహిరంగ జైలులో ప్రజలు చదవడం, మాట్లడటం, రాయడం, ఆలోచించడం ఇవన్నీ నిషేధాలైన ఆ రోజుల్లో ఇక అట్టడుగు వర్గ ప్రజల గురించి ఆలోచించే సమయం ఎక్కడుంది? వారి జీవితమంతా దొరల, దేశ్‌ముఖ్‌ల, గడీలలో ఊడిగం చేయటం తోనే సరిపోయింది. వారు మనుష్యులుగా పరిగణింపబడే వారు కాదు. ప్రతిఫలం లేని వెట్టి ఎంత చేసినా భూస్వాములకు తృప్తి లేదు. వారికి కనీసం ఊపిరి పీల్చుకోవటానికైనా సమయం ఇవ్వరు. ఒక్కొక్కసారి తొలికోడైన బద్ధకించి ఆలస్యంగా కూస్తుందేమోకాని దొర గడిలల్లో పనిచేసే వాళ్లు మాత్రం చీకటి సాయంతో లేచి సూర్యునికి మేల్కొలుపు పాడుతుంటారు. అంత పొద్దున్నే కూడా భూస్వాములు తమ నోటి దురదను చూపిస్తునే వుంటారు.

తిరునగరి రామాంజనేయులు గారి సంగం నవల ప్రారంభంలోనే హృదయాన్ని ఆహ్లాదపరిచే ఆ చల్లని తెల్లవారు ఝామున వెట్టి వారిని గ్రామ సేవకులు తరుముతూ **ముచ్చట్లు గాదుబే! కామ్‌కరో** అంటూ బూతులు తిడ్తుంటారు. ఇత్తడి పొన్నులు, వెండి కట్లున్న పొన్ను కర్రలతో యమభటుల్లా శేతి సింధీలు లాఠీ కర్రలతో. పటేలు పట్వారీలు పనిచేసే వారిని చెండుకు తింటూ బజార్లు వూడిపిస్తున్నారు. పెద్ద గుర్రం స్వారీతో, బజార్లన్నీ సర్వే చేస్తున్న పోలీసు పటేల్ అప్పటి దాకా వూడ్చి, అలత తీర్చుకుంటున్న ఒక వృద్ధ కళేబరాన్ని, గుర్రాన్ని కొట్టే కొరడాతో

ఒకటి చరచి తు(రున దూసుకపోయాడు. దెబ్బకు అబ్బా అని మూలిగ, పనిలో నిమగ్నమయ్యాడా బక్కజీవి!

ఆ రకంగా రోజు తెల్లవారుతుంది వారి జీవితాల్లో. అది మొదలు ఏ మధ్య రాత్రి వరకో వారి ఊడిగం కొనసాగుతునే వుంటుంది. దొరల ఇంటి పనులు, బజారు పనులు మొ॥ వెన్నో, అన్ని రకాల పనివాళ్ళు విరామమెరుగకుండా పని చేస్తూనే వుంటారు. దొరలు లేచి కాలకృత్యాలు తీర్చుకోక ముందే మంగళ్లు గడిలో హాజరు కావాలి. అరక్షణమాలస్యమైనా భరించలేరు. మంగలి రావడు రాలేదని నిప్పులు కురుస్తూ కర్ర అందుకొని రావడి మీద పడ్డాడు అమీను. బలంకొద్దీ కొట్టసాగాడు. కొట్టకు బాంచను కాల్మొక్త, తప్పయింది. ఇగనుంచి చేయను. మల్లచేస్తే పానాలు తీయిరి. బత్కనీయరి కాల్మొక్త. బేగంసాబ్‌కు కట్టుకట్టు అని బ్రతిమాలుతున్నాడుకాని కదలడు. కర్ర విరిగేదాకా కొట్టాడు అమీను. ముక్కలైన కర్ర పారేసి జావ్ బంఛత్ కట్టు కట్టుపో మంగలోల్లకు భీ మస్తీ ఎక్కింది అని ఉరిమాడు (పేజి - 24 - 25).

ఒకసారి తట్టనెత్తి నేసుకుపోతున్న పల్లెవాణ్ణి పిలిచి వాణ్ణి తిడ్తూ తట్టల ఏమున్నాయో చూపించమంటాడు అమీను కోళ్లను తెస్తే తలా ఒక్కటి చొప్పున పోలీసాయన, మస్కూరాయన, దొరజవాను తీసుకున్నారని తట్టఖాళీగా వుందని చెప్తాడు. తనకు ఇవ్వలేదనే కోపంతో వాణ్ణిచితక్కొట్టి కొట్లో పారేస్తాడు.

ఇటువంటి సంఘటన నిజాంగానే హైద్రాబాద్‌లో జరిగిందట. నిజాం తండ్రి మహబూబ్ అలిఖాన్ చిన్నవాడిగా వున్నప్పుడే రాజయినాడట. దివాన్ తొమ్మిది మందిని కొత్వాళ్లుగా వారి బంధువులనే నియమించారట. ఒక పల్లెవాడు 8 సొరకాయలు అమ్ముకోడానికి పట్నంరాగా 8 మంది కొత్వాళ్లు ఆ సొరకాయల్ని లాక్కున్నారట. 9వ

వాడికి మిగలకుంటే ఆ పల్లెవాణ్ణి హింసించగా వాడు వెళ్లిపోతూ అంధేరీనగరీ చౌపట్ రాజా, ఆఠ్ హై ఖద్దూ నౌ హై కోత్వాల్, నవాబ్ బచ్చా దివాన్ లుచ్చా అని రాజభవనం గోడలపై రాసి వెళ్లిపోయాడట (పేజి-26).

ఇదే నవలలో తాసిల్దారు ఒక అందమైన భవనం కట్టాలను కుంటాడు, దానికి కావల్సిన హంగులన్నీ అమర్చమని చెప్తూ పాత హిందూ దేవాలయంలో వున్న స్తంభాలని పెరికించి తన భవనంలో పెట్టమని గ్రామ పెద్దలతో అంటాడు. దాని ఖర్చును గురించి ప్రస్తావిస్తూ వడ్డెరోళ్లు రాయి ఎట్టికి కొట్టిరి. ఇటిక చేసేటోడు ఎట్టికి చేసె, కోయోండ్లు కలపకొట్టి తెచ్చిరి. సుతారోండ్లు ఎట్టికి పనిచేసిరి అని చెప్తాడు, ఎవరన్నా పని ఎగ్గొట్టారని తెలిసిందో వాళ్లని నల్లులోలే నలిపేస్త, కుక్కిన పేలోలె పడుంఁడ్రి రాయికొట్టుంఁడ్రి. పైసడిగిన్రో చింతచెట్టుకు కట్టి తోల్లొలిపిస్త. అంటూ పనికి పైసలు ముట్టకపోగా గుడిసెకు ఐదు రూ॥ వసూలు చేస్తాడు. ఇయ్యనోన్కి ఇగపాణాలుండవనుకో. పీనిగల బొందకు పోతరు అంటూ గ్రామాధికారులు బెదిరిస్తారు, గిర్దావరుకు కూడా దీనిలో భాగముంటుంది ఇటుకచేసే వాళ్లతో, సున్నం చేసే వాళ్లతో, బండ్లవాళ్లతో, కూలీలతో, తాపీపనివాళ్లతో వెట్టిచేయించడానికి వస్తున్నాడు, బెదిరిస్తున్నాడు, తన మామూళ్లు వసూలు చేసుకుంటున్నాడు (పేజి-49).

ఆఫీసరు వస్తున్నాడంటే వెట్టి వాళ్ల హడావుడి అంతంత కాదు. ఆఫీసరుతో పాటు వారి సామాన్లు మొయ్యడం, కొయ్యపెట్టెలను మోసుకపోవడం. ఎంతమంది వున్నా తక్కువే. వారి వెనుక గుర్రంమీద స్వారీ చేస్తూ, ఒక టోపీ వాలా గుర్రంతో పాటు నడిపించేందుకు, అప్పుడప్పుడు ఆ వెట్టి వాళ్లను కొరడాతో చరుస్తున్నాడు. చొక్కాలు లేని

శరీరం మీద కొరడా వాతలు కొట్టొచ్చినట్టు కన్పిస్తున్నాయ్ అంత హడావుడి పడినా ఆఫీసరు వస్తున్న జాడే వుండదు. మోదుగుపూలు నవలలో కూడా ఒక నవాబు వచ్చినపుడు వెట్టివాళ్ల శ్రమను చూపిస్తాడు రచయిత.

రావడు మొదట తాసిల్దారింటికెళ్లి మాలీష్‌జేసి సాహుకారు వెంకయ్య ఇంటికి వస్తుండగా దోవలో అమీన్ వచ్చి పెళ్లానికి కట్టుకట్టమని తీసికెళ్తాడు. ఆ పనిచేసి వచ్చే సరికల్లా షావుకారింట్లో పూజ జరిగిపోతుంది. వాద్యంవాయించే రావడు రాలేదని కోపంతో రావడి తండ్రి బతుకున్నప్పుడు తీసుకున్న 100 రూ॥ అప్పు ఇయ్యమంటాడు. దానికి బాకీయాడిదుండి కాల్మొక, అయ్యతీసుకునే అయ్యాల్లనే తీర్చిబాంచెను. ఇన్నేండ్లనుంచి ఎట్టిచేస్తిమి. ఇంకేంబాకి గులాపోణ్ణి ఇక పైకమిస్తే పనిచేసెడిది. లేకుంటే లేదు కాల్మొక్త అని తెగేసిచెప్పి వెళ్లిపోతాడు. మంగళ్లు తెగబడ్డా రనుకుంటూ వాడి భూమి కాజేయలనే దురుద్దేశంతో అమీన్‌కి డబ్బాశ పెట్టి భూమి తన పేర రాయించమంటాడు. అమీను మంగలి రావణ్ణి పిలిపించి బాకి ఎందుకివ్వవని ప్రశ్నిస్తాడు. బాకీ లేదని చెప్తుండగానే జవాబ్బీ చెప్పతవ్‌బే కోమటోని సొమ్ము పున్నానికొచ్చింద నుకున్నవ్! భూమిరాసియ్యి బాకీకింద అని బాదుతుంటాడు. బాకీ తీసుకోలేదండీ అంటాంటే బాదుతరేముండి? చంపుండి చీరుగ్రని. భూమి వదులుకోను బాంచను. అదిపోరల నోటికాడి ముద్ద కాల్మొక్తా అంటాడు దాంతో తడాఖాచూపిస్త. మస్తీదిగాలె మంగలిగాడ్డికొడుకుల్ది అని ఆదేశిస్తాడు. నల్గురు జవాన్లు రావడిని దూలానికి తలకిందుగా వేలాడదీస్తారు. చింతబరిగెలతో వాణ్ణి చావబాదుతుంటారు. బాధ భరించలేక రాసిస్తానని ఒప్పుకుంటాడు. రావడి అంగుష్ఠంతో సావుకారు; ఒళ్ల నొప్పులతో రావడు ఇళ్లకు చేరుకుంటారు.

తల్లితో సమానమైన వారి భూమిని దౌర్జన్యంగా వాళ్లు గుంజు (లాక్కు) పోతుంటే అశక్తతతో కళ్ల వెంబడి నీరుకారుస మానసీబిట్లున్నది (నసీబు–జాతకం) అనుకుంటూ ఊర్కుండి పోతార

తెల్ల జాతివాళ్లు, నల్ల జాతివాళ్లని, అమెరికన్స్, నీగ్రోలు బానిసలుగా చూసేవారిని, చాకిరిచేయిస్తూ కొరడాలతో కొడ్తూ బరువు మోయిస్తారని పుస్తకాల్లో చదివిన రామారావుకి తెలుగు గడ్డపై బరువులుమోస్తూ గుర్రాలముందు పరిగెత్తే ఆ బడుగు జీవులన గుర్రాలకు, ఆ వెట్టిమనుషులకు ముక్కు రంధ్రాల నుండి పడే నురుగు చూస్తూ, మధ్యయుగం నాటి అమానుషత్వం ఆటంకం లేకుం సాగిపోతున్నందుకు ఆశ్చర్యపోతాడు (పేజి-10 సంగం)

ఆఫీసరు రాంగానే మంచం మీద సాగిలపడంగానే మంగ నారాయణ ఆఫీసరు కాళ్లకున్న బూట్లు విప్పి, వాటిని తనపై పంచె తుడిచి మంచంకిందపెడ్తాడు. కాళ్లు చాచి మంచంమీద పవళించగా ముక్కంటి, నారాయణ వంగి చెరోకాలు వత్తుతూ వున్నారు. ఇవి వింతలుగా రామారావుకి కనిపించినా ప్రతిపల్లెలో ప్రతిగ్రామ అధికార్ల కిం జరిగే తంతు ఇదే! అందుకే వింత అని రామారావు చెప్పినా తల్లి శాంతవ మామూలే, అనుకుంటూ వెళ్లిపోతుంది.

శిస్తులు కట్టలేదని ఆఫీసరు ముందర అబద్ధాలాడట పట్వారీలకి పరిపాటి. రైతులు ఎన్ని ప్రమాణాలు చేసినా ఆఫీస విన్పించుకోరు. రసీదులు చూపమని బెదిరిస్తుంటారు. కాని పట్వారీ ఎప్పుడూ రసీదులు ఇయ్యరు. ఆ నిజం ఒక్క భగవంతుడికే తెలుస ఆడదాని మెళ్లో నల్లపూసల బిళ్లలమ్మి శిస్తు గట్టినదొరా, అని బిడ్డ ప్రమాణాలు చేసిన ఆ రైతుబిడ్డని నమ్మకుండా వానిపై వీపున బండ పెట్టమంటాడు ఆ ఆఫీసరు (పేజి-11-సంగం) ఆ రైతుపై వెట్టి వా

కూర్చోమంటాడు. జాగిర్దారు వేటకు వచ్చిండని తెలిసి వారి పటాలం దిగకముందే ఏర్పాట్లు చేసారు వెట్టివాళ్లు! గొండ్లు తాటాకుకొట్టటం, కోయలు వాసాలుకొట్టి తేవటం కాక బండ్లు వెట్టికి కట్టారు రైతులు. వ్యాపారస్థులందరూ బిర్యానికీ పులావుకు అయిన సామాగ్రి ఇవ్వాలి. మంగళ్లు మసాలాలు నూరాలి. చాకళ్లు మేనాలు మోయాలి, దేగిచాలు తోమాలి. అధికార్లు తప్ప ఊరంతా వెట్టి చాకిరి చేయాల్సిందే. పెద్దదొర చేలో మిరప చెట్లెయ్యటానికి **పోవాలే** అని జనమంతా హడావుడిగా వెళ్తుంటారు. పైసలిస్తరా అని రామారావు అడిగిన ప్రశ్నకు **కూలా! దానింట పీనిగెల్ల ఎవరిత్తరు దొరా కూలీ అంత ఎట్టి** అంటూ అతన్ని ఎగాదిగా చూసిసాగిపోతారు.

దళితులను వెట్టి మాల మాదిగలను కట్టుదిట్టంలో ఉంచుకోడానికి చాలా ప్రయత్నాలు చేస్తుంటారు గ్రామాధికారులు. వారు గ్రామాల్లో వస్తుంటే శరీరాన్నంతా వంచి నిలబడాలి. చెప్పులు కూడా వేసుకోనివ్వరు. పొరపాటున అరుగులమీద కూర్చుంటారని అసలు ఇళ్లముందు అరుగులే తీసివేయించేవారు. ఏ పండుగ పబ్బాలకి, కాస్త తెల్లబట్టలు తొడుక్కున్నా భయంగానే వుండేవారు. ఎప్పుడైనా దొరకంట బడిందా వీనికి యిత్తు ముదిరిందిరో అని కళ్లల్లో నిప్పులు పోసుకుంటారు.

సంగం నవలలో తన కళ్లతో ప్రత్యక్షంగా చూస్తున్న రామారావు స్నేహితుడు సత్యంతో వారి జీవితాలెలా వున్నాయో చెప్పుకొస్తాడు. ఈ భూస్వామిక వ్యవస్థ గురించిచెప్తూ, తన్ని వెట్టిచాకిరీ చేయించటం, వీపుల మీద, **వెట్టివాళ్ల నెక్కించటం, ఎంత అనాగరికంగా వుందో! పోట్లుగొట్టి, బీళ్లు దున్ని రెక్కలు ముక్కలయ్యేలా రాత్రింపవళ్లు చాకిరీ చేసి, బండల పొలాన్ని గూడ పంట పొలాలుగా చేసుకుంటే దానినీ పెద్దలు కావాలనీ,**

**ఖుష్ ఖరీదనీ, గద్దల్లా తన్నుకుపోతున్నారు. రాబందుల్లా ఆ భూముల్నీ కబలిస్తున్నారు. జమీందార్లు, జాగిర్దార్లు, దేశ్ముఖ్లు దేశ్పాండ్యాలు, దొరలు, సర్కారోళ్లు, ఒహ్! ఒకరనేదేముందీ, ఎవనికివాడే ఒక బకాసురుడు.** (పే13)

ఈ హింసించడంలో స్త్రీలకు మినహాయింపేమీలేదని సంగం నవలలో ఒక చోటగమనించవచ్చు. ఆకులమీదున్న యువతిని, తల్లినీ జుట్టు పట్టి బర బరా బజారులోనికి ఆ కంకరరాళ్ల మీద ఈడ్చుకొచ్చారని చెప్తూ వీళ్లలో మానవత్వం పూర్తిగా నశించిందంటాడు. నేరాన్ని మించిన దండన ఉండరాదని మన ప్రాచీనార్థ శాస్త్రజ్ఞుల ఆదేశం, కాని వీరి ఆశయం ప్రజా పీడనం.

ఆ దొరలను ఎదిరించే ధైర్యం లేక ఎవరికి వారు తమ తలరాత అని ఎవనికర్మ కెవడుకర్త, చేసుకున్న వానికి చేసుకున్నంత అని కర్మ సిద్ధాంతాన్ని వల్లె వేసుకుంటూ జీవితాన్ని గడుపుతారు. జనం దొరలకి ఇంత వెట్టిచేస్తున్నా కనీసం సానుభూతి కూడా చూపరు వారు. ఏ పొరపాటు జరిగినా సహించరు. ఇదే నవలలో పోలయ్య అనే వాని భూమిని దొర ఏరకంగా దోచుకున్నాడో చెప్పుతాడు. దొరగుర్రాలని కాస్తూ వుండగా ఒక సారి మెక మొచ్చి గుర్రాన్ని చంపేస్తుంది. తన గుర్రం చనిపోయినందుకు దానికి బదులుగా ఆరు ఎకరాలను దొర లాక్కుంటాడు. ఒక గుర్రం ఖర్చును ఆరు ఎకరాల పొలంతో ముడిపెట్టాడు ఆ దొర. అప్పటికి ఆ పొలం తీసుకుని కూడా పది ఏళ్లవుతుంది.

ఇటువంటి స్థితులకు తలవొగ్గి వుంటున్న దళితులు కొందరైతే మరికొందరు హరిజనులు ఈ అమానుష చర్యలకు బలిగాకుండా వుండాలని మతం మార్పిడివల్ల తమ బ్రతుకు బాగవుతుందన్న ఆశతో

మతం మార్చుకొని ముస్లిములుగా మారిపోతారు. తురకలుగా మారిన హరిజనులకు నీళ్లు పుట్టకుండా తిప్పలుపెట్టి వత్తిడి తేవాలి అన్నదే ప్రజలమనిషిలో రామభూపాల్‌రావు, వెంకటాద్రి ఆలోచన, మతం మార్చుకున్న హరిజనులకి ఎలా పొట్ట వెళ్లదీసుకోవాలో అర్థంకాలేదు. మహ్మదీయులుగా మారిన హరిజనులు జీతగాండ్లుగా పనిచేయడానికి వెనుకాముందాడారు. పటేళ్లు పట్వారీలు మహ్మదీయులే అవుతారని, చెప్పిన మతప్రచారకుడి గురించి వాళ్లు ఎక్కువ రోజులు ఎదురుచూడక గ్రామంలో పని కోసం వెళ్తారు. వారిని జీతాలు పెట్టుకోకపోవడం మాట అటుంచి పాత బాకీలు వసూలు చేయడానికి వత్తిడి ప్రారంభిస్తారు. వెంకటాద్రి వాళ్లను ఈ మాదిగోళ్లు జీతాలు, నాతాలు, తెగలు, కల్లాలు మానుకొని ఏంచేస్తరట అని ఎక్క సక్క మాడుతాడు. దాంతో మొగవాళ్లకు మొహం చెల్లక ఆడవాళ్లను కూళ్లకు పంపిస్తారు. జుట్టూ బొట్టు మొలతాడు లేనిది మన కల్లాల లోనికి వస్తే పాలితిరగనిస్తమా మరి ఆ ఆడోళ్లను మాత్రం కూలికెందుకంట పిలిచేది అని రాంభూపాల్‌రావు హరిజనులపై ఆర్థిక దిగ్బంధం చేస్తాడు.

న్యాయస్థానంలో సర్కారు భూములు, కొలువులూ ఇప్పిస్తానంటే మా బతుకులు బాగయితాయని తురక మతంలో చేరామని కాని జుట్టూ, బొట్టూ, మొలతాడు లేకుంటే రైతులు కల్లాలకాడికి రానివ్వడం లేదని మస్కీన్‌సాబ్‌గా మారిన మల్లిగాడు అనే హరిజనుడు న్యాయాధిపతితో విన్నవించుకుంటాడు. తిరిగి ఆర్య సమాజంవారి సహాయంతో ముస్లింలైన హరిజనులు హిందువులుగా మార్చ బడతారు. కాని సరిగ్గా పంటలకాలంలో ఈ మత పరివర్తనం జరగడం వల్ల వారి ఆర్థిక పరిస్థితి దెబ్బతిన్నది. ఈ మత పరివర్తన చిల్లరదేవుళ్లు నవలలోకూడా కన్పిస్తుంది. ఆ ఊరి హరిజనులతో బహద్దూర్

యార్‌జంగ్ హిందువులు, హరిజనుల్ని చాలా నీచంగా చూస్తున్నారని, వారిని ఉద్ధరించడానికి ఇస్లామ్ మతం వెలిసిందని తన ఉపన్యాసంలో చెప్పాడు. హిందూ మతంలో కులాలున్నట్లు ముస్లిమ్ మతంలో ఉండవని వారికి అందరూ సమానులే అని బోధిస్తాడు. ఈ మాటలు విన్న రెడ్డి కరణాల కళ్లు ఎర్ర వారుతాయి. అయినా నోరుదాటి ఒక్క మాటైనా బైటికి రానీయలేదు. ఖాజీ ఆదేశం ప్రకారం నెత్తులు గొరగంగనే తమ ఆస్తి పోయినట్లు బాధపడి చిన్న బుచ్చుకున్నారు. హరిజనులు, మొలత్రాళ్లను తెంపి పైజమా కుర్తాలు తొడుక్కొని మహమ్మద్, హసన్, హుస్సేన్ మొ॥ పేర్లు మార్చుకొని ఒక పక్క నిలబడ్డారు.

ఈ హరిజనులతో పాటు వారి భార్యలు కూడా మతం మార్చుకోవాల్సి వస్తుంది. వీళ్ల పుస్తెలు తెంపడానికి వస్తాడు ఖాజీ. దానికి వాళ్లు ఒప్పుకోరు. పుస్తే తెంచితే మా పెద్దాయునకు గండమొస్తది పుస్తె ఉంచితురకల్ల కలుపుతే కలుపురి, లేకుంటె మాల మాదిగోల్లంగనే ఉంటం అంటూ వెళ్లి పోవడానికి సిద్ధపడ్డారు. కాని వాళ్ల మనస్సులో అక్కడున్న కొత్త చీరలు రెపరెపలాడుతాయి. ఈ సంఘటన రెడ్డిని, కరణాన్ని సంతోషపరిచాయి. అధికారులకు కోపంవచ్చినా గత్యంతరం లేక పుస్తెలు తెంపకుండ బొట్టు చెరిపేసి ఇస్లామ్ మతంలోకి మారుస్తారు. చివరకు పంక్తి భోజనాలు పెడ్తున్నప్పుడు మేం మాదిగోండ్లతో తినమండీ తురకోండ్లమైతే మాత్రం కులం తగ్గుతదా, మాదిగవాండ్లు మాదిగలే అని ఒకడంటే మేం డక్కలోండ్లతోటి తినమండీ అని ఇంకొకడు వేర్వేరు పంక్తుల్లో కూర్చుంటా మంటారు. బహద్దూర్ యార్‌జంగ్ ఉపన్యాసమంతా బూడిదలో పోసినపన్నీ రవుతుంది.

ఈ మతం మార్చుకొన్న హరిజనులను గ్రామ పెత్తందార్లు పనుల్లోకి రానివ్వరు. భూములిస్తామని, ఉద్యోగాలిస్తామని, విద్యచెప్పి

స్తామని, బావులు తవ్విస్తామని చెప్పిన ఆ ఇస్లామ్ మతస్తులు మళ్లీ ముఖం చూపించరు. వీళ్లిద్దరి మధ్య హరిజన జీవితమే చిన్నాభిన్నమై పోయింది. రెక్కాడితేగాని డొక్కాడని స్థితిలో ఉండే వీరు ఏ పనులూ లేక అల్లల్లాడి పోతారు. చివరికి వీళ్లు మళ్లీ ఆ గ్రామాధికార్ని ఆశ్రయించకతప్పలేదు. వచ్చిన వాళ్లతో వెటకారంగా మీ కష్టాలన్నీ ముస్లీములతోనే చెప్పు కోమంటాడు దొర. అందరమొకటే నని నీతులు చెప్పిండు కాదాయన! తీర వచ్చెటాల్లకల్ల తురకలు రానిస్తాన్రను కున్రా మిమ్ముల? మదర్ సాబ్సుత అన్నడంన్రడి, హసే మీరెక్కడి తురకన్రా? ఈ కల్లెట్టుకుంటే నెమిలైతాన్రకాకి? ఇటు కులపోల్లు రానియ్యకుండైన్రు, అటు తుర్కోల్లు రానియ్యకుండై న్రుంన్రడి అంటూ కోమటాయన అప్పుపుట్టనియ్యక పోయె, కుమ్మరోడు కుండలియ్యకపోయె, మంగలాయన గొరగ డాయె, వడ్లాయిన పన్లు చెయ్యనసె, కులపోడు పిల్లనీయమన్రి, చేస్కోమన్రి, ఇగ ఊళ్లెట్లుంటం, గులాపోల్లం, బోనాలు పడ్తమంటె బైండోండ్లు పట్టనీయరాయె, బొడ్రాయికి ఏటను నరుకుత మంటె ఊళ్లోళ్లు నరకనీయరైరి. అందుకే తిరిగి హిందువులమైతామని దొరతో వాళ్ల గోడు వినిపిస్తారు. దానికి ప్రయత్నం చేస్తానంటూ, తాను చెప్పినట్టు పడి ఉండాలని ఆదేశిస్తాడు రెడ్డి, దొర సహాయంతో ఆర్య సమాజంలో పనిచేస్తున్న నరేందర్జీ గంగాజలంతో వాళ్లను శుద్ధి చేసి మాంసం తినొద్దని కల్లు సారాయి తాగొద్దని, శుచిగా ఉండాలని చెప్పి హిందువుల్లో కలిపి వెళ్తాడు. ఇటువంటి సంఘటనే ప్రజలమనిషి నవల్లో కూడా కన్పిస్తుంది (పేజి-125)

ఈ సంఘటనతో దొరకి హరిజనులపై జాలి ఉందనుకుంటే మాత్రం అది పొరపాటే! ఊర్లోకి అధికార్లు వస్తున్నపుడు వెట్టి చెయ్యొద్దన్నా వినకుండా బండ్లు ఎత్తి పట్టే మాదిగోండ్లను తోలురి.

అడవికి వాసముతెప్పిచ్చురి, గొండ్లోళ్లను తాటాకు కొట్టేయుమురి అంటూ ఆజ్ఞాపిస్తాడు. మంచాలు ఇవ్వం అన్నవాళ్లతో ముచ్చోరోళ్లను తోలి ఇండ్లలోంచి గుంజాకరమ్మమురి, ఇయ్యకుంటే ఇండ్లల్ల మాల మాదిగులను జొరపెడ్తమని చెప్పుమురి అంటాడు.

ఒక సారి చింతల తోటనుంచి చింతకాయలు దొంగతనంగా ఎవడో తెంపుతుండగా దొర చూస్తాడు. అది చూసిన దొర మండి పడ్తూ, ఆగమంటాడు. దొరమాటను వినకుండా వాడు పరుగెత్తుతాడు. అది తనకవమానంగా భావించి దగ్గరలో జొన్నచేను కాపలా కాస్తున్న పెంటిగాన్ని కర్రతో బాదుతాడు. ఆ పారిపోయింది చాకలి పీరిగాడు అని తెల్సుకొని ఊరు అదిరిపోయేలాగ తగిన శాస్తి చెయ్యాలని అనుకొంటాడు. నిజానికి ఆ చింతచెట్లు ప్రభుత్వం వాళ్లవి. ఏడాదికి ఒకసారి వేలం పాట పెట్టాలి న్యాయంగా అయితే! ఆ ఊర్లో దొర అధికారమున్నంత వరకు అది సాగదు. కరణానికింత, పటేలుకింత ఇచ్చి మిగిలింది బస్తీకిచ్చి సొమ్ముచేసుకుంటాడు, ప్రభుత్వం చింతలపై తనకెంత హక్కు ఉందో చాకలి పీరిగానికి అంతే హక్కు ఉంటుంది. తన జాగీరైనట్టు అందరినీ బెదిరించడం, తండ్రి తాతలసొమ్ము పోతున్నట్టు ఆగ్రహించడం దొర మనస్తత్వాన్ని వ్యక్త పరుస్తుంది.

ఈ దొరల అధికార చిహ్నంగా వాళ్ల ఆడవాళ్లు బండిలో ప్రయాణం చేస్తున్నప్పుడు వెట్టిమనిషి బండిముందు పరుగెత్తాలి. ఆ ఎద్దులకు దొరికినంత తిండి గూడ అతనికి దొరుకుతుందో, లేదో చెప్పడం కష్టం. మనిషి ఉరుకుతుంటే అతని వేగానికి తగ్గట్టు ఎడ్లు ఉరుకుతాయని దొరలు భావిస్తారు. ఆ మనిషి శరీరంలో సత్తువ లేకున్నా, కడుపునొప్పిలాంటిదేమైనా వచ్చినా ఈ దొరలు వినకుండా ముల్లు గర్రతీసుకొని బాదుతారు (పేజి-64) ముందర మనిషి లేకుంటే

ప్రయాణం మానకుంటారు కాని వాళ్ల ప్రభుత్వంలో తమ శాసనాలని మాత్రం మార్చడానికి ప్రయత్నించరు. తర తరాలుగా వస్తున్న అధికారాన్ని పడిపోనియ్యరు. అందుకే ఆనాటి ప్రజలు వీరి దౌర్జన్యాల్ని పాటలుగా పాడుకునే వారు. ఆ పాటల్లో వెట్టి ఎట్లా ఉండేదో తెలుస్తుంది.[2]

ఇదే నవల్లో దొరకోసం సారంగపాణి పట్నం నుంచి గాజు బిందెలు తెస్తాడు. ఆ బిందెల్ని పనివాడు ఇంట్లో అమర్చుతున్నప్పుడు చేయిజారి ఒక బిందె పగిలి ముక్కలౌతుంది. దాంతో రెడ్డి ఉగ్రుడై లాగి చెంప మీద కొట్టి, అరుగుమీద నుంచి కిందపడేట్టు తంతాడు. అతను దొరా పిల్లలుగల్లోన్ని అంటూ పరుగెడ్తాడు. దొరకింద పని చేసే మనుషులంతా రాతి మనుషులే, చేయిజారి పడిపోయిన గాజుబిందెకోసం ఒక మనిషిని విచక్షణారహితంగా కొట్టడం వాళ్ల అమానుష చర్యలకు ఉదాహరణ. తిండికి లేక డొక్కమాడే వాడికి ఏనుగులా తిని ఏనుగంత బలంతో వాణ్ణికొడ్తే భరించగలడా అన్న ఇంగిత జ్ఞానం ఉండదు. ఈ దొరలకు సరితూగే వారే గ్రామకరణాలు. గుడిని మింగేది ఒకడైతే గుళ్లో లింగాన్ని మింగేది మరొకడన్నట్లు అమాయక ప్రజలను దోచుకోవడంలో వారికి వారే సాటి. దొరలు అధికారంతో ప్రజలు దోచుకుంటే కరణాలు వాళ్ళ భూములను లాక్కొని మోసం చేస్తారు. ఒకే భూమిని ఇద్దరికి అమ్మి రెండు వైపులా పైకాన్ని తీసుకొని వాళ్ళలో వాళ్ళకు తగాదాలు పెడ్తు తమాషాలు చూస్తుంటారు.

చిల్లరదేవుళ్లు నవల్లో లంబాడీల భూమిని నారయ్య అనే వానికి కరణం అమ్మడం చూస్తాం. లంబాడీలంతా కలసికట్టుగా వచ్చినప్పుడు ఇంట్లో దాక్కుంటాడు. వాళ్లని అణచివేయడానికి పోలీసులతో వచ్చి లంబాడీలను బాగా కొట్టించివాళ్ళ చెప్తున్న మాటలను వినిపించుకోకుండా

మొగోళ్లను కంబాలకు కట్టుండ్రి, ఆడోళ్లను కమ్రలపడేయుండని ఆదేశిస్తాడు. స్తంభాలకు కట్టిన లంబాడీలను పోలీసులు కర్రలతో బాదుతారు. వాళ్ల దెబ్బలకి చర్మంచిట్లి రక్తం కారుతుంది. తుడుచు కోవడానికి వీలులేకుండా పగ్గాలతో కట్టిన కట్లను చూసుకుంటూ రోషంతో కండ్లలో నిప్పులు కురిపిస్తారు. వాండ్ల గాయాలతో పాటు గుండె మండుతుంది. గొండ్ల వాళ్లతో కల్లుకుండలు తెప్పించుకొని తాగుతూ లంబాడీలను తిడ్తూ, ఒక లంబాడీ భార్యను పట్టుకొంటాడు. అమీన్ లంబాడీ భార్య లక్ష్మిని వశపర్చుకో ప్రయత్నించి నపుడు లక్ష్మి అమీన్ పీకనొక్కింది. అతన్ని పురుగుకన్న హీనంగాచూసి అమీను అవమాన పరుస్తుంది. నరరూపరాక్షసుల పరిపాలనలో ఉన్న అమీన్ పిస్తోలు గుండు లక్ష్మి గుండెలో దూసుకుపోయింది. అది గమనించి కోపావేశంతో భీక్యా గొంతు చించుకొని తిడుతూంటె, తక్కిన లంబాడీలంతా అమీన్‌ను, కరణాన్ని తిడ్తుంటారు. ఇంత గడబిడ జరుగుతున్నా, గ్రామంలో ఒక్కరూ తలుపులుతీయరు, బైటకిరారు. పోలీస్ ఠాణాలో సాక్ష్యం చెప్పడానికి లంబాడీలనడుముకు తాళ్లు గట్టి బండికి కడ్తారు. వాళ్లు బండి వెంట పరుగెత్తలేక పడిపోతే బండ్లు లాక్కుపోతాయి. భూమి రాపిడికి చర్మం లేచి రక్తం కారుతుంది. ఆ స్థితిలో ఉన్న వాళ్లని చూసి ఈ దేశంలో ఏ మున్నా సర్కారున్నదను కుంటున్నారా? దొరలు, కరణాలు రాజ్యమేలు తున్నారు, పోలీసోళ్లు వాళ్ల చేతుల్లో కుక్కలు. ఎప్పుడిరగడైపోతదో ఈ దొరల రాజ్యం అంటాడు వాళ్లకు నీళ్లిచ్చిన కుమ్మరి. పోలీసువాళ్లు కొట్టిన దెబ్బలకు భీక్యా ప్రాణాలు వదులుతాడు. చెయ్యని నేరాలు ఒప్పించడానికి, ఇస్లామ్ మతంలో కలపడానికి లంబాడీలందరినీ జనపనార నులకలతో భుజాలనుంచి పాదాల వరకు బిగించికట్టేస్తారు. చాకళ్లు కుండలతో తలపైనుంచి నీళ్లు పోస్తుంటే

నీళ్లకు తడిసిన జనపనార గట్టిగా బిగుసుకొంటుంది. ఒళ్లంతా హూనమవుతున్నా లెక్క చేయకుండా చేయంది ఎట్ల ఒప్పుకుంటమండి అంటారు. తిరిగి వాళ్ళను చావగొట్టి జనపనార తలలకు కట్టి రెండు చివర్ల కలిసే చోట పుల్లలు పెట్టి తిప్పుతారు. అప్పటికి ఒప్పుకోకుంటే అమీరు రాక్షసుడై కర్రలకు కారం పూసి ఆసనాలలో పెడ్తారు. ఈ బాధలు భరించలేక లంబాడీలు చివరికి ఒప్పుకుంటారు.

ఈ రచయితే రచించిన "జనపదం"లో కూడా పోలీస్ ఇన్స్పెక్టరు గ్రామ ప్రజలను హింసించి గాంధీ జయంతి నాడు మానవ జాతి సిగ్గుపడే విధంగా ప్రజలను నగ్నంగా గాంధీ విగ్రహం చుట్టూ తిప్పిస్తాడు. మొక్కిస్తాడు, అవమానపరుస్తాడు.[3] ఈ నవలలో సంఘటనలు కల్పితంకాదు. తెలంగాణలోనే కాక ఎక్కడో ఒకచోట జరుగుతూనే ఉంటాయి. 1949 జులై 14 కృష్ణా జిల్లా ఎలమర్రు గ్రామంలో అనుమానంపై గ్రామంలోని పురుషులందర్నీ నిర్బంధించి గుడ్డలు ఊడదీయించి తమ స్త్రీల ముందే గాంధీ విగ్రహం చుట్టూ తిప్పించింది భారత ప్రభుత్వమిలటరీ. ఇలాంటిదే కాటూరు గ్రామంలో కూడా జరిగింది.[4]

లంబాడీలైనా, వెట్టివాడైనా, మాల మాదిగలైనా సమస్యలు వేరైనా వాళ్ల బాధలు మాత్రం ఒకటే! చిల్లరదేవుళ్లులో అమీన్‌కు, మోదుగపూలులో ఉన్న అమీన్‌కు తేడా ఏమీ కన్పించదు. తాసిల్దారు పీరిగాని బిడ్డను పట్టుకొచ్చి ఇంట్లో పడేస్తారు. మళ్లీ పారిపోయిందని తెలుసుకొని పీరిగాన్ని తీసుకొచ్చి నొసలు చిట్లిపండ్లు విరిగి స్పృహ తప్పి మాట్లాడే స్థితిలో లేకున్నా కర్రలు విరిగేట్టు కొడుతుంటారు. ఆ స్థితిలో మూత్రం పోసుకొంటాడు పీరయ్య, కాలితో తన్ని గొలుసులతో కట్టుకొయ్యకు కట్టేస్తారు. వడ్డెరోళ్లందరూ పీరయ్యను వదిలేయమని

అర్థించటానికి అతని పెళ్లాం పీరమ్మను పంపుతారు. కట్టుకొయ్యకు ఉన్నోడు కాటికి పోవల్సిందే తప్ప తిరిగి ఇంటికి పోవలసింది ఉండదు. ఐతే ఆ రోజు ముస్లీమ్‌ల పవిత్రదినం కావటంవల్ల అతను వదిలి పెట్టబడ్తాడు. చిల్లరదేవుళ్లు నవలల్లో చింతలు దొంగతనం చేసిన పీరిగాన్ని బిచ్చమెత్తు కుంటుండగా చూసి వాణ్ణే లాక్కొస్తే పిల్లలుగల్లోడు అని చెప్పినా వినకుండా దొర  కర్రతో కొడ్తుండగా కణత మీధ దెబ్బ తగిలి ప్రాణం విడుస్తాడు. ఒక్క క్షణం గుండె గుభేలుమన్నా మరుక్షణంలోనే రాక్షసుడిగా మారి తోటలో పాతిపెట్టమని ఆజ్ఞాపిస్తాడురెడ్డి. ఈ నవల్లోని పీరయ్య దొర అమానుష, రాక్షస కృత్యాలకు బలైపోతే మోదుగుపూలులోని పీరయ్య తన చావుకు కారణమైన గ్రామాధికార్ల నాశనం తొందరలో ఉందని తెల్సుకొని మూడు రోజుల తర్వాత కన్నుమూస్తాడు. అతని మరణం సామాన్య మరణం కాదు. ఆరోజు గుడ్‌ఫ్రైడే, అంటే క్రీస్తు శిలువ ఎక్కినరోజు. కట్టుకొయ్యనే శిలువగా మార్చి పీరయ్య జీసస్‌గా, కట్టుకొయ్య శిలువగా చేసి పీరయ్య సమాధి నిర్మిస్తారు. ఆ సమాధి దౌర్జన్యానికి చిహ్నంగా రాక్షసత్వానికి సమాధిగా ఉండి ప్రజల్ని ఎప్పటికప్పుడు తన బాధ్యతల్ని గుర్తించుకునేట్లు చేస్తుంది. ఆ రకంగా పీరయ్య అమరుడయ్యాడు.

అయితే చిల్లరదేవుళ్లు రంగాచార్యగారి మొదటి నవల కాబట్టి దీన్లో కాల్పనికత చోటుచేసుకుంది. పీరిగాని మరణం, ఇతర దుష్కార్యాలు రెడ్డి మనసులో భయం పుట్టించాయి. అతను పశ్చాత్తాపుడైనట్టు వర్ణించాడు రచయిత. నిజానికి అటువంటి పశ్చాత్తాపం జీవితంలో ఎవరూ పడలేదు. వడ్డెరోళ్లు ఎట్టికి రాళ్లు కొడ్తే ఎల్ల లేదని చెప్పి కూలి ఇప్పించమని అడిగితే తన అధికారం అస్తమిస్తున్నట్లనిపిస్తుంది దొరకు మోదుగపూలులో దాని కంతటికి కారణం సంగం అని తెలుసుకుంటారు.

ప్రజల్ని అదుపులో ఉంచడానికి ఇండ్లల్లో దుండగుల్ని పంపిస్తూ, దోపిడీలు చేయిస్తూ, కట్టు గొయ్యలకుకట్టి కొడ్తూ, కొందరి ఎద బండలెత్తుతూ ఊరంతా హడలగొట్టిస్తూ, డబ్బును వసూలు చేస్తాడు అమీన్.

అమీన్ అరాచకత్వం ఈ రెండు నవలల్లో ఒకే తీరుగా సాగింది. చిల్లరదేవుళ్లలో చేయని నేరానికి లంబాడీలు బలైపోతే మోదుగుపూలులో చేయని ఖూని ఒప్పుకోమని లంబాడీలను ఎలా హింసలు పెట్టారో అలాంటి శిక్షల్నే అనుభవిస్తాడు రఘు. నిజాం రాజ్యంలో పోలీసులు రక్షకభటులు కారు రాక్షస భటులు. వారికి ఏ కోశాన పిసరంత మనసుంటుందని నమ్మకం లేదు. ప్రజలను హడలుగొట్టడంలో చేయని నేరాన్ని ఒప్పించడంలో వాళ్ళను మించిన వారు లోకంలో మరెక్కడా ఉండరు.

దొర దౌర్జన్యానికి మరో యథార్థ దృశ్యం ఉప్పెన నవల ప్రారంభంలోనే కనబడుతుంది. దొరల కండ్లలో ఏ వస్తువులు కనబడ్డా అది గడిలో చేరవలసిందే. నోరు ఉన్న జీవాలైనా, నోరు లేని జీవాలైన వారి ఆజ్ఞకు బద్ధులు కావల్సిందే. వెంకటరెడ్డి కొత్తగా కొనుక్కున్న ఎడ్లను చూసి పుణ్యమూర్తికి కన్ను కుట్టింది. వాటిని ఎలాగైనా తన సొంతం చేసుకోవాలని అనుకుంటాడు. అది గమనించి వెంకటరెడ్డి తన దగ్గర ఉన్న పొగాకును లంచంగా ఇస్తాడు. అది తీస్కోని, పుణ్యమూర్తి దగ్గర పని చేసే వాణ్ణి కొట్టడానికి వచ్చాడని అబద్ధం చెప్పి ఎడ్లను బంజరులోకి ఈడుస్తాడు. పొగాకు ఇచ్చినా ప్రయోజనం లేకపోయింది. పైగా ఇనుపకడ్డీతో మాత్రం దెబ్బలు తప్పలేదు. అంతటితో ఊర్కోలేదు దొర, ఎడ్లను తనకమ్మినాడంటూ కాగితం రాయించుకుని పైసలు కూడా ఇవ్వడు. కనీసం అమీన్ సాబ్‌కు చెప్పుకుందామన్నా అతనూ దొర దిక్కే

మాట్లాడుతాడని కిమ్మనకుండా ఊర్కొంటారు ఆ దంపతులు. అంతటితో ఆగిపోకుండా పుణ్యమూర్తి గ్రామపంచాయితీ జరిపించి పుణ్యమూర్తికి ఎదురు తిరిగి మాట్లాడినందుకు నూరు రూపాయలు జరిమానావేస్తాడు. రూపాయలకు బదులుగా కల్లంలో పుట్టి ధాన్యాన్ని తీసికెళ్తాడు.

ఈ దొరలు తమకు అమలు పర్చేది ఒక న్యాయం, ప్రజలకు తీర్పు చెప్పేది మరొక న్యాయం. హరిజనుడైన పెంటయ్య, జగ్గయ్య దొర దగ్గరికి వెళ్ళి తన భార్య పై బొక్కలముత్తడు కన్ను వేసి తన కాపురం చెడగొడుతున్నాడని చెప్పుకోగా యాభై రూపాయలు జమానతు ఇవ్వాలని తీర్పిస్తాడు. మళ్ళెప్పుడైనా నీ మీద నీ మొగుడు షికాయతు చేశాడంటే నెత్తిగొరిగించి గాడిద మీద ఎక్కించి సున్నం బొట్టుపెట్టి ఊళ్ళో నుండి వెళ్ళగొట్టిస్తా అని పెంటయ్య భార్యకు భయం చెప్తాడు దొర (పేజి 12, గంగు) కాని వాళ్ళు మాత్రం పరస్త్రీలను చెరచవచ్చు.

పశువులను పూజించినట్టే మనుషులను కూడా పూజిస్తే ఎంత బాగుంటుంది. ఆవులను బండ్లకు కట్టొద్దు గానీ బండ్ల ముందర మాత్రం మనుషులు కుక్కల్లాగా ఉరకాలె ఇదేమిటి (పేజి-47) ఈ మాటలతో అక్కడ చేరిన జనం ముఖాలు వికసించాయి కాని అమీన్ ముఖం ముడుచుకుపోయింది. అమీన్ దౌర్జన్యానికి నిదర్శనంగా పై సంఘటన గంగులో చూస్తాం. పోలీసు అధికారులు ప్రతిఫలం లేకుండా రోజు హరిజనులు కట్టెలు తెచ్చి యివ్వాలి; రైతులు వాళ్ళ పొలాల్లో పుల్ల విరవనీరు, హరిజనుల్ని ఒకనాడు మద్దిమెట్టు గ్రామ హరిజనుడు, వృద్ధుడు పోశయ్య కట్టెలు ఎక్కడా దొరక్క పోవటంతో పచ్చి కట్టెలు తెచ్చి యిచ్చాడు. అమీన్ వాణ్ణే పిలిపించి తిట్టాడు. రోజు కాకుండా ఏదో ఒక రోజు చెట్టును కొట్టించుకుంటే ఈ తిప్పలు తప్పుతాయని అంటూ

రోజు చేసే ఈ పని మాన్పించమని ప్రాధేయపడ్డాడు. పొలాల్లో కట్టెలు విరిస్తే దొరల చేత తన్నులు, కట్టెలు లేకపోతే అధికారుల చేత తన్నులు! మీ తాత ముత్తాతల నుంచి తన్నులు తింటున్నారు, ఇప్పుడు తన్నులు అంటె దిగులయితున్నదిరా (పేజి-74) అని అమీన్ హూంకరించాడు. మొట్టమొదటి సారిగా అన్నాలంగా తన్నులెందుకు..? అన్నాడు. తరాతరాల నుండి తమ గుండెల్లో మౌనంగా అన్యాయాన్ని భరిస్తున్న జీవితం నేర్పిన మొదటి పాఠం. వాస్తవిక జీవితాన్ని ప్రశ్నించడం నేర్చుకున్నారు. వారి దుర్భర జీవితమే వాళ్ళని ప్రశ్నించటం నేర్పింది. ఈ మాట తెలంగాణా ప్రజా చైతన్యంలో ఒక ముఖ్యమైన మలుపు. చైతన్య ప్రస్థానంలో మరి మజిలి.

అట్టుడుగున పడి వున్న అధికారుల పద ఘట్టనలచే నలిగి పోతున్న జనం ప్రశ్నించడం నేర్చుకున్నారు. కెండ్లు నెత్తికెక్కుతున్నాయిరా అన్న అమీన్ మాటలకు ఎందుకు దొర? తిండికెళ్ళనోళ్ళకు **మాకెందుకట్ల యితది** అన్న సమాధానం విని అమీన్ మండిపడ్డాడు. తాను బీదోణ్ణయినా అని చూడకుండా తన మేకపోతును పటేలు అక్కడి అధికార్లకు పంపించాడు. ఆ విషయం ప్రస్తావిస్తూ కాస్త దయతలచమని ప్రార్థిస్తాడు. ఆ మాటలు వినిపించుకోకుండా అమీన్ పోశయ్యను బయటికి తోసెయ్యమని జవాన్ను ఆజ్ఞాపించాడు. పొత్తికడుపు మీద బూటు కాలితో బలంగా తన్నాడు. కణతకు దెబ్బ తగిలి కిందపడి స్పృహ తప్పి పడిపోయాడు ఆ బక్క జీవి. అతణ్ణి రోడ్డు పక్కకు ఈడ్పించి వేశాడు అమీన్. దొరల అధికార దర్పానికి అహంభావానికి మనుష్యుల ప్రాణాలు బలి కావటం కూడా సాధారణం ఆ వ్యవస్థలో! సామాన్య జనం ఏ చిన్న తప్పు చేసినా, దొరలకు ఒక చిన్న మాట జవాబు చెప్పినా శిక్షలు విపరీతంగా వుండేవి. శిక్ష ముఖ్యంగా తప్పు చేసినందుకు గాదు, తమ

పెత్తనాన్ని అధికారాన్ని ధిక్కరించడమా తప్పు చేసి? అన్న దొరల మనస్తత్వం ప్రధానమైంది. అక్కడ ఆ వ్యవస్థలో న్యాయాలు చట్టాలు ఏవి పనిచేయవు. ప్రభుత్వం అంటే ఉప ప్రభువుల పెత్తనమే. వీరి మాటే ఒక శిక్ష. ఊరి పెద్దలు, పెద్దమనుషులు అనబడ్డ వాళ్ళు వూరి చిల్లరదేవుళ్ళుగా వెలసి న్యాయవ్యవస్థను తమ గుప్పెట్లో బంధించి ఇష్టం వచ్చినట్లు ఆడించేవారు జనాన్ని.

కింద పడి శవంలాగా వున్న పోచయ్యను నవనీతం, నాగభూషణం ఆస్పత్రికి తరలిస్తారు. అక్కడ కూడా వారికి మంచి సదుపాయం లేక రోగిని ఇంటికి పంపివేశారు. హరిజనులంతా పోశయ్యను చూసి గొల్లు మంటారు. అధికారులందరు ఒక్క చోట వున్నారని తెలిసికొని హరిజను లందరూ గుంపుగా న్యాయం కోసం వెళ్ళారు.

తహశీల్దారు వాళ్ళను చూసి ఎగతాళిచేస్తాడు. వెళ్ళిపొమ్మని చీదరించుకుంటాడు. అతనికి వారిపై ఏ మాత్రం సానుభూతి లేదు. హరిజనుల స్త్రీలు ఉక్రోషం పట్టలేక అందర్ని అమ్మఅయ్యా అంటూ కాళ్ళు పట్టుకొని బతుకుతున్నాం. మా మీద అందరికి పగనే, మేమేం పాపం చేసి పుట్టినమో మాదిగకులమే పాపపు కులం అందర్ని ఒక్కసారి సంపెయ్యిరి పీడ పోతది (పేజి-107) అని అంటారు. వాళ్ల మాటల్లో నిస్సహాయతతో కూడిన రోషం తొంగి చూస్తుంది. అంతే కాక బలవంతంగా వాళ్ల చేత తెల్ల కాగితాల మీద వేలిముద్రలు పెట్టించు కుంటారు అధికారులు. ఆ ఉళ్ళో వుంటున్న నవనీతం నాగభూషణంలు హరిజనుల్ని రెచ్చగొడ్తున్నారని, వెట్టికి వ్యతిరేకంగా ప్రచారం చేస్తున్నారని, కాబట్టి వాళ్ళ మీద తగు చర్య తీసుకోవాలని ఆ కాగితాల మీద విజ్ఞప్తి రాసాడు.

నవనీతం, నాగభూషణం, వీరనాగయ్యల్ని జైల్లో నానాహింసలు పెట్టించినా తృప్తి పడలేదు ఆ అధికారులు. వాళ్ళను పోలీసులు తీసుకెళ్ళిన తర్వాత వెంకట్రావు దొర ఊళ్ళో వున్న హరిజనుల మీద ఇతర వ్యక్తుల మీద విరుచుకు పడ్డాడు. వాళ్ళను ఊపిరి ఆడనీయకుండా ఐదురోజుల వరకు ముప్ప తిప్పలు పెట్టి హింసించాడు. ముందు ముందు ప్రజలు తన మాట వినరనీ, తన పెత్తందారికి ముప్పు వస్తుందేమోనన్న ఆలోచనలో ప్రజలు హద్దు మీరి పోతున్నారన్న భయంతో అందరినీ, బెదిరించి అదుపులో పెట్టడానికి ప్రయత్నించాడు.

ఇదే నవలలో దళితులపై దొర ఏరకంగా దౌర్జన్యం చూపించాడో రాజం తన మాటల్లో సుజాతకు ఒకటా నుండి చెప్పటానికి, బంటోళ్ళను పిలిపించి కంచెలో ఒక కట్టె పుల్ల ఇర్వొద్దన్నాడు, గొల్లోండ్లను పిలిపించి ఎను పొంటె జీవాలను (మేకలు) వదలొద్దన్నాడు, ఇక గౌండోడ్లను దమ్మిడి దమ్మిడి కక్కిందాక వదిలిపెట్టనని బండలెత్తుతాడు. మాదిగ జనం అప్పుడిన్ని ఇప్పుడిన్ని గింజలు తీస్కపోయిరి. ఆండ్లను పిలిపించి ఈత బరికెల్తో ఇజ్జర, మజ్జర గొట్టించి గింజలు వసూలు చేస్తాడు, ఏందోగని సుజాతమ్మగారు దొర మాత్రం తాచుపాము పగ పట్టిన్రు. ఎట్ల ముందర పడ్తడో ఏమో గాని (పేజి-134) అని చెప్పుకొస్తాడు.

లంబాడిలు జగ్గయ్య దొర అధీనంలో వున్న తుమ్మల కుంట భూమిని తాతల కాలం నుండి కౌలుకు చేస్తున్నారు. బీడుగా వున్న ఆ భూమిని సాగుచేసి కుంట పోశారు. అప్పటి నుండి అదే వారికి జీవనాధారమైనది. అటువంటి కుంటను ఒక రోజు జగ్గయ్య దొర లంబాడిలను పిలిపించి ఇక పై దానికి ఎవరికి అధికారం లేదని, ఆ కుంటను ఎవరికి కౌలుకు ఇచ్చేదిలేదని చెప్తాడు. లంబాడిలంతా నోరు

తెరుస్తారు. తమ పొట్టలపై కొట్టే ప్రయత్నం జరుగుతుందని ఆందోళన పడ్డారు. ఆ భూమిలో దేవాలయం, ధర్మశాల కట్టిస్తున్నానని చెప్తాడు. **ఉంటున్న పాటు మా మీద గుట్టనేసినట్టు ఏం దొర ఇదీ మేం ఏం తిని బతుకమంటరు ఎందుకండి మా పొట్ట మీద కొడ్తాడు. పంట పొలంలో గుడేందుకు? మీకు పోటు మస్తుగుండెగద?** (పేజి-181) అని ప్రశ్నల వర్షం కురిపిస్తారు. వాళ్ల ఆకలి ప్రశ్నించే చైతన్యాన్నిచ్చింది. ఆ భూమి వాళ్ళ బతుకు తెరువు. అందుకే ఏ విధంగానైనా ఇవ్వటానికి వాళ్ళిష్టపడరు. ఆ భూమి తహసీల్దారుకి ఇచ్చేస్తానని జగ్గయ్య దొర చెప్పడంతో సర్కారు మీకే కాదు మాకు వుందంటూ **న్యాయం కోసం సంగ పోళ్ళ దగ్గరికి పోదాం** పదండి అంటూ వెళ్ళాడు. సంగపోళ్ళు ఆ గ్రామంలో వచ్చినప్పుడు వాళ్ల సంతోషాలకు అవధులు లేవు. హరిజనులు వాయిద్యాలతో వచ్చి చేరారు. బండి వెనుక వస్తున్న ఆడవాండ్లు పెత్తందార్ల కింద అనుభవించిన కష్టాల్ని అవమానాల్ని చెప్పుకు పోతున్నారు. ఒక స్త్రీ హృదయవిదారకంగా విలపిస్తూ అధ్యక్షుణ్ణి కాళ్ళు గట్టిగా పట్టుకుని **మీరు ఇక్కడే వుండాలి కొడకా! లేకపోతే బతుకలేం. దిక్కులేని పచ్చులమైతం.** అని ప్రాధేయపడింది. ఆ దృశ్యం చూసిన నాయకుని కళ్లలో నీళ్ళు తిరిగాయి. వారి హృదయవేదన గ్రహిస్తాడు.

అల్లం రాజయ్య గారి **కొలిమంటుకుంది** నవల్లో దళితులను దొర ఎంత హీనంగా చూసేవాడో చిత్రింపబడింది. నరసింహ నిజాయితీగా దొర చేసింది తప్పని చెప్తాడు, అన్యాయంగా తన పొలంలో వున్న స్తంభాలు పీక్కోవడం మంచిది కాదని గడిలోకి వెళ్ళి ధైర్యంగా అడుగుతాడు. ఆ ప్రశ్నతో దిమ్మెక్కిపోతాడు దొర. కనిగట్ల అడిగినోల్లి ఇడసి పెట్టుకుంటూ బోతే రేపు గడిగోడల ఎగబాకరో, అనిచి పెట్టకుంటే కూలి లంజకోడుకులు ఏడాగుతారో? ఓ కెల్లి తన్నంగా కండ్లు నెత్తికెక్కి

ఎగురుతుంద్రు. అలుసిత్తే గడి తలుపులే పీకెత్తరు. ఇయ్యాల నర్సిమ్మడు, రేపు లట్మిగాడు. ఎల్లుండి పొట్టిగాడు. గిట్ల సుంకరోల్లు ఏమనుకున్నారో అని నర్సింహని అణిచే ప్రయత్నం చేస్తుంటాడు. (పేజి-40)

అతని భూమిని స్వాధీనం చేసుకుని అతన్ని పంచాయితిలో అవమానపరుస్తాడు. అయితే దొర చేస్తున్న పనులకు నర్సింహ ఊరుకోడు. మాటకు మాట సమాధానం ఇస్తూనే ఉంటాడు. దొర! నన్నరిసి కట్టేపిచ్చే నా నోరుమూ పిచ్చి బండలెత్తిచ్చి, బరిగెలతోని గొట్టి సెయ్యని నేరాలు ఒప్పిత్తారు. నన్నొక్కనేగాదు తమరు తలుచుకుంటే ఈడ కూకున్నోల్లెవల నైన గట్లసేత్తరు. గీ ఊరిన బుట్టిన కాన్నించి నా తలెంటికల్లి సూసిన, గీడ కూసున్నోలంత సూసి సూసి కండ్లు మూతలు బడ్డోల్లె, మేమంత మీ సెప్పులకింద సీమలోలె బతుకుతన్నామ్ అనుకుంటాంద్రు నిచ్చమె, మా జుట్లు పోసలు ఇరుకబట్టి తోలుబొమ్మలాడిచ్చినట్లుగా ఆడిత్తుంద్రు. అప్పులు, అడ్డీలు పైపెచ్చులు గట్టి మా నోర్లకు తియ్యరాని తాళాలేసింద్రు. ఇగో... నేను తమరి ఉప్పు పప్పు సిన్నప్పుడెప్పుడో తినచ్చు................గీ ఊరికి దొరవు కావచ్చు ఏలకురాలమాలుకు దొరవు గావచ్చు. మంది సేరట్ల కంబాలు అర్ధరాత్రి పీకిచ్చి, గిదేందంటే సెప్పుతో గొట్టటం దొరతనం గాదు.అని జవాబిచ్చి పంచాయితీలో లేచి ముందు జరిమానా కట్టనని తెగేసి చెప్పాడు. సంగం వారు ఊళ్లోకి వచ్చినప్పుడు దొర దౌర్జన్యాన్ని ఏకరువు పెట్టారు ఒక్కొక్కరూ!

....... దున్నంగ సాతకాక నాగలాపి ఒడ్డున గౌరచ్చి పన్న, ఏన్నుంచ్చచ్చిండో? మడికట్లు మీన ముల్లు గట్టిరిగె దనుక గొడ్డును గొట్టినట్లు కొట్టిండు. నీ కాల్ మొక్కుత దొర ఆరంరోజుల పట్టి జెరం

గోడ్తంది. కాల్ సేతులు సులుకు సులకున బొమత్తన్నయ్; నన్ను సంపకంట్రి దొర, గిప్పుడే గేరచ్చి ఒడ్డు మీన ఒరుగిపోయిన దొర, అని కాల్లకంగి మొక్కిన ఊకున్నాడా? తోలు పికుల గొట్టిండు అని తన చిరిగిన బనీను విడిచి వీపును వాళ్ళకు చూపిస్తాడు. వీపంతా జెర్రిపోతులంత వాతలతో చర్మం పికిలిపోయుంటుంది.

ఇదే నవల్లో దొరకు నర్సింహకు చాలా చోట్ల మాటా మాటా పెరుగుతుంది. అన్యాయాన్ని సహించని నర్సింహ దొరకు ఎదురుతిరిగి నప్పుడల్లా దొర తన చెప్పుతో నర్సింహను కొడ్తుంటాడు. నర్సింహ ఎదురు మాట్లాడుతునే వుంటాడు. సంగంతో కల్సిన నర్సింహాన్ని బాదుతూ; నీ దిక్కున్న కాడ సెప్పుకపో. సంగాలు పెడుతారుర, మూతి మీసాలు మొలసినాయిరా! అప్పుడే కండ్లు నెత్తికెక్కినయ్, పాటలు పాడుతారు, లెల్లె పాటలు గడుతారు, ఎవడన్న నోరు దెరిసిండో సెప్పుతోని నాలుకె తెగోత్తా అంటూ దొర కుడికాలు మొలల చెప్పు నూడ బీకి ఫెడిఫెడిన కొడ్తాడు. ఎంత కొట్టిన నర్సింహలో మార్పు లేదు. సంగం సహాయంతో దొరను ఎదుర్కొంటూనే ఉంటాడు. ఊరి ప్రజల్ని దొర బతుకనివ్వడు. ఏ ఊర్లో అయినా కూలోడు బతకద్దు, భూమి ఉంటే ఒక పూటన్నంతింటాడు; తింటే బతుకుతాడు, బతుకుతే ఎదురు తిరుగుతాడు. బానిస వాడు బద్మాష్ అయితాడు; అందుకే భూమిని లేకుండా చేయాలని అనుకుంటారు దొరలు. అటువంటి వాళ్ళని ఆ దొరతనాన్ని పాతర పెడ్తానని ప్రతిజ్ఞ చేస్తాడు నర్సింహ.

బొత్తయ్య కడుపులో ఆకలి భరించలేక కల్లంలో వడ్లు పాత బట్టలో తోడుకుంటున్నప్పుడు దొర కళ్లలో పడతాడు, మరుసటి రోజు ఊరి పెద్దల సమక్షంలో పంచాయితీ జరుగుతుంది. బొత్తని తరుపున పిర్రల లింగడు క్షమాపణ చెప్పుకుంటాడు. తన్నినా గుద్దినా మీరేనని చేసిన

తప్పుకు ముల్లుగుచ్చ సందులేకుంట తన్నులు తిననే తిన్నాడని అతని పై దయ తలచి వదలి పెట్టండని ప్రాధేయపడ్డాడు. పెద్ద మనుషులందరు కూడ పదుర్కొని ఐదునూర్ల రూపాయల దండుగేసిండ్రు. ఆ దండుగ కిందుగ గుడిసెకున్న పది గుంటల పెరడు భీమయ్య తీసుకున్నాడు. మిగిలింది కోమటి రామలింగం తీసుకున్నాడు. నూర్రుపాయలు అప్పు కూడా తెచ్చాడు. పెద్దోడు వడ్డీ కిందకి పాసింది, పులిసింది తిని బర్ల కాయటానికి కుదుర్తాడు. అప్పు తీర్చేదాక పోరగాన్కి జీతం లేదు, రూపాయలకు వడ్డీ లేదు. ఈ రకంగా దండగ రూపాయలన్నీ చేరాల్సిన చోటుకే చేరాయి. నాలుగువందలు దొరకు అందితే మిగిలినవన్ని పెద్ద మనుషులు పంచుకున్నారు.

ఇవన్ని జరిగినా బొత్తోడు మెడకు ఉరి బిగించుకోలేదు. మాడ్చుకున్న ముఖంతోటి చచ్చిన వాడి లాగ దొరకు పనులు చేస్తునే ఉన్నాడు, వెట్టిని నిలబెడ్తునే ఉన్నాడు. ఫ్యూడల్ వ్యవస్థ మనుష్యులందర్నీ వ్యక్తులుగా గుర్తించదు. వారి దృష్టిలో వ్యక్తులంటే దొరలు, భూస్వాములు, వారికే అధికారాలుంటాయి, హక్కులుంటాయి. వారితోనే ప్రభుత్వం నడుస్తుంది. వారి శక్తి దాన్ని నడిపిస్తుంది. మిగితా వారంతా ప్రాణం ఉన్న జనం, అంతే వారికి వ్యక్తిత్వం ఉండకూడదు. ఉన్నా దాన్ని ఈ వ్యవస్థ గుర్తించటానిక ఇష్ట పడదు. దొరకు సేవ చేయటానికి వీళ్ళు జీవిస్తారు. ఈ జనం ఆ దొరలకు సకల భోగాలు సమకూరుస్తారు. జనానికి ప్రాణం వుంటుందని మాత్రం గుర్తించింది ఆ వ్యవస్థ ఎందుకంటే ప్రాణం ఉంటేనే సేవలు చేయగలుగుతారు. కుక్కలకు గుర్రాలకూ ప్రాణం వుంది. అరకు కట్టిన ఎద్దు కంటే కడుహీనుడు అరకకు తోలేవాడు; ఎందుకంటే ఎద్దులను కొన్నాడు దొర. సేవకుడు అలా కాదు అతడు జన్మాంతం సేవకుడు. అతణ్ణి కొట్టడానికి చంపడానికి అతనికి అధికారం

ఉంది స్వామికి పాలకులు దైవాంశ సంభూతులనే భూస్వామ్య సిద్ధాంతాన్ని పాలకులే కాక పాలితులు కూడా త్రికరణ శుద్ధిగా నమ్మడం ఈ వ్యవస్థలోని దౌర్భాగ్యం అని రంగాచార్యగారు వీరికి పరిచయం చేసారు.

సమాజంలో ఎన్నో వర్గాలున్నాయి. ఆ వర్గాలన్నింటిని అట్టడుగున మరో వర్గం వుంది. ఈ వర్గంలో పుట్టిన వాడు జన్మించడు; భూమ్మీదపడతాడు, పుట్టగానే అందరూ ఏడుస్తారు గాని వీడు విలపిస్తూ పుడుతాడు. జీవితం అంతా అలాగే ఏడుస్తాడు అన్పిస్తుంది. వాడు పుట్టాడన్న ఆనందం చుట్టు పక్కల వారెవరికీ వుండదు. మగపిల్లవాడు పుడితే కష్టం చేసేందుకు మరో చెయ్యి వచ్చిందని సంతోషపడ్తారు. ఆడపిల్ల పుడితే చాకిరి చేసేందుకు మరో జీవి వచ్చిందని నిట్టూరుస్తారు. వీరు ప్రకృతి మాత ఒడిలో పెరిగి పెద్దవారవుతారు. రెక్కలు ముక్కలు చేసుకునే మనుష్యులు, నిట్టూర్పులు, బానిసతనం, కన్నీళ్ళు, సమస్యలు ఎప్పుడూ, ఎక్కడో ఒక చోట ఆర్తనాదాలు ........ ఏడుపులు, చావులు, సంబరాలు ఇలా వుంటుంది వారి జీవితం. పట్నాల్లో, పల్లెలో వీరి జీవితం ఒక్కలాగే ఉండక పోయినా మొత్తానికి కన్నీళ్ళకు ఒకటే రూపం, ఒకే రకం వేదన. ఆశలేమి; రేపటిని గురించిన దిగులు, భయం.......దోపిడికి గురువతూ, రక్తం స్వేదం ఇతరులకు ధారపోస్తూ................ సుఖశాంతులు లేని జీవితం.......... చిన్న చిన్న ఆనందాలు, చిన్న చిన్న అలజడులు వేదనలు, రిక్షా తొక్కినా, రాళ్లను కొట్టినా, పొలాల్లో, కార్ఖానాలో పనిచేసినా ఒకే రకమైన జీవితం. తమది కాని జీవితం ఇతురులకైన జీవితం.

బానిసశ్రమ ముసుగు లేని బలత్కారశ్రమ. ఉత్పత్తి సాధనలు మాత్రమే కాక, శ్రామికుడు కూడా దోపిడి వర్గపు ఆస్తిగా వుండినాడు. బానిసలను పశువుల లాగా కొనడం, అమ్మడం జరిగేవి. యజమాని

బానిసలను చంపవచ్చు. బానిసల శ్రమ సృష్టించిన ప్రతిదీ యజమానికి చెందేది. యజమానులు బానిసల మీద దోపిడిని తీవ్రతరం చేస్తూ వాళ్ల అదనపు శ్రమే కాక, వాళ్ళ అవసర శ్రమలో గణనీయమైన భాగాన్ని గూడా సొంత పరుచుకున్నారు.[5] ఇటువంటి స్థితిలో వున్న దళితుల వెట్టి మాల మాదిగల జీవితాన్ని సంఘం మార్చేసింది. సంఘం రాకతో వాళ్ల జీవితంలో కొత్త ఆశలు చిగురించాయి. చదువుకున్న యువకులు కొందరు, కమ్యూనిస్టు పార్టీకి చెందిన యువకులు మొ॥ వారందరూ సంఘం యొక్క ఆశయాల్ని ప్రజలలో వ్యాపింప జేయడం దాదాపు అన్ని నవలల్లో కన్పిస్తుంది.

ప్రజలను ఒక్కచోట కూర్చడం వారికి సమస్య! వాళ్ల మాటలతోనే వాళ్ల కళ్లు తెరిపిస్తారు. ఈ యువకులు ప్రతి రోజు రాత్రి సమయం చిన్న చిన్న సభలను జరిపి వాళ్ళ మనస్సు మళ్లించే ప్రయత్నాలు చేస్తుంటారు. ఎలా దోచుకోబడుతున్నారో ఉదా॥ పూర్వకంగా చూపిస్తుంటారు. మీ నెత్తిన ఒక మోయలేని బరువు పెట్టబోతున్నాడు. మీ దేశ్‌ముఖ్! నజరానాల కింద మీరు నిలువుదోపిడి యివ్వాలి. నాలుగు రోజులు బళ్ళ మీద మేత గూడ వేసుకొని దొరసానిని దింపి నడిచి రావలట! ఎందుకు కట్టాలి బండ్లు! ఎవ్వరికి యివ్వాలే నజరానాలు. బాడుగిస్తేనే బండ్లు కట్టండి, కూలి పైసలు, గొడ్లకు మేత యిస్తేనే వస్తామవండి. మీరంతా సంఘంలో చేరండి......... వెట్టిగా అరకలు గట్టటం, స్వంత చెలకలు లేకుండా, వట్టిగా ఎరుమట్టి తోలటం, పండకున్నా లెవీలివ్వటం. పైసలిచ్చి తఖ్తాలు రాయించడం, రశీదు లేకుండా పన్ను గట్టడం దొర పట్టేలనగానే దండం బెట్టి జాబితాలు కట్టడం, సావుకారు సరుకులు, కుమ్మర్లు కుండలు, సాకళ్లు సల్వ దుప్పట్లు, మంగళ్లు వారి దున్నపోతులకు క్షౌరాలు చేయటం గొల్లలు గొర్రె జీవాలన్నియ్యటం. పూర్తిగా బందు చేయండి........... అడ్డమైన బరువులు, ఆఫీసర్లు గుర్రాల వెంట నడ్డి విరిగేలా ఎందుకు మోయాలి?

దానికి మైలుకింతని కూలీ కూడా ఇవ్వమని ఖానూన్ వుంది. ఆ వెట్టి చాకిరీని బందు చేయండి......... అంటూ ప్రజలల్లో చైతన్యాన్ని కల్గించారు సంగం యువకులు.

వీరిలో మార్పులు పటేళ్ళు పట్వారీలు పసిగట్టారు. ఎట్టోళ్ల కట్టెల మోపు బందు చేసారు. గుర్రాలకు మాలీష్ చేసేందుకు మంగలి నారాయణ రావటం లేదని సంగం నవల్లో కన్పిస్తుంది. అట్లాగే దాశరథి రంగాచార్య మోదుగుపూలు నవలలో తాసిల్దారింటికి మంగళ్లు వారం రోజులు రాకుండా సమ్మె చేస్తారు. సంగం వాళ్లు సమ్మెను చేయిస్తారు. అక్కడి నుండే మొదలవుతుంది ప్రజల చైతన్యం ఆ నవల్లో. గ్రామంలో మంగళ్లు అచ్చం క్షౌరాలు చేసేవారు మాత్రమే కారు. పల్లెల్లో వాళ్లే వైద్యుల్లాగా పనిచేస్తారు. బెణుకులుసరిచేసి గాయాలకు శస్త్రచికిత్సలు చేస్తారు. వాయిద్యాలు వాయించేదికూడా వాళ్లే కావటం మూలాన గ్రామమంతటికీ వారు ప్రధానంగా వుంటారు. గ్రామాల్లో మంగలి వాళ్లతోపాటు అతిముఖ్యమైన వారు, చాకళ్లు, కమ్మర్లు, కుమ్మర్లు, వీరు గ్రామానికి స్తంభాల్లాంటి వాళ్లు. అందుకే ఏ గ్రామనిర్మాతలయినా వీరికి భూములిచ్చి వీళ్లను ఊళ్లలో తెచ్చి ఇండ్లను పంచుకుంటారు. ఒకరు చేసే ఇంటికి వేరొకరు చస్తే వెళ్లరు. అది అనాదిగా వస్తున్న కులపు కట్టుబాటు.

అటువంటి మంగళ్లు వారం రోజులు సమ్మెచేసారు. తాసిల్దారు అధికారము గిర్దావరూ ప్రయత్నం వారి ముందు ఫలించలేక పోయాయి. ఆరకంగా మంగళ్లు ప్రభుత్వాన్ని వారంరోజులు స్తంభింపచేసారు. లాక్కున్న భూమిని ఇచ్చేయాలని, తాముచేసే ప్రతిపనికి డబ్బుముట్ట జెప్పాలన్న ·షరతులతో తాసిల్దారు గడిలోకి ప్రవేశిస్తారు. ·మొట్ట మొదటిసారిగా తాసిల్దారు వారికి 5 రూ॥ ఇస్తాడు. వారి చూపుల్లో విజయ గర్వం తొణికిసలాడింది. ఆనాడు ఆరకంగా వెట్టిచాకిరి సాగింది, చరిత్ర దానికి తగిన గుణపాఠం చెప్పింది.

# రైతు పోరాటాలు

దున్నేవానికే భూమి కావాలన్న దొక సైద్ధాంతిక భావన, దాన్ని సాధించు కొనడానికి ఒక సంఘటిత శక్తిగా ఆచరణ రూపమైన కార్యక్రమంలో దున్నే వాళ్లు ముందుకు వచ్చినపుడు, వాళ్ల కార్యక్రమాలకు భూస్వాములెటూ అడ్డు పడతారు. ఆ విధంగా మొదలయిన ఘర్షణ బలపడే క్రమంలో అది అనేక ముఖాల పోరాట రూపాన్ని సంతరించుకొంటుంది. విజయందాకా ఎగురుతూనే ఉంటుంది. అన్న డా॥ కాత్యాయని విద్మహేగారి మాటలు అక్షర సత్యాలనిపిస్తాయి. ఈ నవలల్లో రైతు పోరాటాలని పరిశీలించినపుడు, గులాపువాళ్లమనుకుంటూ బ్రతికే బానిస వర్గం ఒక్క సారి తిరగబడి, వారి ఆశయాలని సాధించుకోవడానికి చేసిన పోరాటాలే ఈ రైతుపోరాటాలు!

తెలంగాణలో పోరాటసాహిత్యం అటుపోరాటాన్ని ఇటు ప్రజా జీవితాన్ని అనివార్యంగా ఏర్పడ్డ గత తార్కిక సంబంధాన్ని ప్రతిఫలిస్తూ ప్రజా జీవితంలో నూతన ప్రజాస్వామిక చైతన్యాన్ని మేల్కొల్పడంతో తన ప్రభావముద్రను, గాఢంగా వేయగల్గింది. తెలంగాణాలో రైతాంగ పోరాటం మొదటినుండీ ప్రజావిప్లవ జీవన సాంస్కృతిక అవసరాలను తీర్చడం కోసం ప్రజలను రచయితలను చేసింది. చాలమంది వాళ్ల వాళ్ల అనుభవాల ద్వారా సాహిత్యాన్ని సృష్టించారు.

ఆనాటి తెలంగాణరైతాగానికి **నీబాంచనుకాల్మొక్త** అన్న ఊత పదం నుంచి గ్రామ చిల్లరదేవుళ్లకు గోరీలు కడ్తామనే శక్తి వచ్చిందంటే దానికి కారణం **సంఘం**. జమిందార్లకు దేశ్‌ముఖ్‌లకు తరతరాలుగా వెట్టిచేస్తూ తలరాతలో అంతే భగవంతుడు రాసిపెట్టాడని వేదాంతం వల్లిస్తూన్న జీవితాలకు సంఘం ఒక ఆశాజ్యోతిగా నిలిచి అంధకారంలో ఉన్నప్పుడు చిరు దీపమైనా చీకటిని పోగొడ్తుంది. అజ్ఞానంగా ఉంటూ,

బానిస బ్రతుకులను ఈడుస్తున్న వాళ్ల జీవితాలని సరైన మార్గంలో పెట్టించి రైతాంగానికి ఒక దారి నేర్పించింది సంఘం.

రైతులు జమీందార్లకు, దేశ్‌ముఖ్‌లకు వ్యతిరేకంగా, వెట్టి చాకిరీకి, అక్రమ నిర్బంధాలకు వ్యతిరేకంగా పోరాటాలను సాగించారు. గ్రామాలల్లో మెల్లి మెల్లగా సంఘం ప్రవేశించి వారిజీవితంలోని వారిజీవితంలోని లోటుపాట్లను చూపిస్తూ, వారికి కనువిప్పు కలిగించే ప్రయత్నం చేసింది. ఎదురులేకుండా గ్రామ ప్రజలని దోచుకుంటున్న దేశ్‌ముఖ్‌లు, దొరలు, పెత్తందార్లు **మేం సంఘంలో** చేరినాం అన్న మాటలు వినంగానే వెనక్కు తగ్గేవాళ్లు.

ప్రజల్లో చైతన్యం క్రమ క్రమంగా ఎట్లా పెరిగిందో చెప్పే నవల ఆళ్వార్ స్వామిగారి **ప్రజల మనిషి.** ఈ నవలలో భూమి సమస్య వల్లనే ప్రజలలో చైతన్యం ఆరంభమవుతుంది. రాంభూపాల్ రావుదొర ఒక నాడు కొమరయ్యను పిలిచి అతనప్పటివరకూ కౌలుకు చేస్తున్న భూమిని ఇక మీదట చేయటానికి వీలు లేదని చెప్తాడు. ఆ భూమి దొరది కూడా కాదు. ఎప్పుడో ఊరు వదిలి వెళ్లిన ఒక బ్రాహ్మణ కుటుంబానిది. మొట్టమొదటి సారిగా ఆ మాటే కొమరయ్య దొరను అడుగుతాడు. దొరను ప్రశ్నించే ధైర్యాన్ని ఇతనిలో చూస్తాం. ఆ ఊళ్లో తన వంటి రైతే కనకయ్య, తగిన శిస్తు కట్ట లేక తన భూమిలో తన జీతగానిగా మారి పోతాడు. ఆ ఊళ్లో పెత్తందార్లే తప్ప మిగిలిన కష్టం చేసుకునే వాళ్లంతా కష్టాలపాలైపోయే రోజులొచ్చాయని తెలుసుకుంటారు ప్రజలు. రాంభూపాల్ రావు దొంగ వాజ్మూలంతో తప్పుడు సాక్ష్యాలతో కొమరయ్య భూమిని తన పేర రాయించుకొని రెండేళ్లవుతుంది. ఒకనాడు కొమరయ్య పొలానికి వచ్చేసరికి దొర మనుష్యులు తన పొలాన్ని దున్నుతూ కన్పిస్తారు. అన్నమ్మ కొమరయ్య తల్లి అరకలకడ్డంగా నిలిచి

తన ప్రాణంపోయిన తర్వాతే ఆ భూమిని దున్నుమంటుంది. ఆ రకంగా దొర మనుషులను పొలం దున్నకుండా ఆపలుగుతుంది. తొలిసారిగా దొరకు ఎదురు తిరగడం ఇక్కడ కనిపిస్తుంది. ఆ సంగతి తెలిసి దొర కొమరయ్యను కట్టేసి కొట్టడంతో కాపు కులస్తులందరిలో ఐక్యత నెలకొంది. న్యాయం చేస్తాడని నమ్మిన హైదరలీ కూడా న్యాయం చేయడని కొమరయ్య అనుభవం ద్వారా తెలుసుకొంటాడు. కొమరయ్య భూమి సమస్య పరిష్కరించమని ఆర్యసమాజం ప్రచారకుడు విజయదేవుని కోరుతాడు. విజయదేవు చాలా అమాయకంగా మతవిషయంలో తాను చెప్పినట్టల్లా వింటున్న దొర, భూమి సమస్య విషయంలో కూడా అట్లాగే వింటాడనే అపోహతో చెప్పి అపజయం పొందుతాడు.

అధికారులు ఊర్లోకి వచ్చినపుడు కొమరయ్య, చంద్రయ్యలు దొర పెత్తందారీ దురాక్రమణ స్వభావాన్ని గురించి ప్రశ్నిస్తారు. వీళ్ల మాటల్లో వర్గచైతన్యం ధ్వనిస్తుంది. ప్రజలకిప్పుడు సంఘటిత చైతన్యం ఉంది. ప్రభుత్వం తమ కర్తవ్యం మర్చిపోతే ప్రజలే తమ కర్తవ్యాన్ని తెలుసుకుంటారని హెచ్చరిస్తారు (156-157 పేజీలు) తర్వాత రాంభూపాల్‌రావు చెరువు హక్రాజను ఆపటం. 25 ఏళ్లకింద ఊరు తవదిలిపెట్టిన బ్రాహ్మణ కుటుంబపు వాడే వెంకటేశ్వర్లు అని, కొమరయ్య తండ్రి కోటయ్య కౌలుకు చేసిన భూమి, కొమరయ్య నుంచి దొరలాక్కున్న భూమి ఆ ఇరవై ఎకరాల భూమేనని ఆరాలు తీస్తే తెలుస్తుంది. అయితే వెంకటేశ్వర్లు ఆ భూమిని ఇరవై ఏళ్లుగా కౌలుచేసి అనుభవిస్తున్న కొమరయ్యకు ఇచ్చేస్తాడు.

ఈ విధంగా ప్రజలచైతన్యం దిమ్మగూడెంలోని భూమి సమస్య ఇరుసుగా తెలంగాణ వాతావరణంతో చిత్రించబడింది. ఈ నవల్లో దొర స్వాధీనంలోంచి ఒక కొమరయ్య భూమి మాత్రమే తిరిగి సాధించు

కోవడం జరిగింది. రైతు పోరాటం వల్ల ఒక్కరికే లాభం జరిగింది తప్ప, తక్కిన వారి భూములన్నీ దొరల పెత్తందార్ల అనుభవంలోనే ఉన్నాయి. ఈ ఒక్క పోరాటంతోనే తెలంగాణ ప్రజల సమస్యలు పరిష్కారం కాలేదు. కాని ఈ చిన్న విజయమే దారి ఏర్పడటానికి దోహద పడొచ్చు అని నవల తెలియజేసింది. ప్రజల మనిషిలో వలనే గంగులో కూడా భూ సమస్య ప్రధానమైంది. భూమి కొరకు, భుక్తి కొరకు పోరాటం సాగించటమే తెలంగాణా విమోచనోద్యమ మని చెప్పొచ్చు. ప్రజలు స్వేచ్ఛ పొందడ మంటే భూమి చెరను విడిపించడమన్న మాట!

గంగులో ఇద్దరు భూస్వాముల పెత్తందారీ విధానం కనిపిస్తుంది. నాగభూషణం భార్య అంతమ్మ తన నుంచి తప్పించుకున్నదన్న కోపంతో జగ్గయ్య దొర అతని భూమిని, తక్తారాయించ లేదన్న నెపంతో కాజెయ్యాలని చూశాడు. అప్పు ఉన్నాడని దాని కిందికి వడ్లు తీసుకుందామనుకున్నాడు. ఇవన్నీ చాలా చిన్న విషయాలు. ఆ ఊరికి ఆంధ్రమహాసభ అధ్యక్షుడు వస్తున్నాడని తెలియగానే లంబాడి వాళ్ళు కౌలుకు చేసుకుంటున్న భూమి వారికే చెందుతున్నదన్న భయంతో వాళ్ళని బేదఖల్ చేయించాలని దొర చూశాడు. దేవాలయ నిర్మాణాన్ని దీనికి సాకు పెట్టుకున్నాడు. అయితే లంబాడి వాళ్ళు దాన్ని ప్రతిఘటించారు. కొందరు భయపడి మెత్తగా మాట్లాడినా కొందరు దురుసుగా మాట్లాడినా మొత్తానికి అందరు కల్సి భూమిని వదిలేది లేదని స్పష్టం చేశారు. ఆ భూమిని లంబాడి వాళ్ల సంగం ద్వారా నిలబెట్టు కోవడానికి సిద్ధమయ్యారు. సర్కారు దాకా పోదామను కున్నారు. లంబాడీల తరుపున నాగభూషణం ఉంటాడు. లంబాడీలు ప్రాణాలు పోయినా తుమ్మలకుంట పొలాలు వదలమని నిశ్చయించు కున్నారు. ఈ సమస్య ప్రజలది కాకుండా పెత్తందార్ల అందరి సమస్యగా మారిపోయింది.

పోలీసులు కాల్పులు జరపడం మొ॥ జరిగాయి. ఆంధ్ర మహాసభ కృషి వల్ల తుమ్మల పాలం భూమి లంబాడీ వాళ్ళ సేద్యానికి వదలి పెట్టాలని ప్రభుత్వం తీర్మానించింది. ఈ రకంగా వీరు విజయం సాధించారు.

సరిపల్లి కృష్ణారెడ్డి రచించిన ఉప్పెన నవలలో ముఖ్యంగా పల్లె జీవితం, రైతుల పోరాటం కన్పిస్తుంది. ఆ గ్రామంలో దొర చేస్తున్న అత్యాచారాలు, శిస్తులు కట్టలేదని, సంఘంలో జేరుతున్నారన్న కోపంతో ఏదో ఒక సాకుతో వాళ్లను చిత్రవధలు చేయడం వంటి సంఘటనలు చాలా వున్నాయి. దొర కండ్లు ఏ మంచివస్తువు పైన పడిన అవి తన ఆధీనంలోకి రావల్సిందే. వెంకటరెడ్డి అనే అతని ఎడ్ల జతను బలవంతంగా తన బంజరులొకి తోల్తాడు. అతనితో మాటకు మాట సమాధానం ఇచ్చినందుకు పంచాయితీ పెట్టించి జరిమానా కూడా ఇప్పిస్తాడు. దొర పెట్టే బాధలు భరించలేక అతను ఆత్మహత్య చేసుకుంటాడు. ఈ దొర జులుంను చూస్తూ అదే ఊళ్లో ఉంటున్న ఓబుల్ రెడ్డి రక్తం ఉడుకుతుంది. ఇతడు కొంత భూమి ఉన్నవాడు, వెంకటరెడ్డి చనిపోవడంతో వారి కుటుంబాన్ని ఆదుకుంటాడు. ఓబుల్‌రెడ్డి తన ధాన్యాన్ని పట్నంలో అమ్ముదామని వెళ్తున్నప్పుడు సంగం వాళ్లు ఉపన్యాసాన్నిస్తుంటారు. ఆ ఉపన్యాసం వింటున్నంతలోనే పోలీసులు వచ్చి వారిని బాదుతారు. ఏ పాపము తెలియని ఓబుల్ రెడ్డి వడ్ల సంచులను అమీన్ ఇంటికి తరలించి లాకప్‌లో వేసి గోనె సంచుల్లో కట్టి వేసి బాదుతుంటారు. అక్కడే ప్రతాప్ తో పరిచయం అవుతుంది. ప్రతాప్ ద్వారా సంగం అంటే ఏమిటో తెలుసుకుంటాడు. దొరలు, నిజాం ప్రభుత్వం ప్రజల్ని ఎట్లా దోచుకు తింటున్నారో వివరిస్తాడు. దొరల అన్యాయాలన్ని ఇకపై సాగనివ్వవద్దని అందరికి సంగం అండ వుంటుందని చెప్పుకుంటాడు. వెంకటరెడ్డి చావుకు కారణం దొర కొట్టిన దెబ్బలు. ఆ

దెబ్బలతో చనిపోయాడు కాబట్టి అతనిది హత్యా? ఆత్మహత్యా? అతని మరణంతో ఊరంతా మండిపోతుంది. ప్రతాప్ మాటలు ఓబుల్ రెడ్డి మస్తిష్కంలో మెదలుతాయి. శవయాత్రలో సంఘం వర్థిల్లాల్లి అన్న నినాదాలు చేస్తారు. ఊళ్లో యువకులంతా ఏకమై దొరను ఎదిరించటానికి సిద్ధపడతారు. ప్రతాప్ ఊర్లోకి వచ్చినప్పుడు అందరు దొర దౌర్జన్యాలు చెప్పుకుని కన్నీరు కారుస్తారు. తన ఊర్లోనే కాకుండా ఇతర ఊళ్లలో కూడా దోచుకొచ్చింది వేసికోవడం చూసి అతని తత్త్వాన్ని అర్థం చేసుకుంటారు. ఊర్లో ఓబుల్‌రెడ్డి సంగం కార్యకలాపాల్లో పాల్గొంటున్నాడన్న కసి కొద్ది దొర అతని తండ్రిని శిస్తు కట్టలేదని బంధించి తల మీద పెద్ద బండ పెట్టి కింద పడకుండా కట్టిస్తాడు. ప్రతాప్‌తో కలిసి ఓబుల్ రెడ్డి తుపాకి గురి పెట్టటం నేర్చుకుంటాడు. ఊర్లో రాత్రిపూట సంగం సమావేశాలు జరుగుతుంటాయి. విషయం తెలిసి ఓబుల్‌రెడ్డి దొరతో వాదనకు దిగి అతని జీతగాళ్లను కర్రలతో బాది ఇకనైన జులుం ఆపకపోతే నీకు గోరి కడ్తాను అని చెప్పి తండ్రిని విడిపించుకుపోతాడు.

ఊళ్లో సంఘం ఏర్పడి దానికి దళ నాయకుడుగా ఓబుల్‌రెడ్డి నియమింపబడ్తాడు, వీరిలో స్త్రీలు కూడా పాల్గొంటున్నారు. రజాకర్లకు వ్యతిరేకంగా పోరాడటానికి గెరిల్లా దళాలను నిర్మిస్తున్నారు. వెంకటరెడ్డి కూతురు కల్యాణి ఓబుల్‌రెడ్డి కి చేరువతుంది. కల్యాణి కూడా దళంలో చేరుతుంది.పుణ్యమూర్తి ఓబులరెడ్డిపైపగ సాధించాలని ప్రతిజ్ఞ బూనాడు; పుణ్యమూర్తి రజాకర్ల సహాయంతో ఊర్లో వారందర్ని శిస్తుల లెక్కకు రమ్మని చాటింపువేస్తాడు. బడేమియా, అహమద్ హుస్సేన్‌లు తమ ముఠాని ఊరవతల ఉంచి గంట తర్వాత ఊరి మీద దాడి చేయమని ఆజ్ఞాపించాడు. వారంతా ఒక దిక్కు నిప్పు పెట్టారు, కాలిపోతున్న ఇండ్ల

లోంచి ప్రజలందర్నీ దేవిడీలోకి లాక్కొచ్చారు. దాంట్లో కళ్యాణి, ఓబుల్ రెడ్డి తండ్రి కూడా ఉంటారు. వారు చేసిన పైశాచిక కృత్యాలను రచయిత హృదయ విదారకంగా వర్ణించారు. (107,108,109) స్త్రీలందర్నీ వివస్త్రలను చేసి చెరిచారు. కళ్యాణి వారి బారి పడకుండా తప్పించు కొంటుంది. ఓబుల్‌రెడ్డికీ విషయం తెలుస్తుంది. గడీలోకి వెళ్లి ఖైదీలందర్నీ విడిపిస్తాడు; తిరిగి మూడు నెలల తర్వాత బడేమీయా మళ్లీ రజాకర్ల తో ఊరిపై బడ్తాడు.ఈ సారి కళ్యాణి, ఓబుల్ రెడ్డి తండ్రి చనిపోతారు.

ఓబుల్‌రెడ్డి తన దళంతో ఊరికి వస్తాడు. హోరాహోరిగా వారితో పోరాటం జరుగుతుంది. హైదరాబాదు సంస్థానం స్వతంత్ర భారత్ యూనియన్‌లో కలిసి పోతుందని, రజ్వీని అరెస్టు చేసారనే వార్త వస్తుంది. భారతసైన్యాలు వచ్చి గెరిల్లాని చుట్టుముట్టి ఆయుధాలని అప్పజెప్పమని చెప్పటంతో నవల ముగుస్తుంది.

ఈ నవలలో సామాన్య రైతుగా ఉన్న ఓబుల్‌రెడ్డి సంగం ద్వారా స్ఫూర్తి పొందడం లోకగమనాన్ని గుర్తించటం. పార్టీకి అంకితం కావడం. స్వయంగా పోరాటానికి నాయకత్వం వహించే స్థాయికి ఎదగడం గమనించవచ్చు.

ఏ తెలంగాణా నవలను తీసుకున్నా దానిలో ప్రధాన కథా వస్తువుగా **భూమి** ఉండటం కన్పిస్తుంది. అట్లాగే మహీధరరామ్మోహన్ రావు గారి **ఓనమాలు** నవల; దీన్లో బోళ్ల పొలం చరిత్ర వుంది. ఈ బోళ్ల పొలం రంగయ్యది, ఈ పొలం చుట్టే నవల నడుస్తుంది. రంగయ్య తాతల నాటి నుండి ఆ భూమిని సాగు చేసుకుంటు బతుకుతున్నారు. వారి తాత నుండి తన తరం వరకు ఒక 50 ఏళ్ల పాటుతండ్రి కొడుకులు కడుపు కట్టు కొంటేనే గాని అది భూమిగా మారలేదు. రంగయ్య అక్క,

రంగయ్య తండ్రి చనిపోయిన నాటి నుండి భూమిని తన చేతుల్లోకి తీసుకుంది సత్తెమ్మ. సత్తెమ్మ చిన్నతనంలోనే భర్తను పోగొట్టుకొని పుట్టింటికి వచ్చి తన జీవితానికి ఈ భూమిని కొత్త ఆలంబనగా చేసుకుంది. 150రూ॥ పెట్టికొన్న ఈ 50 ఎకరాల అడివిని కష్టపడి భూమిగా మార్చాక ఆ భూమిని తిరిగి ఇవ్వమంటాడు దొర. ఆ ఇంట్లో అందరికి ఆ భూమితో సన్నిహితం ఉంది. వారికి ఆ భూమే సర్వస్వం. ఆ భూమిని కబ్జా చేయడమే కాదు, దానిలో వీళ్ల శ్రమ వుంది. దాన్ని విలువ కట్టాడానికి ఏ వ్యవసాయ లెక్కలు సాయపడవు. దున్నేవానికి భూమి అన్న నినాదం దొర పాలిట వరమైంది. అదే నినాదంతో బ్రాక్టర్ల ద్వారా ఆభూమిని స్వాధీనంలోకి తెచ్చుకొనే ప్రయత్నంలో ఉంటాడు. కాని సత్తెమ్మకు ఆ భూమికి విడదీయరాని సంబంధముంది. శివరామురెడ్డి దొర కన్ను ఆ భూమి మీద పడింది. ఎట్లాగైనా స్వాధీనం చేసుకోవాలను కున్నాడు. ఇప్పుడు సమయం కల్సి వచ్చింది. వితంతువైన సత్తెమ్మతో వెంకటయ్య వివాహం సాంప్రదాయభ్రష్టం అని దొర హూంకరించాడు. అందుకు ప్రతిగా భూమిని తిరిగి తీసుకొంటున్నట్లు చెప్పాడు. ఆ భూమిని కాపాడుకోవటానికి తల్లి, రంగయ్య, సత్తెమ్మ ముగ్గురూ ప్రయత్నాలు చేశారు. తల్లి గ్రామకరణానికి 5రూ॥ లు ముడుపు చెల్లించి అపరాధం మన్నించమని వేడుకుంది. రంగయ్య కోర్టుకు వెళ్లటానికి సిద్ధమవుతాడు. తన దగ్గర కావల్సిన దాఖలాలు లేకపోయినా వీరిద్దరూ ఈ రకంగా దొరతో కలియబడడానికి సిద్ధం అవుతుండగానే సత్తెమ్మ దొరగడిలోకి వెళ్లింది. తానువివాహం చేసుకోవాలన్న నిర్ణయానికి, భూమి పోవటానికి కారణం ఏంటని పెద్దిరెడ్డి తోటే అడిగి తెల్సుకోవాలని గడీలోకి అడుగు పెట్టింది. అక్కడ అది కారణం కాదని తేలిపోయింది. దాంతో తమ హక్కు గుర్తుకు వచ్చింది సత్తెమ్మకు, తమ జీవితంలో

భాగమైన ఆ భూమిని అడిగే హక్కు దొరకెవరిచ్చారు? అన్న ప్రశ్న వింటాడు దొర. తమ శ్రమకు విలువేమిటి? అని ప్రశ్నించగానే శివరామిరెడ్డి బలప్రయోగం ద్వారా భూమిని లాక్కునే ప్రయత్నం చేయాలని నిర్ణయించుకుంటాడు; దొర మనుషులు పొలాన్ని ఆక్రమించు కుంటారు. ఆ వార్త సత్తెమ్మను కదిలించింది. దృఢంగా అడుగులేస్తూ వెళ్లి బారెడు పొడవు జువ్వి కర్ర లాగింది. జువ్వి కర్ర పట్టుకొని తన భూమి మీదకు వచ్చిన వాళ్లను ఎదుర్కొనటానికి బయలుదేరింది. ఆ సమయంలో సత్తెమ్మ నడిచిన నడకలో తరతరాలుగా అణచివేతకు గురియైన బానిసలు తిరుగుబాటు చేస్తే ఎలా వుంటుందో గమనించవచ్చు. ఆ దూరం నుంచే ఆమె బలం కొద్ది చాచి కొట్టిన జువ్వి కర్ర దెబ్బలకు వీపు పొడువునా చర్మం లేచి వచ్చేది. దొర మనుషులు క్షమాపణ చెప్పుకున్నారు సత్తెమ్మకు. తమ బలాన్ని గుర్తించిన జనం ఉత్సాహంతో పొలమంతా తిరుగుతారు.

ఒక్క సత్తెమ్మ పొలమేకాక ఒక్క వారం రోజుల్లోనే మంగలి వెంకన్న పొలం కూడా విడిపించారు. ఆ విషయంలో దొర ప్రమేయం లేకుండానే చాలా సులువుగా జరిగిపోతుంది.

ఈ రెండు పొలాలు విడిపించడంలో సత్తెమ్మ సహజ స్వభావమైన చొరవ వల్ల జరిగింది. దాంట్లో ఒకరి నాయకత్వం లేదు. అయితే సంగంతో ఆమెకు పరిచయం ఉంది. వెంకటయ్య ద్వారా ఆమెపై సంగం ప్రభావం ఉంది. తాను ఒంటరిగా సాహసించి తన భూమిని కాపాడుకున్నా, దాని తర్వాత రాగల పరిణామాలను ఊహించుకుని సంగంతో సంబంధాలు పెట్టుకుంది.

బోళ్ల పొలం సంఘటనతో దొర భయపడ్డాడు. దానికి కారణం తెలంగాణా అంతటా అటువంటి పరిస్థితులే నెలకొని ఉండటం, అయితే

అంత తొందర్లో తన ఊళ్లో కూడా అటువంటి సంఘటన వస్తుందని ఊహించలేదు. బోళ్ల పొలంను ఆక్రమించుకోవడంలో సత్తెమ్మ ఒంటరి సాహసమే చూపింది కాని జన సహాయం కోరలేదు. తల్లి కోటమ్మ మొదలుకొని ప్రజల వరకు స్వయంగానే సత్తెమ్మకు సాయంగా వచ్చారు.

జన సహాయం తాను కోరలేదు. కాని జనం వెనుక ఉంటేనే పని సానుకూలమైంది. రైతులు చేసుకుంటున్న భూమిని దొర దురాక్రమణ చేసిన పద్ధతిని ప్రయత్నించడానికి ఒక్కరు పూనుకున్నా సరే సహకరించ డానికి ప్రజలంతా కదిలి వచ్చారు.

ఇలాంటి భూమి సమస్యే ఈ నవలలో అనసూయమ్మది. 400 ఎకరాలకు ఈమె యజమాని. ఈ భూమిని కాపాడుకోవటానికి ఆమె పట్వారి లక్ష్మీనారాయణతో సంబంధం పెట్టుకుంది. ఇతని ఆసరా చూసుకుని ఆమె ఎంతో మంది పేద రైతుల భూమిని తన భూమిలో కలిపేసుకుంది. అల్లుడికి, వియ్యంకునికి ఈమె సంబంధం తెలిసి కూడా ఆ భూమిని కాజేసే ఉద్దేశ్యంతో లక్ష్మీనారాయణనే వియ్యంకుడుగా భావించారు. ఆమె పేదరైతుల భూమిని కలిపేసుకున్న భూమిలో పూర్ణయ్య భూమి కూడా ఉంది. వాళ్లు తరతరాల నుంచి సాగు చేసుకుంటున్న భూమిని స్వాధీనం చేసుకుంది. కాని బోళ్ల పొలాన్ని ఆనుకొని వున్న భూమిని తన భూమిలో కలుపుకోవడానికి విశ్వప్రయత్నాలు చేసినా లాభం లేకపోయింది. ఆ భూమి కోసం ఆమె నైతికంగా ఎంత దిగజారినా దాన్ని అనుభవించటానికి వారి కుటుంబ సభ్యులే లేరు. అయినా ఆ భూమిని రైతులకు దానంగా కాక హక్కుగా ఇవ్వడానికి కూడా ఆమె ఇష్టపడలేదు.

భూమి సమస్యను పరిష్కరించుకోవడం అంటే రైతాంగం భూమిని కాపాడుకోవడమే కాదు. దాన్ని కాపాడుకునే క్రమంలో ఆ

భూమిపై దాడి చేయటానికి వచ్చే దొరలను, వారుతెచ్చే చట్టాలను, పోలీసులను, రాజ్యాంగ యంత్రాగాన్ని ఎదుర్కొని తమ ప్రాణాల్ని కాపాడుకోవల్సిన అవసరం ఉంది. ఆత్మ రక్షణ చేసుకోవాలి, ఆ భూమిలోనే బలం, ప్రాణం ఉన్నాయి, దాని కోసం అవసరమైతే ప్రాణాలు ఇవ్వటానికి కూడా సిద్ధపడాలి. కోర్టు పై విశ్వాసంతో వెళ్లిన రంగయ్య కూడా ఈ విషయాల్ని అనుభవపూర్వకంగా తెలుసుకొన్నాడు.

1946లో ప్రారంభమైన సాయుధపోరాటం, 1967లో మొదలైన నక్సలైట్ ఉద్యమం, ఆ మధ్యకాలంలో వచ్చిన భూదానోద్యమం ప్రధానంగా రెండు దశాబ్దాల తెలంగాణా ప్రజా జీవితానికి అద్దం పట్టిన నవల దాశరథిరంగాచార్య **జనపదం.**

తెలంగాణా సమస్యలో భూసమస్య అతి కీలక సమస్య **దున్నే వాని దే భూమి** అనే నినాదంతో కమ్యూనిస్టు పార్టీ ప్రజలను ఉత్తేజ పరుస్తుంటే ఈ నవలలో బలరామయ్య పట్టణం నుంచి తిరిగి వచ్చి **దున్నినవాని దుంపతెంచాలని** అనుకుంటాడు; ప్రజలు ఒక ఉప్పెనలా వచ్చి గడీమీద పడినపుడు గత్యంతరంలేక బస్తీలో తలదాచుకొన్నాడు. అల్లర్లు అణిగాక పోలీసుచర్య తర్వాత ప్రభుత్వరక్షణతో తిరిగి గ్రామంలోకి ప్రవేశిస్తాడు, అతడు పట్నానికి పారిపోయినప్పుడు పార్టీ సహాయంతో బలరామయ్య భూముల్ని గ్రామంలోని పేద ప్రజలు పంచుకొని సాగుచేస్తున్నారు. అది తెలిసి భరించలేక అక్కసుతో వాళ్ల దుంపతెంచాలను కుంటాడు. అందువల్లనే ప్రజలు పండించుకొన్న పంటను కుప్పలుగా పోసి కాల్చేస్తాడు. అమాయకుడైన హరిజన జంగయ్యను ఆ విషయంలో అనుమానిస్తున్నాననే నేరం మోపి కొట్టి **కాన్సెంట్రేషన్ క్యాంపు**కు పంపించి అక్కడ చంపిస్తాడు[6] ఆ సంఘటనల్ని దొర ఉంచుకున్న ఆడ బాప అమృతవాణిచేత పలికిస్తాడు రచయిత. **ఉప్పెనొచ్చిందనుకోరి. మాలోడు,**

మాదిగోడు, మంగలోడు, చాకలోడు కూడా తుపాకులు పట్టిన్రు, ఇరుచుకుపడ్డారనుకోరి. వేలకు వేల జనం, ఆల్లకాల్ల మీదపడ్డ, బతిమిలాడిన ఎవడన్న ఇన్నాడా? అన్ని వస్తువులు దోచుకుపోయిన్రు అని గడీ విషయాలు చెబ్తూ అక్కడ వెల్లువలా వచ్చిన ప్రజానీకాన్ని, ఆ వెల్లువలో కొట్టుకు పోయిన అహంకారం, అధికార భూములు, పెత్తనం గురించి వివరంగా చెబుతుంది.

బలరామయ్య రాక్షసత్వానికి అన్యాయంగా జంగయ్య, జగ్గయ్య బలైపోతారు. ఇటువంటి చావులు ఆనాటి తెలంగాణలో కోకొల్లలు. తెలంగాణా ప్రజల జీవన పోరాటాల కన్నింటికీ ప్రధానకారణం భూమి. అన్ని ఉద్యమాలు భూమిసమస్య చుట్టుతిరిగినవే. భూమికోసం తెలంగాణలో ఒక గొప్ప ఉద్యమం జరిగింది. వినోభా భావే స్థాపించిన భూదానోద్యమానికి మొదటి రంగం తెలంగాణాయే. భూదానోద్యమం వల్ల భూసమస్య పరిష్కారం కాగలదని పెద్దలు భావించడం జరిగింది. ఈ ఉద్యమ ముఖ్యోద్దేశ్యం భూస్వాముల వద్ద నుంచి భూమిని దానంగా గ్రహించి బీదలకు పంచిపెట్టడం, ఉద్దేశ్యం సరియైనదైనా ఆచరణలో మాత్రం ఉద్యమం ఘోరంగా విఫలమైంది. భూసమస్య అంచులను కూడా అందుకోలేకపోయింది.

ఈ నవలలోకూడా ఒక ముఖ్య సంఘటనగా భూదానోద్యమాన్ని వివరించారు. భూస్వాముల నుంచి భూమి దానం చేసి పేదలకు పంచిపెట్టడం కాకుండా ఈ నవల్లో బీదల భూమినే పేదలకు దానం చేస్తారు. చాలా ఆశ్చర్యకరమైన సంగతి మల్లయ భూమి నారయ్యపేర, మంగమ్మ భూమి యలమంద పేర అయిందని చాటింపు డప్పులవాళ్లు వేస్తారు. అక్రమంగా అందరి భూముల్నీ గుంజుకున్న రామయ్య భూముల్ని ఎవరూ దానం చేయరు కాని బీదల భూముల్ని

దానం చేస్తుంటే మల్లయ్య భార్య పిచ్చమ్మలాంటి స్త్రీలకు ఈ విషయం ఆశ్చర్యాన్ని, కోపాన్ని తెప్పిస్తుంది. అందుకే కరుణపోరి భూములన్ని రామయ్య దున్నుకుంటాండ్రు, అవి ఎందుకు గుంజరు? అని పిడుగుల వర్షం కురిపిస్తుంది. ఉన్న వాళ్ల భూమి జోలికి ఎవరూ పోకుండా బీదవాళ్ల భూముల్ని లేని వాళ్లకి పంచారు. ఒక వేళ్ల ఉన్నవాళ్లు భూదానం చేసినా ఆ భూమి ఎందుకూ కొరగాదు. పిచ్చిగడ్డి కూడా మొలవని బీడు, ఈ రకమైన అన్యాయాలతో భూముల పంపకం జరుగుతుంది. అన్యాయం జరిగిందని తెలిసికొని బలరామయ్య భార్య సరస్వతి మల్లయ్యకు డబ్బు సహాయం చేద్దామనుకుంటుంది. కాని దానికి మల్లయ్య ఒప్పుకోక పోవటం అతని ఉదాత్తతను తెలియజేస్తుంది. ఈ భూదానోద్యమం వల్ల దరిద్రులు మరింత దరిద్రులై ధనవంతులు మరింత కుబేరులయ్యారు. ఈ భూదానోద్యమం, ధర్మ కర్తృత్వ సిద్ధాంతాలు ఘోరంగా విఫల మయ్యాయి. ఇది స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత పరిస్థితి, భూదానోద్యమం పేర జరిగిన అన్యాయం.

పల్లెల్లో నివసించే నిరుపేదలకు తమకు మోసం జరుగుతుందని తెలిసినా నోరు మెదపని స్థితిలో జీవిస్తుంటారు. ఆనాటి ప్రజల్లో దొరలంటే వణుకు, వారికి ఎదురుచెప్పే శక్తి లేదు. ఇక స్త్రీల విషయానికొస్తే తమకే అపాయం జరిగినా నోరు మూసుకుని కర్మ సిద్ధాంతాన్ని వల్లిస్తారే తప్ప నోరుతెరిచి అడిగే శక్తి ఎంతమందికుంది?

ఈ నవలలో రజాకార్లచే చంపబడిన వరవరరావు భార్య విమలమ్మను మోసగించి, ఆవిడ భూముల్ని రామయ్య తీసుకుంటాడు. విషయం తెలిసి విమలమ్మ ప్రతిఘటించకుండా తన పూర్వజన్మ కర్మ అనుకుంటుంది. ఈ కర్మ సిద్ధాంతం వల్ల తామెంత నష్టపోతున్నామో ఆలోచించరు. ఈ కర్మసిద్ధాంతం అన్యాయాన్ని న్యాయంగా అధర్మాన్ని

ధర్మంగా చూపటానికి, సమర్థించటానికి ఎంతగానో ఉపకరిస్తుంది. అందుకే వీరభద్రంలాంటి యువకులు విమలమ్మ వంటి వాళ్లను చూసి బాధపడి తర్కించుకొంటాడు. బలరామయ్య విదిలేసే మెతుకులకు ఆశపడే యాదగిరి చాలా తొందరగా సారాదుకాణాలు, భూములు దొంగతనంగా ఆక్రమించుకోవడం కుటీర పరిశ్రమల పేర డబ్బు తీసుకొని ప్రజలకు అందనీయకుండా అంతా తానే మింగడం, ఊర్లో స్త్రీలను భయపెట్టి శీలం అపహరించటం మొ॥ వాటిలో ఆరితేరుతారు.

జనపదంలో యలమంద భూముల్ని యాదగిరి లాక్కొని, అతని కూతుర్ని చెరుస్తాడు. నారయ్య పంట భూముల్ని రామయ్య తగుల బెట్టిస్తాడు. కూలి పెంచమంటే వినిపించుకోకుండా మరనాగళ్లచే పంటను కోయిస్తాడు.

కాముని పండుగ సందర్భంగా మల్లయ్య కొడుకు కోటయ్యను యాదగిరి కిరసనాయులు పోసి చంపిస్తాడు. కోటయ్య వీధిలో ఉరుకుతున్నాడు, మంటలు ఉరుకు తున్నట్లుంది. జ్వాలలు ఉరుకు తన్నట్లుంది. ఆర్తనాదాలు ఉరుకుతున్నాయి. ఇది కిరాతక యాదగిరి రాక్షస కృత్యానికి తార్కాణం. మానవుడు తోటి మానవుణ్ణే యింత కంటే రాక్షసంగా చంపగలడా? యాదగిరి దుర్మార్గానికి ఇది చివరి ఘట్టం. అంతరిస్తున్న దేశ్‌ముఖ్ వ్యవస్థకు ప్రతీకగా బలరామయ్య, స్వాతంత్రం వచ్చింతర్వాత దేశంలో ప్రబలిన కలుషిత రాజకీయాలకు ప్రతీకగా రామయ్య పాత్రను చెప్పుకోవచ్చు, రామయ్యకు వ్యతిరేకంగా నీతికి, న్యాయానికి, ధర్మానికి, పోరాటం సాగించాలనుకున్న తుపాకుల వాళ్లలాగా వీరభద్రం మన ముందుంటాడు. ప్రకాశం, గాంధీ పాత్రలు నేటి యువతరానికి దృష్టాంతాలు. ఈ పాత్రలు సమాజాన్ని ఎలా ప్రభావితం చేసాయో చూపిస్తూ దేశంలో రాజకీయాల పేరిట జరిగే కుట్రలు,

కుతంత్రాలు, బలరామయ్య, రామయ్య, శేషయ్య, యాదగిరి పాత్రల రూపంలో రచయిత ప్రదర్శించగల్గారు. ఏ మాత్రం మానవత్వం లేని నరరూప రాక్షసుడైన యాదగిరిని అరెస్టు చేస్తారు. వెంటనే శేషయ్య జామీను మీద విడిపించుకుంటాడు; ప్రకాశం వీళ్లను **అణచాలె** అన్నప్పుడు **వీరభద్రం సరిగ్గా ఇట్లానే చెప్పేటోడు. తుపాకీలు పట్టినం; దొరల వెళ్లగొట్టినం. భూములు పంచినం. ఏమైంది? మల్ల యూనియన్ మిలటరీ వచ్చింది. పంచిన భూములు గుంజుకున్నారు. నాకు వున్న నేల చెక్క గుంజుకునిరి. వీరణ్ణి** చంపిరి అంటాడు మల్లయ్య.

ఈ నవలలో ప్రకాశం పాత్ర ద్వారా చిగురిస్తున్న సాయుధ పోరాటాన్ని తెలిపారు రచయిత. ఈ సాయుధపోరాటం 1967లో పశ్చిమ బెంగాల్‌లో, నగ్జల్‌బరీ ప్రాంతంలో ఆ తర్వాత ఆంధ్రప్రదేశ్ శ్రీకాకుళం జిల్లాలోని గిరిజన ప్రాంతాలలో జరిగిన రైతాంగ గిరిజన పోరాటంగా రూపుదిద్దుకొంది. దేశంలో భూసమస్య పరిష్కారం కానంత వరకు దున్నేవానికి భూమి దక్కనంత వరకు ఉద్యమాలు తప్పవు. నిర్బంధాలు తప్పవు. అందుకే రంగాచార్య గారు **మార్గం సుదీర్ఘం, భూమి గుండ్రం** అని అన్నారు.

సామాన్య ప్రజల జీవన పోరాటాల నుంచి ఉద్భవించే సజీవ సాహిత్యాన్ని శోధించి ప్రజలకు అందిస్తున్న రచయితలలో అల్లం రాజయ్య ఒకరు. వీరు రచించిన నవల **కొలిమంటుకున్నది**. ఈ నవల ఆ నాటి ఆదిలాబాద్, కరీంనగర్ రైతాంగ పోరాటానికి ముందున్న పరిస్థితులు అని రచయిత చెప్పుకున్నారు. (పేజి 158)

ఈ నవల్లో ఆనాటి ఆదిలాబాద్, కరీంనగర్ రైతాంగ పోరాటానికి ముందు పరిస్థితులు కన్పిస్తాయి. ఈ నవల్లో మనక్కన్పించిన నర్సింహం, గుడ్డి గట్టయ్య, బత్తయ్యలు సజీవంగా ఉన్నారని

తెలియజేసారు. (పేజి 158) ఈ నవల చివర ఇది చివర మాట కాదు అని వ్రాసిన రచయిత తన జీవితానుభవాలు నవల వ్రాయటానికి ఏ రకంగా ప్రేరణ నిచ్చాయో తెలిపాయి. ఈ నవల్లో వచ్చిన సమస్యలన్నీ భూమి, భూమిని సాగుచేయడం, ఫలితం లేని చాకిరి. ఏదో ఒక విధంగా భూమికి సంబంధించి ఉన్నది. భూములను దొర పుట్టుక తోనే భుజానేసుకు రాలేదు, తమ మనుగడ కోసం రైతులు ఎన్ని కష్టాలైనా ఎదుర్కొని సాగు యోగ్యం కాని, భూములు సాగు లోకి తెస్తారు. దొరలు వాటిని ఆక్రమించుకుంటారు, కాలానుగతంగా దొరల ఆక్రమణ పరిస్థితులు మారుతూ ఉంటాయి కాని ఆక్రమించుకోవడం మాత్రం తప్పనిసరి, ఎంతవరకు; కొలిమంటుకోనంత వరకే?[7] నర్సింహం తెగింపుకు, తిరుగుబాటుకు అదే కారణం. పల్లె ప్రజల జీవితాలు భూమితోనే ఎట్లా ముడిపడి వున్నాయో ఈ నవల తెలుపుతుంది. స్తంభాలు పీక్కపోవడం, నర్సింహంను ఆర్థికంగా దెబ్బ తీయడం కాక, అందరిలో చెప్పు తో కొట్టి తనకోసినంతా తీర్చుకున్నాడు. ఈ అన్యాయాన్ని, అవమాన్ని చవి చూసిన తరువాత నర్సింహం అనే బొగ్గుముక్క అంటుకోవడం ప్రారంభించింది. ఆ బొగ్గు ముక్కే కొలిమంటుకునేందుకు దోహదమైంది.

అల్లం రాజయ్యదే మరో నవల అయిన అగ్నికణంలో ప్రధానంగా స్త్రీ సమస్య కన్పించినా ఆ సమస్యకు కీలకం భూమి. బయ్యక్క, నర్సిమ్మలు అన్నాచెల్లెలు. నర్సిమ్మకి దొర లంటే తగని కోపం, తన కోపం పెదవికి చేటని తెలుసు, తన కుటుంబం కులం లేంది. ఆ కులాన్ని తెచ్చుకోవాలంటే 2,000 రూ॥ కావాలి, వాళ్ల తల్లెప్పుడో చెడిపోయింది. అప్పట్నుంచి కులం లోంచి వెలేస్తారు. ఓ వెయ్యి రూపాయిలతో ఇంత నేల చెక్క కొనుక్కున్నారు. 200రూ॥ అప్పు తీరెందుకు ఏడాదికి నాలుగు బస్తాల జొన్నలు వడ్డీ కింద ఇస్తూనే

ఉన్నారు. నర్సయ్య మధ్య మధ్యన చావు దెబ్బలు కొడ్తునే ఉంటాడు. ఓ రోజు బయ్యక్క కోమటివాడితో రాలేదని నేల చెక్కను గుంజుకున్నారు; పంట అంతా వారి వశమైంది. పిచ్చి చూపులతో తన పొలంచుటూ గెట్టు చుట్టూ తిరుగుతాడు. తాను పండించిన పంటనంతా తన ముందరే తీసుకుంటుంటే చూడలేకపోతాడు. బండ్లలో పండిన పంట గౌరయ్య తరలించుకుపోతుంటే దారి కడ్డంగా పడుకుంటాడు. నెత్తి కొట్టుకుంటూ **నా బొందిల పానముండగా నేను గీ బండ్ల కదులనియ్య, గౌరయ్య నన్ను సంపు, నా మీనికెల్లి బండ్ల గొట్టుకొని నానెత్తురు, సెమట నా పంట** గొంటబో అనంగానే పాలెరోళ్లు నర్సయ్యను పట్టుకున్నారు. గౌరయ్య చేతిలో వున్న ఛత్రితో నర్సయ్య డొక్కల పొడుస్తాడు. నర్సయ్యకు అమాంతంగా బలం కట్టలు తెంచుకుంది. గౌరయ్య గొంతు పిసుకుతాడు. ఒక్క క్షణంలో కళ్లు తేలేశాడు. మరో నిముషంలో చనిపోయేవాడు. వెనక నుంచి కొడుకు మొగులయ్య ముల్లు గర్రతో నర్సయ్య తలపై దెబ్బ వేస్తాడు. పుర్రె పగిలి సొడ సొడ నెత్తు కారింది. ఆ రోజే పెద్ద దొర మనుషులు వచ్చి నర్సయ్య దండ చేతులకు తాళ్లు గట్టి తీసుకువెళ్లి నుగ్గు నుగ్గుగా జేసి ఇంటికి పంపిస్తారు. ఆ రకంగా భూమి రుణం తీరిపోయింది ఆ కుటుంబానికి; నేల చెక్క లేకపోయిం తర్వాత నర్సయ్య ఎక్కువ రోజులు ఊళ్లో ఉండలేక వెళ్లి పోతాడు. ఈ రకంగానే మరొక కుటుంబం కూడా దొర దౌర్జన్యానికి బలైంది. బయ్యక్కకు అండగా వున్న పికిలి కుటుంబం పుణ్యానికి పోతే పాపం ఎదురైనట్టు అవుతుంది. పికిలి తండ్రి ఎంకటితో బయ్యక్కకు అక్రమసంబంధం అంటగట్టి జుర్మానా వేస్తారు. ఆ పంచాయితీ జరిగిన నాటి నుండి ఎంకటి పిల్లి కొరికిన కోడిపిల్ల తీరుగా ముడుచుకు పడుకుంటాడు. ఒక రోజు తాగి వచ్చి మనసులో ఉన్నదంతా కక్కుతాడు. ఈ ఊళ్లో పీతిరిగద్దలున్నాయని, అవి చావక ముందే

చంపుకు తింటాయని, జరిమానా పేరుతో తన చేసుకు ఉరి తెచ్చారంటాడు అని వాపోతాడు. ఊర్లో ఒక్కరికి ధైర్యంలేదు. అందరూ పుట్టు బానిసలు అందరితోపాటు ఈ ఎంకటి!

ఆ రోజునుంచి ఎంకటి కట్టెలమోపులమ్ముకుంటున్నాడు. దొర అడవిలో వున్న నూరు ఎకరాల్ని కొట్టి సాగు జేసుకొమ్మని చెప్తాడు. దాంతో ఎంకటికి ఎక్కడలేని ఉత్సాహమొస్తుంది. అడవిలో కొట్టిన కట్టె దొరకు, సాగుచేసుకున్న భూమి పేదవాళ్లకు; భూమి లేని ఎంకటికి భూమి వస్తుందని ఆశతో అందర్నీ కూడదీసుకుని వారం రోజుల్లో అడవిని నరుకుతారు. ఆ సమయంలోనే సేరీదార్లు వచ్చి అందర్నీ తంతారు. దొరనే మాకీపని చెప్పిండని ఎంత మొత్తుకున్నా ఆ మాట ఎవరూ వినలేదు. దొర గడీలోకి కట్టె మాత్రం ఏ కష్టం లేకుండా వెళ్లింది. అడవిని కొట్టినందుకు అందర్నీ వ్యానులో ఎక్కించుకొని పోలీస్ స్టేషన్‌లో పడేసారు. వాళ్లని విడిపించటానికి తల ప్రాణంతోకకు వస్తుంది. ఒక్కొక్క కుటుంబం 100రూ॥ వసూలు చేసి విడిపిస్తారు. భర్తకోసం మెళ్లోని పుస్తె అమ్మింది ఎంకటి భార్య. పల్లెలో జరుగుతున్న దౌర్జన్యాలు రైతాంగ జీవితం పడుతున్న కష్టాలు, భూమికొరకు పడేపాట్లు ఈ సంఘటనల వల్ల తెలుస్తాయి.

బయ్యక్క దళంలో చేరింతర్వాత ఆ ఊర్లోకి మళ్లీ వచ్చింది. అయితే ఊర్లో పెద్ద మార్పులేమీ జరగలేదు. గౌరిగాడు చచ్చి కోమటోడు ఊరు విడిచి వెళ్లి నంత మాత్రాన ఊరు మారలేదు. దొర పోలీసుల అండ చూసుకుంటూ టక్కు టమారాలు చేస్తూనే ఉన్నాడు. ఒక్క దొరను వెలివేసినంత మార్పురాదు. వీళ్లు ఉన్నంతకాలం ఏదో ఒక ఉపాయంతో ప్రజలను లొంగదీయాలనే చూస్తుంటారు. అందుకే సంగాన్ని తోడుగా అంటిపెట్టుకున్నారు ప్రజలు. సంగం అండతో ప్రజల

రెక్కల్ని దొరల బలగానికి ఎదురు నిల్చి పోరాడటానికి సిద్ధపడ్డారు. వాళ్ల కష్టాలన్నీ పోవాలంటే దొరల భూములుపోయి దున్నేవారికి భూమి కావాలి. కష్టమైనా ఈ పోరాటం చెయ్యాలని ఎంకటయ్య సహాయంతో ప్రజలకి బోధిస్తుంది బయ్యక్క.

ఎంకటయ్య, బయ్యక్కను ఆదుకున్నందుకు కష్టపడ్డాడు. అయితే ఆరు నెలల్లోనే తన బాధను మర్చిపోయాడు. పేదోళ్లందరూ సంఘటితమై తమను దోచుకున్న దొరను అంతం చేయాలని నిర్ణయించుకుంటారు. సంగం వల్ల ఎన్నో విషయాలు అర్థం చేసుకుంటాడు. అందుకే పికిలి చనిపోయినాడని వార్త వినంగానే ఆ తల్లిదండ్రులకు ఈ విషయం ఎట్లా చెప్పాలా అని బయ్యక్క మథన పడుతుంది. కాని విషయం మొదటే తెలుస్తుంది. అందుకే ఏడ్వకుండా **మనం బతుకచ్చినామా? నాకొడుకు సీమ తీర్గ దోమ తీర్గసావలేదు. మందిని ముంచి పాపపు సావుసావలే, ఈరుని తీర్గ బతికిండు, ఈరుని తీర్గనే బోయిండు, బిడ్డా బయ్యవ్వ; నా కొడుకును మీ సేతుల బెట్టిన .......... ఎందుకోసమంట; ...... గీ బద్దుమాసి బతుకులు బాంచె బతుకులు;** లంగ **రాజ్జెం,** లపంగ **రాజ్జెం ఉండద్దని నేను బతికుండగా మీరెదైతే తెత్తనన్నరో** గది **నాకండ్ల జూపాలె** అంటాడు. బయ్యక్క గంగతీరుగ పారే ఆ బతుకు పోరాటంలో పికిలి తరుపున, అటువంటి ఎందరో తమ్ముల తరుపున పోరాడ్డానికి నిశ్చయించుకుంటుంది. **విప్లవం వర్ధిల్లాలె** అనే రాతలుగీస్తుంటుంది.

ఈ నవల్లో పోరాటానికి ముందున్న పరిస్థితులు, పోరాట పరిస్థితులు కూడా మనం చూడొచ్చు. రాజారాం మాటల్లో కార్మికులంతా ఏకమై పోరాడాలనే కాంక్షవ్యక్తమౌతుంది. కార్మికుల పరిస్థితి వర్ణిస్తూ **ఇవ్వాళ మనం మనుషులుగా బతకడం కోసం ఏకమైతున్నం... మనం మట్టి తొలిసి బొగ్గు దీసి మన యజమానులకు బంగారం ఇత్తన్నం.**

కాని మనకు మిగులుతున్న దేమిటి పిడికెడు బూడిద.. అన్న మాటల్లో యథార్థమైన జీవితం కన్పిస్తుంది. పోరాటంలో పోలీసులను చెడుగా ఊహించుకుంటాం సామాన్యంగా! అయితే రచయిత ఒక పాత్రచేత దురదృష్టవశాత్తు ఈ పోలీసులంతామనోళ్లె. ఏ ముఖ్యమంత్రి కొడుకూ పోలీసుకాడు, మన వేలుతీసి మనకనుగుడ్డు పొడవడమే ఆడు చేసేపని అని అన్పిస్తాడు. ఈ వాక్యం చదవంగానే చెరబండరాజు మాపల్లె నవల్లో పోలీస్ రంగనాయకులు గుర్తొస్తాడు. ఊరంటే ప్రజలు; ఊరంటే భూమి, ఆ భూమికోసం ఊరు, భూమి, దేశం వీటి మీద ఏ అధికారం లేని వాళ్లుకూడా వాటిని స్వాధీన పరుచుకునే ప్రయత్నంలో ఉన్నారు. ఊళ్లల్లో భూమికొరకు వచ్చే కొట్లాటలు భూమి పుట్టినప్పటినుండీ లేవు. ఊళ్లు పుట్టినప్పటినుండి, భూమిని మనిషి మచ్చిక జేసుకున్నప్పటి నుండి ఉన్నవి. సూది మొనంత భూమికోసమే కురుక్షేత్ర యుద్ధం చేయవలసి వచ్చినపుడు, దున్నేవానిదే భూమి కావాలనుకున్నవాడు అటువంటి కురుక్షేత్రాలెన్నో చేయవలసి ఉంటుంది. నక్సల్‌బరీ పోరాటంలో దున్నేవానికే రాజ్యం మీద అధికారం రావాలని చెప్తూనే ఉన్నారు. తెలంగాణరైతాంగపోరాటం వలన వచ్చిన భూమి పోయింది. తెచ్చిన పోరాటంలో మార్పు వచ్చి ఊళ్లోకి పంచాయితీలను పెట్టి కొత్త దళారీలను, కొత్త దొరలను తెచ్చింది. ఆ రకంగా ఊర్లు మారాయి ఈ మార్పులో భూమి ముఖం చూడని వాళ్లు కూడా తమపేర్ల పట్టాలపైన వేల ఎకరాలున్న దొరల స్థానాల్లో ఊరి మీద భూమి మీద అజమాయిషీచేసే కొత్తదొరలు దిగారు. వీళ్లు భూమి ఒక్కటే కొల్ల గొట్టబడే సాధనంగా ఉందని తలవక భూమి నుంచి పెట్టుబడులు, వ్యాపారాలు నేర్చుకున్నారు. వీళ్ల పుణ్యమా అని చిన్న చిన్న పట్టారైతులందరూ తమ భూములమ్ముకొని ఆ భూముల్లోనే

జీతగాళ్లయ్యారు. మరికొందరు వ్యవసాయకూలీలుగా పని వాళ్లుగా కన్పిస్తారు. ఇటువంటి ప్రజలకు భూస్వాములతో, వడ్డీ వ్యాపారస్థులతో వ్యతిరేకంగా పోరాటం ఎలాచేయాలోనేర్పింది నక్సల్ బరీ![8]

ఆ పోరాటం ఉప్పెనలాగా లేచిరైతు కూలీసంఘం జెండా అయి ఎగిరింది. ఎర్ర జెండా పెట్టుకొని భూమిని దున్నుకొని ప్రజాకోర్టును నిర్వహిస్తూ దొరల తప్పుల్ని ఎంచినారు. కొంతమంది దొరల్ని సాంఘికంగా బహిష్కరించారు. ఊరంటే అర్థమేమిటో ఇన్నాళ్లకి ఊరందరికి తెలిసొచ్చింది. అందుకే "ఊరు మనది వాడ మనది దొర ఏందిరా, దొర పెత్తనమేందిరా" అని ప్రశ్నించ గలిగారు. రైతుకూలీ సంఘం నిర్వహించిన పోరాటాల తర్వాత కూడ వెట్టిచేయక తప్పలేదు. బానిసత్వం తెంచుకోవాలన్న స్పృహ ప్రజల్లో కల్గింది. మనుషులు మారుతున్న సమాజంలో కొత్త దోపిడీలు, కొత్త మోసాలు, కొత్త బానిసత్వాలకు ప్రజలు గురిఅవుతూనే ఉన్నారు. భూమిపై దొరల పెత్తనం అత్యాచారాలతో తప్ప నిలువని స్థితికి వచ్చింది. కనుక తాము సాయుధంగానే దున్నేవానిదే భూమి చేయగలమని రైతాంగం గ్రహించింది.

కరీంనగర్ రైతాంగం ఆ రైతాంగ పోరాట ఆచరణను ఊళ్లలో ఎట్లా నిర్వహిస్తున్నదో, ఇంటి సంగతి గోడలు చెప్పినట్టుగా, అల్లం రాజయ్య ఊరు నవల చెప్తుంది.[9] ఈ నవల్లో దొర మళ్లీ ఊర్లోకి ప్రవేశించడంతో ప్రజలంతా అయోమయములో పడ్డారు. దొర రాజీకొచ్చాడని ఆనోటా, ఈనోటా విని ఎన్నో దౌర్జన్యాలు చేసి ఇప్పుడు రాజీకి వస్తానంటే ఎట్లా కుదురుతుందని అనుకుంటారు. దొరపట్ల ప్రజల్లో విముఖత కన్పిస్తోంది. చేసిన కష్టం, తీసుకున్న దండుగలు, గుంజుకున్న భూములు ఇవన్నీ లెక్కలోకి తీసుకోకపోయినా ఇండ్లు కాలబెట్టిచ్చినాడు. అడ్డం వచ్చిన వారిని గుండాగాళ్లతోని పెడబొబ్బలు

పెట్టిచ్చి, పోలీసుల సహాయంతో పిర్రపిగి ఇప్పుడు రాజీ అంటే కుదరదని స్పష్టంగా తమలో తామే చెప్పుకుంటారు. నవల ప్రారంభంలోనే సంగం ప్రసక్తి వస్తుంది.

దొరకి సహాయంగా లక్ష్మీనర్సయ్య మురారి వాళ్లకి నచ్చజెప్ప ప్రయత్నం చేస్తారు. కాని వారి పాచికలు సాగవు. మన కళ్లముందే ఎంత దుర్జెట్టకాలమచ్చె. పూటకు గతిలేని......... నవాబుసాబు సిరచ్చింది అని తిట్టుకుంటూ వెళ్లిపోతారు.

తాటికమ్మల గుడిసెలో సమావేశం జరుగుతుంది. దాంట్లో కొందరు రాజీకిమొగ్గు చూపుతారు. మళ్లీ అంతలోనే దొర దౌర్జన్యాలు గుర్తుకు వస్తాయి. రాజీకి తొందరగా లొంగుతారని దొరలు భ్రమపడ్తున్నారు. ఈ రోజు అందరం కూడి మాట్లాడుతున్నామంటే దీనివెనక ఎంత చరిత్ర జరిగి ఉండాలి, ఎండు డొక్కలోళ్ల, గుడ్డపేల్కలోళ్ల బాంచె గాళ్ల ఎన్నడన్న ఒకని హృదయంలోని మాట ఇంకోనికి చెప్పుకోటాన్కి నోచుకున్నాడా ఎప్పుడైనా? ఎన్నోకష్టాలకోర్చి సంఘటితిస్తే తిట్లు, కొట్లు పోయినవి కాని భూమి జాగల మాత్రం భూమే ఉంది. ఈ సమస్య ఇప్పుడప్పుడే తెగేదికాదు. అందుకే మనమేం జెయ్యాలను కున్నమో ఆ దొరకి తెలియనియ్యకుండా చేయాలె;[1] అన్న నిర్ణయానికి వస్తారు. ఆ దొరతో రాజీ పడాలనుకున్నా కొన్ని షరతులు పెట్టాలనుకుంటారు. దాంట్లో పోలీసులు ఊళ్లోంచి వెళ్లిపోవాలి. ఏ కేసులూ అడ్డంకులు లేకుండా ఎత్తి వేయాలి. బంజరు, పోరంబోకు భూములు వాళ్లకి విడిచిపెట్టాలి. వాళ్లకివ్వాల్సిన పైకం పదివేలు వాపసివ్వాలి అని అడుగుదామని నిర్ణయించుకుంటారు. ఈ షరతులు విన్న నారాయణరావు నింపాదిగా అన్నీ విని తనకు అప్పు ఉన్న వాళ్లందర్ని ఆ నిమిషంలో తీర్చమంటాడు; దాంతో అందరూ మూగవాళ్లైపోతారు.

దొర మారలేదని పులిచారలు మాస్తే గడ్డితినదని అర్థం చేసుకున్నారు. విషయం ఎటూ తేలక పోయేసరికి ఓదెలు అనే మోతుబరి రైతు సంధి కుదుర్చటాన్కి సిద్ధ పడ్తాడు; ఓదెలు అంతకుముందు రాత్రే దొరతో మంతనాలాడాడు; ఓదెలు చెప్పిన మాటలు అందరికీ నచ్చుతాయి. అంతలోనే వీరయ్యవచ్చి తన బర్రెను దొర తీసుకున్నాడని దీన్ని తిరిగి ఇవ్వమని ప్రాధేయపడ్తాడు. ఇది పది ఏండ్ల కిందట జరిగిన సంఘటన. ఆ రోజు ధైర్యం చేసి వీరిగాడు దొర ఎటువంటివాడో చెప్తాడు. అదంతా విన్న నారాయణరావుకు పిచ్చి ఆవేశంవచ్చి తుపాకితో చంపుతానని బెదిరిస్తుంటాడు. మధ్యలో సర్కిల్ ఇన్స్పెక్టర్ కలగజేసుకొని అతన్ని శాంతింపచేసి వీరిగానితో సంధికుదురిస్తాడు. దొరతో మీ పునాదులు కదుల్తున్నాయి. అరుస్తూ చేతులడ్డం పెట్టడంద్వారా కూలే బంగళా నాపలేము కూలగొట్టే గడ్డపారనాపాలె అంటూ దొరకు తన అండదండలున్నాయని చెప్పి వెళ్తాడు. ఊర్లో జరిగిన విషయాలు, పెట్టిన షరతులు బొంద్యాలు, వడ్ల శంభయ్య కలిసి కొండయ్యకు చెప్పారు. అన్నీ విన్న కొండయ్య ఇదిపరీక్షా కాలమని, ఆ షరతులు తప్పితే మళ్ల ప్రజల్ని కదిలించగలనని చెప్తాడు. అంతట్లోకి పోలీసులు వస్తారు. శంభయ్య పారిపోతాడుకాని బొంద్యాలు పోలీసులకి పట్టుపడ్తాడు. ఊర్లో జనానికి విషయం తెలుస్తుంది. నారాయణరావు ముఖంలో వెలుగొస్తుంది. దాంతో ఓదెలుకు కోపం వస్తుంది. ఒక రోజంతా చంద్రయ్యను ఇంట్లోదాస్తాడు. పోలీసులు రాగానే భయం లేదని ఇంటికి పంపిస్తాడు. చంద్రయ్యకు భయం. ఓదెలు పైనమ్మకం పోయింది. నిలువునా మునిగానని తెలిసి ఓదెలును తన్ని తన తప్పు సంగం ముందు ఒప్పుకుంటాడు. అందరూ ఒక నిర్ణయానికి వచ్చి చంద్రయ్యను క్షమిస్తారు. కాని సంగంలోంచి వెలేస్తారు. అతని నడవడి బాగుందని అనిపించినపుడే తిరిగి సంగంలో తీసుకుంటామంటారు.

బొంద్యాలు, కొడుకుతో దొరకున్న బాకీ గురించి చెప్తున్నప్పుడే కొండయ్య వస్తాడు. ఇద్దరూ దొరల్ని ఎదిరించే పథకాలు వేసుకుంటారు. కూల్లు పెరిగి నంతమాత్రాన, ఒకటి అరా పరం పోగులు మనం దున్నుకున్నంత మాత్రాన మన దరిద్రంపోదు. ఈ దేశంలో ఉన్న భూమంత దున్నెటోనికి సెందాలె. కార్ఖానాలు మాలుకదార్ల సేతులనుంచి కార్మికుల పరంగావాలె. ఒక్క మాటలోచెప్పాలంటె కష్టపడ్డోనిది రాజ్యంగావాలె. అందుకోసం మనం ఎంతకష్టమైనా లడాయి జెయ్యాలె......... అని చెప్పుకొస్తాడు. మరురోజే అందర్నీ సమావేశపెడ్తారు. పాండవుల తీరు భూమికోసం పోరాటం చెయ్యాలని చెప్తూ, ఆనాడు ఆ పోరాటాన్కి శ్రీకృష్ణుడు అండగా ఎట్లా వున్నాడో అట్లాగే ఈ రైతులకు పార్టీ అండగా నిల్చిందని, ఆ పార్టీలోచేరి అందరూ తుపాకి బట్టి దొరల్ని ఎదిరిస్తామని ప్రతిజ్ఞలు చేసి పార్టీలో చేర్తారు. కొన్నిదినాలకే ఊర్లోంచి కొందరు మాయమయ్యారని తెలుస్తుంది. వాళ్లందరూ పార్టీలోచేరిన వాళ్లే. దొరలకు భయంపుట్టుకొస్తుంది. ఊర్లో ఉన్న పట్వారి భూమిని దున్నుకుంటారు సంగం వాళ్లు. ఎడ్డోడు, బొంద్యాలు కొడుకు చంటోడు, పుల్లిగాడు అందరూ తుపాకులు నేరుస్తున్నారని విని సర్పంచ్ దశరథరెడ్డి వణుకుతుంటాడు.

దొర బొంద్యాలు ఇంటికి పరామర్శించటాన్కి వెళ్తాడు. అతన్ని చూడంగానే అందరూ మొఖాలు మాడ్చుకుంటారు. నారాయణరావు వాళ్ళతో ఎప్పుడూ వినని మాటలు, అయోమయంలో పడేసే మాటలు చెప్తాడు. దొరనోటినుండి అంత మంచి మాటలు వింటున్న జనం కలోనిజమో తేల్చుకోలేకపోతారు. ఎవరో ఊరిగానివాడు, పల్లెగానివాడొచ్చి తియ్యమాటలు చెప్పి మిమ్మల్ని ముంచేసాడంటాడు. అన్యాయాన్ని ఎదిరించటానికి మనకు ఓట్లు ఉన్నాయంటాడు. దొర మాటల్ని కొందరు నమ్ముతారు. కొందరు ఎటూ తేల్చుకోలేకపోతారు. శంభయ్య తిరిగి ఒక చిన్న సమావేశం ఏర్పాటు చేసి కొండయ్యను, బొంద్యాలును

విడిపించే ప్రయత్నంలో ఉంటాడు. నారాయణరావు ఓదెలు సహాయంతో చంద్రయ్యకు భూమి ఆశ జూపించి తనవైపు లాక్కుంటాడు. సంగంలో ముఖ్యులైన ఇద్దరూ లేక పోవటంలో ప్రజలందరికి తోచని పరిస్థితి ఏర్పడింది. చివరకు ఒకరోజు దొరను పైకం అడగటానికి నిర్ణయించు కుంటాడు. ఆ సంగతి చంద్రయ్య ఓదెలుకు చెప్తాడు. ఓదెలు జనంరాకముందే గడీలోకి వెళ్లివార్త అందిస్తాడు. జనం గడీదగ్గర సమయానికి జ్వరంతో నున్నానని చెప్పి ఆ రోజుపైకం ఇచ్చేదిలేదని వెళ్తూ శంభయ్యను తన వాళ్లతో కొట్టిస్తాడు. శంభయ్యగాయాలు నయం అయ్యేసరికి బొంద్యాలు జైల్నొంచి వస్తాడు. నారాయణరావు వెనకటి దొరకాదు. అప్పుడు దొర నెత్తురంటిన కత్తి, ఇప్పటిదొర విషంపూసిన కత్తి. శంభయ్యను పరామర్శిస్తూనే అతనికి వడ్ల పని చేతకాదని వేరొకణ్ణి పెట్టుకున్నాడు. ఇది అన్యాయం అనంగానే పనులయిపోయే వరకే అన్నాడు. పాతవసూళ్లు దొర ఇయ్యమంటే ఈ ఏడు కూడా సరిగా పండలేదు. ఎట్లనన్న నాకు బాకీ తప్పియ్యండి అని అడుగుతాడు గంగులు. దొరకు వసూలు ఇవ్వకుండా గంగులు పొలంనుంచి పంట ఇంటికి తెద్దాం అంటారు అందరూ! ఇంతలోనే చంద్రయ్య భార్య రాధమ్మకు చంద్రయ్య సంగంకు నమ్మకద్రోహం చేసి, దొరతో చాటుమాటుగా ఉంటున్నాడని తెలుస్తుంది. ఆ విషయమంతా బొంద్యాలుతో చెప్పింది. గంగులు పంట ఆ రాత్రికే కాలిబూడిదయింది. ఆ విషయం వినంగానే జనం రెచ్చిపోయారు. దొర మేకతోలు గప్పుకున్న వ్యవహారం అందరికీ కళ్లముందే ప్రత్యక్షమైంది. అయితే రాత్రికి మాట్లాడుకుని విషయం దొరకు ఎవరు చెప్పినారోతెల్సింది. వాళ్ళు మాట్లాడుతుండగానే చంద్రయ్య వెనక్కి జరిగి పరుగుబెడ్తాడు. అందరూ కొంతదూరం వెంబడించి అతన్ని తిడ్తూ **రైతుకూలి సంగానికి జై** అని నినాదాలిస్తూ దొర గడీలోకి ప్రవేశిస్తారు. నారాయణరావు పిస్టల్‌తోనర్సింహుల్ని కాలుస్తాడు. కాల్పులాగవు. జనం వెనక్కి పరిగెత్తుతారు.

## పండుగలు :

ఈ నవలల్లో రాజకీయాలు, కుట్రలు, మోసాలు అడుగడుగునా కన్పించినా ప్రజల జీవితాల్తో పెనవేసుకుపోయే సాంప్రదాయాలు, అలవాట్లు అడుగడుగునా ద్యోతక మవుతుంటాయి. పల్లె సౌందర్యాలతో పాటు వాళ్ల భుజించే ఆహారంకూడా హృద్యంగా ఉంటుంది. పంచ భక్ష్య పరమాన్నాలు లేకపోయినా ఉన్నదాంట్లోనే మొక్కజొన్న కంకులను కాల్చి వెన్న మీగడ, మిరియంతో కలిపి తివి క్షుద్బాధను తీర్చుకుంటారు.

ఈ నవలల్లో పండుగ ప్రస్తావన వచ్చినపుడు చాలామంది రచయితలు బతుకమ్మ పండుగని పేర్కొన్నారు. తెలంగాణాలో బతుకమ్మ పండుగ అతిముఖ్యమైనది. దీన్ని అన్ని వర్గాల వారు ఉత్సాహంగా చేసుకుంటారు. దసరా నవరాత్రులల్లో ఆశ్వయుజ శుద్ధపాడ్యమి నుంచి దశమిదాకా తొమ్మిది రోజులు ఈ పండుగను చేస్తారు. ఇది స్త్రీల పండగ. గౌరమ్మను రకరకాల పూలతో అలంకరించి ఆ దేవిని కొలుస్తారు. తొమ్మిదవ రోజున బతుకమ్మలన్నింటినీ ఒక చోట పెట్టి చుట్టూ వలయాకారంగా తిరుగుతూ పాటలుపాడుతూ బతుకమ్మను కొలిచి ఊరి చెరువులో వదిలేస్తారు.

ముఖ్యంగా దాశరథి రంగాచార్య రచించిన ప్రతీనవలలో తెలంగాణా ప్రజలు జరుపుకునే పండుగల్ని చక్కగా అభివర్ణించారు. పోరంకి దక్షిణా మూర్తి రచించిన ముత్యాల పందిరి నవలలో కూడా బతుకమ్మ పండగ ప్రస్తావన వస్తుంది (పేజి 112).

చిల్లర దేవుళ్ళు నవలలో ఇద్దరు పనివాళ్లు గంపలనిండా తామరపూలు, అల్లిపూలు, చేమంతిపూలు, తంగేడు, పైడితంగేడు,

గునుగు, నువ్వు, రుద్రాక్ష, కట్లా గట్టు కొరిమిడి, బీర, గన్నేరు, పాట్ల, కట్లాయి, గుమ్మడిపూలు ఇలా వివిధ రకాల పూలను తెచ్చి గుమ్మరిస్తారు. వనజ వచ్చి ఆ పూలను చూసి సారంగపాణితో పూలు ఏ వరుసక్రమంలో పేర్చితే బావుంటుందని అడుగుతూ ఈ ఏడాది దొరోరి బతుకమ్మను చూస్తే ఊళ్లోళ్లందరి కండ్లు మండాలె అంటుంది. సారంగపాణి పూలవరుసను సూచిస్తూ మంజరి అన్న పేరును బతుకమ్మలో పేర్చమని అక్షరాలు రాసిస్తాడు. పేర్చిన బతుకమ్మలకు పసుపు కుంకుమలతో గౌరమ్మను అర్చించి, పెసర, గోధుమ, బియ్యం, కొబ్బరి, నువ్వులతో చేయబడిన చద్దులు గౌరమ్మకు నైవేద్యం పెడ్తారు.

బతకమ్మల్ని ఒక్కొక్క ఇంటినుంచి తీసుకువస్తూ వెంట సన్నాయి వాళ్లతో కరణం ఇంటికి వచ్చి, తర్వాత గడీ ముందర ఆగాయి. అదొక ఆనవాయితీ. అందరి బతకమ్మల్ని గడీముందర పెట్టి అక్కడ కొంచెం సేపు పాటలుపాడి గడీలో ఉన్న దొర బతుకమ్మను తీసుకొని ఏటికి వెళ్తారు.

రంగాచార్యులదే మరో నవలలో దసరా పండగను కూడా చక్కగా వర్ణించారు. చావడిలో కత్తులు, తుపాకులు పెట్టి వాటికి కంకణాలు కడ్తారు. వాటికి ఆయుధపూజ చేస్తారు. ఆ ఊరి పెద్ద ముత్రాసు మేకను ఒక దాన్ని తెచ్చి ఒక గంపలో పడుకోబెట్టి కాళ్లు, చేతులూ కట్టేస్తారు. ఆ ఊరి పెద్ద చేతిలో కత్తితో జై మహాకాళీకి జై అని ఒక వేటు తో దాన్ని నరకడమూ, గాలిలో తుపాకులు పేలడం ఒక్కసారి జరుగుతుంది. అదే రోజు సాయంత్రం డప్పుల వాళ్లు ఊరు తిరిగి వాయుస్తూ గడీ ముందరికి వస్తారు. పెద్ద ఊరేగింపుతో దొర శమీ వృక్షం దగ్గరికి గుర్రం ఎక్కి వెళ్తాడు. వెంట జనం డప్పులతో కొమ్ములతో అనుసరిస్తూంటారు. దొర వృక్షానికి పూజ చేసి కాగితాలలో శమే

శమేయుతే పాపం........ రామున్య ప్రియదర్శివి అని రాసి ఆ కాగితంలో రానున్న సంవత్సరంలో శుభ లాభాలు రాసి జమ్మి కొమ్మలకు గుచ్చుతారు. తుపాకి మోతతో సీమోల్లంఘనం ముగుస్తుంది. అంతస్థులను బట్టి అందరికి డబ్బు, వస్త్రాలు బహుకరిస్తారు.

రంగాచార్య గారి మాయ జలతారు నవల్లో మహంకాళి జాతరను వర్ణించారు. ఇది జంటనగరానికి సంబంధించిన పండగైనా పల్లె ప్రజలందరూ భక్తితో కొలిచే పండగ. జంటనగరాల ప్రజలకు మహాకాళి అధిష్టాన దేవత. సికింద్రాబాదులో మహాంకాళీ పూర్వం రక్తం బలినే కోరేది. ఆ రోజు రక్తం ఏరులుగా ప్రవహించేది. ఆర్య సమాజ ప్రభావం వల్ల క్రమంగా రక్తపుటేరుల స్థానంలో కొబ్బరికాయలు గుట్టలుగా పడ్డాయి. జంటనగరాలకే అదే ప్రధాన పర్వదినం.

ప్రతి ఇల్లూ శుభ్రపరిచి అలికి ముగ్గులు పెడ్తారు. గడపలను పసుపు కుంకుమలతో అలంకరిస్తారు.వేపమండల తోరణాలు కడ్తారు. అందరూ మాంసం వండుకొని తింటారు. సాయంత్రం వేళ అందరూ అలంకరించు కొంటారు. బిందెలను తళా తళా తోమి వాటికి పసుపు కుంకుమలు పెట్టి అలంకరిస్తారు వేపాకు మండలు కట్టి ఆ బిందెలో నీళ్లు నింపుతారు. అలా బిందెల మీధ బిందెలు పెట్టి, చెంబు మీద చెంబు పెడ్తారు. అదే బోనం. ఆడవాళ్లంతా బోనాలు ఎత్తుకొని వెళ్తుండగా మొగవాళ్లు డప్పులు వాయిస్తుంటారు. పోత రాజు కొరడాతో ఊరేగింపు మధ్యలో వుంటాడు. వేపాకు మొలకు కట్టుకొని ఆడుతుంటే శివం వస్తుంది. ఊరేగింపులోనే కర్రసాము సాగిస్తారు. మహాకాళీ జాతరలో శక్తి బొమ్మను నెత్తిన పెట్టుకొని ఆటలాడే బైండోండ్లు, దొమ్మరివాండ్లూ, బొంగుపేలాలు, బత్తీసాలు, చిలకలు అమ్ముకునే వాళ్లు కూడా బాటకు

ఇరువైపులా దర్శన మిస్తుంటారు. గుడిదగ్గరకు రాగానే స్త్రీలు బిందెల్లోని నీరు గుడిముందు పోస్తారు. వేపమండలు తీసుకొని కొబ్బరికాయలు కొడ్తారు. తల్లి దర్శనం చేసుకుంటారు. పూజారి ఇచ్చిన కుంకుమ తీసుకొని తిరుగుముఖంపడ్తారు. కల్లు కుండలు, సారాయితో ఆ రోజు ముగుస్తుంది.

ఒక్కొక్కసారి ఈ పండుగనాడు తల్లి రంగం ఎక్కుతుంది. అంటే పచ్చి కుండ తెచ్చి బోర్లిస్తాడు కుమ్మరివాడు. ఒకస్త్రీకి పూనకం వస్తుంది. ఆమె జుట్టు విరియపోసుకుంటుంది. పసుపు పచ్చనిరవిక జాకెట్టు తొడుగుతుంది. ముఖంనిండా కుంకుమ ఉంటుంది. మెడలో గవ్వలదండలూ, బంతిపూలదండలు వేసుకుంటుంది. ఒకే కాలిగజ్జ గల్లు మనేట్లు నడుస్తుంది. జనం అందరూ మొక్కుతుండగా పచ్చికుండపై కుడికాలు పెట్టి నిల్చుంటుంది. అంటే దానర్థం మహంకాళి ఆవేశించిందని! అందుకే కుండ పగలదు. ప్రజలందరూ పూనకంలో వున్న స్త్రీని ఆ సంవత్సరంలో రానున్నవి వినిపించమంటారు. ఆమెకు ఆగ్రహం రానీయకుండా ఐదు గుమ్మడికాయలు, నూరు కొబ్బరికాయలతో తృప్తిగావిస్తారు. (పేజి 114).

రచయితలు హిందువుల పండగలకే ప్రాధాన్యమివ్వకుండా మహ్మదీయుల పండుగలను కూడ వర్ణించాడు. రంగాచార్య మోదుగుపూలు (పేజి 111-112) నవలలో పీర్ల పండగ ప్రాశస్త్యాన్ని కళ్ళకు కట్టినట్టు వర్ణించారు. ఈ నవల్లో పీర్ల పండగను మాదిగ వాడైన పీరయ్యతో పోలుస్తూ రచయిత కథకు నిండు దనాన్ని చేకూర్చారు. పల్లె జీవితంలోని సొగసును, అందాన్ని రచయితలు వర్ణిస్తూ, పేద ప్రజ జనజీవనాన్ని ఈ నవలల్లో పొందుపర్చారు.

# పాద సూచికలు

## 2వ అధ్యాయం

1. వట్టికోట ఆళ్వారుస్వామి-ప్రజల మనిషి-పేజి-14
2. పోరంకి దక్షిణామూర్తి-అభ్యుదయ, జనవరి-1980-పేజి-11.
3. జయధీర్ తిరుమలరావు-తెలంగాణ రైతాంగపోరాటం-ప్రజాసాహిత్యం
4. దాశరథిరంగాచార్య-జనపదం-పేజి-130
5. ప్రజాసాహితి-సాహిత్యోద్యమ మాస పత్రిక జులై, ఆగస్టు, 1987-పేజి-53.
6. ముళ్ల పొదలు-ముళ్లబాట-పేజి-1
7. ఎల్. లియోన్‌సెత్సెప్-అర్థశాస్త్రం సంక్షిప్త పాఠం-పేజి-28.
8. తెలంగాణ పోరాటం-తెలుగు కథ, నవల
9. వరవరరావు-తెలంగాణ విమోచనోద్యమం-పేజి-164
10. ఆర్. రామచంద్రారెడ్డి-తెలంగాణ పోరాట స్మృతులు-పేజి-108
11. వరవరరావు-కొలిమంటుకున్నది-పాఠకులుతగ్గి శ్రోతలు పెరిగిన్రు
12. అల్లం రాజయ్య-ఇది చివరిమాటకాదు-పేజి 156
13. వరవరరావు-ఊరు (నవల) ముందుమాట.

# నాగర జీవితం-రాజకీయ సంబంధాలు

అనాటి హైదరాబాదు నగర జీవితాన్ని హైదరాబాదు నగరంలో జరిగిన రాజకీయ సంఘటనలను ఉద్యమాలను చాలా నవలల్లో చిత్రించారు. మొదట చిల్లరదేవుళ్లు నవలని తీసుకుంటే ఈ నవల 1930-40 ప్రాంతానికి సంబంధించిన కథావస్తువుతో మలచబడింది. దీన్లో ఆంధ్రమహా సభలకి ముందున్న నగర పరిస్థితులు, ఇత్తెహాదుల్ ముసల్మీన్ శాఖకు చెందిన అధికారులు తెలుగు వాళ్లను బలవంతంగా తురకలుగా మారుస్తున్న వైనం చిత్రింపబడ్డాయి. చిల్లరదేవుళ్ళలో సారంగపాణి అనే పాత్ర హైదరాబాద్ నగరంలోకి అడుగు పెట్టగానే అక్కడి వాతావరణాన్ని చూసి ఆశ్చర్యపోతాడు. తెలుగు అక్షరం ముక్క వినపడదు, కనబడదు. భాష లోనే కాక వేషంలో కూడా మార్పు ! అందరూ షేర్వాణీలు, రూమీ టోపీలు ధరించే ఉంటారు. తెలుగు దేశానికి తలమానికం లాంటి మహానగరంలో తెలుగు వాడు కానీ, తెలుగు దనం కాని తెలుగు అక్షరం కాని కన్పించట్లేదు. తెలుగు తల్లిని సూానికి చీల్చి, బొట్టు తాళి తీసివేసి, ముసుగువేసి ఉర్దూ మాట్లాడమని హింసిస్తున్నట్లనిపించిది పాణికి. తెలుగు వాళ్లు కూడా తెలుగు మాట్లాడకపోవటం ఆశ్చర్యమన్పించి కారణం అడిగితే తురకవేషంలో వుంటేనే కొంత గౌరవం ఇస్తారని సమాధానం విని ఎంత దౌర్జన్యం అనుకుంటాడు.

సారంగపాణి హైదరాబాదులో మాడపాటి హనుమంతరావుని కలుసుకుంటాడు. వీరిద్దరి సంభాషణల్లో ఆ నాటి హైదరాబాదు పరిస్థితి, తెలుగు భాషకు పట్టిన అధోగతి, పోలీసుల దౌర్జన్యాలు, జనాభా, ఆంధ్రమహాసభలు ఉద్యమించటం అవి ఏ రకంగా ప్రజల్ని జాగృతం చేయటానికి పాటుపడుతుందో, తెల్పుతూ చాలా సుదీర్ఘమైన సంభాషణల ద్వారా ఆనాటి నగర జీవితాన్ని మన ముందుంచారు రచయిత. హైదరాబాదు స్థితిని తెలియజెప్పటానికే, మాడపాటి హనుమంతరావు గారి పాత్రను ప్రవేశపెట్టారు రచయిత.

వట్టి కోట ఆళ్వారుస్వామిగారు ప్రజల మనిషి నవలలో కంఠీరవం పాత్ర ద్వార 1940 నుంచి హైదరాబాదు నగరంలో కన్పిస్తున్న ప్రజా జీవనాన్ని, ప్రజల్లో కలిగిన మార్పును చిత్రించారు. స్టేట్ కాంగ్రేస్ పుట్టుకకు పూర్వం తెలంగాణా వాతావరణాన్ని ఆధారం చేసుకుని దాని ప్రభావం నుండి బయలుదేరి ఒకరిని కథానాయకునిగా తీసుకొని రాసిన నవల అని రచయిత స్వయంగా చెప్పుకున్నారు. కంఠీరవం మొదట కాంగ్రేస్ పార్టీచే ఆకర్షింపబడ్డాడు. ఈ నవల్లో మతపరివర్తనం ఒక ముఖ్య సమస్య. హైదరాబాదు, వరంగల్ లాంటి పట్టణాలలో, అంజుమన్ ప్రభావం కూడా ప్రబలంగానే కన్పిస్తుంది. ప్రజల మనిషిలో తన ఆధిక్యం కోసం హైదరలీ ఆర్థిక ప్రలోభావాలు చూపి మాల మాదిగల్ని తురకల్లో చేర్చాడు. చిల్లరదేవుళ్లు నవలలో కూడా మతం మార్పిడి ఉంది. బహద్దూర్ యార్‌జంగ్ ఆ ఊరి ప్రజలకు హిందువులు, హరిజనుల్ని, వెలివేస్తున్నారని, ఇస్లాంలో అందరూ సమానమే అని చెప్పి మత మార్పిడి ప్రయత్నాలు చేస్తాడు. హైదరలీ ప్రజల్ని తురకల్లో కల్పితే తిరిగి తన ప్రాబల్యం కోసం వాళ్లకు అన్ని రకాల ఆర్థిక దిగ్బంధాలు కల్గించి, అవస్థల పాలు చేసి, ఆర్యసమాజ్ ప్రతినిధి విజయ్‌దేవ్ ద్వారా హిందువులుగా మారుస్తాడు రామభూపాల్‌రావు.

ఆళ్వార్ స్వామి గంగు నవలలో ప్రజలమధ్య వైరుధ్యాలను సృష్టించడానికి మతాన్ని బలమైన పనిముట్టుగా ప్రభుత్వం వాడుకున్న తీరుబాగా చిత్రితమైంది. హైదరాబాద్‌లో కమ్యూనిస్టు పార్టీ శాఖ ఏర్పడడానికి పూర్వం ముఖ్దూంమొహియొద్దీన్, రాజ్‌బహదూర్‌గౌడ్, వి.హెచ్. దేశ్‌పాండేల నాయకత్వంలో కామ్రేడ్స్ అసోసియేషన్ పనిచేస్తుండేది[3] ఈ సంఘంలో రహీమ్ ఒకడు. ఈ రహీమ్ స్వయంగా ముస్లిం బీద ప్రజలకు హిందూ బీద ప్రజలతో మతబేధాలు మరచి పనిచేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తాడు. ఆంధ్రమహాసభ అధ్యక్షుడు రమణారెడ్డి అదే చెబుతాడు. ఈ అవగాహనతో ఈ నవల్లో ఒక చోట,

హిందువులకు ముస్లింలకు మధ్యన వచ్చిన తగాదాను నవనీతం పరిష్కరించాడు.

**గంగు** నవలలో దాదాపు నవల అంతా వ్యాపించి ఉన్న జగ్గయ్య, వెంకట్రావు, ఇతర భూస్వాములు ఒక వైపున, ఆంధ్రమహాసభలోని రమణారెడ్డి, నవనీతం, నాగభూషణం, లంబాడీలు, ప్రజలు మరొకవైపున కన్పిస్తారు. ఆంధ్రమహాసభలు, కమ్యూనిస్ట్ పార్టీల మధ్య ఈ పాత్రలు నడుస్తాయి. తెలంగాణ ప్రజాజీవిత చైతన్యస్థాయికి, ఉద్యమగతిశీలానికి సమంగా ఈ నవలలోని కథానాయకుని చైతన్యం ఉద్యమ నిమగ్నతలో అభివృద్ధి చెందుతూ ఉంటుంది. **ప్రజలమనిషి**లో స్టేట్ కాంగ్రేస్ సత్యాగ్రహంలో పాల్గొని అరెస్ట్ అయిన కంఠీరవం స్థానంలో **గంగు** నవలలో నవనీతం కమ్యూనిస్టుగా ఆంధ్రమహాసభ నాయకత్వ స్థాయికి ఎదిగి గ్రామాల్లో భూమి సమస్య పరిష్కారానికి కృషిచేస్తూ నిజాం ప్రభుత్వ వ్యతిరేక పోరాటంలో రాటు దేలాడు[4].

ఈ నవలలో ఫ్యూడల్ భూస్వామ్య వర్గాల ప్రయోజనాలు కాపాడడానికి రాజ్యాంగయంత్రం ఎట్లా జోక్యం కల్గించుకుందో మనం చూడొచ్చు. భూ సంబంధాలు, సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ జీవితాల పై ఏ రకమైన ప్రభావాలు పడ్డాయో కూడ దీన్లో చూడొచ్చు. "**నీ బాంచను కాల్మొక్త**" అనే బడుగుజీవులే "**నీ గొప్పేంటి**" అని ఎదురు తిరిగి ప్రశ్నిస్తూ "**ఇంకానా? ఇకపైసాగదు**" అని హెచ్చరించే స్థాయికి ఎదగడం **గంగు** లో చూస్తాం.

తెలంగాణ విమోచనోద్యమంపై వచ్చిన నవలల్లో **మృత్యుంజయులు** తొలి నవల. ఈ నవల కార్మికుల సమస్యలను, కార్మికుల పోరాటాన్ని ప్రధాన వస్తువుగా స్వీకరించింది. ఈ నవలలో కూడ **సంగం** ప్రస్తావన ఉంది. తెలంగాణలోని తెలుగు ప్రజలు ఆంధ్రమహాసభనే సంగంగా పిలుచుకున్నారు. కోస్తా జిల్లాల్లో సైతం తెలంగాణ సహాయక

సంఘాలు ఏర్పడిన సంగతి ఈ నవల ద్వారా తెలుస్తుంది. నర్సిరెడ్డిలో కార్మిక వర్గ చైతన్యాన్ని కల్గించిన రాంబాబు తాత రాయల సీమవాడు. ఈ నవల్లోని ప్రముఖ పాత్రలు, సంఘటనలు వీరి సంభాషణల ద్వారా తెలుగు ప్రజలు విశాలాంధ్రకు ప్రాతినిథ్యం ఇస్తున్నట్టు రచయిత సూచిస్తాడు. ముఖ్యంగా నవల చివర్లో దళాలకు శిక్షణ ఇచ్చే సందర్భంలో ఈ విశాలాంధ్ర భావాన్ని స్పష్టంగా ఎల్లారెడ్డి తన సందేశంలో ధ్వనింపచేస్తాడు.

పట్టణంలో పట్టణ కార్మిక సంఘం నాయకుడు రాంబాబు తాత, మొదట పోలీసు ఉద్యోగంచేసేవాడు. కొడుకు కమ్యూనిస్టు రాజకీయాల్లో పాల్గొంటున్నాడనే నేరంపై ఉద్యోగాన్ని తొలగిస్తే వచ్చి హైదరాబాద్‌లో కార్మికుడిగా చేరి కార్మిక సంఘం అధ్యక్షుడుగా ఎదిగాడు. అతడు నిర్వహించిన సమ్మెలు, ఆందోళనలు, పోరాటాల వల్ల ఆనాటి కార్మికుల్ని ఎంతగా చైతన్యవంతం చేసాయన్నది ఈ నవల్లో ప్రధానాంశం. ఈ నవల్లో పేర్కొనబడ్డ ఒక ప్రత్యేకమైన సమ్మె కూడా హిందూ ముస్లింల సామరస్యానికి సంబంధించిందే. శ్రీరామనవమికి సెలవుకావాలని హిందూ కార్మికులు కోరారు. ప్రభుత్వం ఇవ్వలేదు. కార్మిక సంఘం సమ్మెపిలుపునిచ్చింది. ముస్లిం కార్మికులుకూడా అందులో పాల్గొన్నారు. పరస్పర మత విశ్వాసాలను గౌరవించుకోడానికి నిదర్శనం ఇది.

ఈ నవలలో ముఖ్యంగా కన్పించే విషయం ఏంటంటే నిజాం వ్యతిరేక పోరాటం. ఇది ఫ్యూడల్ నిరంకుశత్వానికి వ్యతిరేక పోరాటమేగాని పరమత వ్యతిరేక పోరాటంకాదు. తెలంగాణలో చాలా మంది ముస్లింలు వ్యవసాయకూలీలుగా, వృత్తిపనులు చేసుకునే వారుగా జీవించారు. ఆకలి, బాధ, అవమానం, గాయం, పేద ముస్లింకైనా, హిందువుకైనా ఒకటే. పాలక వర్గాలు పని గట్టుకొని రెచ్చగొట్టేదాకా అందు కొరకు ప్రత్యేకించి రజాకార్లవంటి స్వచ్ఛంద రౌడీ సంస్థలను ప్రోత్సహించే దాక, హిందూ ముస్లింలు చాలా సామరస్యంతో జీవించారు. రాజు ముస్లిం

కనుక ముస్లింలంతా ప్రభువులనే భావాన్ని పసిగట్టుకొని పాలకవర్గాలు ప్రచారం చేసినంత మాత్రాన ముస్లింల ఆర్థిక పరిస్థితి మెరుగు కాలేదు. దేశ్‌ముఖ్ కామదృష్టి ఫాతిమాబి మీదపడినపుడుగాని దోపిడీ వర్గస్వభావానికి, దోపిడీ కామక్రోధాలకు, మతం సరిహద్దు కాదనే విషయం స్పష్టమవుతుంది. ఫాతిమాబీని తప్పించింది ఎల్లారెడ్డి, హిందువైన రాములమ్మను హిందువైన పటేలు సిగపట్టి ఈడిస్తే కాపాడింది ముస్లిం సుభాన్. దీని వల్ల మతం పేదవాళ్ల మానాలకూ, ప్రాణాలకూ అడ్డుపడలేదన్నది ఇక్కడ మనం అర్థం చేసుకోవాల్సిన అంశం.

ఇటువంటి వాతావరణంలో రచయిత ఒక రైతును ప్రవేశపెడ్తాడు. ఆ రైతే నర్సిరెడ్డి. మొదట రిక్షాతొక్కి బతికేవాడు,.తర్వాత తాత ఇతన్ని మంచి నాయకుడిగా మలుస్తాడు. కార్మికుడిగా చేరి, కార్మిక సంఘాల్లో చురుగ్గాపని చేస్తాడు. సమ్మెలో పాల్గొన్నాడు. అతడు కార్మిక వర్గ చైతన్యం పొందిన నాయకుడే కాకుండా పల్లెల్లో రగుల్తున్న విప్లవాగ్నిని సరియైన పద్ధతిలో నడిపించడానికి తన గ్రామానికి తిరిగి వచ్చిన వాడు. సుభాన్‌పై జరుగుతున్న హింసాకాండకు వ్యతిరేకంగా ప్రజలను ఎదురుతిరగడానికి పురికొల్పి తానుకూడా ఆ ప్రతిఘటనలోనే ప్రాణాలర్పించాడు. కార్మికోద్యమంలో పాల్గొనడం ద్వారా ఒకటికి ఒకటి కలిసి రెండై ఆ రెండు మరిన్నై ఒక సంఘటిత శక్తి ఏర్పడుతుందని, ఆ శక్తి ఒక వ్యవస్థలో, నిర్మాణంలో పనిచేసినపుడు ఒక క్రమంలో సాగుతుందని అర్థం చేసుకున్నాడు. నర్సిరెడ్డి పాత్రద్వారా రచయిత కార్మిక కర్షక ఐక్యత రైతాంగపోరాటానికి ఎంత అవసరమో చెప్పదల్చుకున్నాడు.

మహీధరవారి **ఓనమాలు** నవలలోకూడ, ఆర్యసమాజం ప్రస్తావన కొద్దిగా కన్పిస్తుంది. మొదట వెంకటయ్య సత్తెమ్మతో వివాహం గురించి మాట్లాడుతూ వితంతు వివాహాలు తప్పుకావని ఈ రోజుల్లో వాటికి ప్రోత్సాహం లభిస్తుందని చెప్తాడు. ఇటువంటి పెళ్లిళ్లను

చేయించడంలో ఆర్యసమాజంవారు శ్రద్ధతీసుకుంటున్నారని, తాను సంగంతో సంబంధం పెట్టుకోగానే తెల్సింది. ఈ సందర్భంలో తప్ప మరెక్కడా ఆర్యసమాజ్ ప్రస్తావన కన్పించదు. తెలంగాణ గ్రామాల్లోని రైతాంగానికి, ఆర్యసమాజ్ అర్థం కాని విషయమని రచయిత తెలియ చేస్తాడు. ఈ నవల్లో ఇత్తెహాదుల్ ముసల్మీన్ ప్రస్తావన చాలాసార్లు వస్తుంది. బుడన్ అనే పాత్ర ఒక హత్యచేసి అది తన మీదకి రాకుండా చూసుకోవడానికి ఆ సంస్థ నాయకుడు రసూల్ పంచన చేరిన సన్నివేశం ఒకటి చిత్రితమైంది.

హైదరాబాద్ సంస్థానములో ముస్లింలు, హిందువులు సామరస్యం తో ఉంటారని రచయిత తెలియజేస్తాడు. పట్టణాలలో డబ్బు గల వారు, రౌడీలు మాత్రమే తాము ప్రభువులమనే భావంతో ఉంటారు కాని గ్రామాలల్లో ముస్లింలు, రైతులతో, పేదవారితో కలిసిమెలిసి జీవిస్తారు. వీళ్ల చాలా అన్యోన్యంగా కలిసి వుంటారనే విషయం చెప్పడానికే శిలార్, ముంతాజ్ పాత్రల్ని చిత్రించాడు.

రజాకార్లను ఆజాద్ హైదరాబాదు రక్షణ కొరకు ఒక వైపు సాయుధం చేస్తూనే హైదరాబాదు సంస్థానానికి ఉన్న ప్రత్యేక సంస్కృతిని ప్రచారం చేయడానికి కూడా నిజాం చాలా డబ్బు ఖర్చు పెట్టాడు. ఈ విషయాన్ని గోపాల్‌రావు, రంగయ్యలు, హైదరాబాదుకు బస్సులో వచ్చే సందర్భంలోను, హైదరాబాదులో ఒక ముషాయిరాలో పాల్గొన్న సందర్భంలోను రచయిత ప్రస్తావించాడు. ఈ నవల్లో కూడా మత మార్పిడి కన్పిస్తుంది. మతం మార్చుకున్న వాళ్ల మీద పెద్ద కులాల వాళ్లు ఆర్థిక ఆంక్షలు ఉపయోగించి లొంగదీసుకునే ప్రయత్నాలు చేశారు. మతానికి విరుగుడుగా మతాన్నే వాడాలని ఆర్యసమాజం ద్వారా శుద్ధి కార్యక్రమాలు చేపట్టారు.

దొర మిలిటరీ పోలీసుల్ని తెస్తాడనుకుంటే లారీనిండా రజాకార్లు వస్తారు. కర్రలు, జాంబియాలు, బర్మర్లు, పట్టుకొని దిగారు.

బుడన్ చేతిలో ముసలివాడు చస్తాడు. నిజాం రాజు బాహాటంగా రజాకార్ల సైన్యాన్ని ఎలా పెంచి పోషించాడో, రజాకార్లకు పట్టపగలే సాయుధులై విచ్చలవిడిగా తిరిగే అరాచకాన్ని, స్వేచ్ఛను ఎలా ఇచ్చాడో ఈ సంఘటన వల్ల తెలుస్తుంది. ఇక్కడ ఇత్తెహాదుల్ ముసల్మీన్‌లు తెలంగాణ వ్యాప్తంగా జరుపుతున్న దురంతాలను రచయిత ప్రస్తావించాడు. రజాకార్లు చేస్తున్న దురంతాలను నిజామే ప్రోత్సహిస్తున్నాడు కనుక ఈ విషయంలో పోలీసుల నుంచి, ప్రభుత్వం నుంచి న్యాయం ఆశించి ప్రయోజనం లేదని, ప్రతి పేటలోని వాలంటీర్ దళాలను కూర్చుకొని దౌర్జన్యం చేస్తున్న వాళ్లను అదుపులో పెట్టాలని సంగం నాయకత్వంలో జనంగ్రహించారు.

అజాద్ హైద్రాబాద్ నినాదంలోని కుట్రను భగ్నంచేసి "నిజాం భారత యూనియన్‌లో చేరాలి" అనే ఆకాంక్ష వెనుక ప్రజలను సమీకరించి ఉద్యమించాలని కూడ సంగం ప్రజలకు రాజకీయ చైతన్యాన్ని, రాజకీయ కార్యక్రమాన్ని కూడా ఇచ్చింది. నిజాం విషయంలో అతివాద విషయంలో అతివాద కాంగ్రెసుకు, కమ్యూనిస్టులకు ఎలాంటి తేడాల్లేవు.

స్టేట్ కాంగ్రెస్‌లోని రెండు వర్గాలకు కూడ నిజాం ప్రభుత్వంలో ఉద్యోగులల్లో పలుకుబడి ఉంది. ఈ విషయం ఈ నవలలో రంగయ్యకు మామ గోపాల్‌రావు నిజాం ప్రభుత్వంలో ప్రచార శాఖలో పబ్లిసిటీ ఆఫీసర్ ఉద్యోగమిప్పించాలని ప్రయత్నించిన సందర్భంలో ప్రస్తావనకు వస్తుంది. ఈ నవల్లో స్టేట్ కాంగ్రెస్‌లోని అతివాద, మిత వాద రాజకీయాలను ఆ ధోరణులకు ప్రాతినిధ్యం వహించే సంగారెడ్డి, గోపాల్‌రావు వంటి పాత్రల ద్వారా ప్రవేశ పెట్టి రానున్న రాజకీయ స్వభావం ఎలా ఉంటుందో రచయిత విశ్లేషణాత్మకంగా సూచించాడు. ఈ నవలల్లోని ప్రజా ఉద్యమంపై ప్రపంచ యుద్ధ ప్రభావం, జాతీయోద్యమ [illegible] ధ్రమహాసభ సంఘ సంస్కరణ స్వభావాన్ని [illegible]దలుకొన్ని, ప్రజా సమీకరణ, ఆర్థిక, రాజకీయస్థాయి

పోరాటాల వరకు దాని క్రమ పరిణామ రూపాన్ని ఈ నవలలు ప్రతి ఫలించాయి. ఒక్క మాటలో చెప్పాలంటే బానిసలుగా బతుకుతున్న ప్రజలు తమ బతుకులకు తామే నిర్దేశకులు నిర్మాతలు కాదలుచుకున్న దశవరకు, అందుకొరకు వాళ్లు సాగించిన విప్లవ పోరాటస్థాయి వరకు ప్రతిఫలించిన నవలలివి[5].

పెత్తందార్లకు పెత్తందార్ల ప్రతినిధిగా ఉన్న నిజాం నిరంకుశ ప్రభుత్వానికి, అతని పోలీసులకు, రజాకార్లకు వారుసాగించిన ఆర్థిక దోపిడీపై వ్యతిరేకంగా ప్రజల విజయం నమ్మకంగా కన్పించే దశలో ఆంధ్రమహాసభలో చేరి కొత్త ముసుగుల్లో తమ వర్గ ప్రయోజనాలు కాపాడు కోవాలని చూసిన పెత్తందార్ల రంగు బయట పెట్టడానికి కూడా పోరాడారు.

స్టేట్ కాంగ్రెస్ ఏర్పాటుకు ముందు తెలంగాణలో గ్రంథాల యోద్యమం, ఆంధ్ర మహాసభ కల్గించిన సంఘీభావం, ఆర్యసమాజ్, ఇత్తెహాదుల్ ముసల్మీన్ మత పరివర్తన విషయంలో పోటీపడి తప్పుదోవలు పట్టించినప్పటి విశేషాలు, వీటన్నిటి వెనుకదాగి తల నిక్కిస్తున్న భూమి సమస్య ఆళ్వారుస్వామి తొలినవల ప్రజల మనిషిలో అద్దంలో లాగా కన్పిస్తాయి[6] రామ్‌భూపాల్‌రావు వంటి వాళ్ళు ఆంధ్రమహా సభనూ, ఆర్య సమాజ్‌ను మాత్రమేగాక, అంజుమన్ ఇత్తెహాదుల్ ముసల్మీన్‌ను సైతం స్వప్రయోజ నాలకు తెలివిగా ఎలా వాడుకుంటూ వచ్చారో, ఎత్తులు పారనపుడు తమ పెత్తనం నిలుపు కోవాలని ఎలా బల ప్రయోగానికి పూనుకున్నారో వర్ణించింది. ఈ నవల అలాగే ఆంధ్రుల మహాసభద్వారా కమ్యూనిస్టు ఉద్యమం నగరంలోనే కాక గ్రామ జీవితంలోనూ చొరబడి భూస్వాముల కుటుంబాలకు చెందిన విద్యావంతులైన యువతీయువకులను ఎలా ఆకర్షిస్తూ వచ్చిందో వట్టికోట వారి రెండవ నవల గంగు చెప్తుంది. సాయుధ పోరాటానికి ప్రజా ఉద్యమం

సన్నిద్ధమౌతూ ఉండిన దశ మహీధర రామ్మోహనరావుగారి ఓనమాలులో కన్పిస్తుంది. సాయుధ పోరాటం పిలుపు వచ్చాక ఆయుధ సేకరణ శిక్షణ మిలిటరీ దళాల నిర్మాణం వగైరా కొత్త అంశాలు **మృత్యువునీడలో** ప్రస్తావింపబడ్డాయి. **యుగసంధి** నవలకూడా హైద్రాబాద్‌లో జరిగిన రజాకార్లఘర్షణల్ని, నిజాం రాజ్యంలోని పరిస్థితుల్ని వివరించింది. హైద్రాబాద్ సంస్థానంలోకి యూనియన్ పోలీసు మిలిటరీ ప్రవేశించటంతో పారిపోయిన జాగిర్దార్లు తదితరులు కాంగ్రెస్ జెండా నీడకింద తమస్థానాల్లోకి వచ్చి తమ అధికారాన్ని తిరిగి ఎలా సంపాదించుకున్నారో రంగాచార్యగారి **జనపదం** నవల చెప్తుంది. ఈ నవల నగరంలో మతసమస్యల్ని సాకుగా తీసుకొని నాయకుల రాజకీయపుటెత్తుల్ని చూపిస్తుంది. ఎం.వి. తిరుపతయ్యగారి **బతుకు** నవల నగరంలో బడుగువర్గాల బ్రతుకును, ఆ బ్రతుక్కి, రాజకీయ పరమైన అంశాల్ని ఏ రకంగా విధించారో చెప్తుంది. రంగాచార్యగారి **మాయజలతారు** నవలలో నగరంలో జరుగుతున్న మోసాలు, కుట్రలు కళ్లకు కట్టినట్టు చూపిస్తూ, కార్మికుల జీవితాల్తో పెట్టుబడి దారులు ఏ రకంగా ఆడుకుంటున్నారో, పొట్టకూటికి వచ్చిన వీళ్లను తమ చాకచక్యంతో అక్రమాల్లో ఇరికించి, వాళ్ల జీవితాల్ని పావులుగా చేసి ఆడుకోవటం చూస్తాం. కంట్రాక్టుల్లో జరుగుతున్న మోసాలు కూడా ఈ నవల్లో చోటు చేసుకున్నాయి.

నవీన్‌గారి **ముళ్లపొదలు** నవల 1969-79లో జరిగిన ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని శక్తివంతంగా చిత్రించింది. నగరంలో యువకుల సమస్యలు, సమ్మెలు, నిరుద్యోగ సమస్య, నిరాశా, నిస్పృహలు ఈ నవల్లో చోటు చేసుకుంటాయి. భాస్కర భట్ల కృష్ణారావు రచించిన **యుగసంధి** నవలలో హైదరాబాద్ సంస్థానంలోని నగర జీవితాన్ని మన కళ్లముందు ఉంచుతారు. సంస్థానంలో అప్పటి రాజభాష ఉర్దూ. రాజభాషను నేర్చుకున్న వాళ్లే ప్రభుత్వ ఉద్యోగాల్లో చేరి సంస్థానంలో మంచి పలుకుబడి

సంపాదించేవారు. రవణ తండ్రి నారాయణ్‌రావు కూడ ఉర్దూ, ఫార్సీ భాషలు నేర్చుకొని డిప్యూటి తహసీల్‌దారుగా పని చేస్తుంటాడు. నిజాంప్రభుత్వం నిజాం కళాశాలను నిర్మించి ఇంగ్లీషులో ఉన్నత విద్యను ప్రారంభించింది. అప్పటి విద్యావిధానంలో ఫోర్త్‌స్టాండర్డ్ తర్వాత ఒక పబ్లిక్ పరీక్ష ఉండేది. దాన్నే స్పెషల్ అనేవాళ్లు. స్పెషల్ పాస్ అయినవాళ్లు గొప్ప నిధి దొరికినట్టు భావించేవాళ్లు. థర్డ్‌ఫారమ్ పరీక్షని మిడిల్ అనేవారు. మిడిల్ పాసయిన వారికి పట్టపగ్గాలు ఉండేవికావు. మెట్రికుల్యేషన్ కర్మకాలి ఎవరైనా పాసయితే అతన్ని మించిన విద్వాంసుడు చుట్టుపక్కల తుపాకివేసినా కనిపంచేవాడుకాదని రచయిత ఆనాటి అనుభవాలను పేర్కొంటాడు.

ఏడో నిజాం హయాంలో ఉస్మానియా విశ్వవిద్యాలయం స్థాపించారు. ఇంగ్లీషు బోధనాభాషగా ఉంటే విద్యార్థులు విషయాలను గ్రహించడం కష్టమవుతుందని అందువల్ల ప్రాంతీయ భాషల్లో విశ్వవిద్యాలయాల్ని స్థాపించాలని బ్రిటీష్ ఇండియాలో ఒక ఉద్యమం బయలుదేరింది. దానికితోడు ఉర్దూ, హిందుస్తాన్ జాతీయభాషగా ఆమోదించాలని గాంధీజీ గొప్ప ఆందోళనని లేవదీసాడు. అదిసాకుగా తీసుకొని నిజాం ఉస్మానియా విశ్వవిద్యాయంలో ఉర్దూబోధనాభాషగా ప్రవేశపెట్టాడు. సంస్థానంలో నూటికి తొంభైమంది తెలుగు, మహారాష్ట్ర, కన్నడులు ఉండటంవల్ల ఉర్దూ బోధనాభాషగా ప్రవేశపెట్టడంచేత ఈ మూడు ప్రాంతీయ భాషలు చాలా దెబ్బతిన్నాయి. చివరికి విద్యార్థినులు కూడ ఉర్దూ బోధనా భాషగా విద్యను అభ్యసించే వారు. ఈ నవల్లో రమణకూడ ఇలాగే ఉర్దూ భాషను అభ్యసిస్తుంది.

భాస్కరభట్ల కృష్ణారావుగారు సంస్థాన విశేషాలే కాకుండా బ్రిటిష్ ఇండియా ఉద్యమాన్ని కూడ చర్చిస్తారు. గాంధీజీ నాయకత్వం కింద ప్రజలు ఉత్సాహంతో సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొంటున్నారని,

విదేశీ వస్తువులని బహిష్కరిస్తున్నారని, ఖద్దరు వస్త్రాలు మాత్రమే ధరిస్తున్నారని పేర్కొన్నారు. న్యాయవాదులు తమ వృత్తిని వదిలి దేశస్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొంటున్నారు. విద్యార్థులు పాఠశాలలు, కళాశాలల్ని బహిష్కరిస్తున్నారు. బ్రిటీష్ ఇండియాలో స్వాతంత్ర్యం కోసం ఇంత గొప్ప ఉద్యమాన్ని జరుపుతుంటే హైదరాబాద్ సంస్థానంలో మాత్రం నిమ్మకు నీరెత్తినట్లు ఉంది. స్వాతంత్ర్యోద్యమం, వ్యక్తి సత్యాగ్రహం దేశం నలుమూలల దావానలంలా వ్యాపిస్తుంటే హైద్రాబాద్ సంస్థానంలో ఈ స్వాతంత్ర్యసమరం నిర్దాక్షిణ్యంగా అణిచివేయబడింది.

రచయిత బహదూర్ యార్‌జంగ్ స్థాపించిన **ఇత్తెహాదుల్ ముసల్మీన్** అనే సంస్థను కూడ పరిచయం చేస్తాడు. ఈ సంస్థ ముస్లింలలో మతావేశాన్ని, పర మత విద్వేషాన్ని పురికొల్పుతుంది. ఈ నాయకులు హిందూ ముస్లింలు రెండు విభిన్న జాతులని చెప్తూ ఇవి ఒక చోట మనలేవని దేశాన్ని విభజించి ముస్లింలకోసం ప్రత్యేకంగా పాకిస్తాన్ ఏర్పరుస్తేనేతప్ప ముస్లింలు దేశంలో సురక్షితంగా ఉండలేరని ఉద్బోధిస్తారు. ఈ సంస్థపై ఎటువంటి నిర్బంధాలు ఉండేవికావు. అదే ఆంధ్రమహాసభలు జరుపుకోవడానికి మాత్రం ప్రభుత్వ అనుమతిని పొందాలి. ఆ సభల్లో రాజకీయాలు మాట్లాడకూడదు.

కృష్ణారావుగారు ఈ విషయాల్ని వివరిస్తూ ఆంధ్రమహాసభకు సంబంధించిన సంఘటనలను, గస్తీనిషాన్ గురించి, ఆర్యసమాజం గురించి చెప్పారు. రఘుపాత్రద్వారా ఆంధ్రమహాసభ వివరాలను చెప్పుకొచ్చారు. ఇతనికి సత్యాగ్రహం చేయాలనే ఉంటుందిగాని ఆంధ్రమహాసభలో చేరడం ఉత్సాహవంతంగా కనిపించదు. ఆంధ్రమహాసభకు, స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహానికి ఎటువంటి సంబంధం లేదని తెలుసుకుంటాడు. కొన్ని కరపత్రాల్ని, నివేదికల్ని చదువుతాడు. దాంట్లో వెట్టిచాకిరి అనే కరపత్రాన్ని చదివింతరువాత ఆ దురాచారానికి వ్యతిరేకంగా మహాసభ

ఆందోళనను జరపడం ఎంతో సమంజసంగా తోస్తుంది. **వర్తక స్వాతంత్ర్యం అనే మరో కరపత్రంలో వర్తకులు ఎంతో నష్టపోవటం చూసిన ఆంధ్రమహాసభ గొప్ప ఆందోళనను జరిపి వర్తకులకు మేలు చేకూర్చింది.** అన్న వార్తలు రఘుకు చాలా ఆనందాన్ని ఇచ్చింది. ఈ రకంగానే మగ్గం పన్ను మొదలైన కరపత్రాల్ని చదివి సంస్థానంలో ఉన్న పరిస్థితుల్ని తెలుసుకుంటాడు.

రచయిత ఆంధ్రమహాసభలని పేర్కొంటూ వాటివల్ల ప్రజలు మాతృభాష పట్ల భక్తిభావాన్ని ఎలా పెంపొందించుకున్నారో చెప్పారు. మహాసభల ద్వారా మేము ఆంధ్రులం, మా భాష తెనుగు అన్న విషయం ప్రజలు తెలుసుకోగల్గారు. సాంస్కృతికంగా విజయాన్ని సాధించాయి ఈ మహాసభలు; రాజకీయంగా సాధించిన మహత్కార్యమేది లేక పోవచ్చు కాని పెడదారులు పట్టిన జాతిని సక్రమ మార్గంలోకి తెచ్చింది. సాధించింది చాలా తక్కువ, సాధించవలసింది ఇంకా ఎంతో ఉంది. జాతి పురోగమనానికి ఒక దారి ఏర్పడింది. ఇక జాతి తనగమ్య స్థానానికి చేరుకోకతప్పదు.

రఘు విశ్వవిద్యాలయంలో చదువుతున్నప్పుడు వందేమాతరం ఉద్యమం ప్రారంభమవుతుంది. అప్పటివరకు నిజాం ఒక ఉర్దూ ప్రార్థనాగీతాన్ని పాడమని ఆదేశించాడు. దానికి వ్యతిరేకంగా విద్యార్థులు వందేమాతరం గీతాన్ని ఆలపించారు. అది ఒక్క హైద్రాబాద్‌లోనే కాకుండా జిల్లా జిల్లాలకు వ్యాపించింది. విద్యార్థులు శాశ్వతంగా చదువులు మానడానికి నిర్ణయించుకుంటారు. దాని వల్ల ఒక సంవత్సరం నష్టమవుతుందని, కొందరు నాగపూర్ యూనివర్సిటీకి వెళ్తే, మరికొందరు ఇతర యూనివర్సిటీలకు వెళ్లారు. హాస్టల్లో జాతీయగీతాన్ని పాడితే హాస్టల్‌నుంచి విద్యార్థుల్ని తీసివేస్తామని నోటీస్ ఇవ్వబడుతుంది. విద్యార్థుల స్వేచ్ఛాస్వాతంత్ర్యాన్ని అరికడితె అది

దౌర్జన్యం అనిపించుకుంటుందని, తాముపాటికి తలొగ్గేది లేదని రఘు తన ఉపన్యాసంలో చెప్తాడు. అధ్యక్షుడుగా ఉన్న రఘుని తదితర సంఘ సభ్యుల్ని అరెస్టు చెయ్యమని ప్రభుత్వం నుండి ఉత్తర్వులు వస్తాయి. కాని వీరిపై ఎట్టి చర్యలు తీసుకొనబడవు. వీరొక సంవత్సరం వృధాచేసుకొని తిరిగి ఎం.ఏ.లో చేరడానికి నిర్ణయించుకుంటారు. ఉవ్వెత్తున ప్రారంభమైన వందేమాతరం ఉద్యమం చివరికి చప్పగా చల్లారిపోయింది.

రచయిత ఆనాటి స్వాతంత్ర్యపోరాటాన్ని పూర్తిగా మన ముందుంచారు. ఒక్క తెలంగాణా పరిస్థితులే కాకుండా యావద్భారతంలో జరుగుతున్న ఆందోళనల్ని వివరిస్తూ ఆ ఉద్యమాన్ని చూసి తెలంగాణా ప్రజలు ఉత్తేజితులైన సన్నివేశాల్ని మనముందుంచారు. క్విట్ ఇండియా ఉద్యమాన్ని గురించి చాలావిపులంగా వ్రాసారు. రెండో ప్రపంచయుద్ధాన్ని తెలుపుతూ స్వాతంత్ర్యానికి తెచ్చిన ఒత్తిడి వల్ల 15 ఆగస్టు 1947న భారతదేశం నుంచి పాకిస్తాన్‌ను చీల్చబడి ఒక దేశంగా సృష్టించబడింది. అదే రోజు ఆ రెండు దేశాలకు స్వాతంత్ర్యం సిద్ధించినది. యావద్భారతం అంతా ఇంతటి మహత్తర సంఘటనలతో ఉడికెత్తి పోతుంటే హైద్రాబాద్ సంస్థానంకు మాత్రం చీమకుట్టినట్లయినా లేదు. ఆ సమయంలో ఖాసీం రజ్వీ ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంస్థకు అధ్యక్షుడైనాడు. ఇతడు హిట్లర్ ముస్సోలినీలను గుర్తుకు తెచ్చేంతగా ప్రజల్ని హింసించాడు. ఇతడు రజాకార్ల పేరిట చేయించిన భీభత్సాన్ని రక్తాక్షరాలతో రాయవచ్చు.

రజాకార్లంటే స్వచ్ఛంద సేవకులు! ప్రజలను లూటీచేయడం, దోపిడి చేయడం, గృహాలకు నిప్పంటించడం, మత విద్వేషాన్ని పురికొల్పుతూ ముస్లింల ఆధిక్యతను వేనోళ్ల చాటడం, మొదలైన పనులు ఈ స్వచ్ఛంద సేవకులు కడు సమర్ధవంతంగా నిర్వహించారు. ఎందరో అమాయకుల్ని ఈ రజాకార్లు చిత్రవధ చేసారు. ఎంతో మంది స్త్రీల

మానాన్ని దోచుకున్నారు. ఈ రజాకార్ల దురాగతాలను నిజాంకు తెలిపి పెడచెవిన పెట్టాడు. స్వాతంత్ర్య దినోత్సవాన్ని అందరూ జరుపుతుండగా హైద్రాబాద్‌లో మాత్రం ఆ పతాకాన్ని ఎగురవేయవద్దని ఆజ్ఞలు జారీచేసారు. ఎగురువేసినవారిని అరెస్టు చేసారు. జాతీయపతాకాన్ని ఎగురవేయాలను కుంటే దాంతోపాటు ఆసఫ్‌జాహి జెండానుకూడ ఎగురవేయాలని ఉత్తర్వులిచ్చారు. ఆ జెండాను ఎగురవేయడం ఇష్టం లేక ప్రజలు జాతీయపతాకాన్ని కూడా ఎగురవేయడం మానుకున్నారు. భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చి మిగతా సంస్థానాలు భారత భూమిలో కలిసిపోయినా మూడు సంస్థానాలు మటుకు ప్రతిఘటించి స్వయంపాలన కావాలని సవాలు చేశాయి. కాశ్మీర్, జునాగడ్‌లు తేలిపోయినా హైద్రాబాద్ నవాబ్ మటుకు ఖాసిం రజ్వీని నమ్ముకొని, ఢిల్లీలోని ఎర్రకోటపై నవాబుల జెండా ఎగురవేస్తానని ప్రగల్భాలుపలికి, చివరికి ఖాసింరజ్వీయే తాను హైద్రాబాద్ సుల్తాన్‌నని ప్రకటించేటప్పటికి నిజాం గజ, గజలాడి సంధిబేరానికి దిగాడు. చివరికి భారత సైన్యం ఆక్రమించుకోవడం అవన్నీ, చరిత్రలోని విషయాలు.

ఈ నవల్లో ఖాసీం రజ్వీ దురాగత చర్యల్ని, ఘాతుకాల్ని మాత్రమే వర్ణించటం జరిగింది. అతని దురాగత చర్యలలో, సాంప్రదాయ కుటుంబంలో నుంచి వచ్చిన; పల్లెనుంచి పట్నానికి వచ్చిన ఇద్దరు స్త్రీలు నగరంలో ఏ రకంగా జీవించారో వాళ్ళ పరిస్థితుల్ని నగర జీవితం ఎట్లా వాడుకుందో చూపించారు రచయిత.

పల్లెల్లో దొరల దౌర్జన్యాలకు బలైపోతున్నా కూడా నోరు మెదపకుండా వాళ్లకు ఊడిగం చేస్తూ నీ గులాపోన్ని దొరా అంటూబానిస బ్రతుకును గడిపారు. ఆనాటి ప్రజలు ఎంతో కొంత భూమిని ఆధారం చేసుకొని తమ క్షుద్బాధను తీర్చుకుంటున్న సమయంలో కూడా పన్నులనీ, వడ్డీలనీ, తాకట్టుకింద ఖర్చులనీ ఆ ఉన్న భూమి కూడా

దౌర్జన్యాలతో మోసాలతో చిల్లరదేవుళ్లనే గ్రామాధికారులు గుంజుకున్నప్పుడు ఉన్న ఊర్లో కూడు, గుడ్డ కరువై, ఆశ్రయమిచ్చేవారు లేక తమ రెక్కల్నే ఆధారంగా చేసుకొని మాయజలతారు అనే నగర జీవితంలోకి ప్రవేశిస్తారు.

తమ ఊళ్లోనే దొరలు, దౌర్జన్యాలు ఉంటాయనుకొనే అమాయక ప్రజలు పట్టణాల్లో జరుగుతున్న మోసాలను, మాయలను, దౌర్జన్యాలను చేస్తున్న చీడపురుగులను చూసి, ప్రపంచంలో ఎక్కడైనా పెట్టుబడి వర్గాలు పీడిత ప్రజలని దోచుకుంటున్నారనే విషయాన్ని తమ జీవితానుభవాల ద్వారా తెలుసుకుంటారు. పల్లెల్లోని ప్రజలు తమకు అన్యాయం జరిగితే **మాకర్మ** అనీ **పాపాత్ములం కాబట్టే కష్టాలు వచ్చాయని మా మొఖాన దేవుడింతే రాసాడని**, దేవుడి పేరుతో వేదాంతాన్ని జీర్ణించుకుంటారు. అదే గ్రామాల్లో నుంచి వచ్చి, పట్టణాల్లో నివసిస్తున్న ప్రజలే ఈ దురాగతాల్ని చూస్తూ భరించలేక ప్రశ్నించడం నేర్చుకుంటారు.

ఇటువంటి సన్నివేశాలు, పాత్రలు మాయ జలతారు నవలలో చూడొచ్చు. బాలయ్య, పిచ్చయ్య, పోచయ్య పల్లెలను వదిలిపెట్టి నగరానికి వచ్చి రిక్షాలు లాగుతూ, వాళ్ల సంసారాన్ని ఈదుకొస్తుంటారు. ఇటువంటి శ్రామిక వర్గమంతా ఒక ఖాళీస్థలంలో గుడిసెలు వేసుకొని ఉంటారు. వీటినే ధనికులు నగరాలకు పీడలనే మురికి పేటలుగా వ్యవహరిస్తారు. పల్లెల్లో జమిందార్ల దౌర్జనాలు పెరగడం చిన్న చిన్న నేల చెక్కల వాళ్లు వ్యవసాయం చేసుకోలేక పోవడం చేతి పరిశ్రమలు మూలపడడం, ఊళ్లలో కక్షలు పెరగడం మూలాన జనం పల్లెలు వదిలి పట్టణాలకు దారి పట్టారు. అలా దారిపట్టిన పేదలు వెంట రెక్కలు తప్ప మరేమీ తెచ్చుకోలేదు.

ఉండటానికి స్థలం చూసుకుంటూ విడిగా ఉన్న స్థలాలల్లో గుడిసెలు వేసుకున్నారు. ఇవే మనం నగరాలకు పీడలనే మురికి పేటలు. అక్కడ లైట్లుగానీ పంపులుగానీ ఉండవు. మరుగుదొడ్లకు మైళ్లు నడవాలి. డ్రైనేజి ఉండదు. ఏ ఇంటికి ఆ ఇంటి ముందే ఒక మురికికాలువ, దోమల ఉత్పత్తి పంచవర్ష ప్రణాళిక అంచనాలను అధిగమిస్తుంది. పిల్లల శౌచ్యాన్ని శుభ్రంచేయడానికి మాత్రంవస్తుండే పందులు మనుషులతో సహజీవనం చేస్తుంటాయి అని నగర జీవితాన్ని మనకళ్ల ముందుంచారు రచయిత రంగాచార్య!.

ఒక రోజు ఉస్మాన్ అనే అతడు వచ్చి భూమి సొంతదారులు గుడిసెలు పీకేయాలని చూస్తున్నారని తెలిసి తాను గరీబోళ్లకు సాయం చేయాలని వచ్చానని, గరీబోళ్లకోసం ఒక సంఘం పెట్టానని చెప్పాడు. ఆ సంఘానికి మినిస్టరు మద్దతుందని ఎవరన్నా గుడిసెలు ఖాళీ చేయమన్నప్పుడు తనకు కబురుచేయమని చెప్తాడు. ఆ సమయంలో తాను వాళ్లను ఆదుకుంటానని చెప్పి ప్రతి గుడిసెకు 5 రూ॥ల చొప్పున ఇవ్వమని అడుగుతాడు. ఇయ్యని వాళ్ల గుడిసె తెల్లారే సరికి మాయమవుతాయని బెదిరిస్తాడు. ఆ మాటలేవీ అర్థం కాకపోయినా వాళ్లకు తెలిసిందొక్కటే. 5 రూ॥లు ఇవ్వకుంటే గుడిసెలు పీకేస్తారని. "దొర నీకాల్మొక్త పట్టు పట్టుమంటే అయిదు రూపాయిలాణ్ణుం చొస్తయుంద్రి. జర సబర్ చేయుద్రి పైలీకి వసూలు చేసి ఇస్తం, జర మెహర్బానీ ఉంచుండి గరీబోల్ల మీద. ఎట్లనన్న చేసి ఇస్తం గాని గుడిసెలు పీకించకుండి, నీ కాల్మొక్తం, మేమొచ్చి నప్పుడు ఈడ ఒక్క బంగ్లనన్న లేకుండె, అసలు ఇల్లున్నాదుండి. మేమే గుడిసలేస్కున్నాం. సరేనండి పైలికి పైలికి తెచ్చిస్తం కావాల్నంటే పేర్లు రాస్కపొండి" అని గుంపులో నుండి బాలయ్య సమాధానం ఇస్తాడు.

నిజానికి ఆ భూమి ఎవరిదో ఎవరికీ తెలియదు. ఆ ప్రాంతాల్లో ఉన్న పెద్దమనుష్యులుగా చలామణీ అవుతున్న కొందరు వ్యక్తులు, వారి తాబేదార్లు అమాయకులైన రిక్షా వాళ్లను మోసం చేసి భూమిని లాక్కునే ప్రయత్నం చేస్తారు.

బాలయ్యకు పరిస్థితి అంతా అగమ్యగోచరంగా కన్పిస్తుంది. నిజాం పరిపాలన పోయినా కూడా తమ బతుకుల్లో మార్పేమీ రాలేదని అనుకొంటాడు. బాలయ్యకు తన పల్లె జీవితం గుర్తుకు వచ్చింది. తన తండ్రి ఒక వెట్టి మాదిగ. దొరలకు, అధికార్లకు వెట్టి చేసుకొని ప్రాణాలు వదిలాడు. బాలయ్య, అతని అన్న కొమరయ్య కూడా తండ్రినే అనుసరించారు. అదే సమయంలో ఊళ్లోకి సంఘం వచ్చి వెట్టిచేయొద్దని దొరల దౌర్జన్యాన్ని అరికట్టాలని ప్రబోధించారు. అన్నదమ్ములిద్దరూ సంఘంలో కలిసి వెట్టిని మానుకున్నారు. కూలీ పని చేసి పొట్ట పోసుకుంటున్నారు. భూములు పంచుతామని కొందరువచ్చి దొరల పొలాలను పంచారు. అట్లా బాలయ్యకు కూడా నేల చెక్క వచ్చింది. పోలీసులు వచ్చి కొమరయ్యను కాల్చి చంపి బాలయ్య పొలాన్ని తీసుకున్నారు. పోలీసుల సాయంతో దొరలు పల్లెల్లోకి వచ్చి తిరిగి దౌర్జన్యాన్ని సాగించారు. బాలయ్యను జైల్లో వేసారు. జైల్నుంచి వచ్చి తల్లిని, పెళ్ళాన్ని తీసుకొని పట్నానికి వస్తాడు. పల్లెల్లోని ప్రజలు పట్నాలకు ఏరకంగా తరలింపబడతారో బాలయ్య కథ ద్వారా తెలుస్తుంది. అటువంటి కథే పుల్లయ్యది కూడా! అతనికీ కొంత భూమి ఉండేది, ఒక సన్నాసాయన వచ్చి ఉన్నోండ్ల దగ్గరున్న భూములను తీసుకొని లేని వారికి దానం చేసి వెళ్ళిపోయాడు. అతను వెళ్లింతర్వాత సర్కారోళ్లు వచ్చి మళ్లీ ఆ భూమిని లాక్కున్నారు. దొర పుల్లయ్యను చావగొట్టిండు. ఆ రకంగా బ్రతుకుతెరువు కోసం పట్నంలోకి వచ్చి పడ్డాడు పుల్లయ్య; నగరంలో కూడా గరీబోళ్లు బ్రతుకలేరని, తమ వంటి వాళ్ల కోసం ప్రభుత్వం ఏ మాత్రం సహాయం చేయదని వాపోతాడు.

"గరీబోల్లు బతుకాల్నని ఎవరనుకుంటాన్రే నీ పిచ్చిగాని. గిదంత ఉన్నోల్ల దున్యా. మోటర్ గాడిలోల్లకోసం సడకు లేస్తాన్రు, బిజ్లిగోలాలు పెడ్తాన్రు, నల్లలు, మోరీ లేస్తాన్రు, మరి గరిబోల్లకేం పెడతాన్రో చెప్పు; గుడిసె లేసుకున్నందుక్క రంగుపూసె, లంబర్లేసి పాయో. ముర్కిపాలిటోడు టొక్కులు గుంజుతుండు. ఒక నల్ల పెట్టిండా? ఒక బిజ్లి గోలపెట్టిండా? టొక్కులేమో ఈడగుంజే! బిజ్లిగోలలాడపెట్టే" అనుకుంటూ ఈ బతుకు కంటె నిజాం సర్కారు బతుకె బాగుండేది అన్న నిర్ణయానికి వస్తారు. ఎత సంపాదించినా అప్పుల వాళ్లు గద్దల్లాగా తన్నుకుపోతారు. గొడ్లకన్నా వేళకింత తిండి దొరుకు తుంది కాని గరీబోనికి కూడు దొరకడం కష్టమైపోయిందనే జీవితసత్యాన్ని బాలయ్య తెలియ జేస్తాడు. పంటలు గరీబోల్లు పండించినా, బంగ్లలు గరీబోల్లు కట్టినా, కార్ఖానాల్ల గరీబులు పనిచేసినా వీళ్లకు తిండి దొరకదు.

పోచయ్య భార్య లక్ష్మి అపస్మారక స్థితిలో పడి ఉండటంతో పోచయ్యకు దిక్కుతోచని స్థితిలో ఉన్నప్పుడు ఒక బైరాగి అతనికి గంజాయిచ్చి, మాయమాటలు చెప్పి అతన్ని బొంబాయి తీసికెళ్తాడు. పోచయ్య గుడిసె ఖాళీగా ఉండటంతో ఆ గుడిసెలోకి ఎవరువచ్చినా ఉస్మాన్ దానికి నూరు రూపాయలు అడ్వాన్స్‌గా ఇవ్వమంటాడు. ఆమాట వినంగానే రిక్షా వాళ్లందరూ ఉద్రేకంతో వణికిపోతారు. వాడికి అసలు పైకమే ఇచ్చేది లేదంటూ "గరీబోల్లు మర్ల పడ్డరంటే; నీ తల్లి.. యాడపోతడే ఉస్మాన్‌గాడు. వాడి హడ్డీ నరమ్ చేస్తే పాకిస్తాన్ల పడాతో" అని అందరూకల్సి అతన్ని ఎదుర్కొనేందుకు నిర్ణయించుకుంటారు.

ఇంతలో బాలయ్యకొడుకు రాములు, పక్కింటి శాంతతో ఇంట్లోంచి పారిపోయి బొంబాయి రైలెక్కుతాడు. అక్కడ ఒక బట్టలమిల్లులో పనిచేస్తుంటాడు. తనలో ఉన్న బలహీనతల్ని జయించు కొనే, అన్యాయాన్ని ఎదుర్కొనే ధైర్యం వస్తుంది. మిల్లు కార్మికులు అతణ్ణి

నాయకునిగా గుర్తిస్తారు. ఒకసారి పత్తి కొరత సాకు మీద యాజమాన్యం కొందరి కార్మికుల్ని పన్లోంచి తీసివేసినపుడు సమ్మె చేయించాడు. సమ్మె విజయవంతంగా ముగిసి, యాజమాన్యం కాళ్ల బేరానికి రాక తప్పలేదు. ఈ సంగతులన్నీ ఉత్తరం ద్వారా తెలియజేస్తాడు రాములు.

గుడిసెల ఉన్నోళ్లు పైకం ఇవ్వటం మానివేయగానే, ఉస్మాన్ రౌడీలను పంపిస్తాడు. రౌడీలకు, రిక్షా వాళ్లకు పోట్లాట జరుగుతుంది. దాంట్లో కొందరు వయసుమళ్లిన వాళ్లు పైసున్నోని తోని లడాయి మంచిది కాదని చెప్తారు. "పైసున్నోడైతే పల్లకి ఎక్కి ఊరేగమను. పేదోల్లమీద జలుంచేస్తడా? ఉఖ్డాయిస్తడు. ఉఖ్డాయిస్తుడంటె గుడిసెల్ని కాదు నిన్ను కూడా ఉఖ్డాయిస్తుడు. జాగెవనిదో ఎరికె లేదాయె నేను పుట్టక ముందునుంచే ఉంటాన్నరాయె. ఆడి జాగైతే ఇన్నాళ్ల సంది ఎందుకురాడాయె. దొంగలు! యాడికి చాలదు. బంగ్ల మీద బంగ్లా కడ్తాడు. గుడిసెలున్నోళ్లే ఎల్ల గొట్టేటందుకు చూస్తరు. ఏమున్నాకాని గుడిసెల్నుంచి పోయేది లేదని" తీర్మానించుకుంటారు.

ఉస్మాన్ గుండాలు ఒక రాత్రి గుడిసెలముందరకు వచ్చి గలాబాచేస్తుంటారు. కర్రల్తో గుడిసెల్ని చిన్నాభిన్నం చేస్తూ "రండిబే మందిజాగల్ల ఉంటార్ర, ఎల్లండి మొగోల్లైతే, తడాఖా తెలుస్తది ఉస్మాన్‌సాబ్‌ది". అంటూ వారిగుడిసె తలుపుల్ని బాదేస్తుంటారు. వారిని ఎదుర్కొన్నారు ఒక్కసారిగా గుడిసె ప్రజ! కారపు నీళ్లు ఆడవాళ్లు కొట్టడం, కర్రల్తో మగాళ్లు బయటికి రావడం ఒక్కసారే జరుగుతుంది. వస్తాదుల కళ్లలో కారం పడి కళ్లు మండుతాయి. చీకటిలో అయోమయంగా ఎటుపోవాలో తోచక వాళ్లలో వాళ్లే గుద్దుకుంటారు. వాళ్లను చావబాది పంపిస్తారు రిక్షా వాళ్లు. ఈ సంఘటన తర్వాత కొందరు భయపడి ఐదు రూపాయలివ్వటానికి నిశ్చయించుకుంటారు. ఆ రకంగా గుడిసెల వాళ్లు రెండువర్గాలుగా చీలిపోతారు. సబ్ ఇన్స్పెక్టరుకి విషయం

తెలుస్తుంది. ఈ ఇన్స్పెక్టరు శ్రీనివాసరావు నగరంలో మూడు బంగ్లాలు కట్టిన వాడు. జవాన్లతో రాళ్లు మోయిస్తాడు. వెట్టి చేయిస్తాడు. చీరెలు కూడా ఉతికిస్తాడని జనం చెప్పుకుంటారు. అతడు పిచ్చయ్యను పిలిచి లీడరీ చేస్తున్నావని మందలిస్తాడు. ఆ జాగ ఉస్మాన్‌దా అని పిచ్చయ్య అడిగిన ప్రశ్నకు కాగితాలున్నా యంటూ, దాని అనుభవించెందుకు మీకు హక్కు లేదంటూ, మీతల్లులు ఉస్మాన్ దగ్గర పడుకుంటే పుట్టార్రా మీరు అంటారు. ఆ మాటవినంగానే పిచ్చయ్య పిచ్చివాడైపోతాడు. ఏ తిట్టైనా భరించవచ్చుగాని తల్లికి సంబంధించిన తిట్టును విని తట్టుకోలేక పోయాడు. మీ అమ్మ అటువంటిదేమో మా అమ్మనే అంటవుబే అని చొక్కాపట్టుకులాగుతాడు. శ్రీనివాసరావు అతన్ని గొడ్డును బాదినట్టు బాత్తాడు. వాంతిచేసుకుంటాడు. లాకప్‌లో పడేస్తారు పిచ్చయ్యని.

బాలయ్యపై దుర్మార్గులు తలమీద దెబ్బలు వేస్తారు. అతనికి ఆపరేషన్ అవసరమౌతుంది. గూడెంలో ఈ వార్త గుప్పుమంటుంది. అందరూ బాలయ్య జిందాబాద్ అంటూ కేకలు వేస్తారు. గూడెంలో పైకం సంగతి, భూమి సంగతి పేపర్లో పడుతుంది. విషయం తెలుసుకున్న రాములు యస్.ఐ.తో వివరంగా మాట్లాడుతాడు, ఆపరేషన్ చేసిన డాక్టర్ రిషావాళ్లకు మద్దతునిస్తూ నగరం యావత్తు ఉడికిపోతుందని, ఈ విషయంలో ఏమైనా తలకిందులుగా జరుగుతే కమీషనర్ వరకు వెళ్తుందని చెప్తాడు. చివరకు పిచ్చయ్యను, బాలయ్యను జైలునుంచి వదిలేస్తారు. శ్రామిక వర్గ సమస్యలు ఈరకమైనవైతే కల్తీచేసి కాంట్రాక్టర్లు, ఇంజనీర్లు డబ్బు ఎలా కూడబెట్టు కుంటున్నారో రాజారావు పాత్ర ద్వారా వెల్లడి వుతుంది.

బొంబాయి నగరంలో జరుగుతున్న మోసాలు, దొంగ వ్యాపారాలు, స్మగ్లింగ్ మొదలైన వన్నీ బైరాగిద్వారా, పోచయ్య ద్వారా రచయిత వివరిస్తాడు. నగరాలలో ఎక్కడైన ఇటువంటి మోసాలు,

అఘాయిత్యాలు సర్వసాధారణమైనవని ఈ నవల ద్వారా రచయిత చూపాడు.

మంచితనం, మానవత్వం తప్ప జీవితంలో మరేవీ గెలుపును సాధించవని రచయిత ఉద్దేశ్యం. కిరాతకులు ఎంత ధనవంతులైనా జీవితంలో చివరకు ఓడిపోక తప్పదని నిరూపించారు. ప్రస్తుత వ్యవస్థలోని లోపాల వల్లే యిన్ని సమస్యలు ఉత్పన్నమవుతున్నాయని. రచయిత ఉద్దేశం. దీన్లో కొంత చారిత్రక కథలతోపాటు తెలంగాణా పండుగలు, కూడా చోటుచేసు కున్నాయి. కొంత కాల్పనికత నవలలోచోటు చేసుకున్నా ఆనాటి నగర జీవితాన్ని, సామాజికతను రచయిత చూపడం మాత్రం తిరుగులేని నిజం.

## జనపదం :

1948 సెప్టెంబర్‌లో హైద్రాబాద్ సంస్థానంలోకి యూనియన్ పోలీసు, మిలటరీ ప్రవేశించాయి. గ్రామాలు వదిలిపెట్టి పారిపోయిన జాగిర్దార్లు, దేశ్‌ముఖ్‌లు, పటేళ్లు, పట్వారీలు మొదలైన వాళ్లంతా కాంగ్రెసు జెండా నీడ కింద తిరిగి తమ తమ స్థానాల్లోకి వచ్చారు. దోపిడీ, అరాచకత్వం ఎక్కువైంది. ఫ్యూడల్ దోపిడీ కొత్తముసుగు వేసుకుని ప్రత్యక్షమైంది. అందుకే ప్రజలు గొర్రెల **తినేవాండ్లు పోతే** బర్రెల దినే **వాండ్లు** వచ్చిర్రు; అని మండి పడ్డారు. 1948 నుండి 62దాక జరిగిన సంఘటనలకు సన్నివేశాలకు రంగాచార్యుల **జనపదం** నవల దర్పణం పట్టింది.

కమ్యూనిస్టు పార్టీతో పని చేస్తున్న వీరభద్రం సమకాలీన పరిస్థితులను గమనిస్తూ ఆయుధాలను విసర్జిస్తాడు. ఆ సమయంలోనే ప్రభుత్వం 1951లో ఎన్నికలు ప్రకటిస్తుంది. 1952లో జరిగిన మొదటి సాధారణ సార్వత్రిక ఎన్నికల్లో బలరామయ్య కుతంత్రాలు, మోసాలు, కుట్రలతో ప్రజల్ని మోసంచేసి మభ్యపెట్టి తను గెలవాలనుకుంటాడు.

అయినా అతని పథకం విఫలమై వీరభద్రం చేతిలో ధరావత్తు కోల్పోయి చిత్తుగా ఓడిపోతాడు.

ఎన్నికల్లో గెలిచానని వీరభద్రానికి పెద్ద సంతోషం ఏమీ వుండదు. శాసన సభలో జరుగుతున్న శుష్క చర్చలూ, మోసాలు, మారుతున్న, మారిన పరిస్థితుల్ని చూసి నిరాశపడ్డాడు. ఒకప్పటి దొరలే మరో రూపంలో శాసన సభకు వచ్చారని బాధపడ్డాడు. దానికి తోడు ప్రజల్లో పేరుకొని పోతున్న స్వార్థబుద్ధికి వీరభద్రం వ్యథ చెందుతాడు. ప్రజలు మళ్లీ మత్తులోకి వెళ్లిపోతున్నారని, తమ కర్తవ్యాన్ని విస్మరిస్తున్నారని వాపోతాడు. జనపదం నవలలో చిత్రింపబడిన ప్రజల జీవన్మరణ పోరాటాన్ని గమనిస్తే పాతరోజులు ఎంతోమంచివిగా తోస్తాయి. ఎందుకంటే ఒకనాడు నిజాం ఫర్మానాలే వరుమానాలు. రాజకీయోద్యమాలు నిప్పచ్చరమైన కాలం. బాధలబరువు మోసి మోసి విసిగి వేసారిన దిక్కుమొక్కులేని జనం ఒక్కొక్కరు ఒక అగ్ని కణంగా మారి నైజాం పాలనని కూలదోసిన శుభ ఘడియలవి. ఈ చారిత్రక సన్నివేశం తలచుకుంటే గుండె చెరువై భయంకరమైన ఆలోచనలు మనసును గడ గడలాడిస్తాయి. ఆ వికృత రూపమే మళ్లీ మరో రూపంలో స్వాతంత్ర్యానంతరం కూడా నాట్యం చేస్తుందంటే కారణం ఎవరు? ఏమిటి? దీనికి జవాబు **జనపదం** నవల. తెలంగాణా విముక్తికి తర్వాత పాత సారాని కొత్త సీసాల్లో అందిస్తున్న మన దేశ వాళీ రాజకీయాలు ప్రభావాన్ని వివరిస్తున్న గాథ[7] అని జనపదం నవల గురించి వేమూరి వెంకట్రామయ్య అంటారు.

ఈ నవలలో అధికారమార్పిడి వచ్చింది బొమ్మకు బొరుసుకు తేడా లేని పరిస్థితి ఏర్పడి ప్రజల్లో అశాంతి, అవినీతి, దారిద్ర్యం మళ్లీ ప్రారంభమయ్యాయి. ప్రతి ఊర్లో కొత్త దొరలు, వారికి అండగా గుండాలు, పాతరోజులకు, ఇప్పటికి ఏమీ తేడాలేదనిపిస్తుంది వీర

భద్రానికి. అందుకే స్నేహితుడు మస్తాన్‌తో మనం దొరల మీద దండెత్తాం. వారిని ఓడించాం. భూములు పంచాం అది సులభంగానే చేశాం. కాని వీళ్లు అలాకాదు మేక తోలు కప్పుకున్న పులులు. వీరు ఒక్క సారే చంపరు. ఎందుకంటే వారికి వీరితో పని ఉంది. ఓట్లు కావాలి అందుకోసం మెల్ల మెల్లగా చంపుతారు. తాము చంపుతున్నామని తెలియనీరు. ప్రజలను మత్తులో ఉంచటంవారి ధ్యేయం. దాన ధర్మాలు, మహాత్ములు, మతాలు, బైరాగులు వారికి ఆయుధాలు, అవి ఆయుధాలని ఎవరికీ తెలియనీరు అన్న మాటల్లో చారిత్రక సత్యం ఇమిడి వుంది.

ఈ నవల్లో ఆంధ్రప్రదేశ్ అవతరణ, కార్మికుల సమ్మెవంటి విషయాలు కూడా రచయిత ప్రస్తావించారు. కార్మికుల సమ్మెలో వీరభద్రం గాయపడ్డాడు. స్వాతంత్ర్యం వచ్చినా అది భూస్వాములకే కాని సామాన్య మానవులకు మాత్రం కాదు. తిరిగి రెండవ సాధారణ ఎన్నికలు జరిగినపుడు వీరభద్రం స్థానాన్ని రామయ్య ఆక్రమించుకుంటాడు. ప్రజలను పూర్తిగా మత్తులోకి దింపి ఓట్లు కొనడం పరిపాటైపోయింది దేశంలో! ఈ ఎన్నికల గొడవల్లో ఎందరో అమాయక ప్రజలు ప్రాణాలు విడుస్తారు.

రామయ్య విమలమ్మ భూములు కాజేస్తాడు. తన బండారం ఎప్పుడైనా బయట పడుతుందన్న భయంతో తనకు ప్రమాదం ముంచుకొస్తుందని ఆలోచించి ఆ రహస్యం తెలిసిన పరాంకుశరావును హుసేన్ చేత హత్య చేయిస్తాడు. ఈ పరాంకుశరావు హత్య మత కలహాల ఫలితం అని వెల్లడి అవుతుంది. మతం పేరిట భాగ్యనగరంలో హిందూ ముస్లిం ప్రజలకు కలహాలు ఆనాటి నుండి ఈనాటి వరకూ జరుగుతూనే ఉన్నాయి. పరాంకుశరావును ఒక ముస్లిం చేత చంపించడం విశేషం. ఒక మతంవాడు మరొక మతం వాణ్ణి చంపాడు. ఈ మతం వారు రెచ్చిపోయారు. కాదు రెచ్చగొట్టారు. హైద్రాబాద్ మత కలహాలకు

అగ్నిపర్వతంలాంటిది. అది ఎప్పుడూ రాజుకుంటూనే వుంటుంది. ఇప్పుడు బ్రద్దలైంది అంటారు రచయిత ఈ సన్నివేశంలో. తెలంగాణాలో మత సమస్య కూడా ఒక పెద్ద సమస్య. నిజానికి అది పాలకులకు ఆయుధంగా సాయపడ్తుంది. ఇప్పటికీ ఆ సమస్య పోలేదు. అవకాశవాదుల కది తోడ్పడుతూనే ఉంది. రాజకీయాలకు మతం అవసరం లేదు. అయినా అదొక సాకుగా ఎన్నో హత్యలు, ఘోరాలు ప్రపంచ చరిత్రలో జరిగాయి. ఈ నవల్లో కూడా మస్తాన్, పరాంకుశరావు హత్యలు అలాంటివే. ప్రతి ఏడు జరిగితీరాల్సిన దుర్ఘటనల్లో హైద్రాబాద్ మత కలహాలు కూడా ఒకటిగా వుంది.

భాగ్యనగరంలో జరుగుతున్న ఈ సంఘటనలే కాక విద్యా సంస్థల్లో నేడున్న అశాంతి, అల్లర్లు, లోపించిన క్రమశిక్షణ, రకరకాల రాజకీయాలు, లక్ష్యశుద్ధి లేకపోవడం మొదలైన అంశాలు కూడా ఈ నవలలో చోటుచేసుకున్నాయి. ఈ నవలలో గ్రామ జీవితం, నగర జీవితం రెండూ కన్పిస్తాయి. జరిపిన దౌర్జన్యాల వల్ల గ్రామాల నుండి పారిపోయినదొరలే నేడు భారత ప్రభుత్వ రక్షణతో ఖద్దరు బట్టలు ధరించి ప్రభుత్వ యంత్రాంగంలో భాగంగామారిపోయి గ్రామాలకు వచ్చి తిరిగి అదే దౌర్జన్యాల్ని కొనసాగిస్తున్నారు.

**బతుకు :**

డబ్బుకేగాని జీవితంలో మరిదేనికీ విలువలేని సమాజానికి దర్పణమే యం.వి. తిరుపతయ్య బతుకు నవల. సమాజంలో ఒక వర్గం వాళ్ల బతుకుతున్న బతుకును బతుకుతో చేస్తున్న పోరును ఈ నవలలో చూడవచ్చు.

ప్రతి రైతులాగే రామలింగడు కూడా ఒక పల్లెటూళ్లో పది గుంటల భూమితో తన సంసారాన్ని సాఫీగా సాగిస్తుంటాడు. ఇతని భార్య గౌరమ్మ భర్తకు అన్ని పనుల్లో సహాయ పడుతూ వేడి నీళ్లకు చన్నీళ్లుగా

భర్తకు చేదోడు వాదోడుగా ఉంటుంది. వారిద్దరికి ఇద్దరు ముగ్గురు పిల్లలు పోయింతర్వాత పుట్టిన భిక్షపతంటే పంచప్రాణాలు. అయిదవ తరగతివరకు చదివిన భిక్షపతి పెద్ద జీతగాడై తల్లి తండ్రుల్ని ఆదుకుంటున్న సమయంలో వారి జీవితమంతా తారుమారైంది. వాళ్ల ఊరికి ఒక పార్టీ వచ్చి యువజన సంఘాన్ని తెచ్చి ప్రజల్లో చైతన్యాన్ని కల్గించారు. ఆ ఊరి యువకులతో సభలూ సమావేశాలూ ఏర్పాటు చేసి వారికెన్నో కొత్త విషయాలు తెలియజేసారు. దున్నేవాడిదే భూమి అని, పనిచేసే వాళ్లే దేవుళ్లని, కులం మతం లేవని ఇలా ఎన్నెన్నో విషయాలను వివరించారు. సంఘం వాళ్లంతా కలిసి భూస్వాముల్ని, షావుకార్లని బెదిరించి అవసరమొచ్చినపుడు దెబ్బలు వేయడానికి కూడా వెనుకాడలేదు. అదే సమయంలో పోలీస్‌వ్యాన్ వచ్చి యువకుల్ని పట్టుకొని వ్యాన్‌లో ఎక్కించుకున్నారు. దాన్లో భిక్షపతికూడా ఉన్నాడు. సంఘం పెట్టినోళ్లు మాత్రం పారిపోయినారు. పార్టీవాళ్ల ఆచూకీ చెప్పమని వసూలు చేసిన డబ్బు ఏంచేసారని ప్రశ్నిస్తూ హింసించారు. వారం రోజులుగా ఆ హింసలను భరించిన భిక్షపతి ఇంటికి వచ్చిరాకమునుపే మళ్లీ లాకప్‌లోకి తోయబడ్డాడు. సంఘంతో తనకే మాత్రం సంబంధంలేకున్నా పోలీసులు తనను వెంబడిస్తూనే ఉంటారన్న నిజాన్ని అతడి కుటుంబం తెలుసుకుంటుంది. అందుకే రామలింగడు తన కొడుకు భిక్షపతి జీవితమే ముఖ్యమని, అతను బతికుంటే అదేపదివేలని తను ప్రాణంగా చూసుకుంటున్న భూమిని సైతం వదిలి నగరానికి వచ్చి స్థిరపడ్డాడు. నగరంలో దేవయ్య సహాయంతో కూరగాయల బండిని ఇల్లిల్లూ తిప్పుతూ కుటుంబాన్ని పోషిస్తాడు. ఆ రోజు నుండీ వారి నగర జీవితం ప్రారంభమౌతుంది. రామలింగనికి నగర జీవితంలో కూడా మార్పేమీ కన్పించలేదు. దోపిడీ తన కళ్లముందే జరుగుతున్నా నిస్సహాయుడై చూస్తున్నాడు. మనీ రోలింగ్ బ్యాంక్ ద్వారా సర్దారు చేస్తున్న మోసాల్ని చూస్తూ తమ జీవనాధారానికి అతడే దిక్కుకాబట్టి

అతన్ని ఎదిరించే సాహసం చేయలేడు. ఈ సర్దార్ పేదవాళ్లకే కాక పెద్దలకు కూడా సన్నిహితుడే. మున్సిపల్ చైర్మన్‌కు, తదితర నాయకులకు కూడా మిత్రుడు. రామలింగడు ఎంతకష్టం చేసినా, సర్దార్ బాకీ తీరేమార్గం కన్పించదు. అప్పు వసూలు విషయంలో సర్దార్ చాలా నిక్కచ్చి మనిషి. పైసలు ఇయ్యని వాడిని ఇంటికి పంపించకుండా తన ఇంట్లోనే వెట్టి చేయించుకుంటాడు. మల్లిగాడనే ఒకణ్ణి ఇట్లానే హింసిస్తున్నప్పుడు, అతని భార్య తన మెళ్లో ఉన్న తాడును పుటుక్కున తెంపి పుస్తెను సర్దార్ చేతిలో ఉంచుతుంది. అది తీసుకునే మల్లిగాణ్ణి విడిచి పెడ్తాడు. ఆ దృశ్యాన్ని చూసిన రామలింగనికి నరనరాల్లోను భయం చేరుకుంటుంది. తన ఒక్కడి సంపాదనకు అప్పు తీరేది కష్టమని చెట్టంత కొడుకు తనకు సాయంగా లేడని విచారిస్తాడు. విషయం తెల్సుకున్న దేవయ్య భిక్షపతికి రిక్షాను కుదిరిస్తాడు. తన గారాబుపట్టి రిక్షా లాగడం ఇష్టంలేక పోయినా కుటుంబ పరిస్థితి దృష్ట్యా రాజీపడక తప్పలేదు. భిక్షపతి సంపాదనతో తిరిగి తమ జీవితాల్ని నిలబెట్టుకుంటున్న సమయంలో విధి వక్రించి వారి జీవితాల్ని చిన్నా భిన్నం చేసింది. నగరంలో బంద్ కారణంగా రిక్షాలన్నీ బంద్ పెట్టాలని చెప్తున్న ఒక యువకుని మాటలను వింటున్నంతలోనే పోలీసులు వచ్చి తమ లాఠీలతో వీపు చిట్లేట్లు కొట్టి విడిచిపెడ్తారు. పుట్టిన ఊరు వదులుకొని కడుపు చేత్తో పట్టుకొని ఒక్కగానొక్క కొడుకు కోసం పోలీసు వాళ్ల బారి తప్పించుకోడానికి ఇంతదూరం వచ్చినా, ఇక్కడా అటువంటి పరిస్థితే ఎదురౌతుంది. తను తప్పుచేయకున్నా తనకు ఏ పార్టీతో సంబంధం లేకున్నా నిష్కారణంగా తనను హింస పెడ్తున్న పోలీసుల అన్యాయాన్ని సహించలేక పోతాడు భిక్షపతి.

భిక్షపతి కోలుకోవడానికి వారం రోజులు  పడ్తుంది. పరిస్థితి మళ్లీ మొదటికి వచ్చి దాచుకున్న డబ్బంతా మందులకు ఖర్చై సర్దారు కిస్తుకి పైసా మిగలదు. ఆ విషయంలోనే సర్దార్ మనిషికి, భిక్షపతికి

మాటా మాటా పెరిగి కొట్టుకునే వరకు వెళ్తారు. ఆ రకంగా సర్దార్ ద్వేషాన్ని పెంచుకున్నాడు. ఒక్క భిక్షపతి సంపాదనతోనే ఇల్లు గడుస్తున్న సమయంలో పదిహేనురోజుల్లోపే భిక్షపతికి పార్టీతో సంబంధం ఉన్నదంటూ తిరిగి జైల్లోకి తోస్తారు. ఇది సర్దార్ పనే అని తెలిసి కొంత పైకం ఇచ్చి తిరిగి సర్దార్‌కాళ్లు పట్టుకొని భిక్షపతిని విడిపించే ప్రయత్నంచేస్తారు దేవయ్య, భిక్షపతి తల్లి దండ్రులు మళ్లీ తమ పల్లెకు పోయే ప్రయత్నంలో ఉంటారు. ఈ మధ్య కాలంలో వీళ్ల సుఖ దుఃఖాలని, వీళ్ల జీవితాల్ని దగ్గరగా చూస్తున్న దేవయ్యపై రాయలింగని కూతురు మల్లి మనస్సు పెంచుకుంటుంది. భిక్షపతి విడుదలై తిరిగి రిక్షా తొక్కడం ప్రారంభిస్తాడు. జైలు నుంచి విడిపించిన భిక్షపతితో దేవయ్య రెక్కాడితే డొక్కాడని పేద వాళ్లకు కోపం ఉండకూడదని, దాని వల్ల జీవితాలే నాశనం అవుతాయని హితబోధ చేస్తాడు. తన కుటుంబంకోసం అన్నింటిని వదులుకోవటాన్కి సిద్ధ పడ్డాడు భిక్షపతి మామూలుగా రోజులాగే రిక్షా లాగుతూ తన కంతగా పరిచయంలేని ఒక వాడలో ఒకదాదా దౌర్జన్యానికి ఎదురు తిరిగి అతన్ని చిత్తుగా తంతాడు. అతడు ఆ ఏరియాలో చాలా పేరు మోసిన దాదా. అతన్ని ఈ రకంగా నడి బజార్లో తన్నడం వేరే దాదాకి చాలా సంతోషం కల్గుతుందని ఒక రిక్షా వాడు చెప్పి, భిక్షపతిని తమ గ్రూపులో కలువ మంటాడు. ఈ దాదాలు, గ్రూప్‌లు ఏవీ భిక్షపతికి తెలియదు. కష్టం చేసుకునే వాడికి వీళ్లతో ప్రమేయమేమిటో అర్థంకాదు. కొందరు ఈ గ్రూప్‌లో కలువమని మరికొందరు సర్దార్ వైపు పొమ్మని తోచిన సలహాలను ఇస్తుంటారు. ఎంత ఆలోచించినా ఎవరికో ఒకరికి తలవంచాల్సి రావడంతో, అది తన వ్యక్తిత్వానికే విరుద్ధంగా తోస్తుంది. ఏ తప్పుచేయకుండా గులాంగిరీ చేయడం తనకిష్టంలేదు. అందుకే తను ఒంటరిగా పోరాడడానికి నిశ్చయించుకుంటాడు. భిక్షపతి ఇట్లా ఆలోచించుకుంటుండగనే విషయం చైర్మన్ వరకు వెళ్తుంది. భిక్షపతి గుడిసె పీకేయమని ఆర్డర్ జారీచేస్తాడు. వాటన్నిటిని మాఫి

చేయడానికి భిక్షపతి సత్తిదాదా కాళ్లపైనపడితే తప్ప వీళ్ల కష్టం తీరదని స్నేహితులు చెప్తారు. ఆ మాటలు విన్న భిక్షపతి ఎవరికీ చెప్పకుండా ఇంట్లోనుండి వెళ్లిపోతాడు. భిక్షపతి పారిపోయాడని తెలిసి సర్దార్ మరీ ఉగ్రుడవుతాడు. ఒక్కరోజులోగా అతన్ని అప్పగించకపోతే గుడిసె పీకేస్తానని భిక్షపతిని తిరిగి మళ్లీ జైల్లో పట్టిస్తానని బెదిరిస్తాడు. ఒక రోజంతా భిక్షపతి ఎవరికీ దొరక్కుండా తిరుగుతాడు. ఇరువైపుల వాళ్లు తమ గ్రూపులో కలవమని అతనికి నచ్చజెప్తూనే ఉంటారు. రామలింగు గుడిసె పీకి వేయకుండా అడ్డుపడేందుకు పేటలోని ప్రజలందరూ ఏకమౌతారు. సర్దార్ మున్సిపాలిటీ జవాన్లతో రామలింగు గుడిసె పీకేసినట్లు, ఆ గుడిసె ప్రాంతమంతా అల్లర్లతో నిండిందని స్నేహితుడొచ్చి చెప్పేసరికి భిక్షపతి తన తల్లి దండ్రుల దగ్గరికి వెళ్తాడు దారిమధ్యలోనే నలుగురు యువకులు అతన్ని చుట్టుముట్టి ఇనుపరాడ్లతో అతనిపై బడతారు. వాళ్ల చేతిలో నుంచే ఒక రాడ్ తీసుకొని నలుగురిలో ఒకణ్ణి చంపేస్తాడు భిక్షపతి. కాని మరుక్షణంలోనే ముగ్గురు అతన్ని రాడ్‌లతో బాది చంపేస్తారు. ఇక్కడ భిక్షపతి చనిపోవడం, అక్కడ గుడిసెపీకివేయడం ఒకేసారి జరుగుతుంది. బిక్షపతి మరణాన్ని వీర మరణం అని పేర్కొంటూ, గుడిసెవాళ్లందరూ అతని మరణంతో ఏకమయ్యారు. మొట్ట మొదటి సారిగా అన్యాయాన్ని ఎదుర్కొని రౌడీయిజం నశించాలని వడ్డీ వ్యాపారం నశించాలని, రౌడీలను, బద్మాష్‌లను పోషించే వాళ్ల అంతం దగ్గర్లోనే ఉందని నినాదాలు చేస్తూ భిక్షపతి అమర్‌హై అని అతన్ని కీర్తిస్తూ శవయాత్రకు బయల్దేరతారు. ఆ రకంగా భిక్షపతి జీవితం ముగిసింది.

రామలింగు, గౌరమ్మా కొడుకుపోయిన దుఃఖంతో బతుకుపై విరక్తిని పెంచుకుంటున్న సమయంలో దేవయ్య వారిని ఆదుకుంటాడు. తాము పల్లె నుండి వచ్చినప్పటి నుండి ఇప్పటి వరకు తమ బాగోగుల్ని

చూస్తున్న దేవయ్యకు తమ కూతురునిచ్చి పెళ్లిచేసి అతని రుణాన్ని తీర్చుకుంటారు. కూతురి అన్యోన్య దాంపత్యంలో వారి బాధను మరిచిపోయి తిరిగి తన బ్రతుకును సాగిస్తాడు రామలింగు.

ఈ నవల్లో నగర జీవితానికి సంబంధించిన రిక్షా కార్మికుడి జీవితం వివరించబడింది. నగరంలో బ్రతకటానికి కూడ ఒక్క శరీరకష్టమే చాలదని, భిక్షపతిపాత్ర తెల్పుతుంది. నగరంలో జీవించే ప్రతివ్యక్తి జీవితం నగర రాజకీయంతో ముడివడి వుంటుందని దోపిడీ వాళ్లకు సైతం రాజకీయ మద్దతు ఉంటుందని ఈ నవల్లోని పాత్రలు తెలియజేస్తాయి. ఎంత కాయకష్టం జేసినా ఎవరికో ఒకరికి లొంగి ఉండక పోయినట్లైతే బతుకు ఉండదు. ఈ నవల్లో ఒకే వాడలో ఉంటున్నా ఎవరికి వారు తమ స్వార్ధంతో, తమ బలహీనతతో సర్దార్‌ను ఎదిరించడానికి ప్రయత్నించరు. మొట్టమొదటి సారిగా భిక్షపతి ఆ ప్రయత్నం చేసాడు. భిక్షపతి గుడిసె విషయం వచ్చేసరికి అది అందరి సమస్య అయింది. సర్కారు భూమిని అధికారంతో తనచేజిక్కించు కోవాలనుకున్న సర్దార్‌ని ప్రతిఘటించడానికి ఏకమయ్యారు. ఇక్కడ వ్యక్తి చైతన్యం నుంచి సమిష్టి చైతన్యం ఏర్పడింది. ఆ చైతన్యం సముద్రంలా ఉప్పొంగినపుడు సర్దార్ లాంటి వాణ్ణి, సత్తిదాదా లాంటి వాణ్ణి, చైర్మన్ లాంటి వాణ్ణి పూచికపుల్లలా తీసిపారవేస్తారు. నగరంలోని బడుగు వర్గాల బతుకును, వారి బతుకు పోరును ఈ నవల తెలియ జేస్తుంది. ఈ నవల్లో రిక్షా వాళ్ళంతా ఏకం కావడం సర్దార్‌ని ఎదురించటం వంటి సంఘటనలు రంగాచార్యగారి **మాయజలతారు** నవల్లో కూడా చూస్తాం. ఈ రెండు నవలల్లో రిక్షా వాళ్ల జీవితం కళ్లకు కట్టినట్టు చిత్రించారు రచయితలు. తెలంగాణ నగరజీవితాన్ని పరిశీలిస్తే హైద్రాబాద్ సంస్థానంలో జరిగిన ఫ్యూడల్ వ్యవస్థ విధానంలో నాయకులు అరాచకాల్ని రాజకీయ కుయుక్తులతో, తమ చాకచాక్యంతో ప్రజల్ని తమ వైపు తిప్పుకునే

కుతంత్రాలన్నీ ఈ నగరాల్లో చూస్తుంటాం. పార్టీల పేరుతో, తమ ప్రతిష్ఠలకు భంగం కలుగకుండా తమ పదవి నిలబెట్టుకోవడం కోసం అమాయక ప్రజల్ని పావులుగా చేసుకుని చదరంగపు ఎత్తుల్ని వేస్తూ ఈ నాయకులు ప్రజా స్వామ్యపు రాజ్యాన్ని ఏలుతున్నారు.

తెలంగాణా నవలలని చెప్పుకున్న **యుగసంధి, మోదుగుపూలు, జనపదం** మొదలైన నవలల్లో నగరంలో వున్న కాంగ్రెస్ పార్టీ. ఆంధ్రమహాసభలు, వాటిలో చీలికలు, కమ్యూనిస్టు పార్టీ ఏర్పడటం తెలంగాణా సాయుధ పోరాటంగా మారడం, పోలీస్‌చర్య జరగటం, చివరికి ఆంధ్రప్రదేశ్ అవతరించటం, ఇదంతా ఒక క్రమమైన పద్ధతిలో ఒక భాగంగా మనకు దర్శనమిస్తాయి. స్వాతంత్ర్యానంతరం పల్లెల్లో పట్టణాల్లో ఎంతో మార్పువస్తుందనుకున్న ప్రజల ఆశ నిరాశే అయ్యింది. గాంధీ టోపీపేరుతో పటేళ్లు పట్వారీలు రాజకీయ నాయకులై మళ్లీ పల్లెల్లో అవతరించటం జరిగింది. నగరంలో కమ్యూనిస్టుపార్టీ బలం సన్నగిల్లటంతో నక్సలైటు ఉద్యమం ప్రబల సాగింది. ప్రజలు మళ్లీ డబ్బుకు ప్రలోభ పడుతున్నారు. తిరిగి అదే బానిసత్వంలోకి నెట్టబడుతున్నారు. డబ్బు మత్తుమందులా పనిజేసి, సమాజాన్ని నిద్రపుచ్చే స్థితికి తీసుకువస్తున్నారు. రాజకీయ నాయకులు స్వలాభం మాత్రమే చూసుకోవడంతో పేదలు మరీ నిరుపేదలుగా, ధనవంతులు మరీధనవంతులుగా అయ్యే అవకాశాలు ఎక్కువయ్యాయి. ముఖ్యంగా పల్లెల్లో బ్రతుకుతున్న ప్రజలలో ఏ మార్పు రాలేదు, ఏరాజకీయ నాయకుడు వాళ్ల నాదుకోలేదు. వాళ్ల పరిస్థితులు నిజాంకాలంలో కంటే దారుణంగా ఉన్నాయి. అందుకే వాళ్లు **గొర్లతినేవాడు పోతే బర్ల తినేవాడొచ్చిండని** వ్యాఖ్యానించారు.

గ్రామాల్లో ఇటువంటి పరిస్థితులు నెలకొంటే, నగరాల్లో వాటికేమి తీసి పోమన్నట్టుగా కుట్రలు, మోసాలు, అన్యాయాలు జరగడం

రెండింతలు ఎక్కువగానే కనిపిస్తాయి. పల్లెల్లో వున్న దొరలు పట్నానికి పారొచ్చి కాంగ్రెస్ నాయకత్వంతో సురక్షితులై తిరిగి గ్రామాల్లోకి వెళ్లడం, ప్రజల్లో కమ్యూనిస్టు పార్టీపై నమ్మకం సన్నగిల్లడంతోకొందరు యువకులు నక్సలైటు ఉద్యమంవైపు ఆకర్షితులవడం, మొదలైన విషయాలని చిత్రించిన నవల రంగాచార్యగారి జనపదం. ఈ నవల 1960 నుండి 70 వరకు హైద్రాబాద్ నగరంలో నెలకొన్న పరిస్థితుల్ని తెలియజేసింది. నక్సలైటు ఉద్యమం ఒకవైపు కొనసాగుతుండగా మరొకవైపు తెలంగాణ వేర్పాటు ఉద్యమం ప్రారంభమైంది. 69-72 వరకు జరిగిన ఈ వేర్పాటు ఉద్యమంవల్ల ఆనాటి తెలుగుదేశంలో కనిపించిన వాతావరణాన్ని నవీన్ రచించిన **ముళ్లపొదలు** నవల మనకళ్లముందుంచు తుంది. ఈ నవలలో వేర్పాటు ఉద్యమానికి ముఖ్య కారణమైన నిరుద్యోగ సమస్య ఈ నవల్లో చోటు చేసుకుంది. తాత్కాలికంగానైనా సరే ఈ ఉద్యమం ఎందరో యువకుల్ని ప్రభావితంజేసింది. కాలేజీలో చదువుకున్న విద్యార్థులు డిగ్రీలు సంపాదించుకుని బైటిప్రపంచంలోకి అడుగు పెట్టారు. డిగ్రీలు అన్నం పెట్టలేవన్న నిజాన్ని తెలుసుకొని తమ బ్రతుకు తెరువుకోసం సమాజాన్ని ప్రశ్నిస్తారు. బ్రతుకు తెరువు సమకూర్చలేని సమాజం ఏరకంగా వుందో **ముళ్లపొదలు** నవలలో చూడవచ్చు.

ఈ నవల కూడా **అంపశయ్య**లాగే పదహారు గంటలతో కథ నడుస్తుంది. అంపశయ్య కూడా నగర పరిస్థితుల్ని ముఖ్యంగా యూనివర్సిటీలలో జరుగుతున్న గందరగోళాన్ని ఆ నాటి రాజకీయ ప్రభావాలు యువకులపైన ఎలా ప్రసరించాయో తెల్పింది. అంపశయ్య **చైతన్య స్రవంతి**గా పేర్కొన్నా అందులోని పాత్రలు, సంఘటనలు దేశకాల పరిస్థితుల్ని తెల్పుతాయి. అంపశయ్య కొనసాగింపే ముళ్లపొదలు అని చెప్పవచ్చు. యూనివర్సిటీ హాస్టల్లో ఏ బరువు బాధ్యతలు లేకుండా తల్లి

దం(డులు తమ కష్టార్జితాన్ని పంపిస్తే జల్సాగా ఖుషీగా కాలంగడుపుతూ ఆనాటి రాజకీయాల్లో జరుగుతున్న మార్పులను ఆకళింపుజేసుకుంటూ ఎం.ఏ చదువుతున్న యువకులు **అంపశయ్యలో** కనిపిస్తే, ఆయువకుల్లో ఐదుగురు ముఖ్య పాత్రలుగ, నిరుద్యోగ అన్వేషకులుగా **ముళ్లపొదలులో** దర్శనమిస్తారు.

దీంట్లో ప్రముఖ పాత్రలు రవి, రమేశ్, వేణు, సాగర్, నిధి ఈ ఐదుగురు సమాజాన్ని ఒక్కొక్కరు ఒక్కొక్క దృష్టితో చూస్తారు. రవి ఉద్యోగాన్వేషణలో వున్నప్పుడు సిఫార్సుకని ఒక రాజకీయ నాయకుని ఇంట్లోకి వెళ్తాడు. అక్కడ జరుగుతున్న రాజకీయ రహస్యాలు తెలుసు కుంటాడు. ఎన్నో వాస్తవాలను గ్రహించి తనలో వున్న రచయిత ద్వారా ఆ వాస్తవాల్ని బైటి ప్రపంచంలోకి తెచ్చే ప్రయత్నం జేస్తాడు. చివరికి రచయితగా మారుతాడు. **విప్లవం జయించి తీరుతుంది. నక్సల్‌బరీ లోను, శ్రీకాకుళంలోను పొడసూపిన అరుణోదయం భారతదేశమంతా** విస్తరిస్తుంది అని పలికే వేణు క్రాంతి సంస్థలో ముఖ్యుడుగా వుంటాడు. వేర్పాటు ఉద్యమంలో పాల్గొన్న యువకులందరిని తమ విప్లవంవైపు మళ్లింప జేయవచ్చునను కొన్నాడితడు. ప్రత్యేక తెలంగాణా రాష్ట్రాన్ని ఆకాంక్షిస్తున్నవాడు. అతనికి తెలంగాణా ఉద్యమంలో ఒక విప్లవం కనిపిస్తుంది. క్రాంతి సంస్థలో అధ్యక్షుడు, మరికొందరు వేర్పాటు ఉద్యమం సరైనది కాదని, మన విప్లవానికి సమైక్యత అవసరమని విశ్వసించడంతో వేణు, అతని అనుచరులు దాన్ని సాగనివ్వకుండా జేస్తారు. వి.వి. కాలేజీ గ్రౌండ్స్‌లో ఉపన్యసిస్తున్న వేణును పోలీసులు అరెస్టు చేస్తారు. విప్లవాన్ని పీల్చి, విప్లవాన్ని తాగి, విప్లవాన్ని తిని బతుకుతున్న విప్లవం జైలుకుపోతుంది. జనం ఇళ్లకు చేరుకుంటారు. **అందుకే విప్లవం రాగానే ఈ సమాజం అంతా క్షణంలో మారిపోతుందను కోవడం భ్రమ ... విప్లవం వచ్చిన తర్వాత కూడా ఈ సమాజాన్ని నిజమైన**

సోషలిస్ట్ సమాజంగా మార్చడానికి కొంత టైమ్ పడుతుంది అని వేణుని చూసినప్పుడల్లా అనుకునే వాడు రవి....

యూనివర్సిటీలలో ప్రొఫెసర్లు జేసే దుర్మార్గాల్ని వారి అవసరాల కోసం ఆశలు చూపించి యువతరాన్ని ఎలా పక్కదారి పట్టిస్తున్నారో రమేశ్ పాత్రద్వారా బట్టబయలు జేసారు నవీన్. స్టేట్స్‌కి వెళ్లడమే గమ్యంగా భావించే రమేశ్ తన ప్రొఫెసర్ చేస్తున్నది అన్యాయమని తెలిసినా నిజాయితి పరుడైన ఒక లెక్చరర్‌పై అభాండం సృష్టించినపుడు సాక్షి అవుతాడు.

సాగర్ ప్రత్యేక తెలంగాణా ఉద్యమంలో పనిచేస్తూ ఒక మహానాయకుడితో వాగ్వివాదం జేసి అతన్ని అసెంబ్లి సభ్యత్వానికి రాజీనామ ఇవ్వమని డిమాండు చేస్తాడు. తనకు ఉద్యోగం రాకపోవటానికి ఆంధ్రావాళ్లే కారణమని వీళ్లు లేకుంటే ఏ కలెక్టరలో, ఏ తహసీలుదారో, ఏ పోలీస్ సబ్‌ఇన్స్‌పెక్టరో అయ్యి ఉండే వాడినని అనుకుంటూ ప్రత్యేక తెలంగాణోద్యమంలో ఉన్న సాగర్‌కు నాయకులు మినిస్టరు పదవి ఆశ చూపిస్తారు. ఆ రకంగా సాగర్ ఉద్యమం సాగరంలో కలసిపోయింది...

జీవితంలో ఎప్పుడు థ్రిల్ కోసం వెదుకుతూ, థ్రిల్ లేని జీవితం చాలా డల్ అని ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజీ క్యూలో నిలబడ్డ నిధికి నిధి దొరకకున్నా కనీసం డొక్కలో ఇంత తిండి లేదు. కాల్చడానికి ఒక సిగరెట్టు ముక్కలేదు. ఐనా థ్రిల్ కోసం పార్టీచేసుకుంటున్న ఒక ఫ్రెండ్ దగ్గరకు వెళ్లి కిక్ కోసం త్రాగి దాంట్లోనే మునిగి ఉస్మానియా హాస్పిటల్‌లో తేల్తాడు.

ఈ ఐదు పాత్రలేకాక ఎన్నో ఉపపాత్రలు కథను నడపడానికి దోహదం చేసాయి. ఈ ఐదుగురి ద్వారా సమాజ స్వరూపంగోచరిస్తుంది.

నిరుద్యోగ సమస్య నుండి ఉత్పన్నమైన వేర్పాటు ఉద్యమాన్ని ఆధారంగా తీసుకొని రచించిన ఈ నవలలో అతివాద వామ పక్ష ఉద్యమం కూడా చోటు చేసుకుంది. ఈ నాటి యువతరాన్ని వేధిస్తున్న అనేక రాజకీయ ఆర్థిక, సాంఘిక సమస్యలతో బాటు అడుగడుగున ముళ్ల పొదల్తో నిండిన నేటి సమాజం దీంట్లో కనిపిస్తుంది. యువత ఒక లక్ష్యం లేకుండా ఎందుకుంటారా అని ఆలోచింప చేసే నవల ముళ్ల పొదలు....

ఈ ప్రత్యేక తెలంగాణోద్యమం ఒక పాలపొంగులాంటిది. సెలయేరు పరుగు లాంటిది. దీని వెనుక ఒక సిద్ధాంతం లేదు. ఒక నిర్దిష్టమైన లక్ష్యం లేదు. పాలక వర్గాల పంపకాలు సరిగ్గా కుదిరితే, ఈ ఉద్యమం వెంటనే అడుగిడుతుంది. ఇది ప్రజా ఉద్యమం కాదు, ప్రజల్ని తప్పుదారి పట్టించే ఉద్యమం, ప్రజల్ని చీల్చే ఉద్యమం. తెలంగాణావాడు, రాయలసీమ వాడు అన్న సంకుచిత మనస్తత్వంతో ఆలోచిస్తున్నవారి మెదడు ఇంకా బాల్యావస్థలోనే ఉందని తెలియజేస్తుంది. దేశంలో ఉన్న వాళ్లంతా మనుష్యులే. వాళ్లందరు ఇంకా స్థిరంగా వున్న ఫ్యూడల్ వ్యవస్థ చేతిలో నలిగి పోతున్న వారే ఈ విషయాన్ని ప్రభంజనం అనే పాత్రద్వారా యువకులకు తెలియజేస్తూ పాఠకులకు ఉద్యమ వైఫల్యాన్ని సూచిస్తాడు రచయిత[8] ఈ విషయం చరిత్ర ఋజువుచేసింది కూడా.....

దొరతనం సాగినంతకాలం పల్లెల్లో దోపిడీ చేసి ఆపిమ్మట నగరాల్లో నాయకులుగా పరిణమించి ఎలా దోపిడీ చేశారో; ప్రజలు అటు పల్లెలో దోపిడీకి గురయి బతకలేక పట్నం చేరితే అక్కడ సైతం దోపిడీకి గురికాక తప్పని దుస్థితిని రచయితలందరు రకరకాల కోణాల నుండి ఈ నవలల్లో చిత్రీకరించారు.

## కార్మిక జీవితం

తెలంగాణలో ఉవ్వెత్తున లేచిన రైతాంగ పోరాటాల నేపథ్యంలో వచన సాహిత్యం ముమ్మరంగా చెలరేగింది. మౌఖిక, మాండలిక సాహిత్యాలలో రచయితలు చెప్పుకోదగ్గ విజయాలు సాధించారు. వచన సాహిత్యం, పేదరైతాంగంనుండి, అసంఘటిత రైతాంగ ప్రజానీకం నుండి, గని కార్మికుల సంఘటిత శక్తిని చిత్రీకరించే పరిణామంలోకి ఎదిగింది.

ఆ నాటి నైజాం తెలంగాణా పోరాటంలో కేవలం భూమి పోరాటం మాత్రమే ఉంది. కాని ఈ నాటి తెలంగాణా పోరాటం పారిశ్రామిక రంగాలకు కూడా విస్తరించింది. ఆ నాడు లేని పరిశ్రమలు ఈనాడు ఎంతో అభివృద్ధి చెందాయి. ముఖ్యంగా తెలంగాణాలో బొగ్గు పరిశ్రమ అభివృద్ధి చెందింది. సింగరేణి, గోదావరిఖని, బెల్లంపల్లి మొదలైన చోట్ల ఈ బొగ్గు తవ్వకం పరిశ్రమలు ఉన్నాయి.

ఈ బొగ్గు బావికార్మికుల్లో తెలంగాణా భూస్వాముల **భూదాహం** వల్ల భూములను కోల్పోయి విధిలేక కార్మికులుగా మారిన వాళ్లే ఎక్కువ. ఉన్న ఆ కాస్త భూమిని కూడా పోగొట్టుకొని ఊరు తరుముతుండగా బతుకు తెరువు కోసం ఈ బొగ్గు బావిలోనికి వచ్చి పడినవాళ్లు. అయితే ఈ బొగ్గు గనుల్లో పరిస్థితులు ఊర్లో వున్న వాటి కంటే దుర్భరంగా, దారుణంగా, భయంకరంగా కన్పిస్తాయి కార్మికులకి. **భూమి కడుపులో గాలి, వెలుతురు లేని వర్కింగ్ ప్లేసుల్లో భరింపరాని వేడితో రక్తమాంసాలు కుత కుత ఉడికిపోతున్నా .......... కాల్చిన యినుప ముక్కలపై నుండి సుర సుర జారే నీటి చుక్కల్లా కార్మికుల** శరీరాల మీద నుండి చమట బిందువులు రాలి పడుతుంటే, కడుపులోని పేగులు నోట్లోకి రాగా రెక్కలు, ముక్కలు చేసుకొని, మృత్యువుకోరల్లో లక్షల టన్నుల బండ కింద చచ్చిన చావెరుగక, బతికిన బతుకెరుగక బొగ్గు తిని బొగ్గు విసర్జిస్తూ వాళ్ల రక్త మాంసాల్ని టన్నుల కొద్దీ బొగ్గు రూపేణ

టబ్బుల్లో నింపడం తప్ప వారికి దోపిడీ స్వరూప స్వభావాలు తెలియవు అర్ధపూట లీవ్ కోసం ఒదిగి ఒదిగి అగడటం తప్ప హక్కులు తెలియవు. ....... కార్లో వచ్చే దొరలు బూతులు తిడుతుంటే పిడికిళ్లు బిగించి కుత కుత లాడటం తప్ప సంఘటితంగా అదేమిటని అడగడం తెలియదు. బండ కూలి తమ వాళ్లు చనిపోతే కుమిలి, కుమిలి ఏడ్వడం తప్ప కుప్ప కూడి సేఫ్టీ గురించి డిమాండ్ చేయడం తెలియదు అని అల్లం రాజయ్య గారు వారిని పరిచయం చేసారు.[9]

పల్లెల్లో ఏ దొరల దౌర్జన్యానికి బలైపోయినారో, వేటిని తప్పించు కునేందుకు పట్నం వచ్చారో అదే జులుం ఈ బొగ్గు గనుల్లో వారికి వేర్వేరు రూపాల్లో కన్పించింది. ఈ పరిస్థితిని మార్చుకునేందుకు వారు సిద్ధపడ్డారు. పోరాడడం నేర్చుకున్నారు. ఈ పోరాటాన్ని కార్మికులు పల్లెల నుండే నేర్చుకున్నారు. ఆ రకంగా బొగ్గు గనుల్లో నిప్పు రవ్వలు పడ్డాయి. మెల్ల మెల్ల గా నిప్పు రాజుకోవటం ప్రారంభమైంది. కార్మికుల పరిస్థితుల గురించి, గాలి, వెలుతురు అనే కనీస అవసరాల గురించి, పిల్లలకు బళ్లు. నీళ్లు, నివాస స్థలాల గురించి, ఖాళీ టబ్బుల సప్లయి గురించి, అధికార్ల జులుంకు వ్యతిరేకంగా సమ్మెలు చేయటం ప్రారంభించారు. ట్రేడ్ యూనియన్ దొంగ రాజకీయాలను బట్టబయలు చేశారు. అటువంటి సమయంలోనే కార్మికుల్లో సంచలనం కలుగచేసే కార్మిక పాటలు ప్రచారంలోకి వచ్చాయి.

పల్లె పల్లెన పోరు బాటలు! ఎర్రని శ్రీకాకుళము!

నాడు అచ్చట రగిలిరగిలి! నేడు యిచ్చట మండుతుంది!

పోరుబాటల పోదామా! బావయో బంగారయో!

మరి ఎర్ర తోవల పోదామా! ధీరుడో గనికార్మికా!

అన్న పాటతో ప్రతి కార్మికుడు తన అనుభవాన్ని జోడించుకుంటూ పాటలను రూపాంతరం చేసారు.

సింగరేణి కంపెనీ లో సితుక బడ్డ బతకులోడ!

ఒక్కటయ్యి నడవరో బరిగీసి నిలువరో; అన్న పాట ప్రతి కార్మికుని నోట నానింది.

వీరు బొగ్గు బావిలో పని చేస్తూ తమ శక్తినంతా ధారవోసి ఇవతలికి తీసే బొగ్గు సమయానికి అవసరమైనప్పుడు వారిది కాకుండా పోతుంది. బొగు బావుల్లో పని చేసే వాళ్ల ఇళ్ళలో కుంపట్లో బొగ్గు వుండదు. చుట్టు పక్కల ఎక్కడ పడేతే అక్కడ బొగ్గు కుప్పలు కన్పిస్తున్నా తమ అవసరానికి దాన్ని తోసుకొనే అధికారం వారికి లేదు. తాము సృష్టించిన వస్తువే తమకు కాకుండా పోతున్న దుర్భర స్థితిలో ఈ కార్మిక వర్గం జీవించటం కన్పిస్తుంది.

కార్మికుడు సామాజికమైన కాయకష్టం ద్వారా ఉత్తత్తి చేసిన వస్తువు ఉత్పత్తి పూర్తి కాగానే తనది కాకుండా పోతుంది. యజమానికి చెంది లాభాలు తెచ్చి పెడుతుంది. తాను తయారు చేసిన వస్తువుని కార్మికుడు తానే కొనవలసి వస్తుంది. అంటే వాడకం దారుగా, అంటే తనదానికి తాను దూరమై, తనదే తనకు పరాయిదై పోతుంది. పైగా అలా అయ్యాకదాని ఆధిక్యానికి తానే బలి అవుతున్నాడు. లేదా లోబడక తప్పటం లేదు. అది తన చెయ్యిదాటి తనదని చెప్పుకోదగిన స్వతంత్రతను కోల్పోతుంది. శ్రమ ఫలితం యజమానికి లాభాన్ని, ఉత్పత్తిదారునికి నష్టాన్ని కల్గిస్తుంది[10].

ఈ దారుణాల్లోంచి పుట్టినవే కార్మిక పోరాటాలు. తమ సమస్యల పరిష్కారానికి అక్కడి బొగ్గుబావి కార్మికులు సమ్మెలు

కడ్తున్నారు. కార్మిక గనుల్లో యజమానుల, కార్మిక వ్యతిరేక ధోరణిని, ట్రేడ్‌యూనియన్ల యాజమాన్య అనుకూల విధానాన్ని నిరసిస్తూ, వ్యతిరేకిస్తూ సమ్మెలు చేస్తూ పురోగమిస్తున్నారు. ఈ పోరాటాలు పోలీసుల నిర్బంధం మధ్య సమ్మెలను కొనసాగించడాన్ని, విజయాలను సాధించడాన్ని బలపరిచాయి. అయితే ఈ విజయాలు శాశ్వితమైనవి కావని యాజమాన్యం, ప్రభుత్వం, పోలీసులు వాటిని భగ్నంచేసే ప్రయత్నాలు జరుగుతాయని కార్మికులకు తెలుసు. అందువల్ల తమపోరాటం. చివరగా కార్మిక రాజ్యం వచ్చేవరకు కొనసాగుతుందన్న అవగాహనతో దీర్ఘకాలిక పోరాటానికి కార్మికులు సన్నిద్ధమై ఉండాలనే అంశంతో అనేక కథలు, నవలలు వెలువడ్డాయి. కథలు వచ్చినా 1985 వరకు బొగ్గుగనుల కార్మిక జీవితం నవలా సాహిత్యంలో ప్రవేశించలేదు **సింగరేణి కార్మికుల ఈ అన్నిరకాల పోరాటాన్ని అందులోని ఆటుపోట్లను బయటి ప్రపంచానికి తెలియజేయాలనీ** పోరాటంలో తలెత్తుతున్న అన్ని రకాల సమస్యల స్వరూపాన్ని అర్థంచేసుకోవడానికి, తమ సోదరులకు అర్థం చేయించాలనే లక్ష్యంలో చాలా సాహిత్యం వచ్చింది. అందులో నవల కూడా! ఈ నవలలు కార్మికుల గుండె చప్పుళ్లు. కార్మికుడు ఒక్కడూ కాదు, ఇద్దరూ కాదు, వేలాది కార్మికుల ప్రతిరూపం. జీవితం వాళ్లకు పోరాటం నేర్పింది. పోరాటం వాళ్లను రచయితలను చేసింది.[11]

శ్రమ బ్రతుకులో ఒక భాగం ఎలా అయిందో, జీవితాల్లో ఎలా ఇంకి పోయిందో శ్రమదోపిడి కోర ఎలా విస్తరించిందో తెలిపే నవలలు ఆర్.యస్. పవన్‌కుమార్ గారి వల్లవజ్రం జాతశ్రీగారి సింగరేణి **మండుతోంది** మొ॥వి. ఇవి కార్మిక సమస్య ప్రధానంగా గైకొని చిత్రించిన నవలలు. అనారోగ్య వాతావరణమైన బొగ్గు బావుల్లో పనిచేసి శారీరకంగా మానసికంగా ఓపికలను కోల్పోతూ ప్రమాదాలకు గురౌతూ ప్రాణాలను

కూడా కోల్పోతుంటారు. చివరకు తమ భద్రత కోసం బ్రతుకు కోసం విముక్తి కోసం పోరాటమార్గాలను పట్టిన కార్మికుల స్వభావాన్ని ఈ నవలలు శక్తి వంతంగా చిత్రించాయి.

నల్లవజ్రం రచయిత బొగ్గు గనుల్లో సగటు కార్మికుడు ఎదుర్కొంటున్న పరిస్థితులు ఇతివృత్తంగా తీసుకున్నారు. ఈ నవలలో ముఖ్యంగా జీవితంలోని పెనుగులాట కనిపిస్తుంది. "వారి జీవితం కన్నీళ్లతో తడిసి ఉంది. నెత్తురు, చెమట కలిసి వికసిస్తుంది. వారి బ్రతుకు అనేక కష్టాల మధ్య రూఫ్‌కూలి బొగ్గుపెళ్లల మధ్య గొంతుదాకా కూరుకు పోయినగని కార్మికుని లాగా ఉంది. అందులోనే పెనుగులాట వెతుకులాట ఉన్నాయి. ఈ రచయిత వారి జీవితాన్ని బ్రతుకు చేన్ల నుండి నల్లరేగళ్ళ నుంచి, అడవినుంచి, గాలి నుంచి, వెన్నెల నుంచి పందుల గుడిసెల మురికి కూపంలోకి మందువాసన, రాకాసి బొగ్గు పొక్కలోకి తోయబడింది. వారి బ్రతుకు ఊపిరాడని యంత్రాల మధ్య నలిగి చెమటలోకి రక్తం మరిగే బొగ్గు పొరల్లోకి వలసవచ్చింది" అని వారిని అల్లం రాజయ్య పరిచయం చేస్తారు.

సాదాసీదా పల్లె జీవితం నుండి వచ్చిన శంకరయ్య తన కాళ్లు గుంజడానికి తన ఇంటికి బొగ్గుబావి దూరంగా ఉండటమే కారణ మనుకున్నాడు. శంకరయ్య కాళ్ల రెక్కలు గుంజుతున్నందుకు కంపెనీ ఏరియా హాస్పటల్‌కి వెడతాడు.

ఈ గని కార్మికులకు ప్రభుత్వం కల్పించే సదుపాయాలు కూడా సరిగా అందవు. ఉదాహరణకి ఆసుపత్రిలో వివిధ రోగాలతో, బాధలతో లైనులో నుంచున్న సామాన్య కార్మికుణ్ని కాదని ఆఫీసరు, వారి పరివారాన్ని చూసి, వారితో గంటలకొద్దీ బాతాఖానీ పెట్టే డాక్టర్లు తమ

కనీసమానవతా ధర్మాన్ని, వృత్తి ధర్మాన్ని మరిచిపోవడం జరుగుతుంది. (పేజి 12, 13) వారి దృష్టిలో కార్మికుల జీవితాలకు అసలు విలువే లేదు. శంకరయ్య దగ్గరి బావికి బదిలీ కావడానికి అన్ని రకాల లీడర్లకూ చెప్పు కున్నాడు. లీడర్లు **కర్రవిరుగదూ పాముచావదు** అన్నట్టుగా వ్యవహ రిస్తుంటారు. ఆ విషయాన్ని కదిపినప్పుడు ఎద్దు **ఎగురంగనే గంటె గుర్తాదివయా!** (పేజి - 40) అంటూ నానుస్తుంటారు. మొదట బావిపనికి సైకిల్ తొక్కడమే గగనమౌతున్న శంకరయ్యకు యూనియన్ ఆఫీసు చుట్టూ తిరగడం వల్ల మరింత శ్రమ పడవలసివచ్చింది. ఐనా ఫలితం శూన్యమయింది. చివరకు మేనేజరు ప్రాణాపాయ స్థితిలో ఉన్నప్పుడు శంకరయ్య నెత్తురు ఇవ్వడానికి సిద్ధపడ్డాడు. ఇతర కార్మికులు ఇవ్వకూడదు అని చెప్పినప్పుడు **ఇస్తే ట్రాన్స్‌ఫర్ చేయించుతనన్నడే** అని వెల్ఫేర్ ఆఫీసర్ చెప్పిన విషయాన్ని వాళ్లకు తెలిపాడు. కార్మికులందరూ ఆలోచించి ఒప్పుకుంటారు. చివరకు తన రక్తమిచ్చినా ట్రాన్స్‌ఫర్‌ను సాధించుకోలేక పోయాడు. నెత్తురిచ్చిన ఆరు నెలలకు కూడా తన సంగతి ఏమీ తేలక పోయే సరికి కార్మికులందరు అతనికి అండగా నిలబడి తమలో ఒకనిగా కలుపుకున్నారు. శంకరయ్య సరైన మార్గమెంచుకొని పిడికిలెత్తే సరికి బావి బందైంది. వాదనకు దిగిన పోశంను, శంకరయ్యను పోలీసులు కట కటాలలోకి తోసారు. అన్యాయంగా వాళ్లని జైల్లో వేసారని వారిని బావి మీదికి తీసుకు వచ్చి విడిచిపెడితేనే తప్ప, బావులకు దిగేది లేదని తెగేసి చెప్పేసారు. **చిలికి చిలికి గాలివానైంది. గాలివాన పెద్దదయింది. సమ్మె మొదలైంది.**

ప్రతిరోజూ వేలమంది, కార్మికులతో కల కలలాడే ఈ బావులు వెల వెల బోయాయి. అధికారుల యూనియన్ లీడర్ల మాటలు ఎవరూ

లక్ష్యపెట్టలేదు. వాల్‌పోస్టర్లతో, కరపత్రాలతోటి వెంట వెంట సమాచారం బావులపైకి చేరవేస్తూ ఎప్పుడూ లేనంతగా ఉద్రిక్తతను కార్మికులు కలిగించారు. ఆశ చూపించిన యూనియన్ ప్రతినిధిని పట్టుకొని కార్మికులు బూట్ల దండ మెడలోవేశారు. ఇట్లా ఏడు రోజులు సాగిన ఈ సమ్మె వల్ల అధికారులు నష్టపోయారు. అయిష్టంతో కార్మికులను వదిలే యాలని నిర్ణయించారు. ఈ రకంగా సాదాసీదా పల్లె జీవితం నుండి వచ్చిన శంకరయ్య ఆ తరువాత కార్మికులతో కూడి సంఘటిత శక్తిగా మారాడు. జైల్లోకి వెళ్ళిన శంకరయ్యలో చాలా మార్పు వచ్చింది. పోలీస్ స్టేషన్‌లో పదిమందిని చూసిన శంకరయ్యకి లోకం తెలిసొచ్చింది. అతని పరిస్థితి కొండనాలుకకు మందుకావాలని పోతే ఉన్న నాలుక ఊడినట్లయింది. పిల్లి పట్టిన కోడిపిల్ల తీరుగ ఉన్న శంకరయ్య తరువాత భయాన్ని మరిచి పోయాడు. అతనికి చదువుకోవాలన్న తపన కూడా కలిగింది. అతనికిప్పుడు తనకాళ్లు గుంజాడు ఒక సమస్య కాదు శంకరయ్య ఇప్పుడు ఒక్కడు కాదు. కాళ్లు గుంజడానికి, ట్రాన్స్‌ఫర్‌కు ఉన్న సంబంధంకాక అసలు కిటుకేదో అతడు తెలుసుకున్నాడు. తన ప్రాణాల్ని పీల్చి పిప్పిచేస్తున్న రాకాసి బొగ్గు యజమానులకు ఎనలేని లాభాలు తెచ్చి పెడుతుందని గ్రహించాడు. చుక్క చెమట వోడవకుండా సర్వ సంపదలనూ హస్తగతం చేసుకొంటున్న శక్తులపై అతడు పిడికిలి బిగించాడు. అతడొక సంఘటిత కార్మిక శక్తిగా మారాడు. కార్మికు లందరికీ శంకరయ్య కళ్లు బొగ్గు పెళ్లల మధ్య అగ్గిలాగా కనిపిస్తున్నాయి. శంకరయ్యకు ఇప్పుడు కార్మికుల నిజమైన సమస్య ఏంటో తెలిసి వస్తుంది. సంపదను పుట్టించే వర్గం తామైతే, ఆ సంపదను అనుభవించే వర్గం వేరొకటని తెల్సుకున్నప్పుడు. తామందరూ ఒక సంఘటిత శక్తిగా

మారాలనుకున్నప్పుడు అతని మనస్సు తేలికయినట్లనిపించి ఒక్కనవ్వు నవ్వుతాడు. ఆ నవ్వు సంవత్సరాల తరబడి పేరుకుపోయిన మురికి చెత్త పెద్ద వరదలో కడిగివేసినట్లుగా, స్వేచ్ఛగా, హాయిగా కన్పించింది శంకరయ్య స్నేహితులకు!

పవన్‌కుమార్‌గారు వర్గాల పరస్పర సంఘర్షణ పరిస్థితులను, ప్రజల చైతన్యాన్ని బట్టి ఏ విధంగా మారుతుందో తెలియచేసారు ఈ నవలలో. ఈ నవలని పరిచయంచేస్తూ అభ్యుదయలో ఒక విమర్శకుడు గని కార్మికుల సమస్యలను విదితంచేస్తూ ట్రాన్స్‌ఫర్ సమస్య అంత బలమైంది కాదని చెబుతూ, ఒక్క శంకరయ్య ట్రాన్స్‌ఫర్ విషయంలో గొడవ జరిగి సమ్మె చేసేంత పరిస్థితి రాదని, ఇది చాలా అవాస్తవికంగా ఉందని రాశారు[12]. నాయకత్వం లేకుండా సమ్మె జరగడం నవల్లోనే జరుగుతుందన్నాడు. అయినా యూనియన్‌లో ఉన్న కార్మికుల సమస్య లలో శంకరయ్యది చిన్న సమస్యే కావచ్చు అయితే అన్ని సమస్యలకూ పరిష్కారాలు ఒకే విధంగా ఉండవు.

సమస్య చిన్నదా, పెద్దదా, అన్నది సమస్య కాదిక్కడ. ప్రతీ విషయాన్ని సమస్యగా చేస్తున్న యాజమాన్యంను ఎదుర్కొంటున్నారు. ట్రాన్స్‌ఫర్ విషయమే చాలా చిన్నదని, దానికి సమ్మెచేయడం అవాస్తవికంగా వుందని రాసిన దానికి విమర్శకులు ప్రతి స్పందించారు ప్రభాకర్‌గారు తమ వ్యాసంలో. సమ్మెచేయటం సమస్య ఉత్పన్న మవుతున్నప్పుడే జరుగు తుందని ఒక చిన్న యదార్థ సంఘటనని పేర్కొన్నారు. సింగిరేణి బొగ్గుగనుల్లో ఒక కార్మికుడు అపాన వాయువు వదిలిన నేరానికి

యాజమాన్యం అతన్ని ఎంత హింస పెట్టారో చెబుతారు. దానికి నిరసనగా కార్మికులందరూ యాజమాన్యం బాసిజాన్ని ఎదుర్కొనేందుకు సమ్మె చేసారు. ఇదిచాలా చిన్న సమస్య. శంకరయ్య ట్రాన్స్‌ఫర్ పెద్దదే అందుకే ఏ ఒక్కరి నాయకత్వము లేకుండానే చైతన్యవంతంగా సమిష్టి నాయకత్వంతో అప్పటి కప్పుడు వివిధ విషయాలపై జరిగిన సమ్మెలు సింగరేణి చరిత్రలో చాలా వున్నాయి. అయినా నాయకత్వం లేకుండా సమ్మె జరగుతుందనే సూత్రీకరణ నవలలో చిత్రీకరించడం అసహజంగా వుంది.

శంకరయ్య ట్రాన్స్‌ఫర్ సమస్య సమిష్టి సమస్యకాదు అన్నారు వేల్పుల! ప్రతి వ్యక్తిగత సమస్య కూడా సామాజిక సమస్యలో భాగం అనీ, ప్రతి సామాజిక సమస్య కూడా వ్యక్తిగత రూపంలోనే వ్యక్తీకరణ వుంటుందని మార్క్సిజం చెప్తుంది. దానికి ఉదా॥ ప్రభాకర్ గారు ప్రత్తిరైతుల ఆత్మహత్య ఉదంతాల్ని పేర్కొన్నారు. ఈ వ్యక్తి సమస్యలే సామాజిక సమస్యలై కూర్చున్నాయి.

ప్రపంచం అంతా సమిష్టి సామాజిక సమస్యలను తీసుకొని పోరాడి నందుకే మనదేశంలో కూడా ప్రసూతి సెలవులు, ఇతర సెలవులు పిల్లల, పెంపక కేంద్రాలు, ఏర్పాటు చేసారు. భార్యా భర్తల్ని సాధ్యమైనంత వరకు ఒకే ఊరికి ట్రాన్స్‌ఫర్ చేయాలని నిర్ణయించారు. ఇవన్నీ కార్మికులు, ఉద్యోగులు కల్సి పోరాడి సాధించుకొన్న విజయాలు.

ఏది ఏమైనా బొగ్గుని కార్మికులు బొగ్గుగనుల్లో ఏరకంగా సంఘటిత శక్తిగా మారాలో నల్ల వజ్రం నవలలో రచయిత

పరిచయంచేస్తూ కార్మికుల శరీరం రాకాసిబొగ్గుతో ఇడెవారిపోయింది. నెత్తురులో కలెగలిసి పోయింది. అంటే శ్రమ బ్రతుకులో ఒక భాగం ఎలా అయిందో మన జీవితాల్లో ఎలా ఇంకిపోయిందో ఈ నవల తెల్పుతుంది అని యం.వి. సుబ్బారాజు పరిచయంచేశారు. బొగ్గుగని కార్మికుని జీవన క్రమానికి, శ్రమదోపిడీకి ఒక క్రమం యంత్రాంగం, పద్ధతి, రాజకీయంతో కలగలిసి పోయిందని వివరిస్తారు. ఈ బొగ్గుగని కూడలి గనిలోని బొగ్గు పుట్టేపుడు కడుపుచించుకు పుట్టిన శిశువులా డొక్క చీల్చుకుని మరీపుడుతుంది. ఆ సమయంలో కార్మికులు ఎంతో అలజడి, ఒత్తిడిని సృష్టిస్తారు. ఆ సృష్టికార్యంలో బలవంతపు కాన్పులో పాల్గొనే వెల్పేరు యాజమాన్యం, ఆఫీసర్లు, మేనేజర్లు, ఇంజనీర్లు మొదలైనవారంతా ఒక వర్గమైతే ఓర్‌మెన్‌లు, సమస్త వృత్తులవాళ్లు, ఫిల్లర్స్ వీరిదొక వర్గం. ఈ రెండూ వర్గాలు పరస్పరం సంఘర్షించుకునే శక్తులు. ఇది ప్రధానరంగం, దీనికి అనుబంధంగా ఆస్పత్రులూ, బ్రాందిషాపులూ, సారాదుకాణాలు, గుడిసెలు, నీళ్లు, క్వాటర్లు, పిల్లల చదువులు, బడులు ఇలా ఈ సమస్యల హారం కళ్ల ముందుండి చూసే వాళ్లకి ఓ సత్యజిత్‌రే సినిమాలా ఉంటుందని పేర్కొన్నారు సుబ్బారాజు గారు[13].

బొగ్గు ఇంధనంగా మారడానికి విద్యుత్ కార్ఖానాలు, మరలు, సీలు, యంత్రాలు, ఎలా అవసరమో అలాగే కార్మికశక్తి సంఘటిత పడి ప్రశ్నించడం, ఎదిరించడం నేర్చుకోవాలి. దానికి వారికి సరియైన ప్రాపంచిక దృక్పథం రావాలి. ఇటువంటి ఉద్దేశంతో రాసిన నవల నల్లవజ్రం దానిలో తెలంగాణ భాష, సామెతలు, సంభాషణల్లో చోటుచేసుకుని నవలని రక్తి కట్టించారు.

## సింగరేణి మండుతోంది:

ఈ నవలలో ఆర్తి అందరిది. బాధ అందరిది. ప్రతి కార్మికునికి బొగ్గుగనుల్లో పనిచేయడం వల్ల తమ బతుకులు ఏరకంగా కొల్లగొట్ట బడుతున్నాయో తెలుసు. నవలలో ఒక ప్రధాన పాత్ర అంటూ లేదు పరిచయం చేయడానికి! ఎందరెందరో మనకళ్లముందు కన్పించి వారి విషాద గాథలను విన్పిస్తారు. అందరూ నిరుపేదలే. 1. దేశ్‌ముఖ్, జమిందారుల దోపిడిలో నలిగిపోయిన పేదలు 2. తెలంగాణ పీఠభూముల్లో కూటికోసం కూలి పేరుతో వెట్టి బతుకులు వెళ్లదీసిన పేదలు 3. అధికారుల అహంభావాల్లో కట్టు బానిసలుగా హాహాకారాలు చేసిన పేదలు 4. వారే తెలంగాణా అడవుల్లో అరుణ పతాకపు సారథ్యంలో నిజాం నిరంకుశత్వానికి నీళ్లు దొరక్కుండా చేసిన పేదలు 5. రైతాంగ సాయుధ పోరాటంతో కోటల గోడల్ని గజ గజలాడించిన పేదలు 6. ఆ పేదలే బొగ్గు గనుల్లో కూలీలై బతుకు ఈడుస్తున్నారు. వారు తమకి జరిగిన, జరుగుతున్న అన్యాయాల్ని చూస్తూనే వున్నారు. వారి జీవితాలపై పాటలు కట్టుకుంటున్నారు. పనులు చేసుకుంటూ పాటలు పాడుకుంటున్నారు. ఈ కార్మికుల పాటల్లో బొగ్గు గనుల్లో పనిజేసి కార్మిక జీవితం తొంగిచూస్తుంటుంది. ఉదాహరణకు:

**కోల్ కోలోయన్న కోలో**

**కోల్ కోలోయన్న కోలో**

**సింగరేణి కొలువు చూడరో - కోలో**

**బదిలీ మజ్దూరు బతుకు వద్దురో** అన్న పాట మజ్దూరు బతుకును భావంతో ప్రకటిస్తాడు. తనకు విశ్రాంతి లేదని, తన శ్రమకు విలువలేదని చెప్తూ

ఆరున్నర సీటిని - అన్నమున్న తినకుండ

గుసకొ్డుస్తూ - బదిలీకి నువ్‌బోతే

ట్రైమయ్యిపోయిందని - మజ్దూరన్నో, మజ్దూరన్నా

నీకు చార్జీటూ, సస్పెండూ - అని తన బతుకును, తన గుండెల్లో మండుతున్న, ఉద్వేగాన్ని, జీవిత సారాన్ని పాటలో దింపి నింపాడు. వెట్టికి ఎలా బలై పోతున్నారో చెప్తూ వెట్టి వినని వాడి గతిని

బాంచెనుదొరనకుండ సారని పిలిచావో

కిందమీద జూడ బెట్టె - ఎట్టి పనులు జెప్పెబట్టె

టిఫిన్లనే కడుగమంటడు. బూట్ల దుమ్ము దులిపిస్తడు

సెయ్యనని నువ్వంటె-మజ్దూరన్నో, మజ్దూరన్నా

ముప్పుతిప్పలునీకు

అనే వ్యంగ్యంతో పాటు, ఏడుపు, కసి, ఆరాటం, పోరాటం కలగలిపి పాటలో వివరిస్తారు.

అయితే ఎప్పటికీ కాలం ఒకటిగా వుండదు. కార్మికులకు అధికార్ల జులుం తెలిసొచ్చింది. దీన్ని అదుపు చేయకపోతే బతుకు వుండదన్న ఆలోచన వచ్చింది. వీళ్లలో పిరికి తనం పోయి పోరాటాన్ని సాగించేందుకు ముందడుగు వేసారు. ఎక్కడ చిన్న నిప్పు పడ్డా బాధలు రగులుకుంటూనే వున్నాయి. అధికార్లు ఎక్కడ కన్నెఱ్ఱ జేసినా పిడికిళ్లు బిగిస్తూనే వున్నారు. ఏ చిన్న కార్మికుని కంట నీరొలికినా కార్మికులందరూ సంఘటిత మవుతునే వున్నారు.

పోరాటం జెయ్యనిదే

పనిదొరకని దేశంలో

దగాకోరు, దోపిడోళ్లు

దాగున్నరు దేశంలో

మన రాజ్జెం రానిదే మనకష్టం దక్కదురో

అని పాడుకుంటూ నేవున్నారు. శ్రామిక కార్మికుల సంఘటిత శక్తిని చూస్తూ యాజమాన్యం బెంబేలెత్తి పోదు. కాగా మరింత మండుకొస్తుంది. కొత్త ఎత్తుగడలతో, ఉత్పత్తి సంక్షేమ పథకాలతో, విభజించి, పాలించు అనే వైఖరితో, పొగడ్తలతో, చిల్లర సదుపాయాలతో కార్మికుల్ని అదుపులో వుంచడానికి ప్రయత్నిస్తూనే వుంది. కార్మికులు న్యాయం, హక్కులని ప్రశ్నించినప్పుడల్లా యాజమాన్యం దాన్ని అంగీకరిస్తున్నట్టు నటిస్తుంది. కాని మరో విధమైన ఎత్తుగడలతో నాయకత్వంలో వున్న కార్మికుల్ని చిక్కుల్లో పడేస్తుంది. వారిని లొంగదీసుకునే ఎన్నో ప్రయత్నాలు చేస్తుంది. అది సాధ్యం కాకపోతే ప్రాణాలు తీయడానికి కూడా వెనుకాడదు.

ఇటువంటి పరిస్థితుల్లో తమ జీవితాల్తో ఆడుకుంటున్న యాజమాన్యాన్ని, కార్మికుల్ని నవలలో పరిచయం చేసారు జాతశ్రీ గారు. ఏజాతి చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం అని శ్రీ శ్రీ అన్నట్లుగా కార్మిక జీవితాల్లో ఏ పరిస్థితులుంటాయో నవలల్లో కూడా అవే పరిస్థితులు నెలకొన్నాయి. రాజయ్య, రాంబాబు, సీతయ్య వీరందరూ బొగ్గు తిని బొగ్గు పీల్చి, బొగ్గు విసర్జిస్తూ, బతుకుతున్న వాళ్లే. వాళ్ల స్పార్టకస్‌లా, ఓమర్ ముక్తర్‌లా, భగత్‌సింగ్‌లా, తెలంగాణా గెరిల్లాలా బతకకుండా తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీలుగా నిజాం నిరంకుశ పాదాల

క్రింద నలిగిపోయిన తెలంగాణలో, ఢిల్లీలో సిక్కులా బిక్కు బిక్కు మంటూ బతకాలి[13]. ఇదీ యాజమాన్యం కోరిక. ఈ వర్గం కార్మికులు చస్తూ, తాను బతకాలని కోరుకుంటుంది. దానికి వ్యతిరేకంగా కార్మికుడు ఒక శక్తిలా ఆవేశంలా, ప్రచండ ప్రవాహంలా, విద్యుత్ శక్తిలా, జయంకోసం పరుగులు పెడ్తూ వస్తున్నాడు. ప్రశ్నిస్తూ, పిడికిలి బిగిస్తూ నడుస్తున్నాడు. అందుకే కార్మిక సమ్మెలన్నీ ఒక ఎత్తు, 1981 ఏప్రిల్‌లో మొదలై జూన్ నెలదాకా సాగిన 56 రోజులు దీర్ఘకాలిక సమ్మె ఒక ఎత్తు. తాము తట్టాసెమ్మను కింద పడేస్తే దేశంలోని రైళ్లు, విద్యుత్ కేంద్రాలు, పరిశ్రమలు ఆగిపోతాయని ఈ సమ్మెనుండి కార్మికులు తెలుసుకున్నారు. అంతే కాదు తమ సమస్యలు విడిగా లేవని భారత దేశ పీడిత ప్రజానీకం అందరితో ముడిపడి వున్నాయని తెలుసుకున్నారు.[14] పరస్పరం సంఘర్షించిన శక్తులతో చరిత్ర పుట్టిందని, పుడ్తుందని గ్రహించారు.

మొదటే చెప్పినట్లు ఈ నవలలో ముఖ్యమైన పాత్రలు, సన్నివేశాలు లేవు. అసలు నవల కుండాల్సిన ఇతివృత్తం లేదు. అందుకే నవలను పరిచయం చేస్తూ ఎన్ మంచి రచనకు మంచి వస్తువొక్కటే సరిపోదని, ఆ వస్తువును కళగా మార్చటానికి కావలస్సిన శిల్పం రచయితకుండాలని, ప్రక్రియకు అనువైన శిల్పాన్ని పోషించలేక పోయినప్పుడు ఆ రచన ఎంత ఘోరంగా విఫలమైపోతుందో ఈ సింగరేణి మండుతోంది మరొకసారి రుజువు చేసింది అన్నారు.[15]

ఈ నవలలో పాత్రల ద్వారా, సంఘటలనల ద్వారా, విషయాన్ని చెప్పటం జరుగలేదు. పాత్రలు, సంఘటనలు చాలా తక్కువగా కన్పించి రచయితే విషయాలన్ని వాచ్యంగా చెప్పటం వల్ల ఈ నవల ఒక సుదీర్ఘమైన కరపత్రం లాగా, ఉపన్యాసం లాగా కన్పిస్తుంది. కార్మికుల పై అపారమైన సానుభూతితో వాళ్ళలో తిరిగి, వాళ్లతో పాటు పని చేసి వారి జీవితాల్ని కూలంకుషంగా చర్చించానని తను పడ్డ వ్యధనంతా ముందు మాటలో

చెప్పుకున్నా ప్రయోజనం లేకపోయింది. ఈ నవల్లో ఏ ఒక్క పాత్ర మన మనసుల్లో నిలిచిపోదు. అసలు పాత్ర వుంటేగా నిలిచిపోవటానికి!

ఈ నవల్లో మొట్ట మొదటి బొగ్గుగని కార్మికు నవలలుగా చెప్పుకున్నారు. అయితే పవన్‌కుమార్ రచించిన నల్ల వజ్రం కూడా మొట్ట మొదటి నవలగా పేర్కొన్నారు. ప్రచురణ సంవత్సరాన్ని బట్టి నల్లవజ్రం మొట్ట మొదట అని చెప్పుకోవచ్చు. అది నవంబర్ 1987 కాగా, ఈ నవల మార్చి 1988. ఈ రెండింటికీ నాలుగు నెలల తేడా వుంది.

నల్లవజ్రంలో కథ వుంది, ఒక సమస్య వుండటం, ఆ సమస్య కీలకమైన పాత్ర వహించటం, తద్వారా వ్యక్తి చైతన్యం కాకుండా సమిష్టి చైతన్యం పొందటం చూస్తాం. ఈ నవలల్లో రచయితకి వర్గ పోరాటం గురించి, సామ్యవాద సిద్ధాంతం గురించి, వర్గ దృక్పథం గురించి స్పష్టమైన అభిప్రాయాలున్నా అవి నవలలో చూపించలేకపోయారు. ఒక నవలగా మలిచే నేర్పు లేదని ఈనవల రుజువు చేసిందని పేర్కొంటూ దానికి ఉదా॥ వాచ్యంగా తన అభిప్రాయాన్ని ఈ నవలలో ఎలా వివరించారో తెల్పారు ఎన్ గారు.

బొగ్గు పొరల్లోంచి వెలువడే వేడి, దుమ్ము, దుర్గంధ వాయువులు, కార్మికుని రక్తాన్ని ఉడుకెత్తిస్తాయి. ఊపిరితిత్తులు చెడిపోతాయి. క్షయ, ఉబ్బసం, తదితర దీర్ఘ రోగాల్లోకి దిగజారి ఒక్కసారే చావకుండా రోజూ కొంచెం కొంచెం చనిపోతుంటారు.[16] ఈ వాక్యాలు బొగ్గు వల్ల జరిగే అపాయాలు ఏంటి? అన్న సైన్సు ప్రశ్నకు జవాబుగా వుంది. ఇవే మాటలతో ఒక సంఘటనను కూర్చి ఒక పాత్ర చేత మాట్లాడించినట్లు రాస్తే సన్నివేశం రక్తి కట్టేది. సహజత్వం చోటు చేసుకునేది. ఎన్ని సార్లు తిరగ రాసినా వీరి నవల వీరికే సంతృప్తి కరంగా లేదని రాస్తూ గుర్రాల మీద, కుక్కల మీద, జన్యుల మీద, మంచుఖండాల మీద, చీరల మీద, మంత్రతంత్రాల మీద, ఘోరంగా పరిశోధన చేస్తూ

గిమిక్స్ చేస్తూ తెలుగు సాహిత్యాన్ని పరిపుష్టం చేస్తూన్నామనే బాధ్యతా రహితమైన ప్రకటనలతో ప్రజల అమాయకత్వాన్ని డబ్బుగా మార్చు కుంటూ తెలుగు సామాజిక జీవితాన్ని శక్తి కొలది కలుషితం చేస్తున్న కిరాయి రచయితలు పుట్టుకొచ్చిన ఈ తరుణంలో ఈ నవల పుట్టిందని చెబుతారు.[17] అయితే ఆ నవల్లోనూ ఎంత అసభ్యం వున్నా కథ, ఇతివృత్తం, పాత్రలు, సంభాషణల్లో-దీంట్లో ఏవో ఒకటి మన మనస్సుకు హత్తుకు పోతాయి. ఈ నవల్లో అటువంటి వేవి లేనందువల్లనే ఒక నవలగా మలిచే నేర్పు గానీ, సంయమనం గాని ఆయనలో లేవని ఈ సింగరేణి మండుతోంది రుజువు చేసిందని విమర్శకు గురి కాబడ్డారు రచయిత.

తెలంగాణా కార్మిక జీవితంలో మరొక ముఖం బీడిల పరిశ్రమని చెప్పుకోవచ్చు. తెలంగాణాలో ముఖ్యంగా నిజామాబాద్, ఆదిలాబాద్, మెదక్, కరీంనగర్ జిల్లాలలో బీడిల పరిశ్రమలు నెలకొని వున్నాయి. ఈ జిల్లాలో నాలుగు లక్షలకు పైగా బీడి కార్మికులున్నారు. ఈ కార్మికుల్లో చాలా మంది స్త్రీలే.

అన్ని పరిశ్రమల్లో వున్నట్లే ఈ పరిశ్రమల్లోను కుట్రలు, మోసాలు జరుగుతున్నాయి. కార్మికుల కోసం ప్రభుత్వం కనీస జీతాలను నిర్ణయించింది. సెలవు, బోనస్, వైద్య సదుపాయాలు మొదలైనవి ఇచ్చింది. కానీ ఆచరణలో కార్మికులకు ఇవి అందుబాటులో రాకుండా చేశారు. యాజమాన్యం, యూనియన్లు కార్మికులకు వ్యతిరేకంగా యాజమాన్యానికి అనుకూలంగా వుండటంతో బీడి కార్మికుల ప్రయోజనాలు ఏవీ నెరవేరటం లేదు. వారందరు కలసి ఒక సంఘటిత శక్తిగా రూపొంది తమ ప్రయోజనాల కోసం సమ్మెలు కట్టడానికి నిర్ణయించుకున్నారు. పోరాటాలు చేయడానికి నిశ్చయించు కున్నారు. ఈ కార్మికుల్లో అధిక శాతం స్త్రీలే కాబట్టి వారు వారి సమస్యల కోసం పోరాడారు. వీరిని కదిపితే "మాకింకో బతుకు లేదు. నిద్ర పోతున్నా,

తిండి తింటున్నా, ఏ పని చేస్తున్నా, మాకొకటే యావ. బారబజే లోపు ఆకంతపాతంగ కత్తిరించుకోని, ఇంట్ల పనంత చేసుకొని కార్ఖానాకు పోవాలె. యాల్లకు పోకుంటే లైన్ల వెనుకబడ్తం. లైన్ల వెనుకబడ్తె ఎండల అట్లనే గంటలు గంటలు నిలబడాలె. మునీం ఏమంటాడో, బీడిలు సరిగ రాలేదంటడో, ఇసిరి కొడ్తడో? ఇదే గుబులు, ఇదే యావ! ఇంకో ధ్యాస లేదు, మా బతుకే బీడి అసుంటదయింది. ఎంత చేసిన బీడిలు, గుల్ల కట్టలు, కత్తిరింపులు పోంగ మిగిలింది చేతికొచ్చేది నోటికి సాలదు. నోరుదెరసి అడిగితే మున్సుల కచ్చె బెట్టుకుంటరు. ఇంక మాట్లాడితే ఇగో సూస్తుండ్రు గదా పోలీసులు కొడ్తరు, చెరుస్తమని బెదిరిస్తరు" ఇది గంగమ్మ అనే బీడి కార్మికురాలు చెప్పుకున్న గోడు.

బీడి కార్మికులు మిగితా కార్మికుల కన్నా భిన్నమైన వారు కాదు. ఈ పరిశ్రమ దేశంలో పెద్దదిగా పేరు తెచ్చుకుంది. ఈ పరిశ్రమ వల్ల కొన్ని కోట్ల రూపాయిలు ప్రభుత్వానికి చేరుతాయి. లక్షలాది ప్రజల పరిశ్రమ వల్ల యాజమాన్యానికి లాభాలు వస్తున్నాయి. ఒక ఫ్యాక్టరీలో నూరు మంది కార్మికులు ఉంటే వారు రోజుకు లక్ష బీడీలను ఉత్పత్తి చేస్తారు. మార్కెట్‌లో ఈ లక్ష బీడీల విలువ మూడువేల రూపాయలు. దీంట్లో కార్మికులకు కూలీ కింద ఏడువందల రూపాయలు అందుతాయి. కొన్ని కొన్ని చోట్ల అంతకన్నా తక్కువ. బీడీకట్ట తమ కళ్ల ముందరే ఆరుపైసలకు దొరికేది అరవై పైసలకు తీసుకుంటారు. తంబాకు ధర రెండున్నర నుంచి పది రూపాయిలు పెరిగింది. మార్కెట్లో అన్ని ధరలు పెరిగాయి. ఉప్పు ధర, నూనె ధర ఇలా, అన్నీ పెరిగినా తమ కూలి ఎందుకు పెంచడం లేదని కార్మికుల ప్రశ్న. కార్మిక చట్టాలున్నా వాటిని సేట్లు లెక్కచేయరు. సమ్మె చెయ్యడం మొదలు పెట్టంగానే పోలీసులు వారిపై దమన కాండ జరుపుతారు.

సాధారణంగా ఇతర ప్రాంతాలలో అట్టడుగు వర్గానికి చెందిన స్త్రీలే తప్ప మధ్య తరగతి, ఉన్నత మధ్య తరగతి స్త్రీలు శారీరక శ్రమ

చేయాల్సిన ఉద్యోగాలకు ముందుకురారు. కాని ఇక్కడ ముతక అతుకుల గుడ్డలు కట్టుకొని రెక్కాడితే తప్ప డొక్కాడని స్త్రీలతో పాటు చెవులకు చిన్నమెత్తు బంగారం, మెడల నల్ల పూసల గుండ్లు, పూసల గుండ్లు, పుస్తెల బిళ్లలు ఉండి సన్నచీరలు కట్టి వేన్నీళ్లకు చన్నీళ్ల తోడు కోసం పని చేస్తున్న మధ్య తరగతి, ఉన్నత మధ్య తరగతి, అధ్యాపక వర్గం, గుమాస్తా వర్గం, ఇంకా కార్యాలయ సిబ్బంది, మధ్య తరగతి రైతాంగ కుటుంబాల స్త్రీలు పక్క పక్కనే కూర్చొని బీడీలు చేస్తుంటారు.

ఈ కార్మిక జీవితాల "**బతుకుపోరు**"ని బి.ఎస్. రాములు నవలగా చిత్రించారు. ఈ నవలలో బీడీ మహిళా కార్మికులంతా ఒకటై కూలీ రేట్ల పెంపుదల కోసం, బోనస్‌ల కోసం, సెలవుల కోసం, సమస్త పని హక్కుల కోసం, సమ్మెకు దిగటం, సమ్మెను విచ్ఛిన్నం చేయటానికి ప్రయత్నించిన ఏజెంట్లను సమర్థించ వచ్చిన యూనియన్ లీడర్లను ఎదుర్కొని సమ్మెను కొనసాగించటాన్ని చిత్రించిందని కాత్యాయని విద్మహే గారు పేర్కొన్నారు.[17]

కార్మికుల ఇంటి నిండా, బతుకు నిండా బీడిలు చుట్టగా మిగిలిన బీడి ఆకు, తంబాకు, చెత్త చెదారం, చంటి పిల్లలకు పాలిస్తున్నా, ఉడుకుతున్న అన్నం కుండ కింద మంటను ఎగదోస్తున్నా మధ్య మధ్య వాళ్ల చేతుల్లో కత్తెర యాంత్రికంగా అలవాటు ప్రకారం ఆకు కత్తిరిస్తునే ఉంటుంది. ఇంకో ఆలోచన లేదు. మరో ధ్యాస లేదు. ఈ నవలలో ముఖ్యంగా స్త్రీలే కన్పిస్తారు. బీడి పరిశ్రమల్లో ఎక్కువ మంది స్త్రీలే పని చేసేది కాబట్టి ఈ నవలలో మహిళలు వంటకత్తెగా, పనిమనిషిగా, భార్యగా, తల్లిగా చివరకు కార్మికురాలిగా కూడా తమ బాధ్యతను నెరవేర్చడానికి ప్రయత్నిస్తారు. ఈ ప్రయత్నంలో వాళ్లు సమ్మెలు కట్టడమేకాక, లైంగికదోపిడికి గురికావడం కూడా ఒక్కసారి జరుగు తుంటుంది.

## కథాంశం :

లక్ష్మి, రాజయ్య దంపతులు; వారికి ముగ్గురు పిల్లలు శ్రీను, సరస్వతి, వాణి. లక్ష్మి బీడల పరిశ్రమలో పని చేస్తుంటుంది. రాజయ్య ఒక దుకాణంలో గుమాస్తా బాకి వసూళ్ల కోసం తెల్లవారక ముందే లేచి పరుగెడ్తుంటాడు. పిల్లలకు అన్ని అమరుస్తూ ఇంట్లో అన్ని పనులు చేస్తూ బీడీలు చేస్తూంటుంది లక్ష్మి. సుగుణ పక్కింట్లో వుంటుంది. లక్ష్మితో కబుర్లు చెప్తూ తనూ బీడీ కట్టలు కడ్తుంది. సుగుణ పెళ్లి కాని అమ్మాయి. తనకొచ్చే జీతంలోంచి కొంత డబ్బు తనఅవసరానికి వాడుకొని మిగితాది తల్లిదండ్రులకిస్తుంది. పెళ్ళి సంబంధాలు చూస్తుంటారు ఆమెకు. అదే విషయం లక్ష్మి అడగ్గా వరకట్నం విషయంలో కుదరలేదని చెప్తుంది. దానికి లక్ష్మి దేనికి పనికి రాని వాడు కూడా వేలుకు వేలు అడుగుతున్నాడు. ఇల్లు వాకిల్లు లేని వాళ్లు కూడా కట్నాలు అడుగుతున్నారు. వాళ్లు అంత సంపాదించినా మనని మాత్రం కూచోపెట్టి మేపరు అన్న అర్థంలో దెప్పిపొడుస్తుంది. అతడూ బీడీ కార్మికుడే ఇద్దరూ అంతే సంపాదిస్తున్నప్పుడు కట్నం ఎందుకిచ్చుకోవాలి అంటూ మళ్లీ వాళ్లకు చాకిరి చేయడం కూడా ఒకటి దండగ అంటుంది. ఈ బీడీ కార్మికులకి విశ్రాంతి లేదని పొద్దున్నుంచి రాత్రి వరకు పని తీరలేదని రికాం లేని బతుకని, పని చేసి చేసి బొక్కలు తెల్లవడ్డాయని దుఃఖిస్తుంది. అన్నీ మౌనంగా విని భరిస్తుంది సుగుణ. ఆకు కట్టలు కత్తిరిస్తూ కూర్చున్న సమయంలో భర్త రాజయ్య వసూళ్ల నుండి ఇంటికి వస్తాడు. అతడు అదోలా వుండటం చూసి కారణం అడుగుతుంది. అతని పెత్తండ్రి బిడ్డ కొడుకును పోలీసోళ్లు చంపారని చెప్తాడు. రైతు కూలి సంఘాలు పెట్టి కూలీ డబ్బులు పెంచాలని, దున్నే వాని కి భూమి కావాలని పోరాటం చేయించాడని దొరలు చెప్పటంతో పోలీసులు కాల్చి

చంపారని చెప్తాడు. ఈ మాటలు విన్న లక్ష్మి లీడరంటే అట్లుండాలె అని, దోచుకు తినడానికి మాకు ఉన్నాడు యూనియనోడు అంటుంది.

దాదా బీడి కంపెనీ ముఖ్య కార్యాలయంలో మేనేజర్, ప్యాకింగ్‌దగ్గర, చాటన్ దగ్గర, లేబిళ్ల దగ్గర అందరూ పన్లు సరిగ్గా చేస్తున్నారా లేదా చూస్తూ వారిపై అజమాయిషీ చేస్తుంటాడు. అతనే కార్మికులకు జీతాలిస్తాడు. మొదట రాజలింగం అనే అతన్ని పిలుస్తాడు. జీతంలో నాలుగు రోజుల జీతం కోసి ఇస్తాడు అతనికి. తంబాకుసంచి తనపై పడ్తే గోడకు తగిలి దెబ్బనడుంకు తగలటంతో రాలేకపోయానని, తన పనికి లీవు పెట్టుకోలేదని చెప్తాడు రాజలింగం. దాదా అందుకే నిన్ను ఉద్యోగంలోంచి తీసివేయకుండా పాతవాడివని జీతం మాత్రమే కోసానని చెప్తాడు. ఎదురు మాట్లాడలేక వెళ్లిపోతాడు. తర్వాత నారాయణ వంతువస్తుంది. అతనికి కూడా రెండు రోజుల జీతం తక్కువ ఇస్తాడు; ఒక్క రెండు గంటల కోసం పర్మిషన్ అడిగి వెళ్లినా, రెండుగంటలు ఆలస్యంగా వచ్చినా రెండు రోజుల జీతం కోయటం బాగా లేదని తీక్షణంగా మాట్లాడుతాడు. ఆదివారాలు పనిజేస్తూ, పండుగలనాడు కమీషన్ దార్లకు, తంబాకు జోకి, చెన్నీలు మోస్తే ఆ పనికి జీతాన్ని పెంచుతున్నావా అని అడుగుతాడు. లేబర్ ఆఫీసరును తీసుకువచ్చి నీ దొంగలెక్కల్ని, ఓవర్ టైంని ముందు పడేస్తా అని ఆవేశంతో అరుస్తాడు. ఇద్దరూ కాలర్లు పట్టుకుంటారు. అట్లా నారాయణ ఉద్యోగం ఊడిపోతుంది. లక్ష్మితోవలో ఎదురుపడి నారాయణ తల్లి పడ్డ కష్టాలు చెప్తుంది. నారాయణ బి.ఏ. తప్పి బీడీల పనిలో చేరుతాడు. ఇతడే సుగుణను కట్నం తక్కువ అని చేసుకోనంటాడు. లక్ష్మికి ఈ విషయం తెలిసి రాయబారం జరుపుతుంది. నారాయణతో విషయం చెప్పి ఒప్పించటానికి ప్రయత్నిస్తుంది.

బీడీ కంపెనీ విశాలంగా ఏమీ వుండదు. తొమ్మిది గజాల కుమ్మరి గూనయిల్లు, అది చిన్న చిన్న రెండు, మూడు గదులున్న ఇల్లు దాంట్లోనే స్త్రీలందరూ కూర్చోని బీడీలు చేస్తుంటారు. వాళ్లు కూర్చోడానికే స్థలముండదు. వారితో పాటు చంటిపిల్లల్ని కూడా అక్కడే పడుకో బెడ్తుంటారు. జాగా సరిపోవటంలేదని యజమానికి ఎంతచెప్పినా వాళ్లు వినిపించుకోరు. కాళ్లు కూడా జాపుకోకుండా, గాలి వెలుతురూ రాక, చెమట కంపుగ శరీరం అంతా చిమ చిమ అంటుంటే,. ఆ తంబాకు వాసనతో ఉడుకపోతతో పనిచేస్తుంటారు. ఆఘాటుకు జబ్బులొచ్చే ప్రమాదం కూడా వుంది. దగ్గుతోటి టి.బి. తోటి చనిపోతారని అనుకుంటుంటారు. ఆ మాటలు సత్తెక్క వింటుంది. ఈవిడ యజమాని రాజేశం భార్య. తనుకూడా బీడీ కట్టలు కడ్తుంది వీళ్లతోపాటే; తంబాకు తక్కువ ఇచ్చి ఎక్కువ కట్టలను కట్టమంటారు యజమానులు. ఆకు సగం కత్తిరింపుతో పోతుంది. తక్కువ వస్తే ఆఖర్చు కార్మికులపైన వేస్తారు. అందుకే భూదేవి అందరూ కల్సి కార్మికులను ముంచుతున్నారు అంటుంది. ఆకు తుట్టి అయినా, తంబాకు తుట్టి పోయినా దారం తుట్టిపోయినా అన్నీ మా పైసల్లోనే కోస్తారని; కమీషన్ తీసుకునే వాళ్లకి లాభమేకాని, కార్మికులేమునుగుతున్నారని అంటుంది. దానికి సత్తెమ్మ కమీషన్ వాళ్ల కష్టాలు చెప్పుకొస్తుంది. దాదా తనని మోసం చేసాడనుకుని ఎలాగైనా చెడ్డపేరు వచ్చింది. వాణ్ణే తన్నాల్సింది అనుకొంటాడు నారాయణ. లక్ష్మినారాయణ తల్లితో సుగుణ పెళ్లి విషయమై అడగటానికి వస్తుంది. నారాయణ తల్లి ఈ బీడీ చాటల్లో తన జీవితం ఎలా తెల్లవారిందో చెప్పుకొస్తుంది. అన్నీ వింటున్న లక్ష్మి గుండెలో భయం చోటుచేసుకుంటుంది. ఒక్కకొడుక్కే అంత కష్టపడుతుంటే తాము ముగ్గురు పిల్లలతో జీవితాల్ని ఎలా గడపాలి, పట్నంలో మరిది డాక్టరు కోర్సు చదువుతుంటాడు; అడపా దడపా అతనికి పంపిస్తూ తను జీవితాల్లో కష్టాల్ని మాత్రమే చూస్తున్న లక్ష్మికి కండ్లలో నీళ్లు

తిరుగుతాయి. అదిచూసిన నారాయణ తల్లి మనబతుకులు ఇలాంటివే. కష్టం చేసినవాడు పైకిరాడని, మోసం చేసిన వాళ్లే బంగ్లాలు కడ్తారని చెప్తుంది. అదే సమయంలో పెళ్లిని కుదురుస్తుంది లక్ష్మి.

తిరిగి వెళ్తున్న లక్ష్మికి శేఖర్ కనపడ్తాడు. అతడు లక్ష్మికి వరుసకు కొడుకవుతాడు. దాదా సైకిల్ పై వెళ్లటం జూస్తుంది. ఎక్కడికి వెళ్తున్నాడని శేఖర్‌ని అడుగుతుంది. రాజారాం అనేవాడు ఈ రోజు కంపెనీలో పనిచేస్తున్నప్పుడు ఈశ్వరి అనే అమ్మాయిని చీకట్లో ఎవరూ లేరని ధైర్యంతో కాంటాని ఆమె వక్షస్థలాన్కి తాకించాడని, ఈశ్వరి కోపంతో తనచెయ్యి విసరడంతో కాంటా తెగిముల్లు నొసట్లోకి కుచ్చుకుందని, ఆస్పత్రికి వెళ్తున్నాడని చెప్పాతడు. దాంతో వాడికి తగిన శాస్తి జరిగిందంటుంది.

కంపెనీలో ఆకు తుట్టి పోగొట్టినారని పైసలు తక్కువిచ్చే ఉద్దేశ్యంతో వుంటాడు రాజేశం అది గ్రహిస్తారు అక్కడున్న స్త్రీలు; పైసలు తక్కువిస్తే తీసుకొనేది లేదని, మరురోజు పనికి రాకుండా బంద్ చేయాలని నిర్ణయించుకుంటారు; అందరూ కల్సి మాట్లాడే సరికి దాదాను తీసుకువస్తాడు రాజేశం. దాదా కూడా వీరి మాటలతో పరాభవింపబడ్తాడు. అందరూ ఒప్పుకొన్నారని చెప్పి ఒకరికి తెలియకుండా ఒకరికి సగం పైసలు కోసి అందరి ఇళ్లకూ వెళ్లి ఇస్తాడు రాజేశం. విషయం అందరికీ తెలిసి పైసలు తెచ్చి అతని ముందు పడేస్తారు. దాంతో రాజేశం రెచ్చిపోయి కావరం పట్టిందా, అని అడుగుతాడు, అక్కడున్న స్త్రీలంతా అతనితో పోట్లాటకు సిద్ధమవుతారు. ఆ సమయంలో కార్మిక లీడర్ సుధాకర్ వచ్చి నచ్చ జెప్పటానికి ప్రయత్నిస్తాడు. అందరూ అంతకు ముందు ఎట్లా దోచి తిన్నారో చెప్తూ అతన్ని హేళన చేస్తుంటారు. అంతలో శంకరయ్య

వస్తాడు. ఇతడు నిజమైన యూనియన్ లీడర్. దాంతో అందరూ తలోమాటా అనుకుంటూ కార్ఖానాలోంచి బయటికి అడుగేస్తుంటారు. అట్లా సమ్మె ప్రారంభమవుతుంది. ఈ సమ్మెకు కొందరు వ్యతిరేకంగా ఉంటారు తమకు నష్టం కలుగుతుందంటారు. దాంతో లక్ష్మి వాళ్లకు విడమరిచి చెప్పాల్సివస్తుంది. ఇంతకుముందు సమ్మెలు యూనియన్ వాళ్లు చేయమంటే చేసినం, మానెయమంటే మానేసినమని చెప్తుంది. మనతో సమ్మెచేయించి అధికార్ల దగ్గర లక్షలకు లక్షలు లంచాలు తిన్నారని ఈ సమ్మె అలాంటిది కాదని, మనకై మనం పోరాడుతున్నామని చెప్తుంది. ఆకు తుట్టిపోయిందని పైసలు కోయొద్దు..... మన కష్టం సుఖం మనమే జూసుకోవాలనే నిర్ణయంతో సమ్మె చేస్తున్నామని చెప్తుంది.

అదే సమయంలో దాదాకు యజమాని నుంచి ఫోన్ వస్తుంది. సమ్మె సంగతి తెల్సి ఆ సమ్మె విరమించకపోయినట్లైతే దాదాను బదిలీ చేస్తా నంటాడు ఫోన్లో యజమాని.

ఆ క్షణంలో దాదా ఆ కార్మికులకు, తనకూ భేదం లేదని తెలుసుకుంటాడు. ఇతర కంపెనీల్లో వున్న కమీషన్‌పైన బతికే కమీషన్ దార్లతో విషయం అంతా మాట్లాడుకుంటారు. ఆ కార్మికులపై సానుభూతి ఏర్పడి లోలోపల సమ్మెను సమర్థించే స్థితికి మనస్సు ఎదుగుతోంది.

అక్కడున్న ప్రతిస్త్రీ సమ్మెలో తన ధర్మాన్ని నిర్వహిస్తూ, సమ్మె విజయవంతమౌతుందని ఆశిస్తూ చీకటి కడుపులో చిచ్చు రగిల్చే వెలుతురు బాణాల్లా ముందుకు సాగిపోవడంతో నవల ముగుస్తుంది. బీడి కార్మికులు బీడీ ఆకును కత్తిరించటానికి ఏకత్తెర్లు పట్టారో ఆ కత్తెర్ల చేతులనే ఏకంచేసి ఒకటై నిలిచి పోరు దారిలో నడవాలన్న సందేశాన్ని ఈ నవల చెప్తుంది. బీడి కార్మికుల భారమయిన జీవన గాథలు, పోరాటాలను వాస్తవిక దృక్పథంతో చిత్రించిన నవల బతుకుపోరు.

ఈ స్త్రీలు ఇంట్లో ఉదయం పదకొండుగంటలదాకా కూర్చొని ఆకు కత్తిరించి పన్నెండు గంటల వరకు కార్ఖానకుపోయి చీకటి పడ్డదాకా చేసి ఆదరాబాదరాగా ఉడికేసుకొని వీధిదీపాలకిందో, అరుగుల మీదో గుంపులు గుంపులుగా కూర్చొని కత్తిరించినంత ఆకు కత్తిరించి, మళ్లీ చీకటినే లేచి ఓ పక్క ఇంట్లోపని, ఆకు కత్తిరింపు, మళ్లీ బారాబజే జీవితం. క్షణం తీరిక లేకుండా, కనీసం పిల్లల ఆలనా, పాలన చూసుకోకుండా తన తిండి, తిప్పలు, శుచి, శుభ్రతకూడా గమనించే తీరికలేకుండా శ్రమిస్తున్న ఈ బీడీ కార్మికులకు గిట్టేది ఎంత? అని ప్రశ్నిస్తూ తిరగబడండని ప్రబోధిస్తూ బి.ఎస్.బి. "అమ్మా నీ కెన్నిబాధలో" అన్న పాటను రాసాడు. దాంట్లో పొద్దు పొద్దున లేచిం దగ్గర్నుంచి తల్లి కష్టాన్ని వివరిస్తూ చివరికి పేదోళ్ల రాజ్యంకై పోరాటం చేయాలె అని తెలియ జేస్తాడు రచయిత[17].

ఈ నవలను సమీక్షిస్తూ నవలలో కథనం కాక వర్ణన ఉండటం బాగుంటుందని నాటకంలో లాగా కథను సంభాషణల మీద కాక సంఘటనలను వర్ణించటంగా నడిపితే బాగుండేదని, పాత్రల క్రమ పరిణామం నిరూపించబడక పోవటాన్ని పోరు చిత్రణ బలంగా లేకపోవటాన్ని విమర్శించారు[18]. అయితే ఈ విమర్శ సరియైనది కాదేమో అనిపిస్తుంది. మొదట శ్రామికులు కదిలితే వాళ్లే నేత లౌతారు. దాంట్లో నుంచే పోరాటం పుట్టుకొస్తుంది. అందుకే దాశరథీ రంగాచార్యగారు రచయితను అభినందిస్తూ **బతుకుపోరు చలిమంట సెగలా, చల్లని వెన్నెల్లా, గ్రీష్మ తాపంలా, సహజంగా ఉంది. ఇందులో అసహజం అవాస్తవం లేదు. వాళ్లు కదిలితే మనం వాళ్లను అనుసరించాల్సిందే...... జనపదంలో ఇక్కడ రామక్క కదిలింది. లక్ష్మి కదిలింది. కావాల్సింది కదలడమే ఆ తర్వాత వాళ్లే నేతలు, శ్రామికులు నేతలు కావాలనేదే మన విశ్వాసం. ఆ తర్వాత అంతా సంగ్రామమే. వచ్చేది చీకటి కడుపులో చిచ్చు రగిల్చే వెలుతురే అని బతుకు పోరును**

**ప్రశంసించారు.** నవల జీవితం అంత సహజంగా వాస్తవంగా ఉంది. తెలంగాణ పల్లెసారం అరవై పేజీల్లో కాపురం పెట్టింది. పల్లె పట్టల జీవితం దిశమొలతో దిగంబరంగా కన్పించింది. ఆ బతుకుపోరులో మట్టి, పెండ, చెమట, తంబాకు, వాసనలు గుబాళిస్తున్నాయి[19] ఈ నవల్లో వేతనాల కోసం, పని పరిస్థితుల మెరుగుదల కోసం బీడీ కార్మికులు చేస్తున్న పోరును నవల చిత్రించడంతో పాటు, ఇంటా బయటా చాకిరీ తప్పని పరిస్థితి గురించి పురుషుల శ్రమ కంటే స్త్రీల చాకిరీ ఎంత కష్టమో లక్ష్మి, రాజయ్య సంభాషణల్లో లక్ష్మి, రాజమ్మ వేదనలో వెల్లడించారు రచయిత.

ఈ విధంగా కార్మిక పోరాటాల్లో బొగ్గుగని కార్మికులు తమ బాగుకోసం పోరాట పథంలో పయనిస్తే బీడీ కార్మికులు తమ **బతుకుపోరు** కోసం సాగిపోతున్నారు. యజమానుల దౌర్జన్యాలకు, చరమాంకం పలికిన వైనాన్ని పవన్‌కుమార్ **నల్లవజ్రం,** జాతశ్రీ **సింగరేణి మండుతోంది,** రాములు **బతుకుపోరు** నవలలు శక్తి మంతంగా చిత్రీకరించాయి. కార్మికులలోనే విభేదాలు కల్పించి యాజమాన్యం లాభాలు గడిస్తున్నారు. కార్మికులందరూ ఒక్క మార్గంలో పయనించినపుడే వాళ్ల సమస్యలన్నీ తీర్తాయి. మంచికి సమాజంలో గుర్తింపులేదని, మంచి పనులకోసం ఆరాటపడే వాళ్లకు అనేక సమస్యలు ఎదురౌతాయని ఈ నవలలు తెలియజేస్తాయి.

## పాదసూచికలు

## 3వ అధ్యాయం

1. దాశరధి రంగాచార్య – చిల్లరదేవుళ్లు
2. వర వరరావు – ప్రజలమనిషి ఒక పరిచయం
3. వర వరరావు – తెలంగాణ విమోచనోద్యమం
4. వర వరరావు – తెలంగాణ విమోచనోద్యమం
5. వర వరరావు – తెలంగాణ విమోచనోద్యమం
6. వర వరరావు – తెలంగాణ విమోచనోద్యమం
7. కె.వి.ఆర్. – తెలంగాణా పోరాట సాహిత్యం
8. అరుణతార – ఆగష్టు, సెప్టెంబర్, అక్టోబర్ సంచికలు
9. అల్లం రాజయ్య – ముందుమాట – బొగ్గుపొరల్లో – సింగరేణి కార్మిక కథలు
10. అభ్యుదయ – మార్చి 1980
11. జాతశ్రీ – సింగరేణిమండుతోంది
12. జాతశ్రీ – ముందుమాట – సింగరేణిమండుతోంది
13. రత్నమాల – ప్రజాస్వామ్యంలో బీడీకార్మికుల బతుకుపోరాటం, నూతన జూలై – 1981
14. తెలంగాణ పోరాటం – తెలుగు కథలు, నవల
15. కె. రామ్మోహన్ రాజు – ఎండుటాకులు పచ్చనోట్లుగా మారుతున్న వేళ – నూతన – జూన్ – 1981
16. నూతన, జూలై – 1981
17. సృజన, ఫిబ్రవరి – 1983

18. బి.ఎస్. రాములుగారికి రంగాచార్యగారు వ్రాసిన లేఖ
19. బి.ఎస్. రాములుగారికి రంగాచార్యగారు వ్రాసిన లేఖ
20. నవీన్ - ముళ్లపొదలు
21. బొగ్గుపొరల్లో - సింగరేణికార్మిక కథలు
22. అరుణతార, ఫిబ్రవరి 1981
23. అల్లంరాజయ్య, సింగరేణి కథలు
24. వేల్పుల - అభ్యుదయం, మార్చి 1988
25. నల్ల వజ్రం - పరిచయం
26. జాతశ్రీ - సింగరేణి మండుతోంది

# తెలుగు నవలల్లో తెలంగాణ గిరిజన జీవితం

## బి) గిరిజన పోరాటాలు

# గిరిజన జీవితం

గిరిజనులు అనగానే ప్రతి నాగరికుడు ఈకలతో మొలలో గజ్జెలతో ఉండే ఒక విచిత్ర జీవిని స్మృతిలోకి తెచ్చుకొంటాడు. వీళ్ళు తెల్లబట్టలవాళ్ళు కనిపించగానే పారిపోతారనీ, చాలా భయస్తులనీ మరికొందరు చదువుకొన్న వాళ్లు భావిస్తారు. గిరిజనులు, ఆటవీకులు అనే పేర్లు వాళ్ల చైతన్యం యొక్క సంస్కృతీకరణే. మనం వీరిని ఏ పేరుతో పిలిచినా వాళ్లు మాత్రం తమని తాము కొండ మనుషులుగా అడవి మనుషులుగా వర్ణించుకొంటారు. ఉత్తర భారత దేశంలో వీళ్లని ఆదివాసులు అనే పేరుతో పిలుస్తారు. నిజానికి ఈ దేశంలో గిరిజనులే ఆదివాసులని ఇతరులంతా ఒకప్పుడు బయటి నుండి వచ్చి ఆదివాసుల్ని అడవిలోకి తరిమేసినవాళ్లని ఒక సిద్ధాంతం చెపుతుంది[1].

మనదేశమంతా ఒకప్పుడు దట్టమైన అడవులతో నిండి ఉండేది. అలాగే ఒకప్పుడు మనము కూడా అటవీకులమే. వేట, పశుపోషణ, పోడు వ్యవసాయము, జీవనాధారంగా ఉండేది. సామూహిక శ్రమ, సమిష్టిజీవనం, సమానత్వం, ఆస్థాయికి తగిన సామాజిక సంబంధాలుండేవి. ఆ సంబంధాలు క్రమంగా విచ్ఛిన్నమవుతూ స్థిర వ్యవసాయం వర్గ సమాజంగా రూపుదిద్దుకొంది. ఈ రకంగా ఏర్పడ్డ వర్గ సమాజంలో సముద్ర తీరంలోని భూములు, ఉత్తర భారతదేశపు నదులు ఒక్కొక్కటి ఒక్కొక్కటి కేంద్రంగా ఏర్పడి ఒక క్రొత్త జాతికి బీజమయ్యాయి. ఈ జాతులు ఆకేంద్రాల నుండి విస్తరిస్తూ అడవులను మైదానాలను ఏర్పరుస్తూ అక్కడ ఆటవీకులను తమలో బలవంతంగా కలుపుకొన్నాయి. దీని వల్ల ఒక్కొక్క ఆధునిక జాతి ఏర్పడింది. ఈ జాతులకు లొంగని అడవులు, పీఠభూములు మిగిలిపోయి, వాటిలో నివసిస్తున్న ఆటవికులు మాత్రం సాంస్కృతికంగా ఏ జాతికి చెందని వారుగా మిగిలిపోతారు. అందువల్లనే ఏ పరిసర రాష్ట్రాలను తీసుకొన్నా వాటి సరిహద్దులో కొండలు, పీఠభూములు, అడవులు, గిరిజనులు

కన్పిస్తారేతప్ప రాష్ట్ర గర్భంలో వీరు కనబడరు. మన ఆంధ్ర రాష్ట్రంలో శ్రీకాకుళం నుండి పడమటి నిజామాబాద్, ఆదిలాబాద్ దాక దట్టమైన అడవులు కన్పిస్తాయి. ఈ అడవులలో సవర, జాతాపు, కోయ, కొండరెడ్డి, నాయక్‌లు, గోండు, కోలామ్ మొదలైన గిరిజనులు కనబడతారు. అట్లాగే దక్షిణాన చెంచు, యానాది, ఎరుకల గిరిజనులు, కన్పిస్తారు. ఇట్లా ఏ రాష్ట్ర సరిహద్దుల్లో చూసినా గిరిజనులు నివసిస్తుంటారు. వీరందరు ఇప్పటి వరకూ ఆయా ప్రాంతాల వర్గ సమాజ విస్తరణకు లొంగని వాళ్లు. నాలుగు వేల సంవత్సరాల నుండి మైదానాలు అడవుల్ని ఆక్రమించుకొంటూనే ఉన్నాయి. కాంట్రాక్టర్ల ద్వారా ప్లాంటేషన్ ద్వారా వడ్డీ వ్యాపారస్థుల ద్వారా భూస్వాములు ఈ రోజుల్లో భూమిని ఎలా ఆక్రమించు కొంటున్నారో అలాగే గతంలో కూడా భూమి దోపిడి విషయంలో అంతే దౌర్జన్యం జరిగింది. గతంలో అశోకుడు అడవులను వ్యవసాయం కిందికి తీసుకురావడానికి చేసిన ప్రయత్నం మనకు చరిత్రలో కన్పిస్తుంది. అడవుల్ని నరికి వ్యవసాయ యోగ్యం చేసి కొత్త గ్రామాల్ని ఏర్పరచే వాళ్లకి రాజుగారి ప్రోత్సహం ఉండేది. ఆగ్రామాలకు కొంతకాలం రెవెన్యూ మాఫీ చేసే వాళ్లు. ఈ రకంగా నాగరికులు దట్టమైన అడవులన్నిటిని వ్యవసాయ యోగ్యం చేసారు. అప్పటి అటవీకులు ఈ క్రమానికి లొంగిపోయి తమ స్వతంత్ర జీవితాన్ని వదిలి పెట్టి కూలీలుగా మారిపోక తప్పలేదు. చాలా మంది మాల, మాదిగ కులాలలో కలిసిపోయారు. ఇటువంటి చరిత్రకు మనకు ప్రత్యక్ష సాక్షులు, ఆధారాలు దొరకవు. కాని ఈ గిరిజనుల క్రమం యొక్క ప్రతిబింబం పౌరాణిక సాహిత్యంలోను, గిరిజనుల పురాణగాథలలోను కన్పిస్తుంటాయి. ఈ గిరిజనులు హిందూ దేవతల సేవకులుగా, భక్తులుగా, రెండవ భార్యలుగా మనకు దర్శనమిస్తారు. వర్గ సమాజంలో అల్పస్థాయిలో ప్రవేశించిన వీళ్లు చివరికి సాహిత్యంలో కూడా అల్పస్థాయిలో ప్రవేశించక తప్పలేదు.

రాముడి దర్శనం కోసం పడిగాపులు కాచి తాను ఎంగిలి చేసిన ఫలాలను తిన్నందుకు తన జన్మ సాఫల్యం అయిందని భావించిన శబరి సవర జాతికి చెందిన స్త్రీ. గురువుకు గురుదక్షిణగా తన బొటన వేలునిచ్చిన ఏకలవ్యుడు భిల్లు తెగకు చెందినవాడు. పాండవులు అడవిలో తలదాచుకొంటున్నప్పుడు భీముడు, హిడింబి అనే ఆటవిక స్త్రీని పెళ్లాడతాడు. ఆమెకు పుట్టిన కొడుకు ద్వారానే తమ జాతి ఆవిర్భవించిందని ఆటవికులలో ఒక తెగ అయిన గోండుల నమ్మకం. మన దేశంలోని చాలా మంది గిరిజనులు తమని తాము ఆ హిడింబి సంతానంగా ప్రతి సంవత్సరం భీమ, హిడింబిల వివాహాన్ని ఇప్పసారాతో వేడుకతో జరుపుకొంటారు[2]. గిరిజనుల్లో ప్రతి వారు తప్పనిసరిగా ఇప్పసారా తాగుతారు. ఇప్ప పువ్వును కాచి కల్లు చేసుకొని తాగుతారు. ఈ ఆదివాసీల ఆహార సేకరణ విలక్షణమైంది. కన్పించిన ఆహారాన్ని ఏరుకోవడం, జంతువుల్ని వేటాడి పట్టుకొనడం ద్వారా పొట్ట నింపుకొంటారు. పురుషులు చేపల వేటకు బయలుదేరితే స్త్రీలు రోజుగడవటాన్కి కావల్సిన దుంపలు, ఆకు కూరలకోసం అడవిలోకి వెళ్తారు. అయితే ఇటువంటి ఆహార సేకరణను స్వంత ఆస్తి మీద ఆధారపడే వర్గ సమాజం దొంగతనంగా భావిస్తుంది. ఈ సమాజం ప్రతి వస్తువును ఎవరో ఒకరి ఆస్తిగా ప్రకటించి వాళ్లను బలవంతంగా దొంగలుగా మారుస్తుంది. అందుకే బ్రిటీష్ వారు వీరికి క్రిమినల్ ట్రైబ్స్ అని పేరు పెట్టారు[3].

## గిరిజన సంస్కృతి:

గిరిజనులలో సాధారణంగా మూడు రకాల తెగలు కన్పిస్తాయి 1. వేట మీద జీవించేవారు 2. ఆహార సేకరణ మీద ఆధారపడి జీవించే వారు 3. పశుపోషకులుగా జీవించే వాళ్లు. మొదటి రెండు తెగల్లో గిరిజనుల సంఖ్య చాలా తక్కువ; ఉన్నా అతి కొద్ది మంది బ్రిటీష్

వారితాకిడికి తట్టుకోలేక వృత్తి దొంగలుగాను, లేక అతి చౌకగా పనిచేసే కూలీలుగాను మారిపోయారు. ప్రస్తుతం ఆహారాన్ని ఉత్పత్తిచేసే వ్యవసాయదారులైన తెగలు మాత్రమే మనకు కన్పిస్తుంటాయి. ఈ గిరిజనులు పేదరికంలో కొట్టుమిట్టాడుతూ జీవిస్తుంటారు. వీరిది పోడు వ్యవసాయం కావటం వల్ల దీని నుండి వచ్చే ఫలసాయం చాలక అడవిలో దొరికే నానా రకాలైన పండ్లు, కాయలు, ఆకులు పోగుచేసుకొని వాటిని తిని జీవిస్తూ ఉంటారు. స్త్రీలు, పురుషులు కూడా నామ మాత్రంగానే బట్టలు ధరించగల్గేవారు. గిరిజన ప్రాంతాలలో ఆహారధాన్యాలు అతి స్వల్పంగా మాత్రమే పండుతాయి. దానికి కారణం అడవి ప్రాంతాల్లో జీవిస్తున్న పశుపక్ష్యాదులు ఎప్పుడోవచ్చి చేనులో పడటం, చేనంతా పాడైపోవటం వల్ల వాళ్లకు ముట్టేది చాలా తక్కువ. దీన్లో షావుకార్ల మామూళ్లతో మొత్తం దోచుకోబడ్తారు. తిరిగి అదే పరిస్థితి నెలకొంటుంది. గిరిజన ప్రజలు ఏడాదిలో అత్యధిక భాగం గడ్డి గింజలు, అడవుల్లో లభ్యమయే కాయలు, పండ్లు, అడవిదుంపలు, ఇప్ప పువ్వు తింటూ కాలం గడుపుతారు. వీరు అడవి కోళ్లను, యెనుము అనే అడవి దున్నలను వేటాడుతారు. సోమలు, అరికెలు, జొన్నలు లభ్యమయినప్పుడు వాటితో రొట్టెలు చేసుకొని త్రాగి కాలం వెళ్ల బుచ్చుతారు.

నాయకపోళ్లు కొలాములు గోండులకన్నా వెనకబడినవారు. గోండులు ఒకప్పుడు రాజ్యాలు పరిపాలించినారు. అందుకే వారిలో కొందరికైనా పట్టాభూములుంటాయి. పశువులు, ఇండ్లు, నాగలి, భూమి, పుట్రా ఉంటాయి. నాయక పోళ్లు అలాకాదు. వీరు మామూలు వ్యవసాయం చేయరు. వీరిది పోడు వ్యవసాయం వీరు పంట పండించటానికి ఎద్దులు, నాగలి ఏమీ ఉపయోగించరు. కర్రు, పార, కొడవలి, గొడ్డలి ఇవే వారి పనిముట్లు. వీటితోనే పంటలు పండిస్తారు. ఇరవయ్యవ శతాబ్దంలో గిరిజనులు వ్యవసాయాన్ని 1. పోడు, 2. కుకి అని రెండు విధాలుగా చేస్తున్నారు.

1. పోడువ్యవసాయంలో అడవులను నరికి దున్ని వ్యవసాయం చేసేవారు. ఆ విధంగా పంటలు పండించాక ఆ ప్రదేశాన్ని వదిలి గిరిజనులు వేరోచోటికి వలస వెళ్లి తిరిగి మళ్లీ అదే విధంగా భూమిని సాగులోకి తెచ్చేవారు. వీరు స్థలాన్ని మారుస్తూ రెండు, మూడేళ్ల కొకసారి సాగుచేసి నేల మారుస్తుంటారు. పంట మార్పిడిలేదు. ఈ వ్యవసాయం వల్ల అడవికోత ఉండదు. స్థలాన్ని మార్చడం వల్ల ప్రకృతికి నష్టం జరగదు. అడవి సహజంగానే అభివృద్ధి చెందడం జరుగుతుంది. ఎరువులేకుండా ప్రాచీన సంప్రదాయాన్ని అనుసరిస్తారు కాబట్టి నేల మారుస్తారు. ఒకేచోట వ్యవసాయం చేస్తే భూమి సారం తగ్గిపోయి పంటలు పండవని వీరి నమ్మకం. వీరు అడవంతా తిరుగుతూ గుట్టలపై వ్యవసాయం చేస్తారు. గిరిజనేతరులు అడవుల్లో ప్రవేశించి అక్కడి పంటల్ని ఇతర ప్రదేశాలకు తరలించడం చేయటం వల్ల ఈ పోడు వ్యవసాయపద్ధతి అడవుల వినాశనానికి దారి తీసింది.

2. కుకి వ్యవసాయంలో గిరిజనులు ఏటవాలు భూములలో, లోతట్టు ప్రాంతాల్లోనేలను పెళ్లగించి, భూమిలో కన్నాలు తవ్వి వాటిలో విత్తనాలు నాటి వ్యవసాయం చేస్తారు. ఈ రకం వ్యవసాయం వల్ల రైతులకు చాలీ చాలని ఆదాయం లభించేది. అందువల్ల ఈ గిరిజనులు అడవులలో లభ్యమయ్యే ఇతర ఉత్పత్తులైన కుంకుమపువ్వు, పండ్లు మొదలైన వాటిపైన ఆధారపడేవారు. కొన్ని సందర్భాలలో కరువు కాటకాలు సంభవించి ఎంతో నష్టం జరిగేది. ఒక్కొక్కప్పుడు ప్రకృతి భీభత్సాలతో వాళ్ల పునాదులు లేని పూరిళ్లకి నష్టం జరిగేది. అయినప్పటికీ ఈ గిరిజనులు కష్ట నష్టాలను సహిస్తూ, అడవుల్లో నివసిస్తుంటారు. భూమి గిరిజనుని ప్రాణం. వ్యవసాయం అతని వృత్తి, అడవితల్లి తనకూ తల్లి! ప్రతి రోజూ వీళ్ల పని భూమి, పొలంచుట్టూతే ఉంటుంది. చుట్టూ అడవి, నీటి వసతి, స్వచ్ఛమైన గాలీ, వెలుతురూ, పశుసంపద ఇన్ని ఉన్నా సరిపోయేతిండి ఉండదు. జావతాగి కడుపు నింపుకునే కుటుంబాలే

ఎక్కువ. మరికొంతమందికి ఎంతో కొంత అన్నం దొరికినా జావకూడా తప్పనిసరిగా తాగాల్సిన ఆర్థిక దుస్థితిలోనే ఉంటారు.

కొలాములు నాయకపోళ్లకంటె ఇంకా వెనక బడినవారు; వీళ్లు వ్యవసాయం కూడా చేయరు. అడివిలోంచి వెదురుకొట్టి తీసుకొచ్చి బద్దలుగా చీల్చి తడికెలు, బుట్టలు, గుల్లలు, గంపలు, గుమ్ములు, గాదెలు, జల్లెళ్లు చేటలు అల్లుతారు. ఈత చెట్లు ఉన్నచోట ఈత కమ్మలతో చాపలు, చీపురులు కట్టి అమ్ముకుంటారు. అదే వాళ్ల బతుకుతెరువు. చేసిన వస్తువులతో ఊరూరా తిరిగి అంగళ్లు చేసి అమ్ముకుంటారు. వీళ్ళ నుండి కూడా అధికారులు తమ జులుంతో పైసలు వసూలు చేసుకుంటారు. వీళ్ళు అల్లె తడకలకు, కావాల్సిన వెదురు, బొంగు అడవిలోంచి నరుకుతున్నారంటూ వారిని శిక్షిస్తారు.

గిరిజనుల మొత్తం జీవితం వ్యవసాయంతో ముడిపడి ఉంటుంది. అన్ని పనులు వ్యవసాయపు అవసరాల చుట్టూరానే రూపొందిస్తారు. వీరికి వరి, జొన్న, మొక్క జొన్న, రాగులు, ముఖ్య పంటకాగా వ్యాపార పంటలైన ప్రత్తి, పొగాకు, మిరప అతి తక్కువ ప్రాంతాంలో పండిస్తారు. నువ్వులు కూడా పండిస్తారు. వరిసాగు ప్రధానం అయిన చోట జులైమాసం నుండి దున్నడం, విత్తడం, నారుపోయడం ప్రారంభిస్తారు. నీటి సౌకర్యం తక్కువ ఉన్న భూములు కనుక ఎంత ముసురు ఉంటే వాళ్లకి అంత లాభం. వీళ్లు పెద్ద వర్షాలు కోరుకోరు. ఆ వర్షాల ఉపయోగం కూడా తక్కువే. ఈ మధ్య కొందరు గిరిజనులు నాగలిని ఉపయోగిస్తున్నారు. కొందరు గిరిజనులు నాటు వేసే పద్ధతికంటే అలకడానికే ఎక్కువ ప్రాధాన్యమిస్తారు. వీరిలో కొందరికి పశువు లుంటాయి. అవీ వీరిలాగే బక్క చిక్కి ఉంటాయి. ఆవులకు మేకలకు పాలు పితకడం చేయరు. అది వీరి సాంప్రదాయం. తమలాగే ఆ పశువులు కూడా అడవిలో తినడం, ఊర్లో ఉండటం అనే పద్ధతిగా వాటిని పెంచుతారు తప్ప ప్రత్యేకంగా వాటిపై ధ్యాస నిల్పరు. వీరు తమ అజ్ఞానం,

దారిద్ర్యం వల్ల వ్యవసాయంలో మెలుకువలు తెలియక తగిన ఫలితాన్ని ఎలా పొందలేరో అలాగే పశువుల పెంపకంలో కూడా వాటి ఆలనా పాలనా సరిగా చూడక, వాటి విలువలు తెలియక సరియైన పద్ధతులు అర్థంగాక పురాతన పద్ధతుల్ని, అశాస్త్రీయ పద్ధతుల్నే అవలంబిస్తున్నారు.

వీరందరి ఆర్థిక జీవనం ఏరకంగా ఉన్నా సామాజిక సంబంధాలను పరిశీలిస్తే మాత్రం గిరిజనులలో సమైక్యత కన్పిస్తుంది. దీనికి కారణం గిరిజనులలో భూమి, తదితర ఉత్పత్తిసాధనాలు స్వంత ఆస్తి అనేది లేకపోవడం. గిరిజనులు ఇప్పటికీ సమిష్టి ఆస్తి సంబంధాల ఛాయలను వదులుకోలేదు. ఎవరి వ్యవసాయం వాళ్లు చేసుకుంటున్నా ఒక సమిష్టి పద్ధతిలో చేస్తారు. అందరూ ఒకేసారి మొదలు పెట్టడం. సమిష్టిగా పూజ తదితర కార్యక్రమాలను నిర్వహించడం, పంట ఒకేసారి కోయడం, గ్రామమంతా ఒకేసారి అంగడికి వెళ్లటం. ఇలా ప్రతి పనీ పెండ్లి అయినా, చావు అయినా సమిష్టిగా జరుపుకుంటారు. గ్రామమంతా కలిసి పండుగలు, వేడుకలూ, ప్రముఖ సందర్భాలలో ఉమ్మడిగా తమ ఆనందాన్ని పంచుకుంటారు. పంట వేసేటప్పుడు, కోతలు కోసేటప్పుడు, విప్పచెట్టుపూత పూసినపుడు, మొట్టమొదటి వర్షం కురిసినపుడు పండుగలు జరుపు కోవడమే కాక కొన్ని సమయాలలో భీమదేవర పెళ్లి, పురాణ పురుషుని పుట్టుకను ఆధారంగా చేసుకొని పండుగలు చేసుకుంటారు. మోదుగపూలు నవలలో వీరి పుట్టుకని కథగా చెప్పుకోవడం రచయిత వివరించారు[4].

నాగరిక సమాజాన్ని ముక్కలు ముక్కలుగా చేసి చివరకు మనక పక్కనున్న వాళ్లు మనకళ్ల ముందే మరణించినా పట్టించుకోనంతగా మన సంస్కృతి ఎదిగింది. దీనికి విరుద్ధంగా గిరిజన సంస్కృతిలో కట్టడి ఉంటుంది. వీరు ప్రకృతిపట్ల విచిత్రమైన భ్రమలను కలిగి ఉంటారు. ప్రతి వస్తువులోనూ ప్రాణం ఉందని భావిస్తూ, గాలి, చెట్లూ, నదులు,

భూమి, పైరులో ఉన్న ఆ ప్రాణంతో మంచిగా ఉండటం అవసరమను కొంటారు. అందువల్లనే తాము తినే పదార్థాలన్నింటిని ప్రకృతికి సమర్పిస్తారు. ఇదే క్రమంగా నరబలులకు కూడా దారి తీసింది. ఆ జీవిని ప్రసన్నం చేసుకోవడానికి వీరు నృత్యాలు చేసి పాటలు పాడతారు. వీరు ఈ నృత్యాలను ఎప్పుడు పడితే అప్పుడు చేయరు. ఒక నిర్ణీత పద్ధతిలో, నిర్ణీత సమయంలోనే చేస్తారు. ఈ నృత్యాలు చాలా వరకు ఈ దేవుళ్లను ప్రసన్నం చేసుకోవడం కోసమే చేస్తారు. వీరి జీవిత విధానమంతా అర్థంకాని విశ్వాసాలతో నిండిపోయి వుంటుంది. పుట్టుక, పెళ్లి, చావు, ఆట, పాట, వ్యవసాయం అన్నీ ఖచ్చితమైన పద్ధతిలో జరగాలి. దీంట్లో ఏది తప్పినా ఉపద్రవం ముంచుకొస్తుంది. తాము చనిపోయిన తర్వాత దేవతలుగా మారి పూజింపబడతామని వీళ్ల ప్రగాఢ నమ్మకం. ఇట్లా మారిన దేవతలు అక్కడే జీవిస్తూ నిత్య జీవితంలో కలగ జేసుకుంటూ ఉంటారు. అలాగే వీరికి దృష్టిపైన కూడా నమ్మకం. తమకు మంచి జరిగినపుడు ఈ అదృశ్య శక్తుల దృష్టి తగలకుండా చూసుకొంటారు. కొన్ని తెగలలో బాగా పండిన పంటకు దృష్టి తగులుతుందనే భయంతో పంట నాశనమయిపోయిందని పాటపాడుతూ ఆ రోజంతా నృత్యం చేస్తారు. సవర తెగ గిరిజనులు పెళ్లిలో ముందు అమ్మాయికి విల్లంబుతో పెళ్లిచేసి ఆ విల్లంబును నదిలో పారేస్తారు. దానితో ఆమె విధవ అయినట్లు భావించి తిరిగి వరునితో పెళ్ళిచేస్తారు. అలా చేయడం వల్ల దోషం తొలగి దంపతులు కలకాలం చల్లగా ఉంటారని విశ్వాసం.

గిరిజనుల కళా జీవితంలో ముగ్గులు పెట్టడానికి ఎంతో ప్రాధాన్యముంది. సౌందర్య దృష్టి కన్నా దుష్ట శక్తులను రాకుండా చేయ డానికి ముగ్గులు ఉపకరిస్తాయని నమ్మకం. అట్లాగే శరీరానికి పచ్చ పొడుచు కుంటే చనిపోయిన తర్వాత తమ శరీరాన్ని దయ్యాలు తినవన్న మూఢ

విశ్వాసం వుంది. అయితే ఈ పచ్చ బొట్లలో కళ, సృజనాత్మకమైన ఆనందం వున్నా విన్యాసం పాలే ఎక్కువ. వారి శ్రమ నుండి కళా కాంక్షను, సృజనాత్మకతను, విశ్వాసాలను వేరు చేయడం అసాధ్యం.

గిరిజనుల జీవితం అంతా వ్యవసాయంతోనే ముడిపడి ఉంటుంది. ఈ వ్యవసాయంలో ఎంత కష్టించినా అభివృద్ధి పాలు తక్కువే. అయినా జీవితంలో నిత్యం సంతృప్తి అనుభవించడం గిరిజనుల ప్రత్యేక జీవితంలో ప్రతిక్షణం వ్యాపారంతో సంబంధం కల్గి ఉండదు కాబట్టి ఉన్నదాంట్లో తృప్తిగా బ్రతకడం, లేనిదానికోసం అర్రులు చాచడం ఉండదు.

కంట్రాక్టర్లు, కలప వ్యాపారులు, దళారీలు, పెట్టుబడిదారులు, గిరిజనేతరులు మొదలైనవారు భూ ఆక్రమణల ద్వారా, ఇతర దౌర్జన్యాల ద్వారా గిరిజనేతరులు ఉన్న ఈ భౌతిక జీవితాన్ని మార్చటానికి ప్రయత్నిస్తున్నారు. మైదాన ప్రాంతాలకు చెందిన భూస్వాములే గాక గ్రామ పటేళ్లు, పట్వారీలు కూడా ఈ గిరిజనులపై అధికారం చెలాయిస్తారు. వీరు ప్రజల నుండి ప్రభుత్వానికి చెల్లించవలసిన భూమి శిస్తును పదిరెట్లనుండి వందరెట్ల వరకు వసూలు చేసేవారు. గిరిజనులను తాత్కాలిక ఆక్రమణ దారులుగానే ఉంచుతూ, ఆభూములపై పట్టా హక్కును ఈ అధికారులే పొందేవారు. ఆ భూములు గిరిజనుల పేర పట్టా అయి ఉన్నాయని ప్రభుత్వానికి తెల్పేవారు. కాని అది చాలా స్వల్ప భాగమే. నిర్బంధచాకిరి, వెట్టి చాకిరి అమలులో ఉండేది. వారెంతో కష్టం చేసి సంపాదించుకున్న దాంట్లో కాస్తంతైనా వారికి దక్కనియ్యరు ఈ భూస్వాములు.

వీరేగాక గిరిజనుల శ్రమను ఫారెస్టు అధికారులు నానా విధాలుగా దోచుకునేవారు. గిరిజనులు నిత్యావసరాలైన కలపనుగాని, వంట చెరకును తీసుకుపోవాలంటే లంచాలు ఇవ్వక తప్పలేదు. గిరిజనుల దగ్గర లంచాలు గుంజనిదే తోచదువారికి! లంచం ఇవ్వనిదే భుక్తి గడవదు వీరికి! చేతిలో గొడ్డలి పట్టుకోవడమే పాపం! వారిని పట్టుకు పోయి కొట్టేవాళ్లు. ఫారెస్టు అధికారులకు ఎంతో కొంత ముట్ట జెప్పడమే వారి మనుగడకు ఏకైక మార్గం. వీరి బారి నుండి తప్పించుకొని కొత్త ప్రాంతాలకు వెళ్లినా అక్కడా ఇదే పరిస్థితి ఎదురౌతుండేది. అడవులలో లభ్యమయ్యే అన్నింటి మీద ప్రభుత్వం వేలం వేసేది. ఆనాటి గిరిజనుల దుస్థితి ఎలా ఉండేదంటే ఆ అడవిలో పుట్టిపెరిగినా, అక్కడ ఉన్న కాంట్రాక్టరుకో, ఫారెస్టుగార్డుకో, అధికారికో మూల్యం చెల్లించకుండా ఒక్క ఆకును కూడా అనుభవించే వీలు లేని దుర్భర పరిస్థితి.

గిరిజన కార్మికులు అతి తక్కువ జీవితాలు చెల్లించి కాంట్రాక్టర్లు షావుకార్లు విపరీతంగా డబ్బు సంపాదించుకునేవారు. గిరిజన ప్రజలకు చింతపండుకు, తేనెకు, మిరపకాయలు, నూనె, బట్ట, పొగాకు తమ ఇష్టం వచ్చినంత ఎక్కువ ధరలకు అమ్మేతారు. వీరికి పండిన పంటను అమ్ముకోవడానికి తగిన సౌకర్యాలు లేవు. గ్రామాల్లో తాలూకా కేంద్రాల్లో షావుకార్లు తిష్ఠ వేసుకు కూర్చోవడంలో వాళ్లు ఆ షావుకార్లకే అమ్మవలసి వస్తుంది. ఈ షావుకార్ల అడవిలో ఉత్పత్తి అవుతున్నదంతా తరలించుకుపోవడంలో అందెవేసినచేయి. ఈ గిరిజన ప్రజల మార్కెట్ ఈ షావుకార్లతో, సంతకు వచ్చి పోయే షావుకార్లతో ముడిపడి ఉంటుంది. ఈ షావుకార్లందరూ గిరిజనుల్ని సులభంగా నిలువు దోపిడి చేసి తమ పబ్బంగడుపు కుంటారు.

వీటన్నిటి వల్ల గిరిజన సంస్కృతి అంతరించిపోతుందేతప్ప వారి భౌతిక జీవితం అభివృద్ధి కాదు. వారి మూఢ విశ్వాసాలు నాశనం కావు. విప్లవం ఒక్క పారిశ్రామిక రంగాలకే పరిమితం కాకుండా అడవుల్లో కూడా జరగాలి. ఆ విప్లవం ద్వారా దేశ సంపదను శ్రామికుల పరం చేయాలి. వీరు విప్లవంలో భాగమైవారి సమిష్టి జీవనాన్ని, కళను, సంస్కృతిని శ్రామికులకు అందించినపుడే మానవీయ లక్షణాలను కాపాడుకోగల్గుతారు. గిరిజన సంస్కృతిలోని ఉన్నతమైన లక్షణాలు కాపాడాలంటే అది మొత్తం సమాజంలో నెలకొల్పే ప్రయత్నం జరగాలి. వీరు ప్రకృతిని చూసి భయపడే అవసరం పోవాలి. విజ్ఞాన సంపద అందరిదీ అవ్వాలి. సుమారు నూటయాభై సంవత్సరాలనుంచీ గిరిజనుల జీవితం మారుతూనే ఉంది. ఈ మార్పులో గిరిజనులు కూలీలుగా, రైతులుగా మారి వర్గ సమాజపు చట్రంలో ఇరుక్కున్నారు. వీరు గడిచిన ఈ పోరాటాలలో జీవితాల్ని చిన్నా భిన్నం చేసుకున్నారు. వీరి పోరాటాలే గిరిజన పోరాటాలుగా ప్రసిద్ధిగాంచాయి. అడవిలో బ్రతుకుతున్న ఆటవీకులకు నాగరికత అంటే ఏమిటో తెలియదు. వాళ్లు రాతి యుగంలో జీవిస్తున్నారు. అసలు రాతి యుగం అంటే తెలియని వీరికి తెలిసింది జీవితం మాత్రమే. ఇటువంటి కోయల జీవిత వర్ణన రంగాచార్యుల గారి మోదుగుపూలు నవలలో కన్పిస్తుంది. రచయిత కోయగూడెంలో వున్న పాతికగుడిసెల్లో నివసిస్తున్న కోయజీవితాన్ని కళ్లకు కట్టినట్లు చిత్రీకరించారు. అడవిలో ఉన్నదంతా కోయవాడిదే. ఉక్కులాంటి తన శరీరంతో అడవిని కొడుతూ భూమిని సాగుచేస్తూ తన చెమటోడ్చి పంటలు పండిస్తాడు. ఆ పంట రాసులు చూసుకొని మురిసి

పోతాడు. అతని ఆనందం చూసి మురిసి నంత వరకే పరిమితమౌతుంది. షావుకారు వచ్చి పంటలన్నీ తుడుచుకుపోతాడు. చివరకు తన రెక్కలు మాత్రమే మిగులుతాయి. ఎప్పటిలాగే ఆడ, మగ అడవి మీద పడ్తారు. కాయగసరులతో, దుంపలతో తమ జీవనం గడుపుతారు. అలా కాల చక్రం తిరుగుతూ ఉంటుంది. విప్పసారా తాగుతూ ఉంటారు. వీరెప్పుడూ వర్షం కోసం ఎదురుచూస్తూంటారు. వర్షంవారికి ప్రాణం. నెమళ్లు అడవి అంతా కూస్తున్నప్పుడు వర్షం రాబోతుందన్న సంగతి కోయదొరలకు తెలుస్తుంది. బుట్టల్లో నవ ధాన్యాలు తెచ్చి విత్తనాల పండుగ జరుపుకుంటారు. వీరికి దొక్కటే ముఖ్యమైన పండగ.

మోదుగుపూలు నవలలో ఇటువంటి పండగను ఆడ, మగ అందరూ జట్లు జట్లుగా కలిసి చెట్టా పట్టాలేసుకొని పాటలు పాడుకుంటూ తమ పూర్వీకులు ఎట్లా వచ్చారో పురాణ కథల ద్వారా నెమరు వేసుకుంటున్న సమయంలో గూడెంలో తలారి శివుడు గజ్జె ఘల్లుమంటుంది. వాడి గజ్జె ఘల్లుమనగానే గూడెంలో ప్రతి ఒక్కరి గుండె జల్లు మంటుంది. ప్రతి గిరిజనుడు కొండలను తొలిచే, మసిచేసే శక్తీ, పులితో పోరాడే శౌర్యం ఉన్నా అధికారులను చేస్తే హడలిపోతారు. అది కోయల బలహీనత అని తెలుసుకుంది దొరల బలం!

తలారి శివుడు గూడెంలో పెద్దగా పిలువబడుతున్న సమ్మయ్య దగ్గరికి వచ్చి గూడానికి గిర్దావర్, అమీన్ వస్తున్నారని చెప్తాడు. తాసిల్‌దార్ బంగ్లా కట్టడానికి కోయలంతా కట్టె కొట్టి పెట్టాలని చెప్పి అందర్ని తరలించుకుపోయేందుకు సన్నాహాలు చేస్తుంటారు. ఈ కోయలంతా ఒక

గూడెం ప్రజలు ఇంకొక గూడానికి తరలివస్తూంటే ఒకరినొకరు సాదరంగా ఆహ్వానించుకొని అందరూ కలిసి సంబరంగా పండుగలాగా ఆ రోజును జరుపుకుంటారు. కోయ దొరల జీవితంతో పాటు వారి ప్రణయం, కోయల ఆచార వ్యవహారాలు, వారు ఓషధులుగా వాడుకుంటున్న సంజీవిని చెట్లు, తమ ప్రాణాలు పులి వాత పడకుండా దాన్ని దెబ్బతీయటంలో చూపిన చాకచక్యం మొదలగు వాటిని ఈ నవలలో చాలా వివరంగా చూడవచ్చు.

సుఖాలతో, మధ్య మధ్య వస్తున్న దుఃఖాలతో ఎవరి ప్రమేయం లేకుండా తమ బ్రతుకును తాము బ్రతుకుతున్న ఆ అడవిలో కూడా దొరలు, అమీన్లు వారిని సరిగ్గా బతుకనివ్వరు. తాసిల్దారు ఇంటి కట్టడం కోసం కోయవాళ్లందర్నీ కూలికి తీసుకు రమ్మంటాడు.

కోయలల్లో ప్రముఖ పాత్రగా కన్పిస్తాడు సింగడు. ఇతడు గిరిజనుల పెద్ద అయిన సమ్మయ్య కొడుకు, ఇతడు చాలా పరాక్రమవంతుడు. కోయలందరు కూలీలుగా ఊర్లోకి వచ్చినప్పటి నుంచి నాగేష్ అనే కార్యకర్త వీళ్లకు అడవిలో జరుగుతున్న అన్యాయాలన్ని ఒక్కొక్క సంఘటన ద్వారా విడమర్చి చెప్తున్నాడు. వాళ్లలో మెల్లమెల్లగా ఆలోచనలు రేకెత్తిస్తున్నాడు. వాళ్లకు తమను అన్యాయంగా దోచుకుంటున్నారని బోధపడసాగింది. రఘు మాటలను సింగడు శ్రద్ధగా విన్నాడు. తాను చదువుకోక పోయినందుకు విచారపడ్డాడు. తనలో వస్తున్న మార్పును అందరికి చెప్పాలనే తహ తహ ఎక్కువ కాసాగింది. స్తంభాలు పీకే వేసే కార్యక్రమం అయిపోయేలోపున కోయలు నాగేశ్, రఘులు చెప్పిందాన్ని చర్చించుకున్నారు. దౌర్జన్యం, దోపిడి, అధికారం, పీడితులు, అన్న పదాలు వారికి అర్థం కాసాగాయి.

తలారి శివుడు ఎప్పటిలాగే వచ్చిజులుంచేయబోతే ఇంతె జాములు వాళ్లనే చేసుకొమ్మను కోయలెందుకు చేస్తారు? అని ప్రశ్నిస్తాడు. ఆ జవాబు గిర్దావరు గుండెల్లో భయం పుట్టించింది. అతడు ప్రాణాలు చేతబట్టుకొని పారిపోయాడు. ఆ కోయగూడెం ప్రజలు మొదటిసారిగా విజయం సాధించారు. నాగేశ్ కోయల దొరకు అండగా అడవిలో వుంటాడు. నాగేశ్ ద్వారా తుపాకీ కొట్టడం నేర్చుకొంటాడు సింగడు.

కోయగుడెం భూములను పక్క ఊరి దొర కొంటాడు. ఖబ్జా ఇప్పించడానికి అడవిలోకి మాత్రం రావటానికి ఎవరు ఒప్పుకోరు. ఆ రకంగా రెడ్డి గారు మోసానికి పోయి, తిరిగి వెనక్కుపోవడం ఇష్టం లేక తన మనుష్యులతో కోయగూడెంలోకి ప్రవేశిస్తాడు. అక్కడ అతన్ని ఎదుర్కోటానికి కోయలే ఉండరు. ఖాళీ గుడిసెలు. అక్కడ బంగళా నిర్మాణానికి ముగ్గు పోస్తారు. అందరూ ఆనందంగా మత్తులో వున్నప్పుడు అర్థరాత్రి తుపాకీ పేలింది. రెండువైపులా తుపాకీలు తమ పనిని నిర్వరిస్తున్నాయి. మీరంటే మాకు పగ లేదు. తుపాకీలు విడిచిపోండి, ప్రాణాలు దక్కవు; అన్న కేక ప్రతిధ్వనిస్తుంది. భయంతో అందరూ కోయగూడెం నుంచి జారుకున్నారు.

ఈ రకంగా నాగేశ్ అడవిలో కోయగూడెంలో విప్లవాన్ని తెచ్చాడు. దొరల దౌర్జన్యాలను ప్రతిఘటించే శక్తిని సంపాదించుకున్నారు. ఈ పోరాటంలో వీరు విజయం సాధించారని చెప్పలేం. వారి పోరాటం అనంతరం సాగుతూనే వుంది. ఈ పోరాటం ఇంకా సాగుతుందనడానికి నిదర్శనం అడవి, అడవిలో అన్నలు అన్న నవలల ద్వారా తెలుసుకోవచ్చు.

# గిరిజన రైతాంగ పోరాటాలు

గిరిజన రైతాంగ పోరాటానికి తెలంగాణాలో మైదాన ప్రాంత రైతాంగ పోరాట చరిత్ర కంటే ప్రాచీన చరిత్ర ఉంది. .... తెలంగాణా పోరాటం ఒక దారి పట్టాక కూడా గిరిజన రైతాంగ పోరాటం గురించి ఎవరూ పట్టించుకున్నట్లు లేదు. తెలంగాణ పోరాటపు వివిధ దశలను కథలుగా నవలలుగా ప్రతిఫలించిన తెలుగు సాహిత్యంలో కొమరం భీం - నాయకత్వాన జరిగిన సాయుధ తిరుగుబాటును చిత్రించిన రచన ఏది రాకపోవటాన్ని బట్టి అట్లా అనుకోవలసివస్తుంది అని కాత్యాయని విద్మహే గిరిజన పోరాటాన్ని తమ వ్యాసంలో వివరించారు[5].

1858వ సంవత్సర ప్రారంభం నుంచే తెలంగాణా జిల్లాలో ఉద్యమాలు తలెత్తాయి. ఇప్పటి రాయచూర్ తెలంగాణా ప్రాంతంలో ఉండేది. మొదట రాయచూర్‌లో భీమ్‌రావు దేశాయ్ అనే వీరుడు కొంత సైన్యం సమకూర్చుకొని బ్రిటీష్ వారికి ఎదురు తిరగడం నేర్చుకున్నాడు. వారి నాయకుడు రాంజీగోండు. బ్రిటీష్ వ్యతిరేకి. చివరకు ఉట్నూరు తాలూకాలో రాంజీ నాయకత్వంలో గోండులకు, ఇంగ్లీషు వారికి యుద్ధం జరిగింది. గోండులు పరాజితులయ్యారు. రాంజీ గోండును నిర్బంధించింది నిర్మల్‌కు తీసుకువచ్చి అతన్ని ఒక చెట్టుకు ఉరి తీసి చంపారు. ఆ చెట్టును రాంజీ గోండు చెట్టు అని వ్యవహరిస్తారు. 1867లో జంగ్ బహదుర్ అన్న బిరుదుగల రాంరావు అనే యోధుడు కొన్ని వందల సైన్యంతో బ్రిటీష్ వారి నుండి సతారానా అనే జిల్లాను స్వాధీనం చేసుకోవడమే తన ఉద్దేశ్యమని ప్రకటించాడు. కాని 1867లో బ్రిటీష్ సైన్యం రాంరావును నిర్బంధించి అండమాన్ దీవులకు పంపించి యావజ్జీవ శిక్ష విధించారు[6].

అప్పటి నుండి ఆదివాసి పోరాటాలు జరుగుతునే ఉన్నా నిజాం సామంత రాజుకు వ్యతిరేకంగా జరిగిన సాయుధ పోరాటం చెప్పుకోతగ్గది.

జోడన్ ఘాట్ కేంద్రంగా ఉండి, తమ ప్రాంతాల్లోని సర్వహక్కులు తమకే చెందాలని కొమరం భీం నాయకత్వాన సాయుధ తిరుగుబాటు జరిగింది. 1925-26 సంవత్సరాలలో ఆదిలాబాద్ గిరిజన ప్రాంతాల్లో అమలుకు వచ్చిన అడవి సంరక్షణ చట్టాలు మైదాన ప్రాంతాల నుండి వచ్చే గిరిజనేతర భూస్వాముల షావుకార్ల వడ్డీ వ్యాపారస్థుల క్రూరమైన దోపిడి, ఇవన్నీ కలిసి అడవుల్లో పోడు వ్యవసాయం చేసుకొనే గిరిజనులను వాళ్ల భూముల్నుండి వెళ్లగొట్టించి, అడవి లోతట్టు ప్రాంతాలకు తరుముతూ వచ్చాయి. ఈ పరిస్థితులు కొమరం భీం నాయకత్వంలో భూమి మీద హక్కు కోసం సాయుధులై తిరుగబడటానికి గోండులను ప్రేరేపించాయి. ఈ తిరుగుబాటు ఉద్యమం దాదాపు ఏడు నెలలు నైజాం పోలీసుల దాడిని ఎదుర్కొంటూ సాగి చివరకు 1940 సెప్టెంబరు 1వ తేది నాటికి అణచివేయబడింది.

గిరిజనులు అడవినే నమ్ముకోవడం వల్ల తమను భూమి నుండి బేదఖల్ చేయడానికి, ఇతర సంపదలను తరలించుకు పోవడానికి సిద్ధం అయిన ప్రతి వారినీ, ప్రతి చోట ఏదో ఒక రూపంలో ఎదిరించి పోరాటానికి సిద్ధపడ్డారు. ఉత్తర తెలంగాణా చుట్టు పక్కల గల అటవీ ప్రాంతమంతా ఒకప్పుడు గోండు రాజులకు నిలయం. బ్రిటీషు వారి ఆక్రమణల నుండి ఇప్పటి వరకు ఎక్కడికక్కడ అనేక రకాలైన పోరాటాలలో ప్రతిఘటనలు జరుగుతూనే ఉన్నాయి. మెజారిటీ ఆదివాసి క్షేత్రాలలోని ప్రజలు ప్రభుత్వ వ్యతిరేక పోరాటాలలో రాజ్యం యొక్క అణచివేతను, దోపిడిని ఎదిరిస్తూ ఉద్యమాలు నిర్మిస్తున్న చరిత్ర ఈ నాటికీ ఉంది. సామ్రాజ్యవాదంతో పోరాడి ఓడి లోతట్టు అడవుల్లోకి తరుముగా తలవంచి బ్రతకకుండా జీవించిన వారి చరిత్రగానే, స్వేచ్ఛా కాంక్షకు ప్రతీకగానే గిరిజనుల చరిత్ర నిలిచి ఉంది[7] ఆ చరిత్రే చారిత్రక సత్యాలతో నిండి ఉన్న నవలలుగా రూపొందించబడ్డాయి. ఆ చారిత్రక అంశాలను తీసుకునే అల్లం రాజయ్య, సాహుల కొమురం భీం నవల వెలుబడింది.

కొమరం భీం నవల నిజానికి కల్పనలతో, ఊహలతో కూడుకున్న పుస్తకం కాదు. కొమరం భీం పేరుతో ఉన్న వ్యక్తి జీవిత చరిత్ర ఈ నవలలో 1915 నుండి 1940 దాకా జరిగిన సంఘటనలను పొందు పర్చారు. ఆదిలాబాద్ గిరిజనరైతాంగ పోరాటం కొమరం భీం నడిపిన పోరాటాన్ని చారిత్రక నవలలుగా పునర్నిర్మించుకుంది. సాహు, అల్లం రాజయ్య కలిపి అనేక ప్రభుత్వ నివేదికలు, సామాజిక శాస్త్రవేత్తల పరిశోధనలు అధ్యయనం చేసి, కొమరం భీం సమకాలికులను సన్నిహితులను కలిసి మాట్లాడి వర్తమాన గిరిజన రైతాంగ పోరాటాలకు నిర్మాణాత్మకమైన స్ఫూర్తి నివ్వటం కోసం ఆయన చరిత్రను నవలగా రచించారు.

1975లో ఉద్యమాలకు సి.పి.ఐ. (ఎమ్.ఎల్)పీపుల్స్ వార్ గ్రూప్ తమ నాయకత్వాన్నందించింది. మొట్ట మొదట ఈ దళాన్ని గిరిజనులు గుర్తించలేదు. అడువులలో ఉన్నా గిరిజనులు మొదట దళాలను దగ్గరికి రానివ్వలేదు. దళ సభ్యులు భయంకరమైన జీవితాల్లో నిండిన దోపిడిని వారికి వివరించారు. వెంటనే వారి జీవితాల్ని బాగు చేసే ప్రయత్నాలు ప్రారంభించారు. వారు చేస్తున్న రైతాంగ పోరాట లక్ష్యాలను వివరించి వారి మద్దతును సంపాదించుకున్నారు. మొట్ట మొదటి సారిగా గిరిజనులపై సాగుతున్న దోపిడి పద్ధతులను తెలియజేసారు. గిరిజనులను దోచుకు తింటున్న వారిపై అందరూ సంఘటితమై ఏ రకంగా పోరాడాలో నేర్పారు. ఆ రకంగా గిరిజన పార్టీ పైనా, దళ సభ్యులపైనా విశ్వాసం కుదిరేట్లు చేసుకున్నారు. వాళ్లలో చైతన్యం కల్గించటానికి పాటలను చేయూతగా తీసుకున్నారు[8].

గిరిజనులకు వారి జీవితం అడవిలోని జంతువుకన్నా హీనమైందని భావించుకున్నారు. పొద్దున సద్దికూడూ, మధ్యాహ్నం నీళ్లకూడు, జీతం కొద్ది, పొద్దంతాపని, అందువల్లనే పెద్దోరికి భాగ్యం

పోగయ్యిందని తెలుసుకున్నారు. పేదవాడికి తిట్లు, తన్నులూ, కష్టాలు, పేదరికం తప్పలేదు. వారి జీవితాల అనుభవాలతో పాటలను పేర్చుకున్నారు.

యిన్నిటి కోర్చి యిన్న ఏ రోజు తిట్టులన్నా

ఎట్టిగా మాటలాడ కట్టేసి తన్నుతారు

ఈ బతుకు వద్దు పదరా పోరాడు జీతగాడ

అని పాడుకున్నారు. ఫలితంగా 40 ఏళ్ళ కింద కొమరం భీం పోరాటవారసత్వాన్ని గుర్తుచేసుకొని తెలంగాణా గిరిజనరైతాంగం, గిరిజన రైతు కూలీ సంఘాలుగా ఏర్పడి తమపై జరుగుతున్న దోపిడీ దౌర్జన్యాలను, అణచివేతను ప్రతిఘటించాలని నిర్ణయించుకుంది. అందులో భాగమే ఇంద్రవెల్లిలో 1982 ఏప్రెల్ 20వ తేదిన జరిగిన సభ. ఆ సభను విఫలం చేయడానికి పోలీసులు కాల్పులు సాగించారు. నిరాయుధులైన గోండులు సుమారు 60 మంది ఆ కాల్పుల్లో మరణించారు. ప్రభుత్వ రికార్డుల్లో మృతుల సంఖ్య 13 అని తేల్చి చెప్పారు[9]. ఆ ఆదివాసుల మరణం గిరిజన రైతాంగపోరాటం మరింత ఉధృతపడటానికి దోహదం చేసింది. దొడ్డి కొమరయ్య అనే కార్యకర్త మరణంతో ఆనాటి తెలంగాణ పోరాటం పోటెత్తినట్లుగా ఇంద్రవెల్లి కాల్పులు ఈ పోరాటాన్ని విజృంభింపచేశాయి. ఈ సంఘటన జరిగిన తక్షణమే ఆందోళన చేసిన గోండులను, వారిజీవితాలను, పోరాటాలను చిత్రిస్తూ 1981 నుంచి సృజనలో ఎన్నో కథలు వచ్చాయి. అడవిలో వెన్నెల అన్న కథ ఉత్తమ కథగా నిర్ణయించి కొడవటిగంటి కుటుంబరావు స్మారక బహుమతి అందుకొంది. కథలు చాలా వస్తున్నా వచ్చినా మొట్టమొదటి నవల కొమరం భీం. దీని తర్వాత వసంతరావు దేశపాండే అడవి చతురలో 1988లో ప్రచురించారు. మూడవ నవలగా సాధన

రచించిన **అడవిలో అన్నలు** (1990) అరుణతారలో ప్రచురించారు. దీని తరువాత నవల పులి ఆనందమోహన్ రాసిన **వసంతగీతం** (1990) పేర్కొనవచ్చు.

**కొమరం భీం** నవల కాల్పనికతతో కూడుకున్నది కాదని రచయితలు మొదటే చెప్పుకున్నారు. ఇది అతని జీవిత చరిత్ర. భీం పదిహేనేళ్ల వయస్సున్నప్పటి నుంచి 1940లో అతడు మరణించేవరకు జరిగిన సంఘటనలను యధాతథంగా ఈ నవల్లో పొందుపరచడం జరిగింది.

పదిహేనేళ్ళ వయస్సున్న కొమరం భీం తలలో ఎప్పుడు ఏవేవో ఆలోచనలు. తన జాతివాళ్లలో ఏ గోండువాణ్ని కదిలించినా రోగాలు, నొప్పులు, చావులు, షావుకార్ల బెదిరింపులు, వాళ్లను పీడించుకుతినడం ఈ విషయాలనే ఎప్పుడూ చెపుతూ ఉంటారు. తనకు ఊహ తెలిసినప్పటినుంచి వీళ్ల మాటల్లో వీళ్లరాతల్లో మార్పులేదు. తమవి అంతా దిక్కులేని బతుకులే అని, చేసిన కష్టం చేతికి రాకుండా, చేతికి వచ్చింది నోటికి రాకుండా తమ బతుకులు గడుస్తున్నాయని, అడవిలో ఇప్ప పూలు ఏరుకుంటున్నా, పూలకు, గడ్డికి జీవితం అంతా పన్నులు కడుతూ చీమ కాలంత సుఖం లేకపోయినా ఇంకా జీవిస్తున్నామన్న వదిన మాటలు భీంని ఆలోచింపజేస్తాయి. అతన్ని ఎప్పుడు ఒక ప్రశ్న వేధిస్తూనే ఉంటుంది. ఎంతో కష్టానికి ఓర్చి అడవిని నరికి, దాన్ని పంట వేసే భూమిగా తయారు జేస్తారు. పంట పెరిగినప్పటి నుంచి దాన్ని పశువులనుండి, క్రూర మృగాల బారీ నుండి రక్షించుకోవడం కోసం ప్రాణాలకు కూడా తెగిస్తారు. అంత ధైర్యసాహసాలు ఉన్న గోండులు షావుకార్లను చూడంగానే కిక్కురుమనకుండా గింజలు కొలుస్తారు. భూమి, నీళ్లు అడవి అన్నీ దేవుడిచ్చినవన్న వదిన మాటల్లో నిజం ఎంత వుందో ఎంత ఆలోచించినా అర్థం కాదు. షావుకార్ల కల్లంలోకి వచ్చి

గింజలు బలవంతంగా కొలుచుకుంటూవుంటే నిస్సహాయులైపోయినారు. తండ్రి, అన్నలు రాత్రిళ్లు జంతువులతో హోరా హోరి పోరాడి కూడ బెట్టుకున్న జొన్నలు, షావుకారు వడ్డీ పేరుతో గద్దలా తన్నుకుపోతే మొట్టమొదటి సారిగా తనకు అన్యాయం జరిగిందని పించింది. ఏడాది కష్టపడిసాగుచేసి పండించిన పంటను షావుకార్లు ఎగవేసుకుపోతుంటే గోండు జాతి అంతా కాలేకడుపులతో, కాలేడొక్కలతో మంచిరోజుల కొరకు ఎదురుచూస్తుంటారు. రాత్రిళ్లు భీం తండ్రి చిన్ను నెగడు ముందర కూర్చొని మొట్టమొదట గిరిజన పరిస్థితుల్ని చెప్పుకొస్తాడు.

గిరిజనులు మొదట అడవికి రాజులు, వాళ్లు ఎంత పండించుకున్నా వాళ్ల నడిగేవారు లేరు. ఎక్కడ వున్నా పట్టించుకునేవారు లేరు. మొట్ట మొదటి సారి ఆదిలాబాదు జిల్లాలో నిర్మల్‌కు ఆంగ్లేయులు రావడంతో అడవి ప్రాంతాల్లో అలజడి చెలరేగింది. బ్రిటీష్‌వాళ్లకీ, ఈ అడవిరాజుకీ మధ్య పోట్లాట జరిగింది. ఆ రాజును పట్టుకొని నిర్మల్‌లో చెట్టుకు ఉరివేసి చంపారు. దాంతో తలా ఒక దిక్కుపారిపోయారు. ఆ పారిపోయిన వాళ్లలో చిన్న కుటుంబం కూడ ఒకటి. వీళ్లు అడవుల్లో బాగా బతుకుతున్న సమయంలో తురకలువచ్చి ఆక్రమించుకున్నారు. ఈ గోండ్లు చేస్తున్న భూములన్ని మా పట్టాలన్నారు. గూడెంలో వాళ్లంతా ఈ పట్టాలేందో తెలియక వెర్రి మొఖం వేసారు. వీళ్ల వెనుక కౌలని, తహసీల్ అని గోండులపై అధికారం ప్రారంభించారు. నిజాం మెల్లగా రంగంలోకి ప్రవేశించి అడవుల్లోకి జంగ్లాతోళ్లని ప్రవేశపెట్టాడు. షావుకార్లతో రంగు గుడ్డలు, బెల్లం ముక్కలు, పొగాకు గిరిజనులకు పంపించి అడవిలోనున్న సంపదనంతా తరలించుకుపోవడం మొదలు పెట్టాడు.

తమకు జరిగిన అన్యాయాల గురించి తండ్రి చెప్పిన మాటలు భీం మెదడులో బాగా నాటుకుపోయాయి. ఒక రోజు భీం స్నేహితునితో

కలిసి మేకల కోసం చిన్న, చిన్న కొమ్మలు నరికేస్తుండగా చౌకీదార్ వచ్చి ఇద్దర్ని చావతన్నిపోతాడు. అడవి నరుకుతున్నాడని వాళ్ల అధికారితో చెబితే భీంని కట్టేసి స్నేహితుడైన పైకు చేతివేళ్లను నరికేస్తాడు. అది చూస్తున్న భీం మండిపోయాడు. అతని మనస్సులో రాంజీ గోండు మెదిలాడు. అట్లాగే రోజులు గడుస్తున్న సమయంలో చిన్ను చనిపోతాడు. మోతీరాం రాంజీ కథను చెప్పినప్పుడు భీం ఉరి తీయబడిన గోండురాజ్యం కోసం ఏడుస్తు న్నాడు, (పేజి-37) చిన్ను చనిపోయిన తర్వాత ఆ గూడాన్ని వదిలి మరోచోట అడవి నరుక్కుందామని బయలుదేరుతారు. అక్కడ ఆరునెల్లు అడవి నరికి పొలం సాగుచేసుకుంటున్న సమయంలో పట్వారి వచ్చి ఈ భూములు సిద్ధిక్‌సాబ్‌వి అని చెప్పి పంటలో కొలు చెల్లించమంటారు. అలా చెల్లించని పక్షంలో భూమి నుండి భేదఖల్ చేస్తామని బెదిరిస్తారు. ఇది అన్యాయం అంటున్న వాళ్ల మాటల్ని వినిపించుకోకుండా సిద్ధిక్ తుపాకితో ఒకణ్ణి గుద్దుతాడు. ఇరువైపుల మనుషులు కొట్టుకుంటుంటే భీం ఆవేశంతో చేతిలో ఉన్న లట్టుకర్రతో సిద్ధిక్ తలపై బలంగా కొడుతాడు. ఆ దెబ్బతో సిద్ధిక్ గిల గిల తన్నుకొని ప్రాణం విడుస్తాడు. ఆ దృశ్యం చూసిన కొందరు పారిపోతే మరికొందరు స్థాణువుల్లా నిలబడతారు. భీం భయంతో పరుగెడతాడు. అట్లా పరుగెత్తి తాను ముందున్న ఊరికి వస్తాడు. స్నేహితుడు కొండల్‌తో జరిగిన విషయం చెప్పి ఇద్దరు అక్కడి నుండి పారిపోతుంటారు. భీం, సిద్ధిక్‌ని చంపిన విషయం పల్లె, పల్లెలో పాకుతుంది.

ఆరకంగా ఇంటి నుండి వెళ్లిపోయిన భీం బలార్షాలో ఉంటాడు. అక్కడ విఠోబా అనే అతని దగ్గర ప్రెస్‌లో పనిచేస్తాడు. విఠోబా, భీంకు ఆంగ్లేయులగురించి, తురకల గురించి, వాళ్లు చేస్తున్న అన్యాయాలను గురించి చెప్తాడు. విఠోబా సాహచర్యంతో చదవడం, రాయడం నేర్చుకున్నాడు. దేశంలో జరుగుతున్న రాజకీయాల్ని కూడ మెల్ల మెల్లగా అర్థం చేసుకుంటున్నాడు. ఒక రాత్రి విఠోబాను పోలీసులు వచ్చి

పట్టుకుపోవడంతో భీం అస్సాంకు వెళ్తాడు. అక్కడి తేయాకు తోటల్లో అయిదేండ్లు గడిపాడు. అక్కడ రకరకాల మనుషుల వల్ల చరిత్ర ప్రజల స్థితిగతులు తెలుసుకొన్నాడు. అల్లూరి సీతారామరాజు నాయకత్వంలో జరిగిన మన్నెం తిరుగుబాటు సంతాలులు, జాతావులు, భిల్లులు, సవరల పోరాటాలు, వాటివైఫల్యాలు బేరీజువేసుకుంటూ పోరాటం సాగించటానికి సమాయత్తమవుతాడు. తేయాకు తోటల్లో అధికారులతో ఘర్షణపడి దెబ్బకు దెబ్బ తీసి అక్కణ్ణించి పరారి అయ్యాడు. చాలా ఏండ్ల తర్వాత తిరిగి అన్నల దగ్గరికి వస్తాడు. అన్ని ఏండ్ల నుంచి అన్నల పరిస్థితిలో మార్పేమీ లేదని తెలుసుకుంటాడు. భూస్వామి లచ్చు పటేల్ దగ్గర భీం పాలేరుగా కుదురుతాడు. లచ్చుపటేల్ సమస్యను తన తెలివి తేటలతో భీం పరిష్కరిస్తాడు. భీం విజయం పల్లె పల్లెకంతా పాకిపోతుంది. పరాయి చేతికింద ఇట్లా ఎంత కాలం పడుండాలో తెలియక మళ్లీ అందరూ కలిసి అడవి నరకడానికే నిర్ణయించుకుంటారు. గోండ్లు కొలాంలు అందరూ ఒక్కటై పన్నెండు గూడాలను రూపొందించుకొని అడవి మీదకి దండెత్తుతారు. అప్పటినుంచి వాళ్లు అడవులు నరకడం జంగ్లాత్ (అడవీశాఖ) వాళ్లు కేసులు పెట్టడం మామూలైపోయింది. వాళ్లలో లడాయి చేయడానికి సిద్ధమవుతారు. దీనికి పరిష్కారం రెండే మార్గాలు. అదాలత్, పేషీల చుట్టూ తిరగడం ఒకటైతే నైజాం సర్కారును ఎదిరించి మీ అధికారాన్ని మేం ఒప్పుకోవడం లేదని ధైర్యంగా చెప్పేది రెండో మార్గం. రెండు మూడు సార్లు అధికార్లు వచ్చినపుడు గోండులు తిరుగుబాటు జరిపారు. పన్నెండు గ్రామాల భూములను గిరిజనుల పేర పట్టా చేయించాలని కోరుతూ లేఖను వ్రాసి హైదరాబాద్‌కి వస్తాడు భీం. అక్కడ నిజాం వీరితో కలవడు. మంత్రి గోండు వాళ్లను అసభ్యమైన మాటలని వెళ్లి పొమ్మంటాడు. దాంతో పోరాటానికి సిద్ధమౌతాడు భీం. జోడన్ ఘాట్‌లో ఒక సభ ఏర్పరిచి పన్నెండు గ్రామాల మీద ఆధిపత్యం ప్రకటిస్తాడు. వాళ్లధ్యేయం గోండు రాజ్యస్థాపన. వాళ్ల జెండా రగల్ జెండా.

రగల్ జెండా భీం నాయకత్వంలో బర్మార్లు తయారు చేయడం, వడిసెలు తయారు చేయడం, ఈటెలు విసరడం నేర్చుకుంటారు. సైన్యం కావాలని ఊరూరా చాటింపు చేయిస్తాడు భీం. ఆ రకంగా సన్నాహాలు చేసుకుంటుండగానే నిజాం సైనికులు పన్నెండు గ్రామాల మీదకి దండెత్తి వస్తారు. మొట్ట మొదట భీం సైన్యంతో తలపడి నిజాం సైన్యం ఓడిపోతుంది. తర్వాత నిజాం సైన్యాలు కింది గూడాలని దోచుకోవటం మొదలు పెట్టాయి. దాంతో ప్రజలు అందరూ జోడన్ ఘాట్‌కు భీం దగ్గరకు వస్తారు. భీం వాళ్లకు ధైర్యాన్ని నూరిపోసి తిరిగి పంపించి వేస్తాడు. నిజాంకి పన్నెండు గ్రామాల మీద తమ అధికారమే చెల్లాలని మళ్లీ ఒక ఉత్తరం రాసి పంపిస్తాడు. నిజాం సర్కారు పన్నెండు ఊర్లకు పట్టాలు మాత్రమే ఇస్తానని అధికారం ఇయ్యనని అంటాడు. భీంకు, నిజాంకు రాజీకుదరదు. ఏడు నెలల తర్వాత మూడు వందల మంది సైన్యంతో నిజాం సైన్యం జోడెన్ ఘాట్‌కు వస్తుంది. వాళ్లు తుపాకులతో వస్తున్నారని వాళ్ల ముందు గోండుల వడిసెలు, బర్మార్లు పనిచేయవని భీంకు తెలుసు; అయినా పోరాటం సాగించారు; ఆ పోరాటంలో 1940లో భీం చనిపోతాడు.

ఆ రకంగా కొమరం భీం చనిపోయినా గోండు జాతి వాళ్లకు భీం ఎప్పుడూ బతికే ఉంటాడు. గోండు జాతి దృష్టిలో భీం అంటే గొండిస్తాన్, భీమ్ అంటే నాగలిదున్నే ప్రతిరైతు. భీం అంటే లడాయి. భీం అంటే తుడుం మోత; భీం అంటే రగల్ జెండా, ఇటువంటి యదార్థ చరిత్రను కొమరం భీం నవల ద్వార పాఠకులకు అందించారు అల్లం రాజయ్య, సాహు‌లు. ఈ నవల్లో కాల్పనికత కన్పించదు. గిరిజనుల జీవన విధానం గురించి, అధ్యయనం చేసి, ప్రభుత్వ రికార్డులను పరిశీలించి హేమన్ డార్ఫ్ వ్యాసాలను చూసి నవలను రాయడం జరిగింది. అందుకే ఈ నవలను గురించి ప్రస్తావిస్తూ **"The two novelists who authored Komaram Bheem not only extensively interviewed persons**

associated with Komaram Bheem but treked the district of adilabad very extensively to give an insight into the context in which the revolt took place" అని డా॥ జి. హరగోపాల్ గారు పేర్కొన్నారు[10]

ఈ నవలను 'తన చరిత్రనే పఠించి ఫక్కున నవ్వింది రాత్రి' అన్న శీర్షికతో వర వరరావు పరిచయం చేస్తూ ఆ నవలను రాజయ్య, సాహులను రచయితలను చెయ్యటం కోసం, చారిత్రక నవలా కారులుగా నమోదు చేయటం కోసం కాదు. అది ప్రజల జీవన సాంస్కృతిక అవసరాన్ని తీర్చటంకోసం అన్న మాట తెలంగాణ పోరాట సాహిత్య సృజన కారులందరికే వర్తిస్తాయని కాత్యాయని విద్మహేగారు పేర్కొన్నారు. వీరు నవలల్ని, కథలని ఆషా మాషీగా గాకుండా, రచయితగా ఒక ప్రత్యేక స్థానాన్ని పొందాలనే కాంక్షతో కాక ప్రజల్లో ఉంటూ, ప్రజలుగా ఉంటూ అన్ని పనులతో పాటు ఈ రచనను కూడా ఒక పనిగా పెట్టుకొని రాసిన వాళ్లు.

కొమరం భీం నవల 1940లో జరిగిన పరిస్థితుల్ని చూపిస్తే, ఆ తర్వాత జరిగిన పోరాటాన్ని మనం అడవి నవలలో చూస్తాం; ఈ నవల నలభై ఏళ్ళలో ఆదిలాబాద్‌లో జరిగిన అభివృద్ధిని చూపిస్తుంది.

వసంతరావు దేశ్ పాండే రాసిన అడవి నవల 1981లో ఇంద్రవెల్లిలో జరిగిన పోరాటానికి, పోలీసుల కాల్పులకు అద్దం పట్టింది. నవల సగభాగం అడవిలో వున్న గోండుల జీవిత పరిస్థితులు, వాళ్లు ఆబ్కారీ, సేరిదార్ల మొ॥ వారిచేతుల్లో వారి జీవితం ఎలా తెల్లారి పోయిందో చూపిస్తారు. నవల సగభాగం తర్వాత కొమరం భీం ప్రస్తావన వస్తుంది. భీంను తెలుసుకునేంత ఎత్తుకు ప్రజల్ని ఎదగనిస్తాడు తునికాకు అన్న. వాళ్లల్లో మార్పు వచ్చిందనడానికి ఉదాహరణగా మాధు, పోలీసు వాళ్లతో ఎదిరించి మాట్లాడం, వాళ్లపై గొడ్డళ్లను ఎత్తటం నవల్లో కన్పిస్తుంది.

గిరిజనేతరులు అడవిలోకివెళ్లే అవకాశం ఈ నవల ద్వారా కలిగింది. చారిత్రక సత్యాలను హృదయాన్ని హత్తుకొనేలా చెప్పడంలో రచయిత కృతార్థుడయ్యాడు. పరాయి పాలన పోయింది. అన్యాయపు రాచరికం అంతమైపోయింది. తమకు మంచి రోజులు వచ్చేస్తాయనే ఆశతో ఎదురుచూసిన గోండుల ఆశ నిరాశే అయింది. ఎదురు చూపులో ఏళ్లు గడిచిపోయాయి. దశాబ్దాలే అంతరించాయి. అయినా ఈ నేల, నింగిమారనట్టే ఆ అడవి మారలేదు. అడవిలో వున్న గోండుల జీవితాలు మారలేదు. భూమికోసం, భుక్తికోసం గోండులు చేస్తున్న పోరాటాన్ని వివరిస్తూ ఈ అడవిలోని అమాయక ప్రజల్ని వ్యాపారులు, జంగ్లాత్ వాళ్ళు, ఆబ్కారీ వాళ్లు, పటేల్ పట్వారీలు అందరూ కల్సి దోచుకున్నవైనం కన్పిస్తుంది.

ఈ నవల్లో అడవి జాతుల వారిని ఎంత సులభంగా దోచు కోవచ్చో, అడవిలో వున్న సంపదను వారి ద్వారా కారు చవకగా ఏ రకంగా పోగుచేసుకోవచ్చో నవల ప్రారంభంలో రాఘవులు పాత్రద్వారా చూపించాడు రచయిత. రాఘవులు మొట్ట• మొదటిసారి అడవిలోకి సామాను తీసుకుని వ్యాపారాన్ని మూడు పూవులు, ఆరు కాయలుగా చేసుకుందామని వస్తే ఆ షావుకారు తమ కష్టం చూడలేక జాలితో తోడ్పడడానికి వచ్చాడని నమ్ముతారు. **అమాయక అడవి ప్రజలు బంగారం పండిస్తరు.... దాన్ని మనం పైన జేసుకోవాల. ఆల్లకు ఏం గావాల్నో తెలుసుకొని అవి దుకాణం నిండు కోకుండా సూడాల, అట్లుంటే నాలుగేండ్లలో 40 ఎకరాల ఆసామిగా వచ్చు. ఇల్లు మీద ఇల్లు గట్టొచ్చు** ఆ రహస్యం తెలుసుకున్న రాఘవులికి పట్టిందల్లా బంగారమైంది. అందుకే మొదలు వ్యాపారం చేస్తానన్నప్పుడు అతని బంధువు రాఘవులకు కిటుకులు చెప్తాడు. ఈ నవలలో రోడ్లు, లారీ, ట్రాన్స్‌పోర్ట్‌లే కాక ఎక్కువ డబ్బుచేసుకునే ట్రేడర్లని కూడ మనం చూడొచ్చు, దీనివల్ల మనకు తెలియ వస్తుందేమంటే ఎక్స్‌ప్లాయిటేషన్ ఎంత జరుగుతుందో

తెలుసుకోవచ్చు. ఈ నవల్లో అంగడికి వెళ్లి సామాన్లు కొనుక్కోవడం మనకు కన్పిస్తుంది. అదే కొమరం భీం నవల్లో మనకు ఈ అంగడి ప్రసక్తిరాదు. ఇదేగాక డబ్బు చేతులు మారడం కూడా ఉండదు.

అడవి నవలలో దేవుబాయి, జంగు, సోములు, ముఖ్య పాత్రలు. వీళ్లే ముఖ్యమని కూడ చెప్పటానికి లేదు. ప్రతి పాత్రలో ప్రతి గోండు మనిషిలో వారి జీవితం కన్పడుతుంది. అడవిని, అడవి పోరాటాన్ని వాస్తవికంగానే కాక సమర్థవంతంగా చూపించారు రచయిత.

ఈ నవల్లో వస్తువు ఇంద్రవెల్లి సభలోని పెన్‌ట్రాజెడీ. దాని పూర్వాపరాలను, క్రమానుగతంగా అడవి తిరుగబడుతోందన్న తీరునూ ఈ పాత్రల ద్వారా చెప్పారు రచయిత. అయితే ఈ నవల్లో మొదటే చెప్పినట్టు నవల సగభాగం కొమరం భీం కథ ఆక్రమించింది. కొమరం భీంను పరిచయం చేయాల్సిన పనిలేదేమో! కొమరం భీంకు ముందు ప్రతి సన్నివేశాన్ని ఎంత విపులీకరించారో, తర్వాత అంత సంక్షిప్తంగా ఇంద్రవెల్లి సభకు వచ్చారు. 1940 తర్వాత 81 వరకు అంటే ఈ నలభై ఏళ్లలో గోండుల క్రమానుగతచైతన్యం, ఆ వాతావరణం, ఆ శక్తుల ప్రసక్తి అడవిలో చూస్తాం. కొమరం భీం నవలలో గిరిజనులు ప్రభుత్వాధికారులకు పన్ను డబ్బు రూపేణ ఇవ్వటం అసాధ్యంగా కన్పిస్తుంది. కాని ఈ నవలలో డబ్బు రూపంలో పన్ను వసూలును చూస్తాం.

గిరిజనులు తిరుగ బడ్డ తీరు ఎక్కడా ఈ నవలలో కన్పించలేదు. ఈ నలభై ఏళ్లలో గిరిజనులు భూమి కోసం ఎంతగా పోరాటం సల్పుతున్నారో అంతగా ప్రభుత్వాధికారుల విధానాలు అమానుష చర్యలూ, బ్యూరోక్రసి అధికం కావడం చూడొచ్చు. గిరిజనులను హింసించడంలో కూడా వీరు కొత్త పద్ధతుల్ని ప్రవేశపెట్టారు. గిరిజనుల్ని చంపడం వీరి అధికారంలో భాగమైతే మరీ

హింసించి చంపడం వారి పైశాచిక ఆనందానికి గుర్తు. గిరిజనుల్ని తాళ్లతో బంధించి గుర్రానికి కట్టి వాళ్లను ఈడ్చుకుపోవడం, మనిషిని వెల్లకిల్లాపడుకోబెట్టి వాడి చేతుల మధ్య కాళ్లపైన గులకరాళ్లు పెట్టి, ఆ రాళ్లపై నులక మంచాల్ని ఉంచి జవాన్లు ఎగురుతుంటారు. ఇదేగాక మనిషిని పడుకోబెట్టి కడుపుపై ఒక ఎలుకను ఉంచి దాని మీద కుండను బోర్లించి కడుపును కొరికినప్పుడల్లా బాధతో మెలికలు తిరిగి అరుస్తుంటే వాళ్ల ఆనందం చెప్పడానికి లేదు. ముఖ్యంగా దేవు బాయి తమ్ముడు సోమును హింసించే విధానం (95-97), మరొక సంఘటనలో మోతిని రాక్షసంగా చెరిచి ప్రాణం పోగొట్టినతీరు పాఠకులను ఉద్రేక పూరితులను చేస్తాయి. ఇటువంటి అమానుష చర్యలు కొమరం భీం నవల్లో కన్పించవు.

ఈ నవల్లో గోండులనే కాక వాళ్లకంటె ఆర్థికంగా చితికి పోయిన జాతులను కూడా రచయిత చూపించాడు. అడవిలో పుట్టి పెరిగి అడవులను నమ్ముకొని జీవించే వారికి అధికారాలు లేవు. కూతురి పెళ్లికి పందిరి వేసుకున్నందుకు పందిరి మామూలు కింద వెండి మొలతాడును స్వాధీనపరుచుకుంటాడు సేరెదారు. ఈ అధికారులు వారికి, ఉపాధి కల్గించకపోగా వారికి ఇంకా బానిసత్వపు అంచులలో బతకమని శాసిస్తున్నారు. వాళ్ల రక్తంధారపోసి పండించే పంటలు, ప్రాణాలకు తెగించి క్రూర మృగాలను ఎదిరించి తెచ్చుకున్న స్థలాలు అన్నీ నిమిషంలో దళారీల పరమౌతున్నాయనే విషయాల్నే కాక ప్రతి సంఘటనలోనూ వారు విధిలేక గడుపుతున్న జీవితం ఈ నవలలో చూస్తాం. అందుకే **"The new political development transfer of power - raised the expecations of the tribals without any matching performance. Over a period of time they found that there was no qualitive change in the nature of functionaries nor the policies persued by the government. The practices like**

eviction from the land, encouragement for non-tribal migrants, sex abuse, torture and killing the persons were continued. The smuggling of the forest wood become a regular practice as the forest policy became more stringer అన్న అభిప్రాయానికి ప్రొఫెసర్ హరగోపాల్ గారు వచ్చారు[11].. అధికార్ల దోచుకు తింటున్న గోండుల జీవితాన్ని సూక్ష్మంగా అడవిలో చిత్రీంపబడినా కొన్ని లోపాలు లేకపోలేదు. నవల ప్రారంభంలో కన్పించిన సిద్ధార్థ పాత్ర ద్వారా ఏం చెప్పదలచు కున్నాడన్నది నవల పూర్తయ్యాక కూడా అంతుపట్టదు. అట్లాగే ఇతివృత్తం ఇంద్రవెల్లి సభ అయినప్పుడు నవలలో సగభాగం కొమరం భీం ఆక్రమించు కోవడం బాగులేదు. చరిత్రను చెప్పదల్చుకున్నప్పుడు ఒక పాత్ర ద్వారా దాని ప్రభావం ఆ పోరాటంపై ఎలా పడిందో చెప్పవచ్చు. ఉదాహరణకు కొమరం భీం నవలలో రాంజీ గోండు కథను చిన్ను చెప్తున్నప్పుడు భీంలో కల్గిన మానసిక చైతన్యాన్ని రచయిత ఎలా ప్రవేశపెట్టారో అలా! అలాగే కొన్ని వాక్యాలను పరిశీలిస్తే:

1. పటేల్ పాన్‌లోకి సున్నం, కాసు సరిగ్గా సరిపోయింది, పటేలునోరు ఎర్రగా పండింది.
2. సత్యమేవ జయతే దుమ్ముకొట్టుకొని పోయింది.
3. ఈ దేశంలో ఆడపిల్లలకు అత్తవారింట్లో, మగవాడికి పోలీస్ స్టేషన్లో ఎంత మర్యాద వుంటుందో తెలుసుకాబట్టి అడగలేదు.
4. పటేల్ దివాన్ ఖానాను భూమి పోగొట్టుకున్న వాళ్ల కన్నీళ్లతోనే కడిగేస్తారు లాంటి మాటల్లో సంక్షిప్తతతో పాటు సింబాలిజమ్ కూడా కనిపిస్తుంది.

భూమిలో వున్న ఖనిజాలు కొండప్రాంతాల్లో కొట్టుక పోవడంలో ఖనిజాల శాతం తగ్గిపోయి కొండ నీటి వల్ల వీరికి గొంతువాపు

వ్యాధి వస్తుందని అందుకే వారు ఉప్పువాడాలని రచయిత కొత్త విషయాన్ని చెప్పారు. గోండులకు ఇష్టమైన పండుగ అయిన ఘసాడిపండగని రచయిత చక్కగా వర్ణించారు. గోండులకు ఈ పండుగంటే ఇష్టం. వెదురుతో చేసిన టోపినీ నెమలి ఈకలతో అలంకరించి తలపై పెట్టుకొని, మసితో కనుబొమ్మలు దిద్దుకోవడం, నల్లటి ఘుగ్రవేసుకోవడం మొ॥ వర్ణనలతో గోండుల పండుగ నాటి వస్త్రధారణను తెలియజేసారు.

ఈ రకంగా అడవి, అడవిలో అన్నల ద్వారా రాజ్యాధికార రహస్యం తెలుసుకుంది. అడవి ఒంటరిగా లేదని అన్నలతో లాంగ్ మార్చ్ చేస్తుందని సాధన నవల "అడవిలో అన్నలు" తెలియజేస్తుంది. నడుస్తున్న చరిత్రలో ఆదివాసీ ప్రజల పోరాట ఆరాటలే గతంకన్న అధికంగా ముందుకు వస్తున్నాయి. ఇందులో మార్క్సిస్టు-లెనినిస్టు అవగాహనతో నడుస్తున్న వర్గపోరాట చరిత్ర దండకారణ్య ఆదివాసీ పోరాటాలలోనే అధికం. దండకారణ్యంలో నివసిస్తున్న గోండు మాడియా, మురియా, దొర్ల, కొండరెడ్డి, కోందులు లాంటి ప్రధాన తెగల జీవిత విధానంలో వారి ఉత్పత్తి పద్ధతులు అధ్యయనం చెయ్యడం తప్పనిసరి అవసరంగా ముందుకు వస్తున్నది[12].

దీనికి సంబంధించిన సాహిత్యంలోని భాగమైన ఆదివాసీ నవలల్లో అడవిలో అన్నలు ఒకటి. ఈ నవల దండకారణ్య ప్రాంతంలో సుమారు దశాబ్దికాలంగా జీవన్మరణ పోరాటం చేస్తున్న దళాల జీవన నేపథ్యంలో వచ్చింది. అడవిలో దళ కమాండర్ సాయి పార్టీ అవగాహన వున్నవాడు. అడవిలో వచ్చి ఎనమిదేళ్ల పైనే అయింది. అనుభవించిన కష్టాలు ఎప్పుడూ అతని మనః ఫలకంపై కదులుతూ వుంటాయి. నాటి సాయుధ పోరాట కాలంలో పట్టిన గతి ఈ అడవి ఉద్యమానికి ఏనాడు రాకూడదని అతని పార్టీ అవగాహన. దాన్ని అడవి జీవితంలో ఆదివాసీలతో పెనవేసుకు పోతున్న సంబంధాల ద్వారా అర్థం

చేసుకుంటాడు సాయి. ఆనాడు అతనితోపాటు పనిచేసిన వాళ్ల కొందరు ఈ రోజు దిగజారిపోయారు. పోరాటం తీసుకునే తనదైన మలుపుల్ని వాళ్లు సరిగా ఆకళింపు చేసుకోలేక పోయారన్నదే సాయిని బాగా బాధిస్తుంది.

ఈ నవల్లో పార్టీలో పనిచేసే పురుషులే కాక అనేక సందర్భాల్లో స్త్రీలు, స్త్రీల సమస్యలు చర్చకు వస్తాయి. కావేరి, జైని, సమ్మక్క, పూలక్క, సుగుణక్క, రామక్క, పార్వతి, సీత, జయ, శారదలు దీంట్లో స్త్రీ పాత్రలు. ఈ శారద జయలు పేర్లు మార్చబడ్డ గిరిజన స్త్రీలు, శారదకు ఊర్లో సంఘం పెట్టినప్పటి నుంచీ పరిచయం. వాళ్ల ఊళ్లో ప్రతి అభివృద్ధితో శారద పాత్ర ముడివడి ఉంది. మహిళా సంఘంలో ఎంతో చురుకుగా పనిచేసింది. సంఘంలో, మిలిటెంట్ల యూనిట్‌లో అలాగే పార్టీలోకి వచ్చే ముందు ఆర్గ్గెలరీ సెల్‌లో కూడా శారదకు అనుభవం ఉంది. శారద ప్రోత్సాహంతో జయ సంఘంలోకి వచ్చింది. దళ జీవితానికి అడ్జెస్ట్ కావటంలో అవస్థపడుతుంది. ఈ జీవితం చాలా కష్టంగా ఉన్నదని శారదతో ఒకటి రెండు సార్లు వెళ్లబోసుకుంది. దళం టేకేదారుల నుండి పార్టీ అవసరాల కొరకు బెదిరించి డబ్బు తీసుకోవటం జరుగుతుంది. అదే కాక గ్రామ ప్రజలు నేను తిన్నది నా అన్నలకు పెడ్తాను. నాకు పండింది నా అన్నలకు ఇస్తాను అనే పద్ధతిలో వసూళ్లు చేసి దళానికి ఇస్తుంటారు. గూడెంలోని ప్రజలందరికీ అన్నలంటే అభిమానం. ముఖ్యంగా కొర్కె కుటుంబానికి అన్నలతో సన్నిహితమెక్కువ. మూడేళ్ళ క్రితం అతను నిర్బంధంలో ఉన్నప్పుడు పోలీసులు అన్నల కోసం ఇళ్లిల్లు తిరిగారు. కళ్లకు కనిపించిన దంతా దోచుకు పోయారు. అన్నలకు అన్నాలు పెడ్తేనే ఈ సమస్యలన్నీ వస్తున్నాయని జనం వెనుకాముందాడుతున్న సమయంలో కొర్కె అందరినీ కూడదీస్కొని పార్టీరాక ముందు కష్టాలను, అవమానాలను ఎంత భరించారో వాళ్లకు గుర్తుచేస్తాడు. తమ ప్రాణాలు కాపాడటానికి

వచ్చిన పార్టీ కోసం చిన్న చిన్న కష్టాలు ఎదుర్కోక తప్పదని ఒక్కొక్కరికి చెప్పి ధైర్యాన్ని నూరిపోస్తాడు. మా కోసం పురుగనక పూచనక అయ్య అవ్వనిడిసి ప్రాణాలకు సిద్ధపడి పనిచేసే మీకు ఒక్కరోజు పని చెయ్యడం మాకు కష్టమా దాదా అంటూ అందరినీ ఒప్పిస్తాడు. పండిన పంటల్లో తోచినంత సాయం చేయమని పార్టీకోసం నిధిని అడిగినపుడు, వాళ్లకు ఇవ్వడం ప్రజలకేమీ ఇబ్బంది కాదని, సంఘం వాళ్లు వచ్చింతర్వాతనే నాలుగు కుంచల విత్తన పొడ్లన్న దొరికాయని, ఫారెస్టు అధికారులను పటేళ్లను, షావుకార్లను ఎదిరించడం నేర్పిన పార్టీకి తవ్వెడో, మానెడో పారేసేది కష్టమేమి కాదని ప్రజల్ని ఒప్పిస్తాడు. దళం ఈ రకంగా ప్రతి గూడెంలోని ప్రజల ఆదరాభిమానాల్ని చూరగొంటూ, తమ లక్ష్యం వైపు పురోగమిస్తుంటారు.

దళ సభ్యుల్లో రైను ఒకడు. తనుపుట్టి పెరిగిన గ్రామంలోకి వెళ్తున్నప్పుడు రైనుకి గతం కళ్లముందు కదిలింది. దళంలోకి రాకముందు రైను జీవితం దుర్భరం. ఇంట్లో తిండి లేక ఉపవాసం నడుస్తుంది. కనీసం గుగ్గిళ్లు కూడా పుట్టలేదు. అంతకు ముందు రాత్రే జీలుగ చెట్టు బిబ్బిని తెచ్చి దంచిన పిండితో అంబలి కాచుకుని త్రాగాడు ఉదయం ఊళ్లోకి పంజుపటేల్ వస్తున్నాడని తెల్సి అతన్ని చూడటాన్కి వెళ్తాడు రైను.

గ్రామ పెద్దలతో మాట్లాడుతున్న పంజ్‌పటేల్ దృష్టి రైను పైపడింది. రైనుని తనదగ్గరనే పనికి కుదుర్చుకుంటాడు. తన డొక్క నిండని బ్రతుక్కి ఓ తోవదొరికినట్లైంది. దొర దగ్గర జీవితం ఉన్నప్పటి నుంచి తిట్టికొట్టే బేగారి పనులు చేయించుకునేవాడు. రైను అప్పుడే సంఘంలో చేరి దళంలో సభ్యుడైనాడు. తన గ్రామంలోకి

అడుగిడుతున్న రైసుకి ఇదంతా జ్ఞాపకమొస్తుంది. అటువంటి పంజపటేళ్లు, షేకేదార్లు, రేంజర్లు ఈనాడు తనకు లాల్‌సలామ్ చేసి చేయి కలుపుతున్నారు. ఈ గొప్పదనానికి కారణం దళం అని ఉప్పొంగిపోతాడు.

దళ సభ్యులు గ్రామాల్లో తిరుగుతూ వాళ్ల మంచి చెడ్డల్ని అడుగుతుంటారు. ప్రజలు న్యాయం చెప్పమని అన్నల దగ్గరికి వస్తుంటారు.

ఈ గిరిజనుల సంప్రాదాయాలు కొన్ని చాలా విచిత్రంగా ఉంటాయి. వాళ్ల రివాజు ప్రకారం ఒంటిమీద ఆడవాళ్లకు రవిక ఉండకూడదు. శారద, జయ జైని ఇంటికి వెళ్ళేసరికి జైనీ అత్తగారు జైని రవిక వేసుకొందని ఆ రవికను బలవంతంగా తీయించే ప్రయత్నంలో ఆమె వీపుమీద, తొడల మీద వాతలు పెడ్తుంటారు. ఇంతచేసినా ఆ రవిక ముక్కను వదలకుండా జైని **దాదా! మీ కాళ్లు మొక్కుత! నాకు ఈ మొగుడు వద్దు, ఈ సంసారం వద్దు, గీపెయిమీద జానెడు రయిక పేగు ఉంచుకుంటానంటె నన్ను ఎట్ల జేస్తున్నరో చూడు దాదా! మొగడు కూడ ఇనుప సలాకతోటి నాతొడలు ఎట్లకాల్సిండో నువ్వేసూడు దాదా** అని దళంతో మొరపెట్టుకుంటుంది. ఇదే రవిక విషయమ్మై సుశీల అనే స్త్రీ ఉరిపోసుకుంది. అయినా వాళ్ల రివాజును మాత్రం వారు వదలుకోలేదు. అయితే దళం వాళ్లు సాహసానికి పూనుకొన్నారు. ఒక్క కేసులో సాహసిస్తే ఇలాంటి కేసులు చాలా వస్తాయని, అది విప్లవకరమైన మార్పుకు దారితీస్తాయని జైనితో కలిసి ముందడుగు వేసారు. ఆ రోజు నుంచి జైని దళంలో చేరింది. ఆరోజు నుంచి అందరికీ కనబడే రొమ్ములను చేతులతో దాచుకోవాలనెడి తంటాలు ఇక లేవు జైనికి.

దళాలు ఊరూరికి వెళ్లి వాళ్ల బాధలకు పరిష్కారాలు చెప్పటం వారితో స్నేహంగా ఉంటూ దళంలో చేరిన కొత్తవ్యక్తులకు ప్రేలుడు పదార్థాల టెస్టింగ్ కూడా చూపిస్తారు. అదే సమయంలో అనుకోకుండా జోగన్న అనే దళ సభ్యుడికి బాగా గాయాలు తగుల్తాయి. అతనికి ప్రాణాపాయం లేదని తెలుసుకుంటారు. వీరి సంభాషణల్లో దళం వైపు ఒక్కొక్కరూ ఏరకంగా ఆకర్షింపబడ్డారో, ఏ పరిస్థితుల ప్రాబల్యం వల్ల దళంలో చేరాలో తెలుస్తుంది. ఆ జీవితం ఇష్టం లేకపోయినా వాడు దళం నుంచి నిష్క్రమించి పోలీసులకు ఏజెంట్లుగా తయారైన వారిని కూడా పేర్కొంటారు.

నవల చివర్లో పోలీసుల దాడిలో సాయి చనిపోవటంతో కథ ముగుస్తుంది. ఈ నవలలోని కథనం రెండు నెలలుగా మహారాష్ట్ర ప్రాంతంలోని గడ్ చిరోలి జిల్లా ఆదివాసుల్లో పనిచేస్తున్న దళం వారి జీవితాన్ని తీసుకున్నారు.

కథ కాలంనాటికి అడవిలో వున్న దళంలో సీనియర్‌గా సాయి ఈ తొమ్మిదేళ్లలో అడవి భౌతిక జీవితాన్ని అధ్యయనం చేస్తూ గిరిజనులతో మమేకమయ్యాడు. గిరిజన జీవితంలో వైరుధ్యాలను పసిగట్టి వారిని విప్లవకారులుగా తీర్చిదిద్దడం, వారిలో చైతన్యాన్ని తేవడం, దోపిడీ శక్తులను ఎదిరించటానికి ఒక క్రమ పద్ధతిలో పోరాట క్రమాన్ని సూచించడం, ప్రజా సంఘాల్లో కూడా గిరిజనులను ప్రభావితుల్ని చేసి సమీకరించడం, దాని ద్వారా సాయుధ దళాలను నిర్మించడం దీర్ఘకాలిక సాయుధ పోరాటం దేశంలోని ప్రజలలో కలిసి రాజ్యాధికారాన్ని చేపట్టడం ఈ నవల్లోని కథ.

ఈ నవల్లో సాంప్రదాయక ఉత్పత్తి విధానం కన్పిస్తుంది. వ్యవసాయం చాలా పురాతన పద్ధతుల్లో చేస్తారు. ఎరువులు వాడటం అటుంచి కనీసం వరి నుండి ధాన్యాన్ని పశువులతో బంతి కొట్టించకుండా మనుషులు కాళ్లతో తొక్కి తీస్తుంటారు. ఇంత కష్టపడ్డే వచ్చిన ధాన్యం విత్తనాల అప్పుకు ఎడ్ల పాలుకు! ఈ వ్యవసాయం వీరి కడుపు నింపదు. ఈ ప్రాంతంలో విస్తరించిన కలపను పేపరు మిల్లులకు పంపడం వారి పని. సాంప్రదాయక ఉత్పత్తి విధానం ద్వారా రూపొందిన ప్రీ ఫ్యూడల్ వ్యవస్థ పేపర్ మిల్ ద్వారా వచ్చే ఫ్యూడల్ సామ్రాజ్య వ్యవస్థల మధ్య గిరిజనులు ఉక్కిరి బిక్కిరి అవుతారు. గిరిజన గూడెంలో వ్యాపారంలో వస్తు మార్పిడి, డబ్బు చెలామణి రెండూ వుంటాయి. శ్రీకాకుళం ఏజన్సీ ప్రాంతాల్లో గిరిజనులున్నారు. సవర, జాతాపు మొ॥ తెగలవారున్నారు. వారు అడవిని నమ్ముకున్నారు. పోడు వ్యవసాయాన్ని నమ్ముకుంటారు. **1960** ప్రాంతాలనుంచి వారిపై మైదానపు ప్రాంతపు వర్తకులు పట్టు సాధించే ప్రయత్నం చేశారు. గిరిజనులకు దొరకని ఉప్పు, కిరసనాయులు, అగ్గిపెట్టెలు మాత్రమేకాక, వ్యవసాయానికి మదుపు నిచ్చారు. గిరిజనుల్ని ఆ అప్పులు తీర్చలేని స్థితికి నెట్టారు. వారిచేలలోనే వారిని పాలేర్లుగా మార్చారు[13].

బయట నుంచి వచ్చి నిత్యావసర వస్తువులు అమ్మే చిన్న వ్యాపారుల ధోరణి; కలప కూలీలవెతలు అడవి అధికారుల దర్పం; దళాలు ప్రవేశించిన తర్వాత ప్రభుత్వం తల పెట్టిన సంస్కరణలు, అడవి సంపదల ఉత్పత్తి పంపిణీ; ఆరోగ్యం పర్యావరణ విద్య మొ॥ అంశాలతో పాటు వీరికి అండగా నిలిచి దళాలు తెచ్చిన కొత్త సంస్కృతి, వీటి పూర్వ పరాలు, సమస్యల పుట్టుక, అభివృద్ధి, పరిష్కారం దాక వివరంగా ఈ నవలలో చర్చించబడ్డది.

## వసంతగీతం:

'బతుకుతరుముకత్తంది. గాలి దుమారం పెద్దదైతంది. ఊళ్ళుకుదుర్లు కదిలి పోయినాయి. అడవి అడవంతా ఊగుతోంది. గాలి దుమారం దండకారణ్యంలా సుళ్లు తిరుగుతుంది. కా(మ్రేడ్స్, నాగలి పట్టిన రైతుల సేతులకు రైఫోలొచ్చింది. అంతిమ విజయం మనదే'. భీమన్న తన సహచరులతో చెప్పినమాటల్లో కష్టనష్టాలలో నిండిన తమ బతుకుల్లో భూమి లేక దిన దిన గండంగా చస్తూ, బతుకుతూ వున్న గిరిజన పేదరైతాంగం అనుభవిస్తున్న పేదరికం కనబడ్తుంది. భూమి భుక్తి లేక ప్రతి రోజు ఒక గండంగా బతుకుతూ చస్తూ వున్న గిరిజన, గిరిజనేతర పేదరైతాంగం అనుభవిస్తున్న పేదరికంలోంచి ఒక పెనుమంట గాలితో కలిసి వెలువడుతున్న దిశలో కథ పుడ్తుంది. ఆ పేదరికాన్ని చవిచూసిన ప్రజలు తమ నెత్తురు ధారపోసి తమ విలువైన ప్రాణాలను త్యాగంచేస్తూ, ఉత్సాహాన్ని వెన్నంటి పెట్టుకుంటూ దళాన్ని విస్తరింప చేసుకుంటూ, వసంత గీతం నవలా నాయకుడు గట్టయ్యగా మార్పు చెందిన లింగయ్య. ఇతను ఇంట్లో నుంచి పారిపోయి దళంలోకి జేర్తాడు. అతడు ఎక్కడున్నాడో తెలియక తల్లి, అన్న బాధపడ్తుంటారు. ఎప్పుడూ అమ్మతిట్టినప్పుడల్లా ఇంట్లోంచి పోయి రెండు, మూడు రోజులుండి వచ్చేవాడు. ఈ సారి కూడా అట్లాగే అనుకొని ఊరుకుంటారు కుటుంబ సభ్యులు.

లింగయ్యకి మొదటి నుంచి దొరోరి మేకల్ని కాయడం, ఇతరుల చేతికింద పనిచేయడం ఇష్టం ఉండదు. అందుకు ఇంట్లో ఎవరికీ చెప్పకుండా వచ్చి దళంలో చేర్తాడు. దళం కమాండర్ రామయ్య, లచ్చయ్య, భీమన్న, రాధక్క మొదలైన వారి జీవితాల్ని తెలుసుకుంటాడు. వాళ్లు ఎన్నో ఏండ్లుగా పరిచయమున్న వాళ్లలాగా అన్పిస్తుంది. వాళ్లు చూపే ఆప్యాయతా ఆదరణా గట్టయ్య జీవితంలో

ఎన్నడూ పొందలేదు. దళంలో ఉన్నవాళ్లందరూ తమ వాళ్లందర్నీ విడిచి వచ్చినవాళ్లే. వాళ్లు ఒక్క తమకుటుంబం కోసమే కాక దేశ ప్రజలను దృష్టిలో పెట్టుకొని జరుగుతున్నవి, విదేశాల్లో జరిగిన సంఘటనల్ని వింటుంటే శరీరంలో ఒక కొత్త శక్తి పుట్టుకొస్తుంది.

అటువంటి సమయంలోనే తమ ఊర్లో పోలీసులువచ్చి గ్రామాన్ని చిందర వందర చేస్తారు. ఆ సంఘటనలో వదినె గంగమ్మకు గర్భస్రావం అవుతుంది. అన్న పోలీసుల చేతిలో మరణిస్తాడు, ఈ విషయం దళంకి తెలుస్తుంది. గట్టయ్యకు గుండెను నిబ్బరంగా ఉంచుకొమ్మని చెప్తూ జరిగిన విషయం చెప్తారు. వదినను తల్లిగారు వాళ్లొచ్చి పుట్టింటికి తీసికెళ్తారు. తల్లి ఒక్కతే ఒంటరిదైయింది. దిక్కులేని కోడి పిల్లలాగా ఉంది ఆమె పరిస్థితి. చెట్టంత ఇద్దరు కొడుకుల్లో ఒకడు తనకళ్లముందే ప్రాణాలు వదిల్తే, మరొకడు ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో తెలియదు. తన గుడిసెలో కాటికి కాళ్లు జాపి రోజులు లెక్కపెడ్తుంది.

గట్టయ్యకు ఇంటి గురించి ఆలోచనలు ముసురుకొన్నాయి. ఒక పక్క ఇంటి మీదకి, రెండోపక్క పోరాటానికి మధ్య మనసు కొట్టుకుంటుంది. అయితే తాను ఊర్లోకి వెళ్లి బతుకగలడా, ఆ తల్లిని బతికించగలడా అన్నది ఆలోచించుకోలేక పోతున్నాడు. ఒక్కరి వల్ల కుటుంబం బాగుపడుతుందా? నిజంగా అట్లా బాగుపడ్తే రాధక్క అంతమంది మొగాళ్ల మధ్య తుపాకి పట్టాల్సిన పనిలేదు. తన కడుపుకే తిండిలేని స్థితిలో తల్లిని ఎట్లా పోషిస్తానని ఇలా రకరకాలుగా ఆలోచిస్తాడు. ఎంత దళంలో తిరిగి చైతన్యవంతుడు అయినా గట్టయ్య దుఃఖాన్ని ఆపుకోలేకపోయాడు. అటువంటి సమయంలో తుపాకి పట్టలేనని చెప్తూ తన ఊర్లో ఉన్న తల్లి దగ్గరికి వెళ్లడానికి

నిశ్చయించుకుంటాడు. ఊర్లో తల్లి అతన్ని చూడంగానే ఈ దిక్కుమాలిన ఊళ్లో ఏమున్నదని వచ్చినావు, అన్నను చంపినట్టు నిన్ను చంపుతారు అంటుంది. ప్రతి ఒక్కరూ అదేమాట. ఊర్లో మార్పు లేకున్నా ప్రజల మనసుల్లో మార్పువచ్చింది. మాటల్లో తేడా వచ్చింది. ఆ తేడా ఏమిటో స్పష్టంగా బోధపడదు లింగయ్యకి! ఊర్లో అందరికి వేరే దేశం పోయి కూలీ చేసానని అబద్ధం చెప్తాడు. దొర సుగుణాకర్‌రావు ఇంట్లో పాలేరుగా కుదుర్తాడు. వదిన ఊరికి వెళ్లి ఆమె క్షేమం కనుక్కుంటాడు. ఆమె చెల్లెల్ని పెళ్లి చేసుకుంటానని తిరుగు ముఖం పడ్తాడు. ఒక రోజు చేన్లో కాపలా ఉన్నప్పుడు పోలీసులు వచ్చి గ్రామంలో బీభత్సం సృష్టించి లింగయ్యతో సహా వారు కొందర్ని పట్టుకపోతారు. అందర్ని వదిలిపెట్టినా లింగయ్యపై అనుమానంతో పోలీస్ స్టేషన్లో పడేసి రోజూ తన్నులు, గుద్దులతో హింసిస్తుంటారు. ఆ ఊరి దొర కూడా విడిపించలేక పోతాడు. ప్రతి పోలీస్ స్టేషనికి తీసికెళ్లడం, దళం ఎక్కడుందో చెప్పమని వత్తిడి తేవటం, తన్నటం రోజూ వారి కార్యక్రమంలా జరుగుతుంటుంది. శరీరం తన్నులతో, దెబ్బలతో పచ్చి పుండైనా లింగయ్య నోట్లోంచి ఒక్క మాట బయటికి రాదు. పోలీసులు లింగయ్యను అడవిలోకి తీసికెళ్లి దళం ఉన్న స్థలాన్ని చూపించ మంటారు. నిజంచెప్తే పోలీసు ఉద్యోగం ఇస్తామని దళనాయకులు బస్తీలో విలాస జీవితాల్ని గడుపుతూ, మిమ్మల్ని మాత్రం అడవుల్లో తిప్పుతున్నారని ఇలాంటి మాటలెన్నో చెప్తారు పోలీసులు. దేనికీ సమాధానం ఉండదు. ఒక రోజు స్థలాల్ని చూపించమని లింగయ్యని గుట్టలమీదకి తీసికెళ్లినపుడు పోలీసుల కళ్లుగప్పి పరిగెడ్తాడు. పోలీసుల తూటాల నుండి తప్పించుకొని ఆ బండలల్లో పరిగెడ్తూ, పులిబారి నుండి తప్పించుకొని ఆ రాత్రంతా ఆ బండల్లో గడిపి ఒకచోట పడిపోతాడు. నీళ్లకోసం వచ్చిన దళం సభ్యులు గట్టయ్యను గుర్తించి తగిన సపర్యలు చేస్తారు. గట్టయ్య తన ఊర్లో అనుభవాలు పోలీస్

స్టేషన్లో జరిగ ఘాతుకాలు అన్నీ విడమరిచి చెప్తుంటాడు. అతన్ని చూసిన నిర్మల ఏడుస్తుంది. అప్పుడు దళ కమాండర్ భీమన్న, నిర్మలను చూసి మనకివన్ని మామూలే అని అంటాడు. దానికి సమాధానంగా ఆయన నా మరిది అనుకుంటూ వెళ్లిపోతుంది నిర్మలగా పేరు మారిన గంగమ్మ. రాధక్క గోండు యువతి. జులాయిమనిషి అయిన అంబతిరావును పెళ్లాడింది. పుట్టినబిడ్డ దక్కలేదు. అంబతిరావు కొన్నాళ్ళ అన్నల వెంట తిరిగాడు, బాగా పాడగలిగిన రాధక్క ఇంద్రవెల్లి సభలకంటె ముందు తాను ఊరూరా తిరిగి పాడుతానంటే భర్త వద్దన్నాడు. పోట్లాడుకున్నారు, అంబతిరావు తాగుడు ఎక్కువైంది, ఇంద్రవెల్లి కాల్పుల తర్వాత పోలీసుల దాడుల్లో పట్టుబడి బాగా దెబ్బలు తిన్నాడు. బయటపడి వచ్చాక భార్యను హింసించడం మొదలెట్టాడు. అతన్ని విడిచి పుట్టిల్లు చేరింది. అంబతిరావు మరోస్త్రీతో ఆసిఫా వెళ్లి హోమ్ గార్డు నౌకరీ సంపాదించుకున్నాడు. క్రమంగా రాధక్క అన్నలకు సన్నిహితమై దళంలోకి వచ్చి చేరింది.

ఒకసారి విధవరాలైన కన్న తల్లి శోకాన్ని చూసి కూడా ఉద్యమంలో తిరిగి వచ్చాడని నీకు రవ్వంత నెనరులేదు అంటూ లచ్చన్నను రాధక్క తప్పు పడుతుంది. అప్పుడు లచ్చన్న ఇలా బదులంటాడు "రాధక్క నా కామ్రేడ్ మన గుండెలు బండబారితే నువ్వన్నట్టు మనకు నెనరేలేకపోతే; ఈ బండల మధ్య సాయుధులమై ఉండేవాళ్లమంటావా? లోకంలోని దుర్మార్గాలన్ని చూస్తూ, వీలైతే అందినకాడికి మనం దోచుకుంటూ బతికేవాళ్ళం. మానవులపట్ల ప్రేమ, నెనరుగులవాడే కమ్యూనిస్టు, రాధక్క, ఈ దేశంలోని కోట్లానుకోట్ల పేద తల్లుల్లో నీ తల్లి, నా తల్లి ఉన్నది. వాళ్ల దుఃఖం ఉన్నాయి. వాళ్ల కన్నీళ్ళు తుడవడం కన్నా ఈ లోకం నుండి దుఃఖాన్నంతా పారదోలడానికి మనం సర్వస్వాన్ని త్యాగం చేయడానికి సిద్ధంగా ఉన్నాము

కాదా అలా మానవత్వాన్ని దృష్టిలో ఉంచుకుంటూ దీక్షతో దళానికి అంకిత మయ్యారు. రాధక్కతో దళం కమాండర్ లచ్చన్న చెప్పిన మాటల్లో రాధక్క! నా కామ్రేడ్! ఈ అడవిలో మనం ఎవరం మిగులుతామో తెలియదు. కాని మన ఆశయాలను మోయడానికి మానవులు మిగులుతారు. మనం శోధించిన, నడచిన ఈ అడవిదారులు రేపటి విముక్తికి దారులౌతాయి. ఎవరం మిగిలినా ఈ ఆత్మీయతను, ఈ స్వచ్ఛమైన ప్రేమను పంచుతారు''. ఉద్యమ నాయకత్వం పట్నవాసాలలో విలాసవంతమైన జీవితం గడుపుతూ వుందనీ, దళ కమాండర్ లచ్చన్న డెన్‌లో లక్ష రూపాయలు దొరికాయనీ, ఇలాంటి మాటలేవో పోలీసులు ప్రచారం చేశారని నవలలో ఒకటి రెండు ప్రస్తావనలు వచ్చాయి తప్పితే దళ సభ్యుల పరస్పర సంబంధాలుగానీ, జనంతోటి దళం సంబంధాలుగాని, దళ సభ్యుల వ్యక్తిగత ప్రవర్తనా విశేషాలుగానీ, లోపరహితంగానే చిత్రించబడ్డాయి.

'మనం మనవ్యక్తిగత జీవితమనే చిన్న గుడిసె నుండి బయటికొచ్చాం. బయట కోటాను కోట్ల ప్రజలలో లీనమయ్యాము' అన్న సోదరభావం వాళ్లను ఒకటిగా చేసింది. కష్టసుఖాలు పంచుకుంటూ ఈనాడు ఉన్న సభ్యుడు రేపటికి మిగులుతాడో లేదో అన్నంతగా శత్రుచర్యల మధ్య పనిచేస్తున్నారు.

ఈ నవలలో దేవెరుల విషయంలో గిరిజనులకు గల మూఢ విశ్వాసాల గురించీ, పెళ్లి వంటి విషయాలలో జరిగే దుబారా ఖర్చు గురించి, ఒకటి రెండు చోట్ల ప్రస్తావనలున్నా, వాటిని పాత్రల పరంగా చిత్రించివుంటే ఆ ప్రస్తావనకు శక్తి వచ్చేది. ఈ నవలలో వివిధ రకాల పాత్రలున్నా ముఖ్యంగా చెప్పుకోదగింది దళం గురించే.

దళానికి ఒక వ్యక్తిత్వం వుంది. అది సమిష్టి వ్యక్తిత్వం. అందులోని వ్యక్తుల ప్రత్యేక వ్యక్తిత్వాలను మించింది. సహభాగత్వం దీని

విశిష్టత. వ్యక్తులు మారూతూ ఉండవచ్చు. వచ్చి చేరుతూ విడిపోతూ వుండవచ్చు. కలిసి ఉన్నంత కాలం ఇది ఒక యూనిట్. దళం పరిస్థితుల ప్రాబల్యం కారణంగానూ ఎత్తుగడల కారణంగాను ఇది నిలిచిన చోట నిలువదు. కొత్త ప్రాంతాలను సర్వే చేస్తుంది. పాత వాటిలో నిలదొక్కుకుంటుంది. జనాన్ని పేరు పేరునా పలుకరిస్తుంది. వాళ్ల పెట్టిన అన్నం తింటుంది. వాళ్లకు వైద్య సహాయం చేస్తుంది. దురాచారాల నుండి తప్పిస్తుంది. ఆడుతూ, పాడుతూ, ఉపన్యాసాలు కూడా చెబ్తుంది. ఉత్సాహం నిలబెట్టుతుంది. పోరాటాలు నడుపుతుంది. వివిధ రూపాలలో వున్న శత్రువుల పని పడుతుంది. ప్రభుత్వాన్ని ఎదుర్కొంటుంది. దళం జనంతో పెనువేసుకుపోతుంది. అది కళ్ల వెలుగు, జనం కంఠ స్వరం, జనం గుండె కాయ; జనం జీవకర్ర.[14]

సాధారణంగా ఆందోళనలకు ఆర్థిక పరమైన కారణాలేమనకు గోచరిస్తాయి. ఈ గిరిజన ఆందోళనలు, అల్లర్లు, ఆర్థిక అసమానత్వం నుండి ఉద్భవించినవే. కనుక నేటి సాంఘిక వ్యవస్థ అధ్యయనంలో ఆర్థిక పరమైన దృక్కోణం ఎంతైనా అవసరం.

సాహు, అల్లం రాజయ్య గార్లు వ్రాసిన కొమరం భీం వసంతరావుదేశ్ పాండే గారు వ్రాసిన అడవి సాధన గారి అడవిలో అన్నలు ఆనందమోహన్ గారు వ్రాసిన **వసంత గీతం** అనే నవలలు ఈ కోవలోకే చెందుతాయి. ఈ నవలల్లో మొదటి మూడు నవలలు ఆదిలాబాద్ జిల్లాలోని గిరిజన పోరాటంకు సంబంధించినవి. వందల సంవత్సరాల రాజకీయ ఆందోళనలు ఈ నవలల్లో వర్ణింపబడ్డాయి. అప్పుడు జరిగిన సంఘటనలు వీటిల్లో కళ్లకు కట్టినట్టుగా చాలా మటుకు వివరించడం జరిగిందే తప్ప కాల్పనికత వాటిలో ప్రవేశించలేదు. కొమరం భీం నవలా రచయితల ఆదిలాబాద్ జిల్లాలలోని గ్రామ గ్రామాన్ని వెళ్లి ఎందరినో కలిసి వారి అనుభవాలను ఏర్చి కూర్చి ఆ గిరిజనుల పోరాట మూల

కారణాలను క్షుణంగా అర్థం చేసుకొని ఆ నవల వ్రాయడం జరిగింది. అంతే కాకుండా చారిత్రక సత్యాలను తెలుసుకోవడానికి వారు పురావస్తు శాఖ సహాయం కూడా తీసుకున్నారు.

అడవి నవల రచయిత అదే జిల్లాలో పుట్టి పెరిగి అక్కడే జీవనం సాగిస్తున్నారు. ఈ నవలలో తన స్వీయ పరిశీలన, స్వానుభవాలను క్రోడీకరించి జోడించి రచించారు. వసంతగీతం నేటి గిరిజన పోరాటాల గురించి అతి సూక్ష్మంగా పరిశీలించి వ్రాయడం జరిగినది. ఈ నవలల్లో కథాంశం యదార్థాగాథలను ప్రతిబింబిస్తున్నది.

ఈ నవల్లో నవలా పరమైనటువంటి కట్టుబాట్లు, ఇతివృత్తంలో గాని, ప్రక్రియలోగాని పాటించడం జరుగలేదు. రచయితలు ఇతి వృత్తాన్ని సాహిత్యం పరంగా గ్రహించారే తప్ప శాస్త్రీయ దృక్పథంతో దర్శించలేదు. వీరు నవలలోని పాత్రలు, సంఘటనలు పరిస్థితులను చెప్పాలంటే ఈ నవలలు సామాజిక సారమని చెప్పవచ్చు. అయితే ఈ నవలల్లో ఆనాటి రాజకీయ, విధానాలు గిరిజన ఆర్థిక పరిస్థితి, వారి పరిశోధనల ఉత్పత్తులు, వారిలో జాగృతమౌతున్న రాజకీయ ఆందోళనలను మనం చూడవచ్చు. ఈ నవలలు సామాజిక పరిశోధకులకే కాకుండ ఆర్థిక శాస్త్ర వేత్తలకు ఒక సోపానంగా చెప్పుకోవచ్చు.

ఈ నవలల్లో అడవుల నుండి సంపదను వివిధ రూపాల్లో కొల్లగొట్టడం చూస్తాం. జాగిర్దారులే కాకుండా కొందరు వర్తకులు కూడా అటవీ సంపదను ఇతర వస్తువులు ఇచ్చి తమ హస్తగతం చేసుకునేవారు. అటవీ అధికారులు ప్రభుత్వ పరమైన వివిధ పన్నులు వసూలు చేయటమే కాకుండా వాళ్లలో చెలరేగిన అవినీతి వల్ల గిరిజనులు ఇంకా పేదవారయ్యారు. ప్రభుత్వం తమ పోలీసు వ్యవస్థ ద్వారా దమన నీతిని సాగించి అటవీ సంపద తమ పరం చేసుకుంది.

పోలీసుల ముఖ్య కర్తవ్యం గిరిజనులను అణచడం. ఈ విధంగా పోలీసులు అడవులలో ప్రవేశించడం వల్ల అనేక దుష్ఫలితాలకు దారితీసింది.

కొమరం భీం తిరుగుబాటు వల్ల హేమన్ డార్ఫ్ సంస్కరణలు అమలుకాగా, 1981లో జరిగి ఇంద్రవెల్లి సంఘటన తర్వాత ప్రభుత్వ విధానంలో చెప్పుకోదగ్గ మార్పు రాకపోవడం గమనార్హం. కాని ప్రభుత్వం ఇళ్లు కట్టించడం, గృహాలకు పెంకులు ఇవ్వడం, గొర్రెలను పంచడం, బావులు తవ్వించడం తప్ప చెప్పుకోదగ్గ మార్పురాలేదు. వారు కోల్పోయిన భూములు వారికిప్పించే ప్రయత్నం మాత్రం చేయబడలేదు. కాగా ప్రభుత్వం భూమి విషయం వచ్చేప్పటికి అణచివేత చర్యలకు దిగుతుంది. ఈ అణచివేత చర్యల వల్ల అదిలాబాద్ గిరిజనుల దృష్టిలో ప్రభుత్వం కల్లెసర్కార్ అని ఖ్యాతిగాంచింది. నేడు ఆదిలాబాద్‌లో నక్సలైట్ల నాయకత్వంలో గిరిజనులు ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిలిచారు. ఇరు పక్షాలు వారు కూడా ఆయుధాలు చేబూనారు. ప్రభుత్వం తమ సాయుధ దళాల ద్వారా ఈ తిరుగుబాటును అణచడానికి ప్రయత్నిస్తుంది. ఎన్‌కౌంటర్ చావులు అతిమామూల య్యాయి. మునుపటి వలె విన్నపాలు, ఎదురు తిరగడం కాకుండా ఇప్పటి పరిస్థితి సాయుధ పోరాటానికి దారితీస్తుంది.

పోలీసు వ్యవస్థని ప్రమోషన్లు, డబ్బు ఆశ చూపి వివిధ బహుమతులను ఇచ్చి రాజకీయ శక్తులు తమ కోరికలను అనుకూలంగా మలచుకుంటున్నాయి. ఈ ప్రయత్నంలో మన రాజ్యాంగాన్ని, న్యాయ వ్యవస్థని ఉల్లంఘించడం కూడా జరుగుతుంది. ఈ విధానాలతో పోలీసు వ్యవస్థ ఎంత పైశాచికం ప్రవృత్తిని సంతరించుకుంటుందో తెలుస్తుంది. ఈ విధంగా అదిలాబాద్ గిరిజనులు ప్రభుత్వంతో పోరాటానికి సంసిద్ధులయ్యారు. ఈ సమస్యకి పరిష్కారం కనుచూపు మేరలో లేదు.

ప్రభుత్వ కఠిన అణచివేత చర్యలకు సాయుధ తిరుగుబాటుదారులే గాక సాధారణంగా నిరాయుధులైన ప్రజలు కూడా గురికావలసివస్తుంది. నక్సలైట్లకు ఆశ్రయం ఇస్తున్నారనే నెపంతో గిరిజనులను హింసించడమే కాకుండా వీరి ఇళ్లు ఆస్తులు ధ్వంసం చేయడం జరుగుతుంది. ఈ అణచివేత చర్యల వల్ల గిరిజనయువతీ యువకులు నిరాశతో విధిలేక ఈ రాజకీయ ఆందోళనలకు దగ్గరవుతున్నారని ఈ నవలల్లో చెప్పారు.

ఈ నవలల్లో ఆదిలాబాదు జిల్లాలోని రాజకీయ ఆర్థిక స్థితి గతులను విశదంగా వివరించారు. మొదటి నవల కొమురం భీంలో అటవీ సంపదను తమ స్వార్థానికి కొల్లగొట్టడం వల్ల గిరిజనులలో అసంతృప్తి, ప్రతి ఘటన పొడచూపింది. అడవి నవలలో ఈ కొల్లగొట్టడం ఇంకా తీవ్రంకావడమే కాకుండా ప్రభుత్వాదారులు అణచివేత చర్యలు కూడా తోడయ్యాయి. అక్రమ వ్యాపారం, భూ ఆక్రమణలు హింసలకు ఒక సునిశితమైన సంబంధం ఏర్పడింది. వసంత గీతం నవలలో బీడీ కాంట్రాక్టర్ల అవతరణ అటవీ సంపదను అక్రమంగా తరలించడం ఉధృతమైంది. ఈ విధమైన సంపద కొందరి చేతుల్లో సమీకరింపబడటం వల్ల గిరిజనుల జీవితాలు మరింత దుర్భరమయ్యాయి. ఈ నవలల్లో సాధారణ ప్రజలు కూడా అతిక్లిష్ట పరిస్థితులలో తాము మారుతూ, మార్పును కోరేశక్తులుగా పరిణమించడం వివరంగా కన్పిస్తుంది. ఈ నవలలు ఏ విధంగా ప్రభుత్వ విధానాన్ని మార్చవచ్చో, గిరిజనుల జీవితాల్లో వెలుగు ప్రసాదించవచ్చో వివరిస్తాయి. మానవత్వం, పాశవికత, వ్యాపారధోరణి, ఇంకా ప్రజాస్వామ్యం, భూమి పోరాటాలు, హింస, ప్రతి హింస తత్వాలను చిత్రించాయి. ఆదిలాబాదు జిల్లాలోని వివిధ సంక్లిష్ట పరిస్థితులను, రాజకీయ ఆర్థిక సాంఘిక వ్యవస్థ స్థితిగతులను ఈ నవలలు బలంగా చిత్రించాయి.

# నాలుగవ అధ్యాయం

1. బాలగోపాల్ - అడవిలో వెన్నెల
2. బాలగోపాల్ - అడవిలో వెన్నెల
3. బాలగోపాల్ - అడవిలో వెన్నెల
4. దాశరథి రంగాచార్య - మోదుగుపూలు
5. కాత్యాయని విద్మహే - తెలంగాణ పోరాటం - కథ - నవల
6. దేవులపల్లి రామానుజరావు - ఆదివాసులు
7. కాత్యాయని విద్మహే-తెలంగాణ పోరాటం-తెలుగుకథ-నవల
8. కాత్యాయని విద్మహే-తెలంగాణ పోరాటం-తెలుగుకథ-నవల
9. కొమురం భీం - మా మాట
10. Political economy ot Tribal Moments on reflected in three Telugu Novels-Anote
11. Political economy ot Tribal Moments on reflected in three Telugu Novels-Anote
12. బాబు - దండకారణ్య ఆదివాసీ ప్రజల వ్యవసాయం - ఒక సమీక్ష-వ్యాసం-అరుణతార-1990
13. మానేపల్లి-పగిలిన అద్దంలో పాక్షిక చిత్రం - అరుణతార-1990
14. కె.వి.ఆర్. - వసంత వదనం-సమీక్ష-అరుణతార

# తెలుగు నవలల్లో తెలంగాణా స్త్రీల స్థితిగతులు

తెలుగు నవలల్లో తెలంగాణ జన జీవితాన్ని పరిశీలించడం అంటే కేవలం కార్మిక గిరిజన పోరాటాలు - వారి స్థితిగతులు, దొరల దౌర్జన్యాలు, వెట్టి బతుకులు, ప్రతిఘటనలు మొదలైన వాటికే పరిమితమై పోరాదు. చదువుల్లేక, ఆర్థిక స్వేచ్ఛ లేక, సామాజికావగాహన లేక కూపస్థమండూకాలై అసహాయంగా మతపరమైన, సాంస్కృతపరమైన ఆంక్షలతో జీవితాలను వెళ్ళబుచ్చిన స్త్రీలు -ఆ స్థితి నుండి చైతన్య సీమలోకి ప్రవేశించడానికి వారు పడిన తాపత్రయం, చేసిన కృషి ఉద్యమపోరాటాల్లో సైతం భాగస్వామ్యం కలిగించుకోగలగడమేగాక మార్గ దర్శకత్వం వహించడం దాక అంచెలంచెలుగా ఎదిగిన పరిణామ క్రమాన్ని కూడా గమనించడం ఒక ముఖ్యమైన అంశం.

ఆ సమాజంలో పురుషుడే ఒక బానిస అంటే స్త్రీ ఆ బానిసకు బానిస లాంటిది. పురుషుడికి కుటుంబ జీవితం కన్నా సామాజిక జీవితంలోనే సమస్యలెక్కువ. స్త్రీ కౌటుంబికమైన సమస్యలను సామాజిక సమస్యలను ఏకకాలంలో ఎదుర్కోవాల్సి వస్తుంది.

వట్టి కోట ఆళ్వారుస్వామి, దాశరథి రంగాచర్య లాంటి రచయితలు సాంస్కృతిక పరమైన కళల పట్ల ప్రీతి పాత్రలను పండుగ పబ్బాల ఉత్సాహాన్ని, ఆలంకారిక ప్రియత్వాన్నీ చిత్రించినా తెలంగాణ స్త్రీలు పడిన మనోవేదన, అసహాయత, బాధలు, సమస్యలు మొదలైన అంశాలు వీటిలో మనకు ప్రధానంగా కన్పిస్తాయి. ఈ నవలల్లో స్త్రీలు వివిధ రూపాలలో సాక్షాత్కరిస్తారు. కొందరు పల్లె పడుచులు ముగ్ధలుగా దర్శనమిస్తే మరికొందరు జీవితాల్ని భూస్వాములకు అంకితమిచ్చి

దాసీలుగా ఆడబాపలుగా ఉంపుడు గత్తెలుగా పనిమనుషులుగా చెలామణి అవుతారు. ఇటువంటి స్త్రీలే కాక ఆదర్శంతమైన స్త్రీలను కూడా కొన్ని నవలల్లో మనం చూస్తాం. మొదట ఈ నవలల్లో ఉన్న ఆదర్శవంతమైన స్త్రీ పాత్రల గురించి చర్చిస్తాను. ఆదర్శ పాత్రలు అంటే నా దృష్టిలో సాంప్రదాయిక ఆదర్శంగాదు. పతివ్రతలుగా భావించే వారికి నేను ఆదర్శం అని పరు పెట్టట్లేదు. సమాజంలో నివసిస్తూ, దాన్ని అర్థం చేసుకుంటూ, సామాజిక పరిస్థితులను విశ్లేషిస్తూ సమాజంను ఒక సవాలుగా ఎదుర్కొంటూ సమాజాన్ని ఎదిరించే వాళ్ళు నా దృష్టిలో ఆదర్శస్త్రీలు. వీరు చూపిన మార్గం ముందు తరాలకి బాటగా నిలవాలి. వీరి జీవితం భవిష్యత్తుకి ఆదర్శప్రాయమై నిలవాలి. ఫ్యూడల్ భూస్వామ్య కుటుంబంలో జన్మించి అధికతర విద్యావంతురాలై ప్రపంచ పోకడను గుర్తించి ప్రజాపోరాటాల్లో మమేకమై తండ్రినే ఎదిరించిన **సుజాతను** వట్టికోట **ఆళ్వారు స్వామి గంగు** నవలలో గమనించవచ్చు.

ఇదే నవలలో విద్యావంతుల కుటుంబంలో పుట్టి, ప్రజాస్వామిక భావాలతో పెరిగి తనకు నచ్చిన వరుణ్ణి తన నిర్ణయంతో పెళ్ళి చేసుకోగల్గిన **కమల** వికాసాన్ని కూడా చూడవచ్చు.

బుద్ధి తెలియని దశలోనే వితంతువై పుట్టిల్లు చేరి తండ్రిని కోల్పోయి ఇంటికి తానే **మగదిక్కై** కుటుంబ నావను దరిచేర్చి ఉద్యమాలతో మమేకమై మారుమనువు చేసుకోవాలని తపన ఉన్నా విఫల మనోరథమైన **సత్తెమ్మను** మహీధర రామ్మోహన రావుగారి **ఓనమాలు** నవల్లో చూడవచ్చు.

దొరలు పాశవికంగా తన కూతుర్ని చెరచడంతో మొగుడ్ని చంపేయడంతో తల్లడిల్లిపోయి సంఘంలో చేరి క్రమేపి నాయకురాలి

దశకు ఎదిగిన **రాములమ్మ**ను **బొల్లిమంత శివరామకృష్ణ మృత్యువు నీడల్లో** చూడవచ్చు. ఇదే నవలలో ఉద్యమాల్లో తిరిగే వారిని ఈ సడించుకునే శైశవ మనస్తత్వం కలిగిన దశ నుండి ఉద్యమాలకు చల్లని వెన్నెల ప్రసరింప జేసే పరిణత స్థాయి కెదిగిన **శశిరేఖ**ను చూడవచ్చు.

తన భర్తను క్రూరంగా చంపించిన భూస్వామ్య చర్యలను ఒకవైపు ద్వేషిస్తూ, ప్రజలను చైతన్య పరుస్తూనే ఆ భూస్వామి కూతురును ఆప్యాయంగా ఆదరించగలిగే స్థాయికి చేరుకున్న **మంగమ్మ**ను **దాశరథి రంగాచార్య జనపదం**లో చూడవచ్చు.

వ్యక్తిగతంగా బాధలను అనుభవించక పోయినా మారుతున్న కాల పరిణామానికి అనుగుణంగా స్పందించి భూస్వామ్య వ్యతిరేకోద్యమంలో పాలుపంచుకొన్న ముఖ్యమైన పాత్రలుగా **తిరునగరి** రాసిన **సంగం** నవలలోని **స్వరాజ్యం, శాంతమ్మ**లను, బి. తిరుపతయ్య **బతుకుపోరు** నవలలోని **రామక్క** పాత్రను, అల్లం రాజయ్య **అగ్నికణం** నవలలోని **బయ్యక్క**లను ప్రధానంగా పేర్కొనవచ్చు.

భూస్వాముల చేతుల్లో ఎన్నోబాధలు అనుభవించి చైతన్యవంతులై ఉద్యమ నిర్మాణంలో భాగస్వాములైనవారు, సానుభూతితో ఉద్యమాల్లో పాల్గొన్న వారితోపాటు ఉద్యమస్థాయిని అందుకోలేక చైతన్యాన్ని పొందలేక బాధలను అనుభవించి జీవితాలను కూడ తీర్చుకున్న పాత్రలు సైతం కొన్ని నవలల్లో లేకపోలేదు. అట్టి పాత్రల్లో- బోయ జంగయ్య **జాతర** నవలలోని **రాధ**, భాస్కరభట్ల కృష్ణారావు **యుగసంధి**లో **రుక్మిణి**, దాశరథి రంగాచార్య **చిల్లరదేవుళ్ళు**లో **వనజ**, జనపదంలోని అమృతవాణి, **మాయజలతారు**లోని **డైసీ**, వట్టికోట ఆళ్వారుస్వామి గంగులోని **నీలవేణి** మొదలైన పాత్రల మనః ప్రవృత్తుల విశ్లేషణే ఈ పంచమాంక పరమావధి.

## సుజాత :

వట్టి కోట ఆళ్వారు స్వామి రచించిన గంగు నవలలో సుజాత ఒక ఆదర్శవంతమైన పాత్ర. **భూస్వామ్య కుటుంబంలో పుట్టి భూస్వామ్య వ్యవస్థకు చిచ్చు పెట్టిన స్త్రీ సుజాత**[1] అని వరవర రావు గారు తన సిద్ధాంతగ్రంథం లో సుజాతను పరిచయం చేస్తారు. సుజాత తండ్రి వెంకట్రావు మద్ది మెట్టలో పెద్ద భూస్వామి. అతడుచేస్తున్న అన్యాయాలను. చిన్నప్పటి నుంచి చూస్తూనే ఉన్నా పట్నంలో చదువు ప్రభావం వల్ల అని అన్యాయాలని క్రొత్తగా తెలుసుకుంది. హిందీ మాట్లాడటం, ఖద్దరు కట్టడం, చరఖా తిప్పటం అలవాటు చేసుకుంది. ప్రపంచ రాజకీయ పరిజ్ఞానాన్ని సముపార్జించు కుంటుంది. సమకాలీనమైన వామపక్ష, జాతీయోద్యమాల పట్ల ఆకర్షితురాల వుతుంది. ఆ చైత్యనంతో తన ఊళ్లో జరుగుతున్న అన్యాయాలను ముందుగా అరికట్టాలని అనుకొని అందుకుతానేం చేయాలో కూడా నిశ్చయించుకుంది. పట్నంలో చదువుతున్న టెర్రరిస్టు ఉద్యమం గురించి, కమ్యూనిస్టు పార్టీ గురించి తెలుసుకోవడమే గాక ఆ పార్టీతో పరిచయాన్ని కూడా పెంపొందించుకుంది. ఒకసారి ఆ ఊళ్ళో ఉన్న హరిజనుడు వెట్టి చేయడానికి నిరాకరించి అమీను చేతుల్లో దెబ్బలు తిని మరణించనప్పుడు తండ్రి ఖద్దరు ఉత్పత్తి కేంద్రం వారే దీనికంతా కారకులని అరెస్టు చేయిస్తాడు. వారు జైల్లో ఉన్నప్పుడు తన తండ్రి మూయించిన కేంద్రాన్ని సుజాత రహస్యంగా నడిపిస్తుంది. తండ్రిని మంచి మార్గంలో పెట్టాలనే ఉద్దేశ్యంతో చాలా అమాయకంగా అతని దౌర్జన్యాల గురించి చెప్తు ఆ దౌర్జన్యాలు సహించలేని ప్రజలు కొన్ని దేశాలతో తెచ్చిన తిరుగుబాటు గురించి, రష్యా విప్లవం గురించి తండ్రికి వివరించేది. తన తండ్రి మారి ప్రజలకు న్యాయం కలిగిస్తాడని ఉత్సాహపడుతుంది. కాని, తన

అంచనాలను వెంకట్రావు తారుమారు చేయడంతో సుజాతకు ఊహాజనితమైన ఆదర్శవాదం నుంచి ఆచరణాత్మక ఆదర్శవాదం వైపు ప్రయాణించాల్సిన అవసరం ఏర్పడింది. తన తండ్రి వెంకట్రావు నిరంకుశత్వం వల్ల ఉద్యమ కార్యకర్తలైన నవనీతం నాగభూషణంలు నిర్బంధంలో ఉన్నారని తెలుసుకుంది. సుజాతలోని మార్పును వెంకట్రావు పసిగడ్తాడు. వర్గ చైతన్యం తండ్రీ కూతుళ్ల మధ్య ఒక అగాథాన్ని సృష్టించింది. నవనీతం, నాగభూషణం విడుదలైన వార్త పీపుల్స్ వార్ పత్రికలో చూసి సంతోషంతో తల్లికి చదివి వినిపిస్తుంది. ఆమె ఉత్సాహం చూసి తల్లి చీదరించుకుంటుంది. దానికి సుజాత **ఇందులో అబద్ధమేముంది? అంతా నిజమేగా? వాండ్లను పోలీసులకు పట్టించింది నాయనేనని నువ్వు కూడా అన్లేదా! ఊళ్లో వాళ్లను తిప్పలుపెడ్తుది నిజమేనాయే!** అని సమాధానమిస్తుంది. తల్లి జానకమ్మకు కూతురి వ్యవహారం రాను రాను అంతుబట్టకుండా పోతుంది. సుజాత తండ్రికి తెలియకుండా పత్రికలు, పుస్తకాలు ఉత్తరాలు తోట రామయ్య ద్వారా తెప్పిస్తూ అతనితో ఆలోచనలు చేస్తోందని తెలిసి ఒక వైపు కుటుంబ సభ్యులు భయపడుతుంటే మరొకవైపు నవనీతం నాగభూషణం లు ఈమె చైతన్యాన్ని గురించిన వార్తలు వింటూ ఆనంది స్తుంటారు. నవనీతం, నాగభూషణం తదితర నాయకులందరూ బొత్తల గూడెం లో సభ జరపడానికి వచ్చినప్పుడు మొదటిసారిగా సుజాతకు నవనీతం పై ప్రేమ భావం అంకురిస్తుంది. సుజాత ఉత్సాహం పార్టీకి సంబంధమైనదే ఐనా తను ప్రతి రోజు జడలో అలంకరించుకొనే గులాబీ పువ్వు నవనీతం చేతిలో ఉండటం ద్వారా వారికి మానసిక అనుబంధం ఏర్పడిందని తెలుస్తుంది.[2] సుజాత తల్లిదండ్రులు ఆమెకు పెండ్లి తల పెట్టినప్పుడు అది తనకొక పరీక్షా సమయంగా అనిపించి ఆమె పార్టీజీవితానికి అంకితం

కావాలని నిర్ణయించుకుంటుంది. నవనీతం, సుజాతలు వివాహ సమస్య సామాజిక సమస్యగా అర్థం చేసుకుంటారు. నవనీతం ఆమెను వివాహం చేసుకోవడానికి నిర్ణయించుకుంటాడు. ఆ నిర్ణయం తన ఊరినీ కన్నతల్లిని శాశ్వతంగా దూరం చేస్తుందని తెలుసు కున్న సుజాత స్త్రీ సహజమైన మానసిక ఘర్షణకులోనై ఏడుస్తుంది. ఆరోజంతా తాను చదివిన విప్లవ గాథలను, అందులోని స్త్రీల సాహసాలను నెమరువేసుకుంటుంది. వివిధ దేశాల్లో ముఖ్యంగా ఫాసిస్టు వ్యతిరేక పోరాటాల్లో చైనా, రష్యా, తూర్పుయూరోపు దేశాల్లోనూ, స్పెయిన్ అంతర్యుద్ధంలో లాపాశ్‌నారా, రష్యాలోటాన్యా, జోయా స్త్రీల వీరగాధలు స్పురణకు తెచ్చుకుంటూ తన జీవితం అంకితం చేయడానికి సమయ మాసన్నమయిందని ఉప్పొంగి పోతుంది. చివరిసారిగా ఊరినుండి వెళ్లిపోతూ, ఊరిస్థితిని చూస్తూ **ఈ స్థితిపోవాలె తప్పక పోతుంది** అని తనలో తాను గొణుక్కుంటూ ఊరిని దాటుతుంది. ఊరిబయట చిన్న చిన్న డొంకలు, గుట్టలు పోయి విశాలమైన వ్యవసాయ క్షేత్రాలు వెలుస్తాయి. ఈ నాగళ్ళ బక్కటెద్దులకు బదులుగా ట్రాక్టర్‌లు బుల్‌డోజర్లు వస్తాయని ఊహిస్తూ ఆ ఊహలకు రూపాన్ని ఇచ్చేందుకు బయలుదేరింది. సుజాత తన స్నేహితురాలైన కమల ఇంట్లోదిగింది. వీరిద్దరూ ఒకప్పుడు కలిసి చదువుకున్నవారే. అయినా ఒకరి గురించి మరొకరికి ఏమీ తెలియక మూడేళ్లు అవుతుంది. పార్టీ ఆఫీసులో నవనీతం రమణారెడ్డి గార్లు సుజాతను కామ్రేడ్ అనడం విని కమల ఆశ్చర్యపోతుంది. పల్లెటూళ్లో ఏమైపోయిందో అనుకున్న సుజాత పాత సంకెళ్లను త్రెంచుకొని తల్లిదండ్రులకు దూరమై జీవితాన్ని పార్టీకి అంకితం చేసిందని తెలిసిన కమల సుజాతని అభినందిస్తుంది. ఆ వాతావరణంలో కలిగిన ఆనందానికి సుజాత కళ్లలో నీళ్లు తిరుగుతాయి. స్నేహితులిద్దరు

మనస్సు విప్పిమాట్లాడుకుంటారు. మాటల సందర్భంలో గ్రామీణ జీవితంలోని ఘోరాల గురించి చెప్తూ "కమలా! ఈ పట్నంలో బజార్లల్లో బిచ్చగాండ్లను, బీదవాండ్లను, కూలివాండ్లను చూస్తూనే వుంటావు. వారెవరను కున్నావు? వారంతా పల్లెల నుంచి తరలివచ్చినవాండ్లే. పల్లెల్లో మానాన్న వంటి పెత్తందార్లు తప్ప మిగతావారంతా వాళ్ళకెంత భూమి వుండనీ, తెలివివుండనీ, చదువువుండనీ, ఆస్తివుండనీ, నెగలలేరు అందరూ. తప్పువున్నా లేకున్నా, అధికారికింద అన్యాయమైనాసరే, అలావుండాల్సిందే, నెలల కొద్ది నెత్తికి నూనెకు నోచుకోని స్త్రీలు, ఒంటిమీద బట్టసరిగా లేక తినడానికి, ఆడుకోడానికి అవకాశంలేని పిల్లలు అడుగడుగునా కనిపిస్తారు. చాకలి, మంగలి మొదలైన పనిపాటలవాండ్లు పొట్ట తిప్పలు మానుకొని ప్రతిఫలంలేని పాడుచాకిరి చేస్తుంటారు, ఈ విధంగా కష్టాలు, దారిద్ర్యం, రోగాలు, అప్పులు, అన్యాయాలు, ఆజన్మాంతం అనుభవిస్తూ, ఆదుకునే దిక్కు లేక, అన్యాయాలు అంతరించిపోతాయనే ఆశలేక, ఆనువంశికంగా అయోమయ మైపోయారు." అంటూ "రాజకీయవాసనగలనేను, ఒక విప్లవ పార్టీకి చెందిన నేను, అన్యాయాలకు ఆయుధాగారమైన మా ఇంట్లో ఇన్ని యేండ్లు ఏ విధంగా జీవించానో ఊహించుకో కమలా! పైగా నన్ను ఒకనికి అంటగట్టి నాకు వ్యక్తిత్వమూ, అస్తిత్వమూ లేకుండా పోయే ప్రమాదం రాకుండా ఈ నిర్ణయానికి వచ్చాను, మా అమ్మకు, నాన్నకు సొమ్ములు, వరదక్షిణ విషయం తగాదాయేకాని ఒక్క సారైనా నా గురించి ఆలోచించలేదు. ఇదీ స్థితి" అని కమలకు వివరిస్తుంది[3].

నవనీతంతో తన ఆదర్శాల్ని ద్విగుణీకృతం చేస్తుకుంది. ముఖ్యంగా ఈ నవలలో ఒక క్రమపద్ధతిలో సాగే సుజాత మానసిక సంఘర్షణమూ, చైతన్యాన్ని మనం గమనిస్తాం. పట్నంలో పార్టీవల్ల కలిగిన

చైతన్యం భూస్వామ్య దౌర్జన్య పరిస్థితులవల్ల బంగారం పుటం పెట్టినట్లయింది. భూస్వామి కుటుంబంలో చిచ్చు? విద్యావంతురాలైన యువతి అన్నిటనీ వదులుకొని కమ్యూనిస్టు పార్టీలో చేరిక ఇంటర్ విద్యార్థిని సుజాత ప్రకటన ............ నల్లగొండ జిల్లా మద్దిమెట్టు గ్రామంలో ప్రముఖ వతన్‌దారు, దేశ్‌ముఖ్ వెంకట్రావుగారి కూతురు శ్రీమతి సుజాత నేటితో కామ్రేడ్ సుజాతగా మారిపోయింది. ఇల్లు, సంసారం, తల్లి దండ్రులతో, భూస్వామ్య కుటుంబంతో సంబంధాలు తెగ తెంపులు చేసుకొని, తన జీవితం కమ్యూనిస్టు పార్టీకి అంకితం చేసి, పీడిత, బాధిత లోకాన్ని ఉద్ధరించడానికి దీక్ష పూనింది[4] అన్న వాక్యాలు చదివి వెంకట్రావు దిమ్మెరపోతాడు.

సుజాత తనిచ్చిన ప్రకటనలో తనుతినే ఆహారం, పీల్చేగాలి ఉక్కిరి బిక్కిరి చేసి తాను ఆ ఇంట్లో ఉండలేకపోయానని తెలుపుతుంది. తన పరిజ్ఞానం తనపై తిరుగుబాటు చేస్తూ చైతన్యం రెక్కలు కట్టిందని చెపుతుంది. భూస్వామ్య నిరంకుశ విధానంలో భాగస్థురాలుగా ఉన్న నన్ను రక్షించినందుకు కమ్యూనిస్టుపార్టీకి జే జేలు అర్పించు కుంటు న్నాను. అన్న ప్రకటన చదివి వెంకటరావు ఆడదానికేం భాగ ముంటుందని గొణుక్కుంటాడు[5]; ప్రకటన చూసిన తరువాత స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధం తొలగి ఇక తెలంగాణాను ఆవరించిన కమ్యూనిజం నాశనమౌతుందన్న ఉత్సాహంతో ఉంటాడు. వెంకట్రావు తన క్రొత్త ఎత్తుగడలతో కూతుర్ని రాజకీయాలలోకి దించి ఎప్పుడూ తాను నాయకత్వస్థానంలో ఉండాలని కోరుకుంటాడు. ఐతే తండ్రీకూతుళ్లిద్దరి పార్టీలు వేరవడంతో అతని ఫ్యూడల్ అహంకారం విపరీతంగా దెబ్బతిని వెంకట్రావుకి మతి చలిస్తుంది. అతడు కూతుర్ని మనసు మార్చేప్రయత్నంలో కమల తండ్రి తన మిత్రుడైన రామ్‌శరణ్ సహాయాన్ని కోరతాడు. ఐతే రామ్‌శరణ్

వెంకట్రావుకు అతని వాదనలో బలంలేదని చెబుతూ "మీ గ్రామ పరిస్థితులు, మీ వంటి వాండ్లు నిత్య జీవితంలో చేసేపనులు, జరిపే వ్యవహారాలు మీ అమ్మాయి చెబుతుంటేనే మాకండ్లల్లో నీళ్లు తిరిగాయి. పట్టణంలో జట్కాగుర్రాలకున్న గౌరవం, జీవిత రక్షణ మీ గ్రామ ప్రజలకు లేదని తేలింది." మీ అమ్మాయి విషయమే మీకు ఆశ్చర్యమనిపించింది గాని, గ్రామ ప్రజలు ఎందుకు బానిస జీవితం గడుపుతున్నారో ఆలోచించారా? .... నగలూ, చీరలూ విలాస వ్యాపోలి జీవితాలతో కాలంగడిపే ఆడవాండ్లు కూడా ఈ విధంగా సిద్ధపడుతున్నారంటే మనం కొంచెం శాంతంగా, లోతుగా ఆలోచించాలి "అంటాడు. గ్రామ ప్రజలందరికీ సుజాత ప్రకటన తెలిసి దొరను పిచ్చివాణ్ణి చేసిన సుజాతమ్మ గారికి జై అన్నారు. దాంట్లో కసితో కూడిన ఆనందం కనిపిస్తుంది. సుజాత చైతన్యం మద్దిమెట్ల గ్రామంలో భూస్వామ్య సంబంధాలను తలక్రిందులు చేసింది. ఇది సుజాత ఒంటరిగా సాధించిన విజయంకాదు. ఆంధ్రమహాసభ కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో సమిష్టిచైతన్యం వల్ల సాధించిన విజయం. అందుకే సభలో సుజాతని పరిచయంచేస్తూ కమల ఈ కామ్రేడ్ అపర మహిరావణుడుగా తెలంగాణా లో పేరుమోసిన ఒక భూస్వామి మద్దిమెట్ల వెంకట్రావు కూతురు. అన్యాయార్జితమైన అతని ఆస్తిని, ఉనికిని అసహ్యించుకొని ఈ కామ్రెడ్ మహిరావణునికి దూరమై ఎర్రజండా నీడను ఆశ్రయం పొందింది అంటూంది.

పీడింపబడేవాళ్లు కష్టజీవులు కమ్యూనిస్టులైతే దాంట్లో ఆశ్చర్యపడవలసిందిలేదు. అది వాళ్ల భౌతికావసరం. ఐతే దాంట్లో వాళ్ల బాధల కొనసాగింపే తప్ప వాళ్లకి ఒరిగే దేముండదు. పోరాటంలో బానిస సంకెళ్లుతప్ప వాళ్లకి పోయేవి ఏవీ ఉండవు. కాని, భూస్వామ్య కుటుంబంలో పుట్టి తన చదువువల్ల పరిస్థితుల వల్ల పరిసరాల వల్ల కలిగిన

చైతన్యంతో సుజాత కమ్యూనిస్టుగా మారడం గొప్ప ఆశ్చర్యమైన, సంచలనం కలిగించే విషయం. పెత్తందారీ కుటుంబంలో పుట్టిన వ్యక్తి కమ్యూనిస్టు కావడమంటే తన పుట్టుక వేర్లను తాను నరుక్కొని ప్రజల పక్షంచేరడం. ఇది అరుదైన విషయమేగాక చారిత్రకంగా కూడా అని వార్యమైంది. మొదట సుజాత భూస్వామి హృదయ పరివర్తన వరకు మాత్రమే ఆలోచిస్తుంది. కొద్దికాలంలోనే అది తన భ్రమ అని తెలుసు కొని ప్రజల చైతన్యాన్ని ఆకళింపు చేసుకొంటూ ఎదురుతిరుగుతూ ఆ పునాదుల్ని కదిలించడానికి తన జన్మ సంకెళ్లని తెంచుకుంటుంది. బానిస సంకెళ్లు తెగాలంటే కన్నపేగు అనుబంధాలను కూడా నిర్దాక్షిణ్యంగా త్రెంచుకోవలసిన వర్గపోరాట చైతన్యం అవసరమని సుజాత పాత్ర రుజువుచేసింది[6].

సుజాత కరపత్రం చదివిన ప్రయాణీకులు ఆమె చేసిన పనిని మెచ్చుకొంటూ రావణుని ఇంట్లో విభీషణుని వలె ఈ అమ్మాయి భలే పనిచేసింది. ఆడవాండ్లు ఈ విధంగా తెగిస్తే ఎవని కొంపలు ఆగుతాయి. మగవాండ్లే అంతంత మాత్రముంటుంటే ఆడదానికింత సాహసం కలగడం ఆశ్చర్యమే. ఆశ్చర్యమెందుకు చదువుకున్న అమ్మాయి. తండ్రి ఎంత దుర్మార్గుడో ఎవరికెరుక? బండలెత్తడం, బరిగెదెబ్బలు చూడలేక పోయిందేమో, మనసు మారితే ఎంతకావాలె. ఆడది తల్చుకుంటే ఆపేదెవరు? .... ఈ రకంగా తర్జన భర్జనలు చేసిన ఆ ప్రయాణీకుల్లో కూడా పెత్తందారీ వ్యవస్థపై నిరసన సుజాత చేసినపనికి ప్రోత్సాహం తెలిపారు; ఈ రకంగా సుజాత నూతన చైతన్యంతో కలిగి ఉండి, తన సంకెళ్లను తెంచుకోవడమేగాక తన ఇంట్లో ఆడబాపగా వున్న నీలవేణికి, రాజం కు కూడా తనచైతన్యంతో విముక్తి కల్గిస్తుంది.

## కమల :

ఈ నవలలో రెండవ ఆదర్శమైన పాత్రగా మనకు కమల దర్శనమిస్తుంది. కమల సుజాతలా భూస్వామ్య కుటుంబంలో పుట్టి కమ్యూనిస్టుగా మారిన స్త్రీగా కాకుండా మొదటి నుండి సామ్యవాద దృక్పథం కలిగి ఉన్న స్త్రీ. కమల తండ్రి మెజిస్ట్రేట్‌గా పనిచేశాడు. ఇతడే కమలలో ప్రజాస్వామిక భావాలు, సామ్యవాద దృక్పథాన్ని కలిగించాడు. తనకు నచ్చినా, నచ్చకపోయినా ఎదిగిన పిల్లల మనోభావాలను గౌరవించాలన్న వివేకం లోకజ్ఞానాన్ని ప్రదర్శించడం ఇతని వ్యక్తిత్వానికి నిదర్శనాలు. అందుకే కమల కరుణాకర్‌ని వివాహం చేసుకున్నప్పుడు తల్లి ఈ పెళ్లికి వ్యతిరేకించినా అతడు నిండు మనసుతో ఆశీర్వదిస్తాడు. కమల, సుజాత ఒకప్పుడు కలిసి చదువుకున్నారు. సుజాత చదువు వదిలి స్వగ్రామం వెళ్లి పోగా కమల డాక్టరు కోర్సులోచేరుతుంది. ఈ మూడు సంవత్సరాల తరువాత సుజాతను కలుసుకున్నప్పుడు తనలో వచ్చినమార్పే సుజాతలో కూడా ఉండటం చూసి ఆనందిస్తుంది. సుజాత స్నేహితురాలితో గ్రామాలలో జరుగుతున్న దౌర్జన్యాలనూ దుర్భర పరిస్థితులను వివరించినప్పుడు ఒక దీర్ఘమైన నిట్టూర్పు విడుస్తుంది. పట్టణ వాతావరణంలో సంస్కారంగల కుటుంబంలో పుట్టడంవల్ల దానికి తోడుగా విద్య ఉండటం వల్ల తాను బహిరంగంగా పార్టీ పనులల్లో పాల్గొనేందుకు తనకు అవకాశాలున్నాయని గ్రామీణ వాతావరణంలో ప్రతికూల పరిస్థితులలో తనవంటి భావాలే ఉన్న సుజాతకు అటువంటి అవకాశాలు లేకపోయినా సుజాత ఎంతో ధైర్యంతో త్యాగానికి సిద్ధపడిందని అర్థంచేసుకుంటుంది.

పురుషులు తమను స్నేహాదరణతో సమానస్థాయిలో చూడాలని, విధిలేకనో అలవాటుగనో గాక హృదయంతో ప్రేమించగలిగే

స్వాతంత్ర్యం కావాలని స్త్రీలు ఆకాంక్షిస్తారు. తమ అభిరుచులను తామ అభివృద్ధి పరచుకోగలగాలని తమ నిర్ణయాలను తామే స్వేచ్ఛగా తీసు కోవాలని కోరుకుంటారు. ఒక్కమాటలో చెప్పాలంటే మరొకరి నీడగా కాక, తానొక వ్యక్తిగా నిలవ గలిగితేనే వారికి నిజమైన స్వాతంత్ర్యం వచ్చినట్టు లెక్క. సామ్యవాద భావాలుగల స్త్రీ పురుషులు ఒకరి అభిప్రాయాలను మరొకరు గౌరవించుకుంటూ స్నేహితులుగా ఉంటారే తప్ప భరించేవాడు భర్త, భరింపబడేది భార్య అన్న భావంతో ఒకరు యజమాని, మరొకరు బానిస అనే దృష్టితో తమదాంపత్య జీవితాన్ని ఛిన్నా భిన్నం చేసుకోరు. చూసే వారికి కూడా వాళ్లలో అనవసరమైన సిగ్గు బిడియాలు ఆధిక్యతాభావాలు భేషజాలు కన్పించవు. ఈ విషయా లన్నీ కమల, కమల భర్త కరుణాకర్‌ల పాత్రల ద్వారా రచయిత నిరూపిస్తాడు.

ఈ నవలలో కమల అతిధి పాత్రగా దర్శనమిచ్చినా ఆమె కమ్యూనిస్టు భావాలూ, ఉపన్యాసాలు చాల తీవ్రంగా ఉంటూ సామ్యవాద దృష్టితో ఉన్న స్త్రీగా వర్ణింపబడింది. కరపత్రం వ్రాయడం చేతగాదు కాని గుక్కతిప్పుకోకుండా ఉపన్యాసం ఇచ్చే కమల ఉక్కు సంకల్పాలతో, నవనీత హృదయంతో తయారైన సామ్యవాద స్త్రీ[7] అంటారు వరవరరావు గారు.

**సత్తెమ్మ :**

మహీధర రామ్మోహనరావుగారి **ఓనమాలు** నవలలో సత్తెమ్మ పెళ్లైన మరు సంవత్సరమే భర్తపోయి తల్లిగారింటికి చేరుతుంది. తండ్రి మరణంతో వ్యవసాయ భారాన్ని తనపై వేసుకుంటుంది. వ్యవసాయానికి సాయంగా వెంకటయ్యను కుదుర్చుకుంటుంది. వారింట్లో కుటుంబ సభ్యులందరూ మరీ చిన్న వాళ్లు ముసలివాళ్లు కావడంతో వాళ్ల పొలాన్ని సాగుచెయ్యడం కోసం వెంకటయ్య సాయంతో తన నగలను అమ్మి పగలనకా రేయనక రెక్కలు ముక్కలు చేసుకొని ఇద్దరూ కలిసి పొలం

పచ్చ బడేటట్లు చేస్తారు. వారితోట గ్రామ ప్రజలందరినేగాక దొర కూతురు సుమిత్ర అల్లుడు రాజిరెడ్డి లను కూడా ఆకర్షిస్తుంది. ఆ రకంగా పొలాన్ని బాగుచేయడంలో తోడ్పడ్డ వెంకటయ్య పై మనస్సు పెంచుకుంటుంది.

వారిద్దరి మధ్య ప్రేమకు ఆర్థిక అంతరం లేదు. వెంకటయ్య అదేకులానికి చెందిన వాడు. ఒకప్పుడు స్థితిమంతుడేకాని అదృష్టం బాగాలేక పాలేరుగా మారాడు. వీరిద్దరి ప్రేమ ఊరందరికి తెలిసినా ఎవరూ పైకి అనేవారు కాదు. ఈ రకంగా వాళ్లిద్దరు కలిసి ఉంటున్నప్పుడు ఆ ఊర్లోకి పద్మాలు అనే అతను సంఘాన్ని తెస్తాడు. సంఘంలోకి చేరిన వెంకటయ్య కి ఎన్నో కొత్త విషయాలు తెలుస్తాయి. పెళ్లి చేసుకోకుండా స్త్రీ సంబంధం పెట్టుకోవడం మంచిది కాదని తెలుసుకుంటాడు. అదేమాట సత్తెమ్మతో చెప్పి ఆమెను బహిరంగంగా పెళ్లి చేసు కుంటానంటాడు కాని సత్తెమ్మ తోపాటు ఆమె తల్లి, తమ్ముడు కూడా పెళ్లికి ఒప్పుకోరు. వాళ్ల కులంలో మారుమనువు నిషిద్ధం. పెళ్లి చేసు కోకుండా చాటుగా స్త్రీ పురుషసంబంధాలు పెట్టుకున్నా ఫర్వాలేదు. ఈ విషయం కుటుంబంలో తల్లికి, తమ్మునికి, మరదలికీ తెలిసినా అంతగా పట్టించుకోరు. రంగయ్య పట్నంలో చదువు కుంటున్నాడు కాబట్టి ఆధునిక భావాలు కలిగి ఉంటాడు. వీరేశలింగం గారి ఉపన్యాసాల ప్రభావంతో సంఘ సంస్కరణను కోరుతూ విధవ వివాహాలూ, పునర్వి వాహాలు చేసుకోవచ్చంటాడు. కొద్ది రోజులవరకు తన అక్కకు మళ్లీ పెళ్లి కోసం ప్రయత్నాలుచేస్తాడు. కాని ఏ సంబంధమూ కుదరక పోవడంతో తన ప్రయత్నాన్ని మానుకుంటాడు. ఇంతలోనే సత్తెమ్మ తాను వెంకటయ్య ను వివాహమాడ బోతున్నట్లు చెప్పుతుంది. వెంబడే రంగయ్య లో మార్పువస్తుంది. దానికి కారణం వెంకటయ్య ఒక పాలేరు కావడమే. అంతస్థుల్లో భేదాలురావడం ఒక కారణమైతే తన అక్క పెళ్లి చేసుకొని పోతే సంసారాన్నిచూసే వారెవరూ ఉండరని అతనికి భయం.

తల్లికి కూడా సత్తెమ్మ పెళ్లి వలన సంఘంలో ప్రతిష్ఠ చెడుతుందని తెలుస్తుంది. వీరందరూ వెంకటయ్యతో కలిసి ఉన్నా ఫర్వాలేదంటూ ఆమెకు ఏ కడుపు వచ్చినా మందుపెట్టి తీసెయ్యొచ్చు. దానిలో ప్రాణాపాయం జరిగినా నష్టం లేదనుకుంటారు. కాని పెళ్లికిమాత్రం ఒప్పుకోరు. పెద్దమనుషులతో కూడా మారుమనువు కూడదని చెప్పిస్తుంది. ఆ రకంగా సత్తెమ్మ తన పెళ్లి ప్రయత్నాన్ని విరమించుకుంటుంది. ఆనాడు సంఘం కొన్ని రహస్యాలు బహిరంగమైనా కొన్ని కట్టుబాట్లకు లొంగి వుండేది. పసిప్రాయంలోనే పెళ్లిచేసి, మగడు చనిపోతే ఆజన్మాంతం విధవగా ఉండిపొమ్మని మాత్రం ఆడదాన్ని శాసించింది. మగాడు కాటికి కాళ్లు చాచుకున్నా ముసలి వాడయినా, ఎన్ని పెళ్లిళ్లనయినా చేసుకోవచ్చునని లైసెన్సు ఇచ్చి స్త్రీల గొంతును కోసింది. ఈ మతం వయస్సులో ఉన్న వితంతుయువతితో రహస్యంగా తప్పుచేసినా కప్పిపుచ్చుకొని బిడ్డలను కనిపారేసినా కళ్లు మూసు కుంటుంది. కాని మళ్లీ పెళ్లి చేసుకోవటానికి మాత్రం అంగీకరించదు. పెద్దింటి వారు చేసిన తప్పులు బైటకు పొక్కకుండా జాగ్రత్త పడేవారు. అదే అట్టడుగువర్గాలైతే వారిని తప్పుపట్టి జుర్మానా వేసేవారు. చిన్న కులాలల్లో మారు మనువుకు తప్పులేదు. పెద్దకులంలోపుట్టడంవల్ల సత్తెమ్మ వెంకటయ్యకు దూరం అయింది. వెంకటయ్యను పనిలోనుండి తొలగిస్తారు. ఆరోజునుండి సత్తెమ్మ బావిదగ్గరకు వెళ్లకుండా సేద్యం గురించి ఆలోచించకుండా నిస్తేజంగా పడి ఉంటుంది. వెంకటయ్యతో మాట్లాడటానికి ఇష్టపడదు. స్నేహితురాలు ముంతాజ్ వీరిద్దరిని కలపడానికి ప్రయత్నించినపుడు ఆమె దౌత్యం నడుపుతుందని కోపంవచ్చి **తార్పుడు ప్రారంభించావా?** అని తీక్షణంగా అడుగుతుంది. అలాంటి పనులెప్పుడూ చేయవద్దని చెప్పి ఆ విధంగా రాయబారాలు నడిపి, సంకేతాలు ఏర్పాటు చేసుకొని పరాయి ఇంట్లో కలుసుకోవడం సత్తెమ్మకు చిన్నతనం గా అన్పించింది. తమ

ప్రణయం అందరికి తెలిసినా వ్యతిరేకం చెప్పనివారు, పెళ్లి ప్రస్తావన వల్ల బెడిసికొట్టి చివరకు స్నేహితురాలు తాము కలుసుకొనే అవకాశం కల్పించటం సత్తెమ్మ భరించలేకపోయింది.

సత్తెమ్మ పొలం శివరాంరెడ్డి ఆక్రమించుకుంటాడు. విషయం తెలియగానే చూరులోంచి బారెడు పొడుగు జువ్వికర్రను తీసుకొని ఆవేశంతో బయలుదేరింది. ఆమెతో పాటు తల్లికోటమ్మ, జానకి రామయ్య వెంటవెళ్లారు. సత్తెమ్మ రౌద్రాకారాన్ని చూసి సేరిదారు కిష్టయ్య పారిపోతాడు. దొరపాలేర్లను క్షమించి వదిలేస్తుంది. ఈ సంఘటన తర్వాత ఊళ్లో చాలా మార్పులు వస్తాయి. ఆ ఊర్లో వచ్చిన సర్కిల్ ఇన్స్పెక్టర్ రమణారెడ్డి వెంకటయ్యను హింసిస్తుంటాడు. సంగతి తెలుసుకున్న సత్తెమ్మ గడీకి బయలుదేరుతుంది. గొడ్డలితో గడీ తలుపులు విరగగొట్టి అతన్ని విడుదల చేస్తుంది. కాని పల్లెత్తుమాట కూడా అతనితో మాట్లాడదు. లోకం దృష్టిలో వెంకటయ్యతో విడిపోయినా, శారీరకంగా అతనికి దూరమైనా, మానసికంగా సత్తెమ్మ ఎప్పుడో అతనికి దగ్గరైంది.

ఆనాటి సమాజంలో మగవాడికున్న స్వేచ్ఛ స్త్రీకి లేదు. ఒక ఆదర్శం స్త్రీ పురుషులిద్దరికీ ఒకేలాగా వర్తిస్తుంది నిజానికి! కాని సంఘంలో అవి ఆదర్శాలుగానే ఉండిపోతాయి. కట్టుబాట్లు ముందుకు వస్తాయి. మగవాడు ఎంతమందినైనా చేసుకోవచ్చు. ఎంత మంది భార్యలు వుంటే అంత గొప్పగా భావించబడుతుండే వాళ్లు. నిజాం నవాబుకి మూడు వందలకుపైగా భార్యలు ఉన్నట్టు చెప్పుకునేవారు. అదే స్త్రీ విషయానికొస్తే ఒక్క పురుషుణ్ణే అంటి పెట్టుకుని ఉండాలి. మానసికం గా అతనికి దగ్గరయ్యానన్న తృప్తితో, తన ప్రేమను త్యాగం చేసి అతనికి దూరమైనా చేతులు ముడుచుకొని కూర్చోక, తనమనస్సును మళ్లించు కోవటం లో **ఓనమాలు**లోని సత్తెమ్మ పాత్ర ముగుస్తుంది.

ఓనమాలు నవల కొనసాగింపే అయిన మృత్యువు నీడల్లో నవలలో కూడ సత్తెమ్మ ఉంటుంది. అయితే ఈ నవలలో సత్తెమ్మ పాత్ర సగానికి పైగా కన్పించదు. మొదట తన వివాహమే ఉద్దేశమనుకున్న సత్తెమ్మ దళంలో చేరిపోయి వెంకటయ్యను మనసులోకి రానీయకుండా నిగ్రహాన్ని పాటిస్తోంది. వెంకటయ్యను పెళ్లాం, పిల్లలు, కుటుంబం మీదకి మనసు మళ్లకుండా దళాల నిర్మాణం కొరకు ఏకాగ్రతలో దృష్టి నిలిపే వ్యక్తిగా చేయాలని సత్తెమ్మ సంకల్పించుకుంటుంది. అందుకే వెంకటయ్యకు ఎదురు పడకుండా తప్పించుకు తిరుగుతుంది. పెళ్లి వద్దన్న నిర్ణయాన్ని పుల్ల విరుపుగా చేస్తే అతని మనస్సు అల్లల్లాడి పోతుందని భావించింది. తన నిర్ణయానికీ, మనస్సుకు మధ్య ద్వైదీ భావానికి కాసేపు గురయింది; సత్తెమ్మ చాలా కొద్ది సమయంలోనే నూరేళ్ల అనుభవాన్ని చూసింది. ఆ చూడటం ప్రతి మనిషి చూస్తున్నట్లు కాకుండా ప్రాపంచిక దృక్పథంతో చూసింది.

ప్రపంచాన్ని అందరూ చూస్తున్నారు, చూస్తున్నా అందరికీ ఒక దృక్పథం ఏర్పడుతుందని అనుకోవడానికి వీలులేదు. ఏర్పడినా, అది ఒకే దృక్పథంకూడా కాక పోవచ్చు. ఆ చూసిన వాటిలో ఉన్న అనేక అనుభవాలను, సంఘటనలను క్రోడీకరించి సాధారణీకరించి వాటి ఆధారంగా ఎక్కువ కాలాలకు, దేశాలకూ, ఎక్కువమంది ప్రజలకు అన్వయించగల సూత్రాలు తయారుచేయాలి. ఆ సూత్రాలు ఆచరణలో ఊహించిన ఫలితాలనివ్వాలి. అవి భవిష్యత్తు ఆచరణకు మార్గం కూడా వేయాలి. అప్పుడే అది శాస్త్రీయ దృక్పథం అవుతుంది[8]. ఇటువంటి దృక్పథాన్నే ఏర్పరచుకుంది సత్తెమ్మ. వెంకటయ్య తన మనసును నిగ్రహించు కోలేక బెజవాడకు పారిపోదాం రమ్మంటాడు. ఆ మాటలకు

తనను లేచి రమ్మన్న అర్థంస్ఫురించి ఆ ప్రతిపాదనకు చక్రుమంది. ఇల్లువిడిచి పారిపోవడం ఆమెకు అసహ్యాకరంగా తోచింది. ఊళ్లోనే వుండి నిగ్రహంతో పెళ్లిచేసుకోవడం మంచిదనే అభిప్రాయం ఆమెది! సంఘంతో సంబంధం పెట్టుకున్న తర్వాత తనలాంటి అసహాయులైన స్త్రీలకు అవసరమైన జ్ఞానం, సంగం అండ ఆమెకుంది. అప్పటి తెలంగాణా పరిస్థితుల్లో ఆ జ్ఞానం లేకుండా సమాజ జీవితమేకాక వ్యక్తి జీవితం కూడా ప్రశాంతంగా వుండదన్న సత్యాన్ని గ్రహిస్తుంది. తనకి పెళ్లి పరమార్థంకాదని, పొలం, ఇల్లుకన్నా విశాలమైన నేల, ప్రపంచం ఉన్నాయని, తన సుఖమయ జీవితం కోసం తెలంగాణ అంతా సుఖమయ జీవితం కావలసిన అవసరం ఉందని గ్రహించి, తన జీవితాన్ని త్యాగం చేయడానికి సిద్ధపడింది. ఒక సమగ్రమైన దృష్టిని ఏర్పరుచుకుంది. పిరికివాడుగా మారిన వెంకటయ్యతో స్నేహాన్ని చేయలేనని చరా చరా వెళ్లిపోయింది. ఆమె నిశ్చయం వినంగానే వెంకటయ్యకు తన స్వార్థాన్ని ఎత్తి చూపించినట్లయి సిగ్గుపడ్డాడు. కాని వెంబడే తన కర్తవ్యాన్ని గుర్తించుకొని క్రమ శిక్షణతో దళంలో చాలా నమ్మకమైన సభ్యుడిగా చివరికంటా పనిచేశాడు. ఆమె ప్రాపంచిక దృక్పథంలో కొండమీంచి చూస్తే ఊరంతా చిన్నగా అన్పించినట్లు ఆనాటి సమస్య ముందు తమ పెళ్లి సమస్య చాలా చిన్నదిగా అన్పించింది. అయినా అది విడదీయరాని బంధమని ఇద్దరూ గుర్తించారు. సత్తెమ్మ వెంకటయ్యల ప్రేమ బోళ్ల పొలాన్ని ఎడారిలో నీడపట్టుగా మార్చడంతో మొగ్గతొడిగి తెలంగాణ నేలతల్లి చెరను విడిపించే క్రమంలో వికసించిందనే వర వర రావుగారి మాటలు ఈ నవలలో రుజువు అవుతాయి. ఈ రకంగా సత్తెమ్మ ఓనమాలు నవలలో తన ప్రేమను త్యాగంచేసి మృత్యువునీడల్లో అన్న నవలలో ప్రజాక్షేమానికి పాటుపడ్డ వనితగా దర్శనమిచ్చింది.

**రాములమ్మ :**

చరిత్రపుటలలోకెక్కిన స్త్రీలు అటుగొప్ప పురుషుల ప్రేమకు పాత్రులైన వారైనా కావాలి, లేదా ఎదురైన సమస్యల మూలంగా తప్పనిసరై మగవాళ్ల రంగాలలో ప్రవేశించిన వాళ్లైనా కావాలి అని స్త్రీ శక్తి సంఘటన వర్కింగ్ గ్రూప్ పేర్కొంది[9].

బొర్రిముంత శివరామకృష్ణగారు రచించిన మృత్యుంజయులు అనే నవలలో తనకెదురైన సమస్యల మూలంగా వాటిని ఎదుర్కోడానికి మగవాళ్ల రంగాలలో ప్రవేశించిన స్త్రీగా రాములమ్మను చిత్రీకరించారు రచయిత. ఈ నవలలో రాములమ్మ పాత్రను మలచిన తీరులో మార్క్సిమ్‌గోర్కీ నవల అమ్మ ప్రభావం ఉందని వరవరరావుగారు తమసిద్ధాంత గ్రంథంలో[10] పేర్కొన్నారు. మొదట అందరి స్త్రీలలాగే రాములమ్మ పొలానికి వెళ్తూకాయకష్టంచేసుకుంటూ మల్లారెడ్డి రెండవ భార్యగా ముగ్గురుపిల్ల తల్లిగా జీవనం సాగిస్తుండేది.

ఒక రోజు దేశ్‌ముఖ్ పొలంలో నాటువేయడానికి దొర ఏజంటు అప్పన్న వచ్చి రాములమ్మను పిలుస్తాడు. కాని ఆమె అమ్మ వినకుండా తన పొలంలో నాటువేసుకోవడానికి వెళ్తుంది. అదితెలిసిన దొర బంటు రాములమ్మ కూతురు రాజవ్వని గడీకి ఈడ్చుకుపోతాడు రాజవ్వ నెత్తుటిముద్దగా గడీనుండి తిరిగి వస్తుంది. ఆనాటి వ్యవస్థలో దొరలు తమ పొలంలో పనికాకుండా వారి పొలాల్లో వారు పనులు చేసుకోనివ్వరు. నాట్లకైనా, కోతలకైనా ఊళ్లోవున్న స్త్రీలందరూ మొదట దొర పొలానికే వెళ్లి అతనికి ఊడిగం చేసిన తర్వాతనే సమయం మిగిలితే అప్పుడు తమ సొంతపొలాల్లో పనిచేసుకోవాలి. అందుకు భిన్నంగా ఎవరైనా ఎదురుచెప్తే వారికి జుర్మానా పడుతుంది. పనిలో విశ్రాంతి అంటూ వుండదు. దొర బంటు ఎప్పుడూ వేయి కళ్లతో చూస్తు వాళ్లని అజమాయిషి చేస్తుంటారు. (పేజి 16)

విసునూర్ దొర పిల్లలకు పాలిచ్చి వస్తానంటే కూడా వినకుండా బొడ్డు గిన్నెల్ని తెప్పించి వారి చనుబాలను పిండించి పొలాలలో చల్లాడట[11]. ఈ నవలలో రాములమ్మ తన పొలంకి వెళ్లిందన్న కోపంతో ఆ దొర బంటు మరో ఇద్దరు రౌడీలతో కల్సి రాములమ్మ కూతుర్ని గడిలో చెరుపుతారు.

ఒకవైపు కూతురిపై దౌర్జన్యం, మరో వైపు సవితి కొడుకు భాగ్యరెడ్డి ఇంటినుండి వెళ్లిపోతాడు. ఇటువంటి కష్టాలలో రాములమ్మ ఉన్నప్పుడు చిన్నకొడుకు ఎల్లారెడ్డి సంఘంతో సంబంధాలు పెట్టుకుంటాడు. ఆ సంగతి తెలిసి కొంచెం భయాందోళనలకు లోనైనా దొరలపట్ల వాళ్ల ఏజంట్ల పట్ల విపరీతమైన కసి ఉండటంతో పేదవాళ్ల కూతుళ్ల, పెళ్లాలను చెరిచే వీరు తొందరలో నాశనం అవుతారనే భరోసాతో మెల్లిగా చైతన్యాన్ని పొందుతుంది.

రాములమ్మ భర్త మల్లారెడ్డి స్వతహాగా భయస్తుడు. దొర రాంనారాయణరెడ్డి తండ్రి చనిపోతే బూడిద పట్టీ ఇవ్వడానికి పిలిచిన వెంటనే రాలేదని అహంకారంగా మాట్లాడాడని అప్పన్న మల్లారెడ్డిని దెబ్బ మీద దెబ్బకొడుతుంటాడు. ఆ దెబ్బలతో మల్లారెడ్డి చనిపోతాడు. కాని దీనికి అసలు కారణం ఎల్లారెడ్డి సంగంతో సంబంధాలు పెట్టుకోవడం. దొరకు వ్యతిరేకంగా సంగం ఏర్పడుతుందని! తండ్రి చనిపోవడం ఒక భారంగా అనిపించకపార్టీ పనుల్లో మునిగిపోతాడు. ఇతని మనస్తత్వం అర్థంగాక రాములమ్మ అతనికోసం రెండుసార్లు గింజలుపోసి సోది చెప్పించుకుంటుంది. ఇది గ్రామాల్లో వుండే ప్రజల అమాయకత్వానికి చిహ్నం. కొడుకు చేసే పనులు ఆమెకు అర్థంకాక, ఎక్కడెక్కడో తిరుగుతున్నాడని తెలిసీ అడిగే ధైర్యంలేక సోది ద్వారా నైనా అతనేం చేస్తున్నాడో తెలుసుకుందామనే ఆత్రుత! ఆ విషయం తెలిసి అతడు తల్లిని మందలిస్తాడు. మెల్ల మెల్లగా తల్లిలో మార్పుతేవడానికి

ప్రయత్నిస్తాడు. సంగం వాళ్లు ఇంటికి రావడం మొదలుపెడ్తుంటారు. వాళ్ల కలుపుగోరుతనం చూసి రాములమ్మకి ఆశ్చర్యమయ్యేది. తన జీవితంలో అంతకు ముందు అలాంటి మనుష్యుల్ని చూడలేదు. తనకు బుద్ధి తెలిసినప్పటినుంచి ఉసురోమంటూ మరణ దేవత దగ్గరికి కాళ్లీడ్చుకుంటూ వెళ్లే మనుష్యుల్ని మాత్రమేచూసింది. దేశ్ ముఖ్‌గారి మనుష్యులే నవ్వు మొఖాలతో ఉంటారుగాని తమలాంటి దౌర్భాగ్యుల ఇళ్లల్లోకూడా ఇలా ఆనందంతో కాలం గడిపే వ్యక్తులుంటారని ఆమెకి తెలియదు. రాములమ్మ క్రొత్తగా ఈ సంగంవాళ్లకి కులభేదాలు లేవనే విషయం తెలుసుకుంటుంది. ఈ విషయాలన్నీ రాములమ్మ మనసులో మార్పును తెస్తుంది. చైతన్యాన్ని పొందిన ఎల్లారెడ్డికి పుట్టుకతోటే అందరూ సమానులని ఉన్నవాళ్లు, లేనివాళ్లు, పెద్దకులాలవాళ్లు, పురుషులకన్నా స్త్రీలు తక్కువనే ఈ భావలన్నీ ఈ వ్యవస్థే కల్పించిందని అజ్ఞానంలో ఉన్న తల్లికి చెప్పడానికి కొంతసమయం పట్టింది. తనతల్లికీ తాను నివసిస్తున్న లోకానికీ మధ్యన చిక్కని చీకటి ఉంది. ఆ చీకటిని తొలగించుకోవడానికి సంగం సహాయంతో తనతోపాటు ఆమెను నడిపిస్తాడు. ఆమెమనసులో ఉన్న అరమరికలు, కులమత భేదాలను పోగొట్టడానికి ఒకసారి తల్లికి చిన్న పరీక్షపెడతాడు. ఒక కార్యకర్త రాములమ్మ ఇంటికి వచ్చినప్పుడు మాటలలో అతడి కులమేదో తెలుసుకొని అతనికి భోజనం వరండాలో పెడుతుంది. ఆ కార్యకర్తకీ సంఘటన ఏమాత్రం కష్టం కలిగించలేదు కాని విషయం తెలిసిన ఎల్లా రెడ్డి ఆమెలో మార్పు తీసుకరావడానికి నిశ్చయించుకుంటాడు. తల్లిని ఏమీ మాట్లాడించకుండా కంచం, గ్లాసు తెచ్చుకొని వీధి అరుగుపైన కూర్చోని భోజనం వడ్డించమంటాడు. విషయంవెంబడే అర్థంచేసుకున్న రాములమ్మ ఏడుస్తూ, ఇంట్లోకి రమ్మంటుంది. "మేంకులంలేని వాళ్లం. ఇంతకు ముందు భోజనం చేసి పోయినమనిషీ, నేను అన్నదమ్ములం. పాపం ఎంతో గౌరవకులానికి చెందిన నీ ఇంటిని ఎందుకు అపవిత్రం

చేయాలి' అంటూ జవాబిస్తాడు (పేజి 53, 54) ఆ మాటలు విన్నరాములమ్మ తననుకొడుకు ఏవిధంగా అవమాన పరచాడో తెలుసుకొని అతని మీది మమకారంతో మార్పుని స్వీకరిస్తుంది. ఎల్లారెడ్డి మీద సంగం కార్యకర్తలమీద పోలీసుల నిఘా ఉంటుందని ప్రజలు అనుకుంటున్నప్పుడు రాములమ్మ నిర్మలంగా ఉన్న నీటిలో రాయివేస్తే చలించినట్లుగా చలించింది. దొర ఒక ముస్లిం స్త్రీని చెరచాలని ప్రయత్నించినప్పుడు కార్యకర్తలందరూ ఒకటై ఆమెను హైద్రాబాద్‌కి పంపించి వేస్తారు. దొర ఆమెపై దొంగతనం నేరం మోపి పోలీసులకు ఇంటింటినీ సోదా చెయ్యమంటాడు. కాని, ప్రజలందరికీ నాయకుడిగా ఉండి ఎల్లారెడ్డి దొరకు మాటకు మాట జవాబిస్తాడు. ఆ సమయంలో రాములమ్మ హృదయం ఒకవైపు మమకారంతో, న్యాయంకొరకు నిలచిన కొడుకుని చూసి మరొకవైపు గర్వంతో పొంగిపోతుంది. అసహాయులైన యువతుల మాన రక్షణ కోసం తన కొడుకు ముందుకు వచ్చాడని ప్రజల్లోవున్న ఒక తల్లి అభినందిస్తే ఆనందంతో ఉప్పొంగిపోతుంది. అయితే ఆ క్షణంలోనే ఎల్లారెడ్డిని అరెస్టు చేయగానే రాములమ్మలో మాతృత్వం బయటికి తన్నుకొచ్చింది. తన కొడుకు ఒంటరిగా లేడనీ, గ్రామం అంతా తన బిడ్డ పక్షమే వుందని తెలిసినా ఆపుకోరాని దుఃఖంతో ఏడుస్తుంది. విచక్షణ, ఆలోచన తక్కువున్న ఆ కడుపు తీపికి తెలిసింది మమకారమే! అయితే ఆక్షణంలోనే రాములమ్మకు కార్యకర్తలు చెప్పిన, విన్న సంఘటనల కన్నా ఈ సంఘటన ఆమె జీవితానికి ఒక పాఠంగా అయింది. దొర దౌర్జన్యాలకు పోలీసులు సహాయ పడటం, ప్రజలు ఎదురుతిరగడం రాములమ్మలో న్యాయన్యాయలను గ్రహించే స్పృహ వస్తుంది. అన్యాయాలని చూస్తూ ఊరుకోక ఆగ్రహించే చైతన్యం కూడా రాములమ్మలో కల్గుతుంది. పోలీసులు ప్రతి ఇంటినీ సోదా చేస్తూ భీభత్సం సృష్టిస్తుంటే చూసి అచ్చుబోసిన ఆంబోతులాగా దేశ్‌ముఖ్‌ను ఊరు మీదకి వదిలి, కాదంటే యిలా గల్లంతు చెయ్యండి అంటుంది

ఉక్రోషం పట్టలేక! అది విన్న పటేల్ రాములమ్మని జుట్టుపట్టుకొని ఈడ్చుకొస్తాడు. అయినా తనకు ఆ సంఘటన అవమానంగా భావించదు. ఆమె బాధంతా ఎల్లారెడ్డి పోలీసుల చేతుల్లో పడ్డాడనే!

మాక్సిం గోర్కీ "అమ్మ" నవలలో ఇలాంటి సంఘటనే కనిపిస్తుంది. పావెల్ ఆమెకి దూరంగా వున్నప్పుడు పావెల్ గురించి ఆతని సహచరులు చెప్పుకుంటున్నప్పుడు ఆమె మాతృహృదయం పొంగి పోతుంది. అతని క్షేమాన్ని గురించి ఎప్పూడూ ఆలోచిస్తుండేది. పావెల్ అమ్మ, రాములమ్మ ఇద్దరిలో ఒకే మమకారాన్ని, ధృడవిశ్వాసాలని చూస్తాం[12]! రాములమ్మకు పుట్టిన మొదటి బిడ్డ ఎల్లారెడ్డి, తలలు పండిన వాళ్ల సైతం ఎల్లారెడ్డి దగ్గరకు సలహాలకు వచ్చినపుడు నా కొడుకింతటి ప్రయోజకుడైనాడుగదా అని మురిసిపోయేది. ఆ తన్మయత్వంలో ఒక్క క్షణం కష్టాలు మరిచిపోయేది. కాని జైలుపాలనలో వున్న కొడుకుల తల్లి దండ్రుల దుఃఖాన్ని ఊహించుకొని నాకు మాత్రం అలాంటి అవస్థ తేబోకు భగవంతుడా అని ప్రార్థించేది.

రాములమ్మను జుట్టుపట్టి ఈడ్చుకొస్తున్న పాపిరెడ్డి తలపై ఎల్లారెడ్డి సహచరుడు సుభాన్ ఖాన్ చేతిలోని కర్ర యుగయుగాల హింసాకాండకు ప్రతీకారం తీర్చుకుంది. దేశ్‌ముఖ్ తరువాత ప్రజలు ద్వేషించేది పటేల్‌నే. ఐతే అదే పటేల్ మరణించకూడదని కోరు కుంటారు. దానికి కారణం పటేల్‌ని కొట్టిన సుభాన్‌ఖాన్ తప్పించు కోవడం వల్ల పటేల్ హత్యానేరంపై ఎల్లారెడ్డికి మరణశిక్ష విధించాలని దొర ప్రయత్నం. కాని పటేల్ చనిపోవడంతో రాములమ్మ హృదయంలోని దీపాన్ని ఆర్పేసినట్లయింది. ఎల్లారెడ్డి కోసం ఏడ్చి ఏడ్చి ఆమె సొమ్మసిల్లింది. పటేల్ శవాన్ని బయటికి తియ్యడానికి ఎవరూ ముందుకురాకపోయేసరికి పటేల్ తమ్ముడు మురహరి ఆమెను క్షమాభిక్ష అడగడానికి వస్తాడు. మురహరి అన్నలాకాకుండా బుద్ధిమంతుడు.

రాములమ్మను చూసిన క్షణంలో అతని మనసుగాయపడింది. ఆముసలి హృదయంలో చిచ్చుపెట్టిన వాళ్లలో తన అన్న ఒకడు. నిన్నసాయంత్రమే తన అన్న ఆ మానవతిని జుట్టుబట్టి బజారులోకీడ్చాడు; అని తనమనసులో అనుకుంటున్న మురహరి క్షమించమని అడగలేక పోయాడు. అతన్నిచూసిన రాములమ్మ ముఖం వింతగామారిపోయింది. అప్పటివరకు పేరుకున్న దుఃఖం రౌద్రంగామారిపోయింది. తన సర్వస్వాన్ని నాశనం చేసిన క్రూరమృగం పటేల్. వాడి రక్తంలో పాలుపంచుక పుట్టిన వాడేవీడు అన్న ఆలోచనను మురహరి పసిగడతాడు. ఆ క్షణంలో రాములమ్మ రక్తదాహంతో నాలుక చాచిన మహిషాసురమర్ధినిలా కనిపిస్తుంది మురహరికి. అంతలో పసిపిల్లాడిలా ఆమెపాదాలముందు పడి ఏడుస్తున్న మురహరి తలపై తన వణుకుతున్న చేతులతో తనకు తెలియకుండానే నిమురుతుంది. "శగజూపిన వెన్నలా ఆ యమ్మ హృదయం కరిగివూరుకుంది. ఈ పాతికేళ్లనుంచీ ఆమెకు మాతృత్వమే తెలుసు. ఆ హృదయం అందుకే అలవడింది" అంటూ రాములమ్మ హృదయంలో వున్న మాతృత్వపు అనురాగాన్ని చూపించారు రచయిత. అయితే క్షమించేది తనుకాదని, ప్రజలేనని వారికే క్షమాపణ చెప్పుకోమని అంటూ "మా ఇంట్లో వచ్చేందుకెవరున్నారు, దేశ్‌ముఖ్‌వాత బడకుండా మిగిలిందల్లా ఈ నాలుగేళ్లకూన, నరిసిరెడ్డి కొడుకు. మరివాడి వంతెప్పుడో"! అని ఏడుస్తుంది. పొరపాటున అమంగళం పలికినందుకు వెంటనే నొచ్చుకొని చిరంజీవి చిరంజీవి అనుకున్నా కొద్దిరోజుల్లోనే ఆ మాటలు సత్యాలవుతాయి.

అర్ధరాత్రి సమయంలో సంగంపెద్ద రాములమ్మ ఇంటికి వచ్చినపుడు అతన్ని చూడంగానే పెద్దగా ఏడవాలనిపించింది. ఆమెదుఃఖం బయటికి వచ్చేలోపే అతడు చేతితో సంజ్ఞచేస్తాడు. వెంబడే అర్ధం చేసుకుని తన దుఃఖాన్నంతా దిగమ్రింగుకుంటుంది.

సామాన్యంగా స్త్రీలకు సంతోషంవచ్చినా దుఃఖంవచ్చినా పట్టలేరంటారని ఓ అభిప్రాయం. మరీ ఇటువంటి పరిస్థితి వచ్చినప్పుడు వీళ్లను ఓదార్చడం అసాధ్యం. తన పూర్వ జీవితంలో అటువంటి మానసికస్థితిలో ఉన్న రాములమ్మ ఎల్లారెడ్డి నుంచి అతని సహచరుల నుంచి నిగ్రహాన్ని పార్టీ రహస్యాలను కాపాడే పద్ధతిని, జాగ్రత్తను నేర్చుకుంది. పార్టీకి ఏ నష్టమూకలుగనివ్వని అవసరాన్ని, అభిమానాన్ని, క్రమశిక్షణను నేర్చుకోవడంవల్లనే రాములమ్మ అంతదుఃఖాన్ని దిగమింగింది. తనబిడ్డను గురించి "నీ ఒక్క దానికే బిడ్డేమిటి? దేశానికే బిడ్డ ... మేంవచ్చినట్లు ఎక్కడా అనకూడదు ... ఈ సమయంలో నీవు దేశానికి చేయదగ్గసేవ ఎంతైనా ఉందిగదా"! అన్న కార్యకర్తలమాటలతో ధైర్యం తెచ్చుకుంటుంది.

ఎల్లారెడ్డి జైలునుండి పారిపోయాడన్నవార్త ఊరంతా వ్యాపించగానే రౌడీలు సాయుధపోలీసులు ఆ గ్రామాన్ని ఆక్రమించుకుంటారు. ప్రత్యేకంగావారిలో అరబ్ గుండాలు కూడా ఉన్నారు. ఆ గూండాల అత్యాచారాలకు రాములమ్మ కూతురు రాజవ్వ, నరిసిరెడ్డి నాలుగేళ్ల కొడుకు చనిపోతారు. నర్సిరెడ్డి ఊర్లోకి ప్రవేశించి వాళ్లచేతిలో తన్నులుతిని కొన ఊపిరితో ఉంటాడు. అడవినుండి వచ్చిన రాములమ్మకు ఇంట్లో ఈ దారుణ దృశ్యాలు కనిపిస్తాయి. ఒకవైపు కూతురు, మరొకవైపు మనవడు, ఎదురుగా ఎన్నో ఏళ్లక్రితం ఇంట్లోనుంచి పారిపోయి తిరిగివచ్చి కొన ఊపరితో ఉన్నకొడుకు. ఎన్నో ఏళ్ల నుండి ఏడ్చి ఏడ్చి ఆమె గుండెల్లో తడి లేకుండా పోయింది. ఏ తల్లికైనా ఏడ్వాడానికి ఎంతనిదుఃఖం ఉంటుంది? అందుకేనర్సిరెడ్డిని చూసి ఆమె సంతోషించకుండా తటస్థంగా ఊరుకుంటుంది. నర్సిరెడ్డి

అమ్మా అమ్మా! అన్న పిలుపు రాములమ్మ గుండెలోకి సూటిగా తగులుతుంది. తనలో మిగిలింది శూన్యమే. తన గుండెలో మమతే లేదనుకున్న రాములమ్మ భోరున ఏడ్చింది. నేను అమ్మను ఒక సారి చూడవూ! అంటూ అతన్ని చుట్టుకుపోయి ఏడుస్తుంది.

నర్సిరెడ్డి "అమ్మ" అన్న పిలుపు రాములమ్మ తడి ఆరిపోయిన పేగుల్లోని దుఃఖాన్ని ధైర్యాన్ని కడిగివేసినట్లయింది. ఆ తల్లి ఒడిలో నర్సిరెడ్డి మరణిస్తాడు. ఆక్షణం నుండి రాములమ్మ దుఃఖించడానికి నిరాకరించింది. తన కళ్లెదురుగానే భర్తా, కూతురు, పెద్దకొడుకు; వీరందరి చావులకు కారణమైన ఈ వ్యవస్థని తనదుఃఖంతో ఏ మాత్రం మార్చలేదని అర్థమైంది. ఈ వ్యవస్థను తుదముట్టించందే కొడుకులూ, కూతుళ్లు బ్రతుకలేరని కూడా ఆవిడకు స్పష్టమౌతుంది.

రాములమ్మ జీవితాన్ని ఈ నవలలో చదివినప్పుడు ధర్మాపురం పశ్చిమాన లంబడి తాండాలోనివసించే హామ్యా, మంగిలి దంపతుల కష్టాలు గుర్తుకువస్తాయి. విసనూర్ దేశ్‌ముఖ్ కొడుకు బాబుదుండగులు ఈ తాండాపై దాడిచేసి అందర్నీ చిత్రహింసలుపెట్టి ఈ ఇద్దరు దంపతులను పట్టుకున్నారు, ముఖ్యంగా మంగిలీని. అంత బాధలోను ఆమె ఆ దేశ్‌ముఖ్‌ను తిట్టిన తిట్టు తిట్టకుండా తిడుతూ ప్రజలందరితో దేశ్‌ముఖ్‌పై తిరుగబడి ప్రతీకారం తీర్చుకోమని ఉసికొలుపుతుంది. హామ్యా, మంగిలీల కళ్లముందే కొడుకు సోమ్లాను చంపేస్తాడు ఆ దేశ్‌ముఖ్. రెండునెలల తరువాత మళ్లీ దాడి జరిపి మంగిలీని ప్రత్యేకంగా హింసిస్తారు. వారి నలుగురు కొడుకుల్ని జైల్లో పెట్టి కోడళ్లనూ, మనుమలనూకూడా హింసిస్తారు. ఈ రకమైన ఎన్నో బాధలకు,

చిత్రహింసలకు గురైన మంగిలీ దిగజారిపోకుండా ఎర్రజండాను విడువదు. భారతసైన్యాల ప్రవేశం జరిగిన తరువాత దళాలు విస్నూర్ బాబును చంపివారి ప్రతీకారం తీర్చుకున్నారు. ఈ రకంగా మంగిలీ ఆప్రాంత ప్రజలందరికీ ఉత్తేజం కలిగించే స్త్రీగా నిలచిపోయింది[13]. ఈ మంగిలీ మనుమడే కొమరయ్య; తల్లిగా తనపిల్లలపట్ల ఎంత మమకారం, అనురాగం చూపుతుందో అవసరమైతే ఎంతటి త్యాగాలనన్నాచేస్తుంది అనడానికి నిదర్శనమే ఈ రాములమ్మ పాత్ర. ఈ నవలలో రాములమ్మ దళాలలో చేరుతుంది. గర్భిణీ స్త్రీలు, ముసలివారు, పదిసంవత్సరాల కుర్రవాళ్ల దగ్గరనుండీ అందరూ దళాలలో చేరతామని అంటున్నప్పుడు మురహరి నిరాకరిస్తాడు. బుద్ధితక్కువంతా మన సంగం వాళ్లది. ఇలాంటి దాని కెవర్ని నియమించాలో తెలీకుండా పటేల్ తమ్ముడినా నియమించేది. ఎలాగైనా జనాన్ని ఇందులో చేరకుండా చేసి పోరాటంకాస్తా పాడుచేస్తున్నాడని మురహరిని నిష్ఠూరమాడింది. ఎంతో మెత్తని హృదయంగల రాములమ్మ శత్రువుపట్ల కసితో మాటల్లో కాఠిన్యాన్ని ప్రకటించడం మురహరికి కష్టమేసింది. "అన్నీపోయినై. జాలి, భయము, భక్తి, అన్నీపోయినై ఎవరికోసమేడ్చేది. నన్ను కూడా పోరాటంలోకి రానీ నాయనా, నావాళ్లంతా అందులోనే పోయారు. నన్నెందుకు వేరుచేస్తావు? అదుగో రాజవ్వ, నర్సిరెడ్డి, మనుమడు అంతా వాళ్లకోరికతీరుస్తాను. వాళ్లను హింసించిన వారిమీద కసితీర్చుకుంటాను" అని ఒక పిచ్చి చూపుచూసింది. "సంగం వాళ్లకు ప్రాణంపోసింది." అంటూ జనాన్ని తోసుకుంటూ వెళ్లిపోతుంది.

తెలంగాణా రైతాంగ పోరాటంలో వీరోచితంగా పోరాడిన రాములమ్మ ఉన్నది. ఈమెది నల్లగొండ తాలూకా చెరకుపల్లి గ్రామం. భర్తతోపాటు 1946లో పార్టీలోకి వచ్చింది. నిజాంవ్యతిరేక పోరాట కాలంలో ఆమె గెరిల్లా దళాలతో పాటు తిరుగుతూపార్టీకి ఎర్ర జండాలు కుట్టి ఇచ్చేది. ఆమె మిలటరీ శిక్షణ కూడా పొందింది. కొందరు ధనికరైతులు ఆమెను మభ్యపెట్టి పోలీసుల కప్పగించారు. ఈ సంఘటనల వల్లనే రచయిత ఉత్తేజితుడై ఈ పేరును స్వీకరించాడనిపిస్తుంది[14]

ఎల్లారెడ్డి రాకతో రాములమ్మ మాతృత్వం చిగురిస్తుంది. ఆ ఆనందం రాములమ్మదే కాదు; ప్రజలందరిది. కొడుకు సంగంలోచేరడం, ఆ సంగాన్ని ఇంటికి తేవడం వల్ల తను సంగాన్ని తెలుసుకుంది. దాన్ని అర్థం చేసుకోవడానికి తన జీవితానుభవం కూడా తోడయ్యింది. తనుకూడా రహస్య జీవితంలోకి వచ్చి దళంలోచేరింది. ఇప్పుడు రాములమ్మ సంగం తల్లి; ఎల్లారెడ్డి సంగం కొడుకు. ఆ వీరునికి వీరమాతను నేను అన్నట్లు ధీమాగా నిలుస్తుంది. ఈ నవలలో రాములమ్మ ఎక్కడా పిరికితనం చూపించ లేదు. మామూలు మట్టి మనిషి నుంచి నూతన తరం కోసం అన్వేషిస్తూ అనుసరిస్తూ ఆ తరం పోరాటాల్లో పాలుపంచుకుంది. మాతృత్వపు మమకారంతో ఎల్లారెడ్డిని పోరాట మార్గన్నుండి తప్పించాలని తల్లిగా ఎక్కడా ప్రయత్నంచేయ్యదు. ప్రతి తల్లి తన బిడ్డ క్షేమం కోసం ఆదుర్దాపడినట్లు తను ఆదుర్దాచెందిందే తప్ప ఎక్కడా అల్పత్వాన్ని ప్రదర్శించలేదు. తనకుటుంబ సభ్యులంతా భూస్వామ్య ఆర్థికదోపిడీని సాంఘిక దోపిడీని ఎదిరించిన వారే. వీళ్లకు రాములమ్మ ఎల్లారెడ్డి మాత్రమే మృత్యుంజయులుగా కన్పిస్తారు. కాని నిజానికి ఆ కుటుంబం అంతా మృత్యుంజయులే.

మానభంగాలు, లైంగిక హింసలు స్త్రీలను భయపెట్ట లేదనడానికి నిదర్శనంగా పుచ్చలపల్లి సుందరయ్యగారు తన గ్రంథంలో రాములమ్మ పాత్రకు అనుగుణంగా ఉన్న మరొక యదార్ధ సంఘటనను మనముందుంచారు. కామ్రేడ్ పద్మ మొదట విధవరాలు. కమ్యూనిస్టు సభ్యులందరూ కల్సి వారికి తమ సహచరులలో ఒకడైన కార్యకర్తతో పెళ్లి జరిపిస్తారు. అప్పటికే పద్మకి మొదటి భర్త వల్ల కల్గిన ఒక కుమారుడు వుంటాడు. కొన్ని నెలల్లో శత్రువుల దాడి అధికం కావటంతో కార్యకర్తలను అడవులలో ఉన్న స్థావరానికి పంపించటం జరుగుతుంది. ఆ సమయంలో పద్మ నిండు గర్భవతి. తన భర్త అడవులకు వెళ్లే అవసరం ఆమె గుర్తిస్తుంది. ఆ సమయం తను పుట్టింటికి వెళ్లాలంటే తనకు పుట్టిన బిడ్డను ఎవరికో ఇచ్చేసి తన అన్నల దగ్గరికి వెళ్లాలన్నప్పుడు దానికి ఒప్పుకుంటుంది. ఆస్పత్రిలో బిడ్డని వదిలేసి అన్నల దగ్గరికి వెళ్లిపోతుంది.

తెలంగాణా పోరాటం తర్వాత వారిద్దరు దంపతులు సామాన్యమైన జీవితాన్ని గడిపారు. అయితే ఆమె దురదృష్టం ఏమిటంటే ఇద్దరు కొడుకులు వుండి వారిని తాను చూడలేకపోవటం, వారితో తాము జీవితాన్ని పంచుకోలేకపోవడం, మొదటి కొడుకు ఆమెతో వుండాలంటే అప్పుడు పెంచుతున్నవాళ్లు ఆస్తిలో భాగం ఇవ్వరు. రెండవ కొడుకు తను పుట్టినప్పుడే ఇతరులకప్పగించిందని తెలిస్తే తనపై వైముఖ్యాన్ని పెంచుకొంటాడు. అదే పద్మకు ఇష్టంలేక ఇద్దర్నీ వదులుకుంది[15] తెలంగాణా ఉద్యమంలో ఇలాంటి మహత్తర త్యాగాలను చేసిన స్త్రీలు ఎందరో వున్నారు.

## శశిరేఖ:

తెలంగాణ రైతాంగ పోరాట కాలంలో ఉద్యమంలోకి వచ్చిన వందలాది తెలంగాణ రైతాంగ యువతీ యువకులకు ఆదర్శమైన జంట శశిరేఖ, భాగ్యరెడ్డి. వారు మట్టిలో పుట్టి మట్టిలో పెరిగినవారు. చదువుకున్నవారు కాకపోయినా తమ చుట్టూ వున్న గ్రామాన్ని పరిస్థితులను ఆకళింపు చేసుకుంటూ ఆచరణకు ఉద్యుక్తులవుతూ కాలానుగుణంగా మార్పు చెందుతూ ఉద్యమంవైపు ఆకర్షింపబడతారు. తీగసాగిన మట్టి లోంచి వెలికి తీసిన ముడి బంగారం లాంటి వీళ్ళు. ఉద్యమం వీరిని మలిచింది. వీరు పుస్తకాల ప్రభావంతో కమ్యూనిస్టులైన వారిగా కాకుండా నిర్మాణ రీత్యా కమ్యూనిస్టులుగా కన్పిస్తారు. ముఖ్యంగా ఇందులోని స్త్రీ పాత్ర శశిరేఖ. ఈమె భర్త భాగ్యరెడ్డి ఓనమాలు నవల్లో సత్తెమ్మ ఇంటి పక్కనున్న నర్సిరెడ్డికొడుకు. సత్తెమ్మకు నీతులు చెప్పబోతే "నీకూతురి వియ్యమ్మకు చోటే నవాబ్‌కు ఉన్న సంబంధం మొదట తెలుసుకో" అని నర్సిరెడ్డి నోరుమూయిస్తుంది సత్తెమ్మ. సంగంలోకి వెళ్లడం భాగ్యరెడ్డికి ఇష్టమున్నా ప్రతి ఇంట్లో సంగంమీద ఉన్న అభిప్రాయాలే వీరింట్లో కూడా ఉండటంవల్ల తన సంబంధాలు చాలా రోజులు ఇంట్లో దాస్తాడు. తన సంగతి భార్య శశిరేఖకు తెలుసు; భాగ్యరెడ్డికి వార్తలు చాటుగా అందిస్తుంది చాకలి మంగమ్మ, అయితే చాకలి మంగమ్మతో చనువుగా ఉండటం చూసి తల్లి అక్రమ సంబంధంగా అనుమానిస్తుంది. దాంతో సంగం సంగతి ఇంట్లో తెలియజేస్తాడు. ఇంట్లో వాళ్లందరూ సంగంతో సంబంధాలున్నాయని తెలిసి, వారి జాగ్రత్తకోసం ఇంటి నుంచి వేరుచేస్తారు. అందరి కోడళ్లలాగే వేరింటి కాపురానికి ముచ్చటపడ్తుంది శశిరేఖ. భవిష్యత్తులో తన పథకాలు నెరవేర్తాయని సంతోషంతో వేరింటి కాపురానికి ఒప్పుకుంటుంది. తన పథకాలను భవిష్యత్‌ను భర్తకు చెప్తున్నప్పుడు భాగ్యరెడ్డి ఆశ్చర్యపోతాడు.

గది బయట తన ఉత్సాహాన్ని ఇసుమంతైనా చూపించని ఇల్లాలు గది గోడల మధ్య ఉన్నప్పుడు చెప్తున్న వ్యవహార జ్ఞానానికి విస్మయం చెందుతాడు.

వేరింటి కాపురంలో తనకు కావలసిన స్వేచ్ఛ తనకు లభిస్తుందనే ఆశతో, భాగ్యరెడ్డి ఉంటే తన కలలకు, ఊహలకు ఒక రూపం రాబోతుందని భర్తతో ఏకాంతం లభిస్తుందని, సంసారం తీర్చి దిద్దుకోవచ్చని శశిరేఖ ఆలోచిస్తుంటుంది. కాని కళ్లముందు పరిస్థితులు తారుమారయ్యే సరికి కలవరపడ్తుంది. భాగ్యరెడ్డి ఇంట్లో తక్కువగా వుండడం అతనికోసం పోలీసులు గాలిస్తుండటంతో ఆమెకు భయం పట్టుకుంది. అతను వెళ్తే అతనితోపాటు తానూ బయలుదేరు తానంటుంది. తాను ఉద్యమంలోపని చేయడానికో సహాయం కొరకో వస్తాననదు. భర్తను వదిలి వుండలేక వస్తానంటుంది. భర్తతో పరుషంగా మాట్లాడ వలసి వచ్చినందుకు బాధపడ్తుంది. గొడవలు రాకుండా సర్దుకుపోయే మనస్తత్వం కాదు శశిరేఖది. దానికితోడు వల్ల మాలిన ప్రేమ వల్ల ఆలోచించి ఒక మార్గాన్ని ఎన్నుకునే వయస్సుగానీ, అనుభవంగానీ లేవు. పార్టీ పనిమీద పంపించినపుడు భార్యను తీసుకొని వెళ్లటానికి పార్టీ అనుమతించదు. ఆ సమయంలో వెంకటయ్య అన్న పెద్ద మనిషి శశిరేఖకు ఆంధ్రమహాసభల గురించి వారి మహత్తర త్యాగాల గురించి, ప్రజల కష్టాల గురించి, ఉద్యమం గురించి వివరంగా చెప్తాడు. ఆ మాటల ప్రభావం ఆనాడు కాకున్నా ఏదో ఒక నాడైనా పనిచేసి తీరుతాయని అనుకుంటారు. ఇప్పుడున్న రోజుల్లో ఆడవాళ్లకూడా గట్టిపడి వాళ్లకు వచ్చే కష్టాలు వాళ్లే ఎదుర్కోవడం నేర్చుకోవాలి. ఇటువంటి పరిస్థితులను విని శశిరేఖ తలవంచక తప్పలేదు; ఫ్యూడల్ వ్యవస్థలో పుట్టి పెరిగిన శశిరేఖకు పార్టీలో పనిచేస్తూ, ప్రజల సేవలో

తిరిగే వాళ్లు మగాడి మగాళ్లు అని, ధైర్యంగల వాళ్లంతా దండు ముండలు అంటుంది. శశిరేఖ దృష్టిలో తమకు వచ్చిన ఇబ్బందుల్ని ఎదుర్కోకుండా వుండే వాళ్లని ఇల్లాళ్లుగా వ్యవహరిస్తుంది. నిజంగా ఆలోచిస్తే దీన్లో మగాడి స్వార్థం కన్పిస్తుంది. స్త్రీలను తమ సమస్యలను తాము పరిష్కారం చేసుకొనే ధైర్యస్థులుగా వారిని తయారు చేయకుండా, తమపై ఆధారపడే అబలలుగా తయారు చేయడంలో మగవాని స్వార్థం వుంటుంది. ప్రజల్లో సగం మందికి పైగా ఉన్న స్త్రీలు కూడా పురుషులతో పాటు చేయి కలిపి కదలందే విప్లవ కర్తవ్యాలు పరిపూర్తి కాజాలవనే లెనిన్ మాటలు గుర్తుంచుకోదగ్గవి. **"If we do not draw women into public activity, into the militia, into political life, if we do not tear women away from the deadening atmosphere of house hold and kitchen; then it is impossible to secure real freedom, it is impossible even to build democracy, leave alone soclialism"**[16] శశిరేఖ లాంటి స్త్రీలు ఇప్పటికీ సమాజంలో చాలా మంది కన్పిస్తుంటారు. వీరి ఇతరులకు ఇన్ని వంకలు పెట్టినా దండుముండలని మగాడి మగళ్లు అని హేళన చేసినా ఇటువంటి వాళ్లు వేరింటి కాపురాలు పెట్టడంలో తమకు రావలసిన వాటా రాబట్టడంలో, భర్తను సాధించడంలో భవిష్యత్తు గురించిన ఆలోచనల్లో వాళ్ల కన్నా అపారమైన తెలివి తేటలు, ధైర్యసాహసాలు ప్రదర్శిస్తారు. ఈ సంసార పక్షం స్త్రీలు, ఈ ఇల్లాళ్లు చూపించే జాగ్రత్త ఎలాంటివంటే ఒక కోడి పెట్ట తన పిల్లల గురించి తీసుకునే అనివార్య అసహాయ జాగ్రత్తలాంటిదే.

పై విషయాలన్నీ శశిరేఖలో మనకి కన్పిస్తాయి. దానికి కారణం శశిరేఖ అందరి ఆడపిల్లల్లాగే తండ్రిచాటున, భర్తచాటున పెరిగిన ఎదగలేని వ్యక్తిత్వం ఆమెది. ఇతరులపై ఆధరపడే స్వభావం ఆమెది. దానికి ఆమెను

తప్పు పట్టడానికి వీలు లేదు. ఈ వ్యవస్థ ఆమెను అలా తయారుచేసింది. ఇటువంటి పరిస్థితుల్లో వున్న శశిరేఖలో మెల్ల మెల్లగా మార్పురావడం గమనిస్తాం. వేరుకాపురం పెట్టినప్పటినుంచీ పుట్టింటివారు అత్తింటివారు రావటం మానేసారు. ఎవరైతే అలగాజనం అనుకుందో వారు, సంగం మీద అభిమానం వున్న వాళ్లు శశిరేఖ ఇంటికి వస్తూ పోతున్నారు. మెల్లగా శశిరేఖ వారితో సాన్నిహిత్యం పెంచుకుంటుంది. తర్వాత పట్టుదల, త్యాగం భర్త సహచర్యంలో అలవాటు చేసుకుంది. ఆయుధాలకోసం నగలు ఇచ్చేందుకు సిద్ధపడింది. ఒక్కమాటలో చెప్పాలంటే ఆమె మంచి మార్గానికి పయనించడానికి కారణం భర్త ఉద్యమంలో ఉండటమే!

శశిరేఖ పాత్రను చదివే ముందు గుర్తుపెట్టుకో వల్సిన ముఖ్య విషయాల్లో-అవి నిజాంకాలం నాటి తెలంగాణ పరిస్థితులు అని! వీరికి జీవితంపై, తమ ఒంటరి తనంపై భయం. వెలితిని పూరించుకోడానికి పుస్తకాలని చదువుదామంటే చదువురాదు. అది పట్టణమూ కాదు. ప్రతినిమిషం భర్తకొరకు ఆలోచించి శత్రువు వేసే నిఘా వల్ల భర్త ఎప్పుడు పట్టుబడ్తాడో అన్న వ్యగ్రతతో; అతని క్షేమాన్ని కోరుకొంటారు. భర్తపార్టీ పనిలో ఉంటే అతన్ని బెదిరించి అదిరించి, రాచిరంపాన బెట్టి అటు చావనీయక, ఇటు ఉద్యమంలో బ్రతుకనీయకుండా, అతనికి మానసిక చిత్రవధ కలుగజేసి ముందే ఆలోచించి శత్రువుకు పట్టిచ్చే భార్యలున్నారు. ఉద్యమంలో ఉన్న భర్త ఎప్పుడైనా ఇంటికి వచ్చి ఆనందంగా గడుపుదామనుకున్న ఆ కొద్ది సమయంలోనే ఇల్లు నరకంలా చేసి ఎప్పుడు పారిపోదామా అనేట్టు చేసే భార్యలూ లేకపోలేదు. అటువంటి స్త్రీలతో పోలిస్తే శశిరేఖ నిజంగా ఆనాడు తెలంగాణా ప్రజా జీవితం మీద పరుచుకున్న కారు మబ్బుల్లోని శశిరేఖ.[17]

ఖానుడి పేటలో రజాకార్ల కాల్పుల్లో ఒక దళ సభ్యుడు మరణించాడని తెల్సినప్పుడు తన భర్తే అన్న అనుమానంతో అక్కడికి సత్తెమ్మ, కోటమ్మల సహాయంతో వెళ్తుంది. దండు ముండలుగా మగాడి మొగుడులుగా భావించిన సత్తెమ్మ, కోటమ్మలు దారి పొడుగునా శశిరేఖకు ధైర్యం చెప్తూ తమ అభిమానాన్ని ఆత్మీయతను పంచడంతో తన అభిప్రాయాన్ని మార్చుకొని కోటమ్మక్క, సత్తెమ్మ పిన్ని అని పిలువ వలసి వచ్చింది. ఆ రోజునుంచి తను వాళ్ల ఇద్దరితోపాటు ప్రజల జీవితానికి అంకితమైంది. షావుకారు నందయ్య మోసం కోటమ్మ దాక్షికం ఆమె అర్థం చేసుకోలేక పోయింది. ఇది శశిరేఖ జీవితంలోని రెండవ దశ అని చెప్పవచ్చు. శశిరేఖ ఖానుడిపేటలో సత్యాగ్రహ సభ ఏర్పాటుచేసినపుడు రంగయ్యతో ధ్యానం పంచేట్టు చేయమని అడగాలని వెళ్లింది, మునుపటి వలె బిడియపడకుండా! సాధారణ పల్లెటూరు స్త్రీ, ఒక న్యాయ శాస్త్రం చదువుకొన్న రంగయ్యకు సలహాలు చెప్పే ఎత్తుకు ఎదిగింది. బిడియపడ్తే పనులు కావని తెల్సుకుంది. చిన్నవయసులోనే ఎన్నో అనుభవాలను ఆకళింపు చేసుకుంది. ఈ బిడియం ఫ్యూడల్ సంస్కృతి అలవాటు చేసిందే తప్ప సాటి మగవాని దగ్గర నిజానికి బిడియపడే కారణం ఏముంది?

గ్రామ పరిస్థితులను ఆకళింపు చేసుకుంటూ తన పుట్టిల్లైన మంగళం పల్లిలో రాఘవరెడ్డి జరుపుతున్న దౌర్జన్యాన్ని వింటుంది. ఈ రాఘవరెడ్డి తండ్రి భార్య సరళ, శశిరేఖకు వరుసకు చెల్లెలు అవుతుంది. ఈ రాఘవరెడ్డి మొదట సరళను ప్రేమిస్తాడు, కాని సరళ రాఘవరెడ్డి తండ్రిని పెళ్లాడవలసివస్తుంది. ఊరి వాండ్లందరు కొడుకుతో సంబంధం పెట్టుకుందని తప్పుపడ్తారు. విషయమంతావిని సలహా ఇవ్వడానికి సరళ దగ్గరకు వస్తుంది. సరళ రాఘవరెడ్డి పైనే తనమనస్సు ఉందని అతని

తండ్రి కట్టిన తాళికి తను ఏమాత్రము విలువ ఇయ్యడంలేదని చెప్పినపుడు లోకోపవాదానికి భయపడకుండా రాఘవరెడ్డితో వెళ్లిపొమ్మని చెప్తుంది. రాఘవరెడ్డి ఇంతకాలం మానసిక క్షోభతో రగులుతున్నాడని తమ మధ్య శారీరక సంబంధము లేదని చెప్పినపుడు శశిరేఖ నమ్మలేకపోతుంది. వ్యవస్థ అలా తయారు చేసింది. ఎవరు తాళికడ్తే అతని భార్యలాగానే వ్యవహరించాలన్నది ఈ వ్యవస్థలో ఒక నియమం. ఆ నియమాన్నే ప్రేమించిన వ్యక్తి పాటిస్తున్నాడంటే మాత్రం ఈ వ్యవస్థది నమ్మదు. ప్రేమను అర్థం చేసుకునే విలువలలో ఈ వ్యవస్థ లేదు. ఈ నియమాలు ఉల్లంఘించే వారిపై మాత్రమే ఈ వ్యవస్థ స్వారీ చేస్తుంటుంది కాని అసహాయులు కానపుడు మాత్రం కళ్ళు మూసుకొని ఉదాసీనత నటిస్తుంది. శశిరేఖ తన చాక చక్యంతో ప్రతివారి మన్ననపొందుతూ తెలంగాణ విమోచనోద్యమకాలంనాటి ఎందరో రైతాంగ యువకులకు స్ఫూర్తినిచ్చింది. అందుకే ఒక మాటలో చెప్పాలంటే; మంచి మనసుతో, మంచితనంతో నవల ఆరంభంలో శశిరేఖాప్రాయంగా ఉన్న శశిరేఖ చైతన్యం దృష్ట్యా చూసినపుడు ఆ నవల ఆఖరుకు శశిబింబంలా ఎదిగిందనే, వరవరరావు గారి మాటలు యదార్థాలు[18]

## మంగమ్మ:

దాశరధిరంగాచార్య "**జనపదం**"లోని మంగమ్మ కూడా **మృత్యుంజయులులో** రాములమ్మ పాత్రలాగానే వుంటుంది. మంగమ్మ భర్త జగ్గయ్య ఉద్యమంలో కొరియర్‌గా పనిచేసి తన ప్రాణాలను త్యాగం చేసిన వ్యక్తి. బలరామయ్య కిరాతకానికి తన భర్త బలైపోయినప్పుడు కూడా తన దురదృష్టానికి కుమిలిపోతుందే తప్ప దొరను ప్రశ్నించే సాహసం లేదు. అదే దొరకొడుకు రామయ్య తనని పశుత్వంతో అనుభవించినపుడు స్త్రీ సహజ స్వభావంతో ఆత్మహత్యకు పాల్పడుతుంది. ఆ సమయంలో

వీరభద్రం ఆమెను ఆదుకుంటాడు. అప్పటివరకు మంగమ్మ జీవితం అందరి స్త్రీలలాంటిదే. దొరల డేగకాళ్లలో చిక్కుకున్న కోడిపిల్ల లాంటిదే. వీరభద్రం చేయూత మంగమ్మకు పునర్జన్మ. వీరభద్రం సహవాసంతో మంగమ్మలో చైతన్య దశ ప్రారంభమయింది. రామయ్య తనను చెరచడం ఆమె జీవితంలో ఒక మలుపు. అప్పటినుంచే ఆమె వ్యక్తిత్వం ఎదుగుతుంది. మెల్ల మెల్లగా ఆమెలో విప్లవ భావాలు చోటుచేసుకుంటాయి. రామయ్య తనను అనుభవించడం వల్ల పుట్టిన బిడ్డ ప్రకాశం. గ్రామాల్లో జరుగుతున్న కుట్రలను మోసాలను కళ్ళతో చూస్తూ ఊరుకోక నాయకుల ముందు విమర్శించి ఒకటి రెండు సార్లు జైలుకు వెళ్లుతుంది. జైల్లోపల వున్న అనుభవాలను కూడా చవిచూస్తుంది. పోలీసు వ్యవస్థను విమర్శిస్తూ న్యాయస్థానాల్లో న్యాయమే లేదంటుంది. మంగమ్మకు ఉద్వేగం, ఉద్రేకంపాలు ఎక్కువ. సమాజంలో ఉన్న పరిస్థితులను మార్చాలంటూ పోరాటం వల్లనే ఈ వ్యవస్థ మారుతుందని పెద్ద పెద్ద ఉపన్యాసాలిచ్చి, జరుగుతున్న అన్యాయాలను ప్రజలకు చెప్తుంది. ఈవిడ "ప్రజలమనిషి" నవల చదివి తెలంగాణ పరిస్థితుల్ని అర్థం చేసుకుంటుంది. వీరభద్రంతో కలిసి జీవించినా ఆఖరికి అతని సిద్ధాంతాలతో ఏకీభవించదు. "రామయ్య బలవంతుడు, వీళ్ళు బలవంతులయింది ఎప్పుడు? స్వాతంత్ర్యం వచ్చింతర్వాత, తాము బలహీనులయిందెప్పుడు? స్వరాజ్యం వచ్చింతర్వాత... స్వరాజ్యం, పోలీసు చర్య ఎవరికోసం? జనం కోసంకాదు" అన్న మాటల్లో మనకళ్లముందు జరుగుతున్న సత్యం నిల్చుని ఉన్నట్టనిపిస్తుంది.

ఈ మంగమ్మను చదివినపుడు తెలంగాణా పోరాట కాలంలో ఎందరో స్త్రీలు కష్ట నష్టాలకు ఓర్చి, తమ బిడ్డలతోపాటు పోరాట రంగంలో దుమికి, వీరోచితంగా పోరాడిన స్త్రీలు మన కళ్ల ముందు మెదుల్తారు.

మంగమ్మను రామయ్య అధికార గర్వంతో చెరుస్తాడు. ఈ సంఘటన యాధృచ్ఛికంగా జరిగిందో లేక రామయ్య మద గర్వంతో ప్రవర్తించిన తీరో తెలియదు. భూస్వామ్య సంస్కృతిలో స్త్రీలని చెరచడం ఒక ముఖ్యాంశం. లొంగిన ఆడది మగవానికిలోకువ అందుకే మంగమ్మపై ఎంతో యిష్టాన్ని చూపి తర్వాత తనతో ఎటువంటి సంబంధం పెట్టుకోవద్దంటాడు. ఇది పాత దొరల అలవాటు. దొరల వ్యవస్థలో పుట్టిపెరగడం వల్ల రామయ్య కూడా అటువంటితత్వాన్నే కల్గి ఉంటాడు.

మంగమ్మ కడుపులో పెరుగుతున్న బిడ్డకు తాను కారణం కాదంటాడు. ఇతని కన్నా పాత ఫ్యూడల్ దొరలే నయం అందుకే వీరభద్రం మంగమ్మతో అమృతవాణి వుంటే విషంపుచ్చుకునేది. ఎంత ఉత్తమురాలు ఆ తల్లి! ఎలాంటి బిడ్డను కన్నది అంటాడు. తన భర్తను చంపిన శివరావు కుమార్తె గీత అని తెలిసినా తన సహృదయంతో గీతను చేరదీస్తుంది. శివరావుపై ఆమెకు కక్ష వున్నా, కొడుకు ప్రకాశం, గీత ఇద్దరూ తన ఆలోచలకు రూపాన్నిచ్చే వారని అర్థం చేసుకుంటుంది. గీత మంచితనాన్ని ప్రకాశం ద్వారా వింటుంది.

మంగమ్మ చదువులేని ఒక మామూలు స్త్రీగా నవలలో కన్పించి తన అనుభవాలతో నెలకొన్న పరిస్థితులలో, రాజకీయాల్ని అర్థంచేసుకుని అనేక విషయాలను సిద్ధాంత పరంగా ప్రశ్నించి చర్చించేంత వరకు ఎదిగింది. తన ఉద్రేకాన్ని వీరభద్రం సమర్థించడం లేదని తెలుసు కుంటుంది. ఒక సామాన్య స్త్రీగా జీవితాన్ని ప్రారంభించిన మంగమ్మ, గ్రామాలలో వస్తున్న మార్పులను పుస్తకాల సహాయంతో గమనిస్తూ, చురుగ్గా గ్రామ రాజకీయాల్లో పాల్గొంటూ, పరిస్థితుల నాకళింపు చేస్కుంటూ ఉద్యమాల్లో రాటుదేలి, ఒకటి రెండు సార్లు జైలుకి వెళ్లి నిశ్చితమైన రాజకీయ అభిప్రాయాలకు అంకితమైపోతుంది. విప్లవకార

భావాలవైపు మొగ్గుచూపుతుంది. వీరభద్రంతో చర్చిస్తూ వారి సిద్ధాంతాలు, నమ్మకాలు వేరై నాయని బాధపడుతుంది. ప్రకాశాన్ని బడిలో చేర్పించాలని అనుకున్నప్పుడు తండ్రిపేరు ఎలా రాయించాలా అని మధనపడుతుంది. "కట్టుకున్నవాడు పోయాడు. కాలారాచిన వాణ్ణే గురించి చెప్పుకోరాదు, ప్రకాశానికి తండ్రి ఎవరు?" ఏ తప్పు చేయని ఏ పాపమెరుగని వీరభద్రాన్ని తలుచుకొని కళ్లు చెమ్మగిల్లాయి. ఈ వాక్యాలల్లో ఆమె ఎంత క్షోభను, మానసిక సంఘర్షణను అనుభవించిందో రచయిత వ్యక్తం చేశారు. నిజమైన జీవితాన్ని మన ముందుంచుతూ పుస్తకాలు అవగాహన కలిగిస్తాయే కాని ఇటువంటి ప్రశ్నలకు జవాబు చెప్పవని రచయిత ఉదారంగా చెప్పారు[19]

## శాంతమ్మ, స్వరాజ్యం :

సంగం నవలలో ముఖ్య మైన పాత్రలుగా శాంతమ్మ, స్వరాజ్యం లనే తల్లి కూతుళ్లని చెప్పుకోవచ్చు. వాళ్ళిద్దరు నాలుగు గోడల మధ్య తమ జీవితాన్ని వెళ్ళదీస్తున్నవాళ్లు. కొడుకు రామారావు రాక తో వీళ్ల జీవితం లో మార్పు వస్తుంది. చెల్లికి పుస్తకాలు చదివించడంలో ఆసక్తిని పెంపొందిస్తూ తల్లికి ప్రతి విషయము విడమరచి చెప్తుండే వాడు. ఊర్లో మెల్ల మెల్లగా పుస్తకాలు చదవడం, రాత్రి వేళ్లలో రైతులందరిని ఒక చోట చేర్చి వారికి జరుగుతున్న దోపిడిల గురించి మెల్ల మెల్లగా బోధిస్తుంటాడు. వాళ్లతో పాటు తల్లీ కూతుళ్లు కూడా వాటిలో పాలు పంచుకొంటారు. ఊర్లోకి సంఘం వచ్చిందని ఆ సంఘం కోసం తన కొడుకు అనవసరంగా తిరిగి ఒళ్ళు పాడు చేసుకుంటాడని మందలిస్తూ; ఈ అలగావాళ్ల కోసం ఎందుకు కష్ట పడటం అంటుంది. దానికి సామ్రాజ్యం రామారావు ఇంట గెలిచి రచ్చ గెలవాలని నిశ్చయించుకొని మొదట తల్లి ని మార్చే ప్రయత్నం చేస్తారు. సంఘం పెట్టాక రైతులంతా పట్వారీలకు మాముళ్లు ఇవ్వటం లేదని వారి నోటి ముందు కూడు ఈ సంఘం వలన పోతుందని,

అమాయకంగా అంటున్న శాంతమ్మ మాటలకు రామారావుకు జాలేసింది. మాక్సిమ్ గోర్కి రచించిన "అమ్మ" పుస్తకంలోని పాత్రలాగే తన తల్లి కూడా ఉందనిపిస్తుంది. శాంతమ్మ మెల్ల మెల్ల గా విషయాలు అర్థం చేసుకుంటూ సంఘ కార్యక్రమాలలో పాల్గొంటూ గ్రామాలలో మహిళా సంఘాలు ఆరంభిస్తుంది. దానికి సామ్రాజ్యం అధ్యక్షత వహించి రజాకార్ క్యాంపులు పెట్టి స్త్రీల మీద అత్యాచారాలు సాగుతున్నవి, దాన్ని ఎదుర్కోడానికి సంసిద్ధులైవుండాలని దెబ్బకు దెబ్బ వేసే స్థితిలో ఎదగాలని, స్త్రీలకు బోధిస్తుంది. రామారావు జాడ తెలియనప్పుడు శాంతమ్మను ఈడ్చుకు వచ్చి జుట్టు పట్టి లాగుతూ, కొడుకు ఎక్కడున్నాడు చెప్పమని కొడుతుంటారు పోలీసులు. మౌనంగా ఉన్న శాంతమ్మను కత్తిమొనతో రొమ్ముపైన గీస్తు రవికను తొలగిస్తారు. శాంతమ్మను సీతమ్మను వివస్త్రలుగా జేసి వాళ్లనడుములకు తాళ్లుగట్టి చెట్టకొమ్మలకు వేలాడ తీస్తారు. కింద మంటపెట్టి వాళ్ల శరీరాన్ని ఉయ్యాలలుగా ఊపుతూ కసితో వాళ్ళ శరీరాలను గాయపరుస్తుంటారు. వాళ్లగాయాల నుంచి రక్తం చుక్కలు మంటల్లో పడి చుయ్, చుయ్, మంటుంటే జనానికి చూపిస్తు "మీగతులు కూడ గింతకే వస్తాయంటు" ఆనందిస్తారు. అప్పటికీ వాళ్ల రాక్షస వృత్తికి తృప్తికలుగలేదు. వెల్లేముందు పిట్టల్లాగ వాళ్లను తుపాకులతో కాల్చేసి వెల్లిపోతారు. తమ కొడుకుల కోసం తమ జీవితాన్నేకాక మానాన్ని కూడ దోచుకుంటున్నా కూడ వాళ్లు భరించారే తప్ప సంఘంకు వ్యతిరేకమైన పనులెప్పుడు తలపెట్టలేదు. తనకెన్ని తలవంపులు వచ్చినా సహించి కొన ఊపిరి వరకు సంఘం కొరకు పోరాడి వీరవనితగా నిలిచింది శాంతమ్మ, సామ్రాజ్యం కమ్యూనిస్టులలో చేరి ఊరూరు తిరిగి ప్రజల్ని చైతన్యవంతంచేసింది. అడవులల్లో తిరుగుతూ తన ఆరోగ్యం సహితం లెక్కచేయకుండా దళాలతో తిరిగి సంఘంలో ఒక ముఖ్య పాత్ర వహిస్తుంది. చివరకు కమ్యూనిస్ట్ పార్టీ సభ్యుడు ప్రతాప్‌ను పెళ్లి చేసుకోవడానికి అంగీకరిస్తుంది.

ఈ నవలకు బొల్లిముంత శివరామ కృష్ణ రచించిన "**మృత్యుంజయులు**" నవలకు చాలా పోలికలు కన్పిస్తాయి. ఈ రెండు నవలల్లో తల్లిలో మార్పుని, తల్లి కొడుకు చాలా ఎదిగి పోతున్నాడని గ్రహించడం, తల్లులు సంఘంలో చేరడం మొదలైనవి. ఈ నవలలో శాంతమ్మ మృత్యువుకు బలికాగా, సత్తెమ్మ మృత్యుంజయురాలైంది. ఈ రెండునవలలకు ఇదొక్కటే భేదం. 1986లో ప్రచురింపబడిన ఈ నవల తెలంగాణా పోరాట కథే అయినప్పటికీ, కథాంశంలో కొత్త దనంలేదు. అంతకు ముందే తెలంగాణా పోరాట నవలలు వెలువడటం మూలాన ఈ నవలలోని సన్నివేశాలు, సంఘటనలు చర్విత చరణమే అనిపిస్తాయి తప్ప ఉత్కంఠతను రేకెత్తించవు.

## రామక్క:

'**బతుకుపోరు**' నవల స్త్రీలకి సంబంధించినదని ముందే చెప్పుకున్నాం. ఈ నవల్లోని స్త్రీల జీవితం ఒక్కొక్కరిది ఒక్కొక్క విధంగా వుంటుంది.

నారాయణ తల్లి లచ్చిరాజవ్వ, భర్త బొంబాయిలో పనికి వెళ్ళినపుడు, ఊరికే కూర్చుని ఏంచేయాలని బీడీలు, కట్టడంనేర్చుకుంటుంది. మొదట ఇంట్లో నీడ పట్టున వుండి చేయటమే కదా అనుకుంటుంది. "**కూసుండి కూసుండి నడుమువాయె దారం సూసి సూసి కండ్లు వాయె, తంబాకు ఘాటు వశపడక పాన్ అలవాటు జేసుకుంటె పండ్లు పాడైపోయె. పుప్పిపండ్లయిపాయె-పండ్లు ఊసిపోయె సరికి ముసల్దానితరీకైతి – ఈ బీడీలు జేసి సంపాదించింది లేదాయె – బంగ్లాలు కట్టిందిలేదాయె – ఉత్తగ పానం తెర్లయిపాయె**" అంటూ వాపోతుంది (పేజి - 37).

వ్యవసాయం పనిచేస్తేనే శరీరం హాయిగా వుంటుందంటుంది. కోతలకు, కలుపులకు పోయినప్పుడన్నా ఇంత చల్లటి శుభ్రమైన గాలి తగుల్తుందని అంటుంది. కంపెనీలో అంతా వాసనతో నిండి వుంటుంది. ఈ వాసనకు ఎక్కడ లేని రోగాలొస్తాయి అంటుంది.

ఈ స్త్రీలు ఎప్పుడూ పొగాకులో మునిగి తేలుతూండటం వల్ల వారి ఆరోగ్యం తొందరగా పాడవుతుంది. వాళ్లందరికీ క్షయ వ్యాధి వస్తుంది. ఎప్పుడు పొగాకు దగ్గరే వుండటం వల్ల నాటుపొగాకును నమలడం అలవాటు చేసుకుంటారు, ఇది క్యాన్సర్‌కి దారితీస్తుంది. ప్రభుత్వం వీళ్లకు వైద్య సదుపాయాలు అందజేసినా ఆచరణలో మాత్రం శూన్యం.

ఇటువంటి జీవితంలో తన తల పండిపోయిన వృత్తాంతాన్ని లచ్చి రాజవ్వ చెప్తే రామక్క కథ ఇంకొక తీరుగా వుంటుంది. నవ్వుతూ, తుళ్లుతూ బతుకును సాగదీస్తున్న రామక్క జీవితం అర్ధాంతరంగా భర్త చనిపోవడంతో దుర్భరమైంది. ఒక్క కొడుకును చూసుకుంటూ, బీడిలు కట్టడం, పొగాకు ఘాటు, ఇచ్చింది తీసుకోవడం ఇవ్వకుంటే గొణుక్కుంటూ ఇంటికి రావడం, ఆ కసి, ద్వేషం ఒక్కోసారి పిల్లవాళ్ల పైన చూపడం, ఎప్పుడు ఈ సమస్యలతో సతమవుతున్న రామక్క కొడుకు స్కూలుకు పోయి చదువుతున్నాడో లేదో కూడా గమనించుకోలేదు. కొడుకుని షావుకారు దుకాణంలో జీతానికి ఉంచితే వాడికి దొంగతనం అంటగట్టారు. ఆ కోపంలో ఎన్నో ఏళ్ల నుంచి పేరుకు ఉన్న కసి తీరేలా పిల్ల వాణ్ణి చావ బాదుతుంది. దాంతో పిల్లవాడు మాయమయ్యాడు; ఆ రోజునుంచి కొడుకు కోసం ఎదురుచూస్తూనే వుంది. మొగుడూ రెక్కలొచ్చిన కొడుకు ఇద్దరూ దూరమవుతారు. అప్పటినుండి ఈ బీడీల కార్ఖానాకే తన బతుకు అంకితమైంది. అన్ని రోజుల్నుంచి రెక్కలు ముక్కలు జేసుకొని సంపాదించి కూడాపెడ్తే

రెండొందలు. ఆడబ్బు కడుపునిండా తినకుండా దాచిన డబ్బు, ఎప్పుడో కొడుకు, కోడలు, మనువళ్లు అన్న ఆశతో బ్రతికీడుస్తుంది. మధ్య మధ్యన ఎవరోవచ్చి పట్నంలో కొడుకు కన్పించాడని తాము చూసామని చెప్తుంటారు ఆ జ్ఞాపకాల్ని సమాధిచేసుకుంది. ఇటువంటి కష్టాలనుభవిస్తున్న స్త్రీలు ఆ కార్ఖానాలో ఎందరో!

వారందరూ తన బతుకు బాగుచేసుకోవాలని నిర్ణయించుకుంటారు. వారి బతుకుపోరును వారి సమ్మె ఉద్దేశ్యాన్ని రాములు ఈ నవలలో తెలియజేస్తారు.

లక్ష్మినితన భర్త ఇంట్లో కూచుని పనిచేయడమే పెద్ద పని చేస్తున్నంటావేమని అడిగినపుడు ఇచ్చిన సమాధానం ఎంతో సహజంగా వుంటుంది. "మా ఆడోల్ల కష్టాలు మీకే మెరుక, ఊడ్చు కునుడు, అలుక జల్లుకనుడు, తొమ్మిదినెల్లు కడుపుల మోసి అయిదేండ్ల దాక కంటిపాప తీర్గ కాపాడుడు-వంట జేసుడు - యివన్నీ గాక ఇంక మీదికెల్లి బీడీలు జేసుడు, మేం ఆడోల్లం జేసే పనిల మీరు ఏ పాటి పని జేత్తరు? మేం ఒక్క పోరగాన్లను సగపెట్టినంత పనిగాదు మీరు పొద్దుందాక రాజ్యాలేలొచ్చేది. పనులు చేసేది. అంతగలిపి ఏదో ఆడపుట్టుక పుట్టినామని వంచిన తల ఎత్తకుంట మాటకు ఎదురు జవాబివ్వకుంట, మాట్లాడకుంట, పనిజేసుకుంట జేర్తె మీకు ఏమేర్పడుతది మేం జేసే పని - ఆడోల్లందరం ఓ సారి పదిహేను రోజులు పిల్లగాన్లను మొగనికి అప్పజెప్పి తల్లిగారింటికోతే తెలుత్తది" అంటుంది.

ఇన్నిపనులు చేసుకుని కార్ఖానాలకు పోతే అదొక నరకం. "కాల్లుజాపుకుందామంటే జాగలేదాయె, పోరగాన్లను పండేద్దామంటె సతాం ముత్తెమంత జాగలేదాయె, యిట్ల ముడుసుకొని కూసుండి మోకాల్లు గుంజవట్టె........ఈ ఘాటు ఊకే పీలిస్తే టీబీ అసొంటిరోగాలత్తయంట - గా గాండ్ల బుచ్చక్క గిట్లనే తంబాకు గాటు

వడక బీడీలు చేసి చేసి చేదగ్గుతోటె గాదె దావుకాన్ల వడ్డది" అని ఒక స్త్రీ, "బీడీలు జేసేటోల్లకు వయసుతోటి ఏంపనిగా పోయింది తీయి. పదేండ్లు జేసెటొల్లకు పానం ఏమ్మిగులుతుంది? ఛేదగ్గు పెయి మీది బొక్కలు దప్ప ఈ పరిస్థితి మారాలె, మనంగూడ అందరి తీర్గ బత్కాలె మనగ్గూడ కూలీలు పెరుగాలె; సౌకర్యాలు పెరుగాలె. గందుకనే సమ్మె జెయ్యాలె" అని సమ్మెను సమర్థిస్తారు.

సామాజిక సమస్యలు వాటి పరిష్కారాన్ని ఉత్పత్తి సంబంధాలరీత్యా విశ్లేషిస్తూ, సామాజిక సమస్య పరిష్కారంలోనే స్త్రీ సమస్య పరిష్కారం కూడా ఉందని రాములు "బతుకుపోరు" నవల నిరూపిస్తుంది.

## రాధ

బోయజంగయ్య తన "జాతర" నవలలో పల్లెల్లో గాఢంగా నాటుకుపోయిన మూఢవిశ్వాసాలను జనం భాషలో వెలుగులోకి తెచ్చి వారిని చైతన్యవంతం చెయ్యడానికి ఈ నవలను రచించానని చెప్పారు. ఈ నవలకు ప్రేరణ తన చిన్ననాటి అనుభవాలేనని ఆయన తెలిపారు.

ఈ నవలలో ముఖ్య పాత్ర రాధ. పిల్లలు లేని రాధ హుషారుగా ఉండదు. దీని చుట్టూ ఉన్నకథే జాతర నవలకు మూలం. రాధకడుపున కాయకాస్తే చూడాలని మామగారి కోరిక, గుడికి వెళ్లి దీపారాధన చేయించి ఒక రోజు అక్కడ నిద్రచేస్తే పిల్లలు పుడతారని ఆ ఊర్లో నమ్మకం. భర్త రాధకు పిల్లలు పుడతారనే నమ్మకం తనకు లేదంటూ రాధ నొక్కర్తినే జీతగాని సాయంతో వెళ్లమంటాడు; ఈ నవలల్లో పిల్లలుపుట్టకపోవడానికి కారణం తప్పంతా రాధదే అయినట్టు ఆమెపైనే తోసేస్తారు.

రాజారామమోహన రాయ్ సంఘ సంస్కరణోద్యమం ప్రవేశ పెట్టి విగ్రహారాధనను నిరసించి మూఢనమ్మకాలను ఖండించాడు.

మంత్రాలనూ, నమ్మకాలనూ దుయ్యబట్టాడు. ఇతనిని అనుసరించే గురజాడ, గిడుగు వారు వీటిని తెలుగు సాహిత్యంద్వారా ప్రసారంచేస్తూ, మూఢ నమ్మకాలను సడలించే ప్రయత్నాలు చేసారు; వీరేశలింగంగారు సంస్కరణోద్యమాలను నడిపే సమయానికి తెలుగుదేశంలో విద్యా విజ్ఞానాలు అంత ప్రచారం పొందలేదు. తెలంగాణాలో కూడ బాల్య వివాహాలు, కన్యా శుల్కం, నిర్బంధ వైధవ్యం, దేవదాసి, ఆడబాపల పేరిట భోగం మేళాలు విపరీతంగా వుండేవి. మశూచి, కలరా వ్యాధులు వస్తే అమ్మవార్లకు ఆగ్రహం వచ్చిందని జాతర చేసి జంతు బలులు ఇచ్చే వారు. ప్రజల అజ్ఞానాన్ని ఆసరాగా తీసుకొని మతం, మతాధిపతులు వారిని జాగృతం చేయకుండా వారి అజ్ఞానాన్ని వినియోగించుకున్నారు. స్త్రీ చదువుకుంటే మగవాడి ఆయుష్షు తగ్గిపోతుందనీ మతం ఆంక్షలు పెట్టింది. మతం కట్టు బాట్ల పేరుతో ఆడదాన్ని అజ్ఞానాంధకారంలో ఉంచింది. అయినా ఇప్పటికీ గ్రామాల్లో ప్రజలు ఈ మూఢవిశ్వాసాలను, మంత్రాలనే నమ్ముతుంటారు. వీరి అమాయకత్వాన్ని ఆసరాగాచేసుకుని గ్రామాధికారులు, పూజారులు ఉన్నత వర్గాల వారందరూ కలిసి వారి పబ్బం గడుపుకుంటుంటారు. గుళ్లోని కోనేటిలో మునిగి ఒంటిపొర చీర కట్టుకొని ఆడవాళ్లు ధ్వజస్తంభంచుట్టూ పొర్లుదండాలు పెట్టుకుంటే పిల్లలు కలుగుతారని ఒక మూఢవిశ్వాసం. తరువాత శివుని గుడిలో కెళ్లి లింగపూజ చేసి పూజారిచేత నీ కడుపున ఒక కాయకాస్తుంది అన్నమాటపై విశ్వాసముంచుతారే తప్ప మగవారు తమని డాక్టరు పరీక్షించడానికి మాత్రం ఒప్పుకోరు.

మామగారి ఆజ్ఞప్రకారం జీతగానితో కలిసి జాతరకు బయలుదేరుతుంది రాధ. జీతగాడైన రంగడు రాధల సంభాషణలో కలల ప్రస్తావన వస్తుంది. రాధ దృష్టిరంగడి దండరెక్కకున్న తాయత్తుపై పడుతుంది. తాయత్తు ఎందుకు కట్టుకున్నావన్నదానికి సమాధానంగా

కలలు పడకుండా ఉండటానికని సమాధానమిస్తాడు. కలలుపడితే మనిషి బక్కగై పోతాడట అన్న రంగడి అజ్ఞానానికి జాలేస్తుంది.

ఫ్రాయిడ్ సిద్ధాంతం ప్రకారం కలలకీ, మనుష్యుల అంతరంగాలకీ సంబంధం ఉంది. కలలద్వారా మానవ మనస్తత్వాన్ని విశ్లేషించవచ్చు. ఈ కలలను గురించి కొంతమంది మనస్తత్వ శాస్త్రవేత్తలు వ్యక్తుల బాహ్య ప్రవర్తనను పరిశీలిస్తారు. మరికొంతమంది మన అంతరంగంలో ఎలాంటి అంతఃసంఘర్షణలు జరుగుతున్నాయో బాహ్య లోకంలోని వాస్తవికతలను తమలోని బలహీనతలను వ్యక్తులు ఏ విధంగా గుర్తించలేకపోతున్నారో చెబుతారు[14]. (పేజి-19) కలలు ఆరోగ్యానికి చాలా మంచివని చెబుతూ తీరని కోరికలు అన్నీ కలల్లో కనిపిస్తవి అన్న రాధ మాటలు ఫ్రాయిడ్ సిద్ధాంతానికి చాలా సమీపంలో ఉన్నాయి. ఫ్రాయిడ్ వంటి మనో విశ్లేషణ శాస్త్రజ్ఞులు స్వప్నాలు వ్యక్తియొక్క వ్యక్తిత్వాన్ని ప్రతిబింబిస్తాయని, అవి అర్థవంతాలనీ భావించారు.

"At all events dreams highly individualized products of the entire personality"[15]

హిందూతత్వంలో కూడా స్వప్నాలకు ప్రాముఖ్య మీయబడింది. వ్యక్తి యొక్క చేతననుమించి మనసు స్వప్నావస్థలో చలించటం గమనించాల్సిన విషయం. ఆ తాయత్తును కట్టుకొని ఆడోళ్లను ముట్టుకుంటే ఆ తాయత్తు మహిమ ఉండదని చెప్పిన రంగడి మాటలకీ, వాడి అమాయకత్వానికి రాధ నవ్వుకుంటుంది. విప్పకునే మొగ్గలో ఏవేవో అందాలు దాగున్నట్లు మూసుకున్న కళ్లల్లో ఏవేవో తీరని కోరికలు అన్న రచయిత రాధ పాత్ర పరిస్థితిని బట్టి ఆమెయొక్క మనసు పోకడ మనకు అర్థమౌతుంది. శివుని గుడిలో కూర్చున్న పూజారి ఒక్కొక్క స్త్రీకి నూనె దీపంవెలుతురులో ఆమెనుదుట అడ్డంగా విభూతి రుద్ది, శివలింగం దగ్గర మల్లెపూలు తీసుకుని ఒకటి నోట్లో

పెట్టి, ఓచేత్తో నోరుమూసి మరోచేత్తో బొడ్డుదగ్గరి చీరను క్రిందకి నెట్టి బొడ్లో ఓ పువ్వుంచి తప్పక నీ కడుపున ఈ పువ్వు కాయకాస్తది అంటూ తలనుండి మొలవరకు నిమురుతాడు.

మేలిమి బంగారమైనా రవ్వంతైనా రాగి కలిస్తేనే ఒక అందం అన్న మాటను ఒక శాసనంలాగా చెప్పుతూ ఇతరులకు వినిపించకుండా ఇంకా ఏదో అంటూ కనుసైగ చేస్తాడు. తర తరాలనుండి వస్తున్న ఈ తంతుని ఆ ఊరిపెద్దలు అక్కడి పూజార్లు కాపాడుతూ వస్తున్నారు. ఈ తంతంతా రాధకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. తడిసిన ఒంటి పొరచీరలో తాను నగ్నంగా ఉన్నట్లు పూజార్ల చూపుల ద్వారా తెలుసుకొని వళ్లు జలదరిస్తుంది. ఈ రకంగా జాతరను పూర్తి చేసుకొని ఇంటికి వస్తుంది రాధ. చాకలి మంగమ్మ ఉతికిన చీరను రాధకిస్తూ చీర పోగలు లేచినాయని చెప్తుంది. జాతరకు పోయినపుడు పట్టుచీరతో స్నానం చేయడం మూలాన చీర పోగులు లేచినాయేమోనన్న రాధ సమాధానం విని మంగమ్మ నవ్వుతుంది. మంగమ్మ నవ్వుకు రాధ కారణం అడిగి నప్పుడు "మనిషికి పిల్లలయ్యేచాలు ఉండాలెగాని మొగోనిలోపల ఇత్తనం ఉండాలెగాని దేవుని దగ్గరికి పోనవసరం లేదని" చెప్తుంది. అటువంటప్పుడు మంగి జాతరకు ఎందుకు వెళ్లిందోనని రాధ అడుగుతుంది. దానికి సమాధానంగా జాతరపేరుతో తనకూ తన బావకు మధ్య సంబంధాన్ని చెప్తుంది. మంగమ్మ, రాధల సంభాషణలో వర్గవైషమ్యంగాని వర్గ విరోధంగానిలేదు. భూస్వామి కోడలు, చాకలి మంగమ్మ అన్న భేదంలేకుండా ఇద్దరూ కష్టసుఖాలు చెప్పుకునే ఆడవాళ్లలా కనిపిస్తారు. రాధమ్మకు భూస్వామి భార్య, భూస్వామి కోడలుగా అనే హోదా తప్ప మరింకే హోదా లేదు. అందువల్లనే వాళ్లిద్దరూ పూజార్లు చేసే మాయను చాలా ఓపెన్‌గా చెప్పుకుంటారు.

వెంటనే రాధకు జాతరలో జరిగిన దృశ్యాలు గుర్తుకు వస్తుంటాయి. ఆ రోజు పూజారి తనతో మాట్లాడుతూ మాట్లాడుతూ ఆలయగోడలపై శృంగార దృశ్యాలను చూపిస్తూ హరికథలో చెప్పిన శ్రీకృష్ణుని చేష్టలను గుర్తుచేస్తాడు. ఏ కార్యం వెనుక ఏ పరమార్థం దాగుందో నంటూ గుడిలోంచి ఒక కొబ్బరికాయ తెచ్చి ఆమె చేతిలోపెడుతూ మన్మథపూజ చేయిస్తానంటాడు. మన్మథపూజ పేరుతో ఆమెను స్వాధీనం చేసుకుంటాడు. పిల్లలుకావాలన్న రాధ అవసరం మీద పూజారివల విసిరాడు. ఇతరుల అవసరాన్ని గుర్తుచేసి మనిషి భయాన్ని సృష్టిస్తాడు. ఆ భయాన్నే దేవుని పేరుచెప్పి అణిచి వేస్తూ తన అవసరాలను తీర్చుకుంటాడు.

రాధకు కడుపు పండిందని అందరూ సంతోషిస్తుంటారు. జీతగాడు రంగడు కూడా తన సంతోషాన్ని వ్యక్తంచేస్తూ మంత్రాల్లో ఎంత మాయ ఉంది అంటూ తాను జాతరలో ఒక ఆడదానితో కలిసి ఉండగానే తాయిత్తు మాయమయిందని చెప్తాడు. రంగడి మాటలువిన్న రాధకు జాలి, నవ్వు రెండూ కలుగుతాయి. ఆ తాయత్తు ఆడదాన్ని తగలంగానే పోలేదని రంగడు నిద్రలో ఉండగానే తానే రెక్కనుండి తీసానని చెప్తూ కచ్చడం కప్పుపైనున్న తాయత్తును తీసి చూపిస్తుంది. రంగనికి కూడా మోసం తెలిసి కోయదొర తన పబ్బం గడుపుకోవడానికి అబద్ధం చెప్పాడని గ్రహిస్తాడు.

మూఢనమ్మకాలు మనిషిని గుడ్డివాణ్ణి చేస్తున్నందుకు వాటిని ప్రచారం చేసే వాళ్ళ మీద కోపంతెచ్చుకుంటూ మంగిమాటలు మననంచేసుకుంది. "**అంతామాయ, బతుకే మాయ, సంసారంమాయ, పిల్లలు మాయ**", అన్న బట్టలుతికేమంగి మాటలే జీవిత సత్యాలు.

## ఆడబాపలు:

తెలంగాణా నవలలు ఆ ప్రాంతపు దురాచారాల్నేగాక వెట్టి, బేగారి మొదలైన కట్టుబాట్లతో పాటు ఆడబాపల దురాచారాన్ని కూడా విపులంగా చిత్రిస్తాయి. ఇది ఒక ఘోరమైన దాస్యం. రెడ్డిగారి భవంతిని, అంతఃపురాన్ని గడీ అని పిలుస్తుండేవారు. ఆ అంతఃపురానికి వచ్చే అతిథులకు ఆడబాప అనుభవించగలిగే విలాసవస్తువుగా ఉంటుంది. అందరికీ అణిగిమణిగి ఉంటూ ఆట బొమ్మలా తయారౌతుంది. ఆమె ఇష్టాయిష్టాలతో పని లేకుండా రసం తాగి తొక్కను పడేసినట్లు వేస్తుంటారు. దొరల జల్సా ఖుషీలకుద్దేశింపబడిన ఆడబాప బతుకు నీచంగా ఉండేది. వ్యభిచారం, బానిసత్వం, ఈ రెండూ ఆ ప్రాంతంలో స్వైర్యవిహారం చేసాయని ఈ నవలల వల్ల వ్యక్తమౌతుంది. ఈ ఫ్యూడల్ వ్యవస్థలో ఇతర స్త్రీలను ఉంపుడుకత్తెలుగా ఉంచుకోవడం ఒక రీతి. ఆనాటి సమాజంలో ఈ నీతి వివాహితులైన స్త్రీలకు కూడా వర్తించింది. గంగు నవలా ప్రారంభంలోనే జగ్గయ్య దొర అంతమ్మను చూపిన విధానం రచయిత చిత్రీకరించాడు. జగ్గయ్యదొరను చూసి బెదిరిపోయిన అంతమ్మ తోవలో వదిలేసిన బొక్కెనను దొర పిల్లవానితో ఇంటికి పంపిస్తే ఆ పిల్లవాడు ఆసంగతి ఊరంతా చెప్పినప్పుడు జనమంతా ఆ ఇంటిని వింతగా చూస్తూ పోయారు. దాంతో అంతమ్మ తనకవమానం జరిగిందని బాధపడింది. రచయిత అంతమ్మను ఒక ఆలోచింపజేసే వ్యక్తిగా మనముందుంచుతాడు. అవమానం జరిగినప్పుడు ఏడుస్తూకూర్చునే సాధారణ స్త్రీగా కాక ఆ కళ్ళలో నిప్పులను కురిపించిన స్త్రీ అంతమ్మ. తమకు ఎదురైన క్లిష్ట పరిస్థితులలో ఆమె భర్త తాత్కాలికంగానైనా దొర ప్రభావానికి లొంగి పోయేసమయంలో అతనికి వివేకాన్ని కలిగించి అతనిలో వ్యక్తిత్వాన్ని నిలబెట్టిన స్త్రీగా ఈ నవలలో కన్పిస్తుంది. భర్త

నాగభూషణంతో ఈ ఊళ్లో అందమైన ఆడది ఆడదిగా బ్రతకడం కష్టం అంటుంది. (పేజి - 19) జగ్గయ్య దొర అంతమ్మ కూతురిని గంగమ్మ నెత్తుకొని ముద్దుపెట్టుకుంటూ అంతమ్మను ముద్దుపెట్టుకోవాలనే కాంక్షను వ్యక్తంచేస్తాడు. ఆ ఘాతుకాన్ని జ్ఞప్తికి తెచ్చుకున్నప్పుడల్లా అంతమ్మ ఆవేశంతో వణికి పోతుంది. జగ్గయ్యదొర కంటబడిన స్త్రీ ఎవరూ నేటి వరకూ అతని చెరనుండి విడిపోలేదు. కాని అలావిడిపోయి ఆ దంపతులు గ్రామాంతరం పోయి కష్టాలను కొని తెచ్చుకున్నారు. తనను తాను కాపాడుకోవడానికి చేసిన ప్రయత్నంలో వారుజీవితంలో ఆర్థికంగా నష్టపోయారు. అంతమ్మపట్టు వల్ల దొరసాని సాయం వల్ల నాగభూషణం పల్లెటూరి నుండి పట్నం వచ్చి ప్రామిసరీ నోటు వ్రాసి ఇవ్వడం తప్పించుకున్నారు. దొర అక్రమంగా తన ధాన్యాన్ని కుప్పగొట్టించుకొంటే ఏమీ చేయలేక పోయాడు.

తన ఇంట్లో దొంగతనం చేయిస్తే కూడా మారు మాట్లాడలేదు. అంతమ్మ ఊళ్లో ఉండి ఇదంతా చూస్తూ బతకమ్మ పాటలూ, దంపుడు పాటలూ పాడుతూ ఇతరులకు నేర్పి పాడించడంలో శ్రద్ధతీసుకుంటుంది. జగ్గయ్య దొర కన్నుపడ్డ నాగభూషణం భార్య అంతమ్మ అతని చేజిక్కకుండా ఆమె భర్తతో గాయపడిన తన మనసును విప్పిచెబుతుంది. ఆర్థికంగా చాలా నష్టపోయినా ఎంతో ధైర్యంతో ఆ గ్రామం నుంచే మకాం మార్పించే పరిణామం జరిగింది. లేకుంటే ఆమె కూడా మరొక ఆడబాపగా జగ్గయ్య ఇంట జీవనం గడపవలసి వచ్చేది. ఇదే నవలలో రచయిత పరస్త్రీల విషయంలో దొరల నీతి ప్రభావం వాళ్ల స్త్రీల పైన కూడా ఉంటుందని చెబుతాడు. ఈ దొరల పెళ్లాల జీవితాలు పంజరాల్లో చిలకల్లాంటివి. వీళ్లకొక ప్రత్యేకత లేకుండా తమకున్న హోదాను ఆర్థికమైన దర్పాన్ని చూసుకొని మాత్రమే తృప్తిపడతారు. వ్యక్తిగతంగా ఆలోచనలూ కోర్కెలూకల మానవులుగా బ్రతకరు.

వ్యక్తిత్వం అసలే ఉండదు. దీనికి ఉదాహరణగా జగ్గయ్య దొర భార్య రత్నమ్మ దొరసానిని చెప్పుకోవచ్చు. వీరు తమ భర్తలతో విముఖత కలిగి ఉండటంతో పాటు పంజరంలాంటి జీవితం వల్ల ఇతర పురుషులను ఆకర్షించుకునే ప్రయత్నంచేస్తారు. ఈ భూస్వాముల ఇళ్లలో ఘోషాను పాటించడం వల్ల పురుషులు చాలా తక్కువగా ఇంట్లోకి రావడం జరుగుతుంది. తప్పని పరిస్థితులలో పాలేర్లు తదితరులు వస్తుంటారు. అటువంటి వాళ్లల్లో ఒకడైన నాగభూషణంతో రత్నమ్మ అక్రమసంబంధాన్ని ఏర్పరచుకుంటుంది. అతడు తనభర్తకు శత్రువై పోయాక కూడా అతనిపైన వ్యామోహాన్ని ఆకర్షణని తొలగించుకోలేదు. నాగభూషణంపైన అనవసరంగాకోపం ప్రదర్శించే జగ్గయ్యమీద రత్నమ్మకు జాలి, సానుభూతి కలుగవు. తన భర్తముందు నాగభూషణం గెలుపు రత్నమ్మకొక అవ్యక్తమైన ఆనందాన్నిచ్చింది. అతడు ఆంధ్రమహాసభలో చేరి దొరకు పూర్తి శత్రువైపోయాక కూడా అతనిపై వ్యామోహన్ని ఆకర్షణని తొలగించుకోలేకపోయింది. ఊళ్లోని క్రొత్త కోడలు ఎవరైనా వచ్చిందంటే ఆమెను ప్రక్కలోకి తెచ్చుకునే మార్గాల కోసం దొరలెంతో శ్రమపడతారు. ఆ సంఘంలో ఆడదాని విలువ పక్కవరకే. కనుకనే అంతమ్మ వంటి స్త్రీలు కుమిలిపోయేవారు. తాముగా పొందే సుఖాలను పొందకుండా తమకళ్ల ముందో చెవులముందో ఇతర స్త్రీల పట్ల తమ భర్తలు మోజు పడటం చూసి, తమ సంతానం కూడా అలాగే ప్రవర్తించడం చూసి వారి మనసులపై ఒక రకమైన గాఢ ప్రభావాన్ని చూపుతుంది. అందుకే వారు ఇతర పురుషులతో సంపర్కం పెట్టుకునేందుకు ఉబలాట పడ్తుంటారు. అందుకే రత్నమ్మ తన కొడుకు దగ్గర నాగభూషణాన్ని ప్రశంసిస్తూ, గుమస్తా లక్ష్మయ్య ఎడల వెకిలిగా ప్రవర్తించిన తీరులో స్త్రీ సహజమైన వాంఛలను, ఆకాంక్షలను, నిర్లక్ష్యంచేసిన తమ భర్తల అహంకారం పట్ల నిరసనని తెలియజేస్తారు

రచయిత ఈ పాత్రలో! "ఈ గొలుసు దొరసానికే తగింది. **వారికి తగ్గట్టే వెతికి తెచ్చాను**"; అంటాడు నాగభూషణం. కాని జగ్గయ్యకి ఆ గొలుసునుచూడగానే నాగభూషణం భార్య అంతమ్మ గుర్తుకు వచ్చి మనసులో అంతమ్మకు తగ్గట్టు అనుకుంటాడు పైకి అనలేక. కాని నాగభూషణం మాత్రం రత్నమ్మకు తగ్గట్టుందని అనేశాడు. దాంతో అంతమ్మ సౌందర్యం తనని ఆకర్షించినట్లే తన భార్య సౌందర్యం నాగభూషణాన్ని ఆకర్షించ లేదుకదా అని మనస్సు చివుక్కుమనేలా బాధపడతాడు. వెంబడే "అంతటి గుండెలా మామూలు కంసాలివాడికి" అని ధైర్యం తెచ్చుకుంటాడు. వీరిద్దరి అభిమానాన్ని రచయిత కొన్నిచోట్ల భావగర్భితంగా చెబుతాడు. "**దొరతోటకు పోయిన సమయంలో రత్నమ్మ కొంటెగా నాగభూషణాన్ని చూస్తూ మేడ మెట్లెక్కి సాగింది. నాగభూషణం కూడా వెంట వెళ్లాడు**" (పేజి - 26).

దొరప్రవర్తన వల్ల తనలో కలిగిన మానసిక బాధను అంతమ్మ నాగభూషణంతో చెప్తుంటే నాగభూషణం నగల పనితనాన్ని మెచ్చుకుంటూ రత్నమ్మ జగ్గయ్యతో సంతోషంగా చెప్తుంది. ఈ నలుగురి విలోమఅనులోమ సంబంధాలను రచయిత నర్మగర్భమైన భావాలతో వెల్లడించారు. జగ్గయ్యదొర బంగారు గొలుసును అంతమ్మకిచ్చి తన పథకాన్ని నెరవేర్చుకోవాలనుకున్నాడు. కాని ఫలితం దక్కలేదు. జగ్గయ్య దొరకు అంతమ్మ మీద కన్నుపడితే రత్నమ్మకు నాగభూషణం మీద మనసు పడింది. అందుకే తృణప్రాయంగా రత్నమ్మ నాగభూషణానికి ఆ గొలుసును ధారాదత్తంచేసింది. ఇటువంటి సంఘటనలు దొరల ఇళ్లల్లో పతి గతిలేక పడే అవస్థలో దొరసానుల తప్పనిసరి ఇక్కట్లు! ఈ నవలలో రత్నమ్మ తన మాటలచేత ఆనాటి ఫ్యూడల్ విధానాన్ని నిరసించేతీరు దొరసానుల దయనీయమైన అసహాయమైన జీవితం ఈ పాత్రలో కనిపిస్తుంది.

ప్రతి దొర ఇంట్లోను ఆడ బాపలుగా ఉంపుడుగత్తెలుగా జీవితాన్ని గడుపుతున్న స్త్రీలు తప్పనిసరిగా దర్శనమిస్తారు. వీళ్ల జీవితాలు విచిత్రమైన కథా సంఘటనలతో నిండి ఉంటాయి. ఓ ఇంటికి కోడళ్లై అందరిలా సంసార జీవితం గడపాలనుకుంటూ కమ్మని కలలుకన్న స్త్రీలు వీరు. కాని పుట్టింటి దారిద్ర్యానికి దొరల అహంకారానికి వారి శారీరక అవసరాలకు బలియై, పెండ్లిండ్లు లేక దాసీలవలె దొరల ఇండ్లల్లో తమ జీవితాన్ని గడుపుతుంటారు. ఈ దొరలు సంతానం కలుగకుండా శాశ్వితంగా గొడ్రాళ్లు కావడానికి బలవంతంగా మందులు తినిపిస్తుంటారు. ఈ ఆడబాపల జీవితాలే రహస్య నిలయాలు. దొరల ఇళ్లల్లో వీరికి తెలియని రహస్యాలంటూ ఉండవు. ఏ విధమైన ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోగా దొరలకు తమ భార్యలిచ్చే సర్వ శారీరక సుఖాలనిస్తూ దాసీల కంటే నికృష్టంగా జీవనం గడుపుతున్న ఈ ఆడబాప దాసీ చేసే చాకిరి జీవితాంతం వెట్టి చాకిరీయే. దొరలకంటికి ఇంపుసొంపులుగా కనబడిన స్త్రీలంతా వారి హస్తగతాలే. శీలంచెడగొట్టబడిన స్త్రీలుగా కుక్కలుతాకిన విస్తర్లుగా వీరు జీవితాలు గడుపుతుంటారు. ఏ ఇంట్లో ఎంత మంది ఆడబాపలూ మగబాపలుంటే ఆ దొరలపైశాచిక కృత్యాలు అంతహెచ్చుగా పరిశీలించుకోవాలి. ఇటువంటి వారి సంఖ్య ఆనాటి వారి హోదా, స్థాయికి గుర్తింపుగా భావించిన కాలమది.

దాశరధిరంగాచార్య రచించిన చిల్లరదేవుళ్లలో వనజ దొరగడీలో జీవితాన్ని ఈడుస్తున్న ఒక ఆడబాప. వనజ పుట్టింది పెరిగింది దొర గడీలోనే. ఆ గడీనివదిలి ఎన్నోసార్లు పారిపోదామనుకుంది. వనజ తల్లిని దొర ఉంచుకుంటాడు. వారిద్దరికీ పుట్టిన బిడ్డ వనజ. మొట్టమొదటిసారి తనను దొరలగదిలోకి దొరసాని పంపించినప్పుడు తన తల్లి కళ్లల్లో నీళ్లు నిండటం చూస్తుంది. ఆమె కూడా తనవలెనే విస్సహాయురాలని తలచి ఆ జీవితాన్ని అలవాటు చేసుకుంటుంది. అటువంటి జీవితం గడుపుతున్న

సమయంలో సారంగపాణి మాటలు శరీరానికి కాకుండా గుండెకు గిలిగింతలు పెట్టి నట్లనిపిస్తుంది. యంత్రంలా, ఆట బొమ్మలా అందరికీ లొంగిన తనకు సిగ్గెప్పుడో పోయింది. ఇన్ని రోజులూ ఆడదాన్ని పళ్ళరసంలాగా పాయసంలాగా సారాయిలాగా తాగేవాళ్ళు మగవాళ్ళు అన్న అభిప్రాయంతో ఉన్న వనజకి సారంగపాణి క్రొత్త అనుభూతిని కలిగిస్తాడు. కాని తాను దాసి, ఆడబాప! జంతువును అమ్మినట్లు తనను, తనతల్లిని ఈ ఆచారాలు అమ్మివేసాయి. వేశ్యకన్నా కడుహీనమైన స్థితిలో దొరకు బానిసగా వనజ తన బతుకును ఈడుస్తుంది. తనలాగే ఈ గడీలో సరళ, విమల, ప్రమీల జీవిస్తున్నారు. తనలాంటి గుండెలేని జీవితాన్ని కోరి తెచ్చుకునేవాళ్ళు తక్కువ. కాని సారంగపాణి రాకతో తన రాతి గుండెలో జీవం వచ్చింది. దొరతో చెప్పి పెళ్లాడుదామని అనుకుంది. అతని వక్షంలో తలదాచుకోవాలన్న ఆనందంతో తబ్బిబ్బైంది. తనకొక భర్త ఉంటాడని అతనితో జంటగా అందరికి కనిపించొచ్చని ఉబ్బిపోయింది. తన జరిగిపోయిన జీవితాన్నంతా సారంగపాణికి చెప్తుంది.

ఆ వ్యవస్థలో అధికారుల పెత్తందారుల క్రూరత్వానికి, కీచకత్వానికి అతి సులభంగా బలి కాగలిగింది స్త్రీలు. నవలలో ఈ విషయంతో పాటు ఆధ్యాత్మిక మానభంగం అనతగిన బలవంతపు మతం మార్పిడి ప్రధానంగా చిత్రించబడ్డాయి[16].

స్త్రీల విషయంలో ఆ దొరలు ఎంత నీచత్వానికైనా పాల్పడేవారు. ప్రేమ, పెళ్లివంటి స్త్రీ, పురుష సంబంధాలు - మానవీయ సంబంధాలు కలుషితం చేయబడ్డాయి. ఇదే నవలలో వనజ తల్లి దొర దాహానికి ఎర అయ్యింది. పెళ్లై కొత్తగా అత్తగారింటికి వెళ్తున్న కొత్త పెళ్లి కూతుర్ని భర్త చూస్తుండగనే గడి లోపలికి లాక్కుపోయాడు దొర. ఆ భర్త దొర కాళ్ల మీదపడి ఏడ్చినా లాభం లేకపోయింది. దొర ఆ రకంగా భార్య, భర్తలను దూరం చేశాడు. మొగుడు ఏడ్చి ఏడ్చి వెళ్లిపోయాడు.

భార్య గడిలో ఆడబాప అయ్యింది. ఆ ఆడబాప కూతురు వనజ. దొరకు పుట్టి మరో ఆడబాప అయ్యింది. గుండెలేని జీవితాన్ని గడుపుతూ తమ శరీరాల్ని యంత్రాల్లాగా అర్పిస్తూ ఉంటారు. మనసుకు అన్నీ గాయాలే. నాశనం చేయబడ్డ వాళ్ల మనస్సులో ఎంత అగ్ని రగులుతూ ఉండేదో వనజ పాత్రద్వారా చెప్పించారు రచయిత. వనజ దేశ్‌ముఖ్‌గారి గడిలో ఆడబాప. తల్లి యవ్వనం దేశ్‌ముఖ్‌గారి పౌరుషానికి అంకితమైతే, తన యవ్వనం ఆ గడికి వచ్చిపోయే దొరబాబులకంతా పడక కావాల్సివచ్చింది. దేశ్‌ముఖ్ పుత్రిక మంజరికీ, వనజకూ ఆకారంలో ముఖ్యంగా కళ్లలో ఒకే పోలికలున్నాయి. ఉండవా మరి? అలాంటి వనజ లెందరో ఉన్నారు. ఒకే రక్తాన్ని పంచుకున్న ఇద్దరు వ్యక్తులలో ఒకతి చిన్న దొరసాని అయింది. మరోవ్యక్తి ఆడబాప అయ్యింది. ఇలాంటి సత్యాలను చాటిచెప్తూ రచయిత నేటి సమాజంలో రావల్సిన మార్పును దృష్టికి తీసుకొస్తాడు. ఆస్తి, అధికారం వారసత్వంగా సంక్రమించే పరిసరాలలో నీతి కోతియై వెక్కిరించే వెకిలి చేష్టలను స్పష్టంగా రచయిత చూపించారు అని ముకురాల రామారెడ్డి గారు వనజ పాత్రను ఆ పాత్రను మలిచిన రచయితను విశ్లేషించారు[17]. ఇదే నవలలో గ్రామ కరణాలు కూడా వీరికేమి తీసిపోరు. కరణం వెంకట్రావ్ ప్రాణాలు తీసి దానాలు చేసే దాతృత్వం కలవాడు. ఇతడు "Personification of deceit wickedness"[18]. గొండ్ల వీరిగాడు పెండ్లి చేసుకొని భార్యతో దండంపెట్టడానికి వచ్చాడు. పుల్లి అందం చూసి కరణానికి కన్ను కుట్టింది. అది కూడా కరణానికి లొంగిపోతుంది. వీరిగాడు ఎప్పటికైనా తనకు ఆటంకమే అని ఆలోచించి కరణం వాణ్ని చంపి పాతిపెట్టించాడు. అది చూసిన కరణం భార్యకు మతి చలించింది. సంగతి ఊర్లో అందరికి తెలిసినా నోరెత్తే ధైర్యం ఎవరికీ లేదు. ఆడదానికి హృదయం ఉంటుందని అతనికి తెలియదు. అసలు ఆడది జంగమం అని కూడా తెలీదేమో! ఆడదంటే ఆటవస్తువు అని అతని అనుభవం (పేజి-172) అలాగే ఇంకో

కుమ్మరి మల్లి. ఇలా ఎందరెందరి జీవితాలో! నవల చివరలో దొర కూతురు మంజరి సారంగపాణిని ప్రేమిస్తుందని తెలుసుకొని వ్యభిచారం, దాస్యంలో పుట్టిన తన జీవితాన్ని చూసి సారంగపాణి తనను ఒక విలాస వస్తువుగా భావించక ఒక ప్రత్యేకమైన స్థానాన్ని ఇవ్వడంతో అతనిపై ప్రేమను సోదర ప్రేమగా మార్చుకుంటుంది (పేజి-138, 139).

ఇక్కడ కూడ రచయిత వనజ పాత్రకు న్యాయం చేకూర్చ లేకపోయారు. రెడ్డి, సారంగపాణి వనజల పెళ్లి చేస్తానంటే సరే అని ఊరుకుంటుందే తప్ప వారిద్దరి మధ్య సోదర ప్రేమ ఉన్నట్లు చెప్పలేకపోయింది. దానికి కారణం ఆడబాపగా బ్రతకాల్సివస్తుందని జవాబిస్తుంది. పాణి వనజను ప్రేమిస్తున్నాడని అనుమానంతో మంజరి వనజపై ద్వేషం పెంచుకుంటుంది. దాసీది తన కులుకులతో అతన్ని మురిపిస్తుందని, తాను దేశ్‌ముఖ్ కూతురు కావడం వల్ల ప్రేమించానని చెప్పలేని తన అశక్తతని నిందించుకుంటూ వనజపై అసహ్యం పెంచుకుంటుంది. మంజరి దుఃఖానికి కారణం వనజ అని అనుమానించి రెడ్డి బెత్తంతో వనజను చావబాదుతాడు. పాణి వనజకు అడ్డం వస్తాడు. సారంగపాణి ఇంట్లోంచి వెళ్లిపోయినపుడు తన సోదర ప్రేమను మంజరికి చెప్తుంది. "నిన్ను తెలుసుకోలేదు, నీవు పాణిని ప్రేమిస్తున్నావని అనుకున్న నాకు అడ్డం వస్తున్నావనుకున్న. ఆ కోపంతోనే చెంపమీద కొట్టిన" అన్న మంజరి మాటలు భూస్వామ్య వ్యవస్థను సూచిస్తాయి. వీళ్ల కెవరిపైన కోపం వచ్చినా అకారణంగా తమ ఇంట్లో పనిచేసే వాళ్లను, దాసీలను శిక్షలకు గురిచేస్తుంటారు. సంతోషమెచ్చినపుడు ఇనాములు తీసు కుంటూ, ఆగ్రహమొచ్చినపుడు తన్నులు తింటూ విశ్వాస పాత్రమై కుక్క-ల వంటి జీవితాల్ని గడుపుతుంటారు ఈ గడీలోని ఆడబాపలు.

ఇటువంటి జీవితాన్నే గడుపుతున్న మరో స్త్రీ గంగు నవలలో నీలవేణి. ఈమె మద్దిమెట్ట గ్రామం వెంకట్రావు దొర అవసరానికి గురై

పుట్టింటి దారిద్ర్యంవల్ల పెళ్లి పిల్లలులేక ఆడబాపగా దాసీ జీవితం గడుపుతుంది. దొరకూతురు సుజాతను చూస్తూ అదే వయసులో ఒకప్పుడు తానూ ఒక ఇంటికి కోడలు నౌతానని తోటి వయసు వారిని తలచుకొని ఊహించింది. తాను దాసీగా మారినప్పటినుండి కలిగిన అనుభవాలు ఆమె కళ్లల్లో మెదిలాయి. మొదటి సారిగా నెల తప్పినప్పుడు దాన్ని తీసేయడానికి వెంకట్రావు చేయించిన ప్రయత్నం. అప్పుడు ఆరోగ్యం దెబ్బతిని పడ్డ అవస్థలు తరువాత శాశ్వితంగా గొడ్రాలు కావడానికి తినిపించిన మందులు అన్నీ శూలాలతో పొడిచినట్లు జ్ఞాపకంవచ్చింది. రెండు కన్నీటి చుక్కలు వదిలింది. ఆనాటి నుంటి సుజాత ను తల్లివలె అభిమానంతో కాపాడుకుంటుంది.

ఒకసారి సుజాతకి రహస్యంగా ఉత్తరాన్ని ఇస్తున్నప్పుడు తల్లి చూస్తుంది. వెంబడే సంగతేంటో తెలుసుకోకుండా నీలవేణి మీదపడి సిగబట్టి రెండు చెంపల్నీ వాయిస్తుంది. అంతేకాకుండా నీలవేణిని పొరకతో కొట్టుకుంటూ మేడపైకి తీసుకుపోతుంది. మద్దిమెట్ట గ్రామంలో ఆంధ్రమహాసభ కార్యకలాపాల్ని చూస్తూ, ప్రజాశక్తి పత్రిక, భూమి, జంగ్, పత్రికలు తెప్పిస్తున్న తోటరామయ్యకు, సుజాతకు మధ్య సమాచారాల్ని అందిస్తూ సుజాతకు ఒక కొరియర్‌గా నీలవేణి పనిచేసింది. సుజాత తల్లి జానకమ్మ ఫ్యూడల్ వ్యవస్థలో పుట్టి పెరిగిందే కాబట్టి ఫ్యూడల్ విలువలు, అలవాట్లు ఆమె రక్తంలో జీర్ణించుకుపోయాయి. అందువల్లనే నీలవేణి చేస్తున్న ప్రతిపనిని అను మానిస్తుంది. భూస్వామ్య వ్యవస్థలో ఆనాటి స్త్రీలు తమ భర్తలు చేస్తు న్నది తప్పని తెలిసినా వాళ్లముందు నోరు ఎత్తే ధైర్యం లేక ఆ కోపాన్ని, అసూయని ఈ దాసీలపై తీర్చుకుంటారు. ఈ దాసీలను ఏ భోగదృష్టితో చూస్తారో ఆడబాపల్ని ఏ కామవాంఛలకోసం ఉన్నారని భావిస్తారో అదే దృష్టితో వారు చేసే ప్రతి పనిని అనుమానిస్తారు. స్త్రీ, పురుషుల మధ్య

ఉత్తర ప్రత్యుత్తరాలుంటే అవి సెక్స్‌పరమైనవే అనుకుంటారే తప్ప వేరే రకంగా ఆలోచించరు. దానికి కారణం రాజకీయ ఉత్తరాలు రహస్యంగా ఉంటాయని ఆమెకు అవగాహన లేకపోవడమే. అందుకే నీలవేణి రహస్యంగా ఉత్తరాన్నిచ్చినపుడు మీదపడి తంతుంది. నీలవేణికి తార్పుడు పని తప్ప ఇంకొకటి చేతకాదని వీళ్ల నమ్మకం. ప్రజలను దోచుకుతింటూ వారి చెమటను డబ్బుగా చేసికొనే దొరలకు కామవాంఛలు పెరిగేవేకాని, తరిగేవి కావు. ఆ దొరల దాసీలు నలిగి పూలయ్యాక, పీల్చివేయబడ్డ చెరుకులయ్యాక చేసేది ఈ తార్పుడు పనే. వీళ్లు దొరలకు, దొరసాన్లకు ఒకరికి తెలియకుండా ఒకరికి సంబంధ సమావేశాలను ఏర్పరుస్తూనే ఉంటారు.

ఇటువంటి సంఘటనలన్నీ దొరల గడీలల్లో సామాన్యమే కాబట్టి తన కూతురు కూడా నీలవేణి సాంగత్యం వల్ల చెడిపోయిందేమోనని అనుమానించింది. జానకమ్మ నీలవేణిని బరితెగించిన ముండ అని తిడ్తుంది. నీలవేణిని గర్భవతిని చేసి దిగతాగించి శాశ్వతంగా గొడ్రాల్ని చేసి తన కామవాంఛతో ఆడబాపగా చేసిన వెంకట్రావ్ గొప్ప మర్యాద కలవాడు. ఆ గడీలోకి వచ్చే ఎందరో దొరల అధికారుల కోరికలకు బలైపోయిన నీలవేణి బరితెగించినముండ! ఈ నీతిలేని వాళ్లకు ఎదుటి వ్యక్తుల్లో నీతి కనిపించదు. పచ్చకామెరులకు లోకమంతా పచ్చగా కనిపించినట్లు గడీలో అవినీతి ప్రపంచాన్ని చూస్తున్న, అనుభవిస్తున్న జానకమ్మ అంతకుమించి ఆలోచించలేకపోయి నూతిలోని కప్పలా బతుకుతుంది. తన ఎదురుగనే నీలవేణి వంటి ఇతర స్త్రీలను భర్త వెంకట్రావ్ అనుభవించటంతో ఎంతో కాలంనుంచి తన గుండెలో అదిమిపెట్టిన అసూయా, కసి ఈ తార్పుడు ఉత్తరం సాకు ద్వారా వెళ్లగక్కింది. అందుకే పొరకతో గొడ్డును బాదినట్టు బాదుతుంది నీలవేణి.

సుజాతకు నీలవేణంటే చాలా గౌరవం. నావల్ల చావుదెబ్బలు తిన్నావని నీలవేణితో అన్నప్పుడు, "**ఐతేమాన్లేది, నారాతేగంత, నేచేసిన**

తప్పు ఆ బగవంతుడు చూస్తునే ఉండు. మాదేందిలేరి, మావి కుక్క బతుకులు కొడ్తెపడితిమి ఇంత పడేస్తే తోకాడిస్తిమి' అని గుడ్లలో నీరు తీసుకుంటూ సుజాతతో తన దీన గాథనుచెప్పుకొంటుంది నీలవేణి. సుజాత ఎంత ఆప్యాయత కురిపించినా ఈ నరకంనుంచి బయట పడలేనని, దాని వల్ల మరింత కష్టాలేకలుగుతాయని నీలవేణికి తెలుసు.

తమ కామవాంఛలకు ఈ ఆడబాపల్ని వాడుకొని వాళ్లని దాసీ పుత్రులకే ఇచ్చి వివాహం చేయడం దొరల ఇళ్లలో రివాజు. ఈ నవలలో మగ ఆడబాప రాజం. ఈ రాజం నీలవేణి దంపతులని స్పష్టంగా రచయిత చెప్పకపోయినా నవల చివరలో సుజాత మాటలద్వారా ఈ విషయం స్పష్టమౌతుంది. రాజం నీలవేణి ఇద్దరు సుజాతకు సమాచారం అందిస్తున్న సమయంలో సంఘం వాళ్లతో పరిచయం ఏర్పరుచుకున్నారు. ఊర్లోకి సంఘం వస్తుందని వాళ్లు ఎదురు చూస్తారు. సంఘంతో రహస్య సంబంధం పెట్టుకుంటూ తమ ఊర్లోకి వచ్చిన ఊరేగింపును చూడడానికి ఉత్సాహంగా పరిగెత్తి ఇంటి వాకిట నిలబడుతాడు రాజం. వెంకట్రావ్ జానకమ్మల ముఖాలలో వస్తున్న మార్పును గమనిస్తూ నీలవేణి నిల్చుంటుంది.

సంఘంతో, లంబాడి రామయ్యతో పరిచయం ఏర్పడిన తర్వాత దొరగడీలో ఆడబాపగా ఉన్న నీలవేణి అదే గడీలో సంఘం ప్రతినిధి గా మారింది. నవనీతం నాగభూషణాలతో సుజాత కలిసి మాట్లాడ్డానికి రహస్య సమావేశాన్ని ఏర్పాటు చేసింది. సుజాత తల్లి తండ్రులకు కూడా తెలుపని తన అంతరంగిక విషయాలను కొన్ని పార్టీ రహస్యాలను నీలవేణికి చెప్తుంది. అందుకే నీలవేణి సుజాతను కన్నబిడ్డలా చూసుకుంటుంది. సకల సంపదలను వదిలి వెళ్లి పోతున్న ఆమె త్యాగ బుద్ధికి జోహార్లర్పించింది. తనలాంటి బాధాసర్పద్రష్టుల జీవితాన్ని వెలుగులోకి తేవడానికి సుజాత ప్రయత్నిస్తుందని అర్థం చేసుకుంది.

రాజం దొరల సహవాసంలో పుట్టిపెరగడం వల్ల అతను కూడా వ్యసనాలకు లోనయ్యాడు. తాగివచ్చి భార్యను కొట్టేవాడు. మొదట్లో సంఘంతో పరిచయం ఏర్పడిన తర్వాత రాజం వాటిని మానాడు. ఈ మార్పు పార్టీ వల్ల జరిగింది.

సుజాత పట్నం వెళ్లిన తర్వాత పార్టీలో చేరిందని, తిరిగి ఇక రాదని చూచాయగా విషయంతెల్సి జానకమ్మకు నీలవేణిపై అనుమానం పోయింది. పిల్చి గద్దించి అడిగింది. దానితో నీలవేణికి సుజాతకు ఉత్తరం అందించినప్పటి రోజులు, చావతన్నులు గుర్తుకొచ్చి వణికి పోయింది. ఆ రాత్రికి రాత్రే పుట్టింటికి వెళ్లి గడి కడపతొక్కలేదు. రాజం వెళ్లి పిలిచినా ఏదో ఒక వంక చెప్పితోట రామయ్య సహాయంతో ఎక్కడైనా లేచి పోదామంటుంది. అది విన్న రాజంకి మొదట భయమేస్తుంది. నీలవేణి చెప్పింది అర్థంకాక తికమక పడ్డాడు. ఎందుకంటే, తోట రామయ్య సహాయంతో వెళ్లిపోవటమంటే పార్టీ కొరకు పోవడం అని అర్థం. తోట రామయ్య అనుమతితో ఒక రోజు తెల్లవారుజామున నీలవేణి, రాజం ఊరు విడిచి వెళ్లిపోయారు. ఐతే ఒక్క నీలవేణి వల్ల ఈ పని జరిగిందా అంటే కాదు అనే దీనికి జవాబు చెప్పొచ్చు. ఆంధ్రమహాసభ తెచ్చిన సాంఘీక చైతన్యమే తనకు విముక్తి కలిగిస్తుందని తనకు మొదటి నుంచి తెలుసు. నీలవేణి తన జీవితమే కాకుండా సుజాత కూడా పార్టీ జీవితానికి అంకితమైపోవడానికి కూడా సహాయపడింది. నిజానికి సుజాత కొరకు దెబ్బలు కాచి, రహస్యాలు మరుగున పరచి, ఉత్తరాలు, పత్రికలు అంది స్తూ, సుజాతకు తోడు నీడగ వ్యవహరించకపోయినట్లైతే సుజాత పార్టీ జీవితానికి పోయి ఉండేదికాదు. ఆ రకంగా ఆమెకు పార్టీ జీవితాన్ని ఇచ్చింది నీలవేణి. మొట్ట మొదట దొరసాని చేతులో తన్నులు తిని తమ బతుకులు కుక్కలవంటివని కొడితే పడివుండే, పెడితే తోకాడించే బతుకులు మావి అని చెప్పుకున్న నీలవేణి గడిలోనే ఉండి పార్టీ "ప్రతినిధిగా నిలదొక్కుకొని చివరికి హైదరాబాదు పార్టీలో చేరేటంత

దశలో వున్న అమృతవాణిని చూస్తూ, బలరామయ్య జరిగిపోయిన సంఘటనలన్నీ నెమరు వేసుకుంటూ, ఆమెపై జాలిని, కరుణను ప్రదర్శిస్తాడు. అమృత వాణి ఏడుస్తుంటే తానూ దుఃఖాన్ని ఆపుకోలేకపోయాడు; ఆ క్షణంలో తన తాహతు, అధికారం, సంపద అన్నీ మరిచి ఆమెపైబడి విలపిస్తాడు.

ఈ నవలల్లో ఆడబాపల జీవితాల్ని చదువుతున్నప్పుడు నిజంగా స్త్రీలు ఈ రకమైన జీవితం గడిపారా అన్న ఆశ్చర్యంతో కూడిన సందేహం కల్గుతుంది. రంగాచార్యగారు తెలంగాణ జన జీవితచిత్రణకు మాండలిక అందాలను కూర్చినవల రాయడానికి పూనుకున్నప్పుడు "నా చినగూడూరు మనసు తలుపులు తన్నుకొని బయటపడింది. చిల్లరదేవుళ్లు నవలలో నేను ఊరు పేరు చెప్పలేదు. చినగూడూరు ఆనాటి దొర రామారెడ్డి, వారి గడీనవలలో అచ్చు గుద్దుకుంది. నవలలోని పిచ్చి మంగమ్మ ఇటీవల వరకూ ఆ ఊళ్లో ఉండింది. నేను శిల్పంలా చెక్కి నామనసునే కదిలించిన వనజకు మాతృక అందమయిన అమృత పాణి. ఆమెయే మరీ నా మీద ఆవహించి జనపదం నవలలో అమృతవాణి అయింది" అని ఇటీవల ఆంధ్రభూమిలో పేర్కొన్నారు[20].

ఇవి కేవలం కల్పిత పాత్రలు కాదు చిల్లరదేవుళ్లలోని వనజ పాత్ర విమర్శలకు గురిఅయింది[21]. అయితే ఆ నవల్లో ప్రధానమైన సమస్య వనజ, సారంగపాణిల పెళ్లికాదు. వారిద్దరిపెళ్లి కాకుంటే నష్టం లేదు; రచయిత 1930 ప్రాంతపు రాజకీయ పరిస్థితుల్ని రాస్తున్నాడని గుర్తించాలి. వీరిద్దరి పెళ్లిజరిగినట్టు రాస్తేనే అది అవాస్తవికతగా రూపొందుతుంది.

## దేవదాసీలు :

జాతరనవలలో అయినింటి ఆడపడుచుల విషాద జీవన గాథతోపాటు బలంకలిగిన వాళ్లు బలహీనుల్ని ఏరకంగా వేపుకు

తింటున్నారో రచయిత చెప్పాడు. ఈ నవలల్లోని పాత్రల సంభాషణలు కన్యాశుల్కంలో బైరాగి సీనును తలపింపజేస్తుందని పురాణం సుబ్రహ్మణ్య శర్మగారు పేర్కొన్నారు.[22]

వ్యభిచారం చేసి బ్రతికే స్త్రీలద్వారా మునుపటికీ ఇప్పటికీ మనుషులలో వచ్చిన మార్పులను స్త్రీల దైన్యాన్ని ఆయా పాత్రల చేతనే చెప్పించాడు రచయిత. ఈ నవలలో పూజారులు ప్రజల అజ్ఞానం మీద వాళ్ల తెలివిని చూపిస్తు ఎలా బ్రతుకుతున్నారో అలాగే పోలీసులు కూడా ప్రజల్ని దోచుకుంటూ జబర్దస్తీగా బ్రతికేస్తున్నారని రచయిత ఆయా పాత్రలచేత ధ్వనింపజేస్తాడు; పల్లెలో జరుగుతున్న వ్యభిచారమే పట్టణాలలో క్యాబరే పేరుతో జరుగుతున్నది దానికి సమతుల్యమైన వ్యభిచారమే. రాధ భర్త పాండయ్య తనలో ఉన్న కోరికల్ని భార్యతో తీర్చుకోలేక క్యాబరే కి వెళ్లుతుంటాడు. పత్రికలో సెక్స్ సమస్యలు ఆబగా చదువుతూ భార్యను గుర్తుతెచ్చుకుంటాడు. ఇంటికి వెళ్ళి పెరట్లో స్నానం చేసి వస్తున్న భార్య తడి పాదాల్లో తన అడుగులు వేసుకుంటూ వస్తున్న పాండయ్య రచయిత భర్త మార్పు చెంది భార్యని గుర్తిస్తున్నాడనే సన్నివేశం ద్వారా పాఠకులకు అందించారు.

జాతర నవలను పాఠకులకు పరిచేయం చేస్తూ మధురాంతకం రాజారాం; "ప్రశాంత సాగర గర్భంలో తిమింగలం వున్నట్లుగా పల్లె సీమల జన జీవనంలో సైతం అర్థం లేని ఆచారాలు అంధవిశ్వాసాలు ఇంకా వేరూనుకునే వున్నాయి. బలం కలిగిన వాళ్లు బలహీనుల్ని వేపుకు తినడం మాములు విషయంగా చెల్లి పోతుంది. కొందరి అమాయకత్వం మరికొంద్దరికి మహదావకాశం గా ఉపకరిస్తుంది.ఈ సమాజ అంతరంగిక స్వరూపాన్ని ఆవిష్కరించడానికి వీలుగా రచయిత ఒక జాతరను ఆలంబనగా తీసుకున్నారు. సాధారణంగా జాతరకు వచ్చే వాళ్ల లో రామ భక్తుల శాతం కంటే రమాభక్తుల జేబులు, నగలు కత్తిరించే వారు, రామ

భక్తుల అందమైన ఆడవాళ్ల వెన్నంటి తిరగే వాళ్ళ సంఖ్యే ఎక్కువ. కానీ సచ్ఛీలం కలిగి వుండి ఇతరులకు ఆదర్శప్రాయం కావల్సిన పూజారులు న్యాయాన్ని, ధర్మాన్ని, పరిరక్షింప వలసిన రక్షక భటులు కూడా రమాభక్తుల గా వుంటే ఎలా? కంచే చేను మేయడంలోని ఈ విడ్డూరాన్ని జాతరలో రచయిత స్పష్టంగా చిత్రీకరించారని"[23] వ్రాసిన సమీక్ష నూటికి నూరు పాళ్లు నిజం

తెలంగాణా జీవితం నేర్పిన అనుభావాన్ని ఒక నవలగా వ్రాయ సంకల్పించానని చెప్పిన బోయ జంగయ్య జాతర నవలకు 1990 లో తెలుగు విశ్వవిదాలయం వారు సాహిత్య పురస్కారాన్నిచ్చారు. జాతర నవల ద్వారా మూఢత్వానికి పాతర వేస్తూ జాతర జంగయ్య గా సిద్ధపడ్డాడు రచయిత; ఉరిమి చేసే కొండలు ఊడిగం చేస్తున్న కొంపలు ఉన్న ఈ జాతర నవలను మైసూరు విశ్వవిద్యాలయం బి.ఏ.బి.ఇడి.కి ఉపవాచకంగా ఎంపిక చేసింది.

ఈ నవలల్లోని స్త్రీ పాత్రలన్ని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో,దౌర్జన్యాన్ని నిరసించేవిగా, అసహ్యించుకొనేవిగా కనిపిస్తాయి. ఆ దౌర్జన్యాన్ని ఎదిరించడం శక్తికి మించిన పనైనా పోరాటం సల పటంలో మాత్రం స్త్రీలు వెనుకంజ వేయలేదు. ఎందరో స్త్రీలు వారి రాక్షసత్వాలకు బలైపోయినా కొందరు మాత్రం తమ పోరాటంలో విజయం సాధించారు.

భాస్కరభట్ల కృష్ణారావు రచించిన **యుగసంధి** నవల తెలంగాణా రాజకీయ సాంఘిక వాతావరణం ప్రాతిపదికగా తీసుకొని రచించిన సామాజిక నవలగా సాహిత్యవేత్తలు చెప్పినా ఈ నవల్లో ముఖ్యంగా స్త్రీల స్థితి గతులకు సంబంధించిన ఇతివృత్తమే చెప్పబడింది. రచయిత నవలతో పాటు నైజాం సంస్థానంలోని అప్పటి పరిస్థితులను, రాజకీయ సాంఘిక పరిణామాలను తీసుకున్నా, ఆయన తీసుకున్న

రెండు రకాల స్త్రీలు పాఠకుల గుండెల్లో చెరగకుండా నిల్చిపోతారు.

1922 నుంచి 1948 మధ్య హైదరాబాదు లో రాజకీయాల సాంఘీక పరవర్తన మధ్య జరిగిన సంఘటనలను ఆధారంగా చేసుకొని ఈ నవలను రచించారు. పాతకాలం దురాచారాల కట్టుబాట్లు మూలగోడలు కూలిపోయి కొత్త పునాదుల మీద గట్టి కట్టడాలు వేస్తున్న తరుణం ఈ **యుగసంధి.** భావాల పరివర్తనలో, సంకల్పాల సాధనలో , సమాలోచన సిద్ధి లో ఉన్న వాతావరణం లో హైదరాబాదు రాష్ట్రంలోని తెలుగు జీవనం అతలాకుతలం అయిపోయింది. దాని వల్ల రాజకీయాలు, సాంఘీక వ్యవస్థలు, ఆచార వ్యవహారాలు అలవాట్లు తారు మారయ్యాయి. అటువంటి పరిస్థితులల్లో నవలల్లోని పాత్రలు జీవిస్తాయి.

ఈ నవల్లో స్త్రీ పాత్రలు హైదరాబాదులో జరిగిన సంక్షోభాలకీ భీభత్సాలకీ గురి అయిన మానవ సంకేతాలు. రుక్మిణి, పద్మ రమణ ఎవరికి వారే విచిత్ర వ్యక్తులు. అయితే ముగ్గురి జీవితం లో నష్ట పోయింది రుక్మిణి మాత్రమే. పద్మ జీవితం చిన్నతనం నుండి వడ్డించిన విస్తరే కాబట్టి కష్టాలంటే ఏమిటో తెలియకుండా కోరుకున్న వారితో కోరుకున్న జీవనం గడిపింది.

ఇక రమణ రుక్మిణిల విషయానికొస్తే ఇద్దరు సాంప్రదాయమైన బ్రాహ్మణ కులంలో పుట్టి పెరిగినా ఒక్కసారి ఆ సంప్రదాయ సంకెళ్లను తెంచుకొని బైటి ప్రపంచంలో అడుగు పెట్టారు. రుక్మిణి జీవితంలో పూర్తిగా ఓడిపోతే, రవణ తన జీవితాన్ని కొత్త మలుపు తిప్పుకొని అనుకొన్నది సాధిస్తుంది. ఈ నవలలో రుక్మిణి పాత్రే ముఖ్యం కాబట్టి మొదట ఆమె కథనే ప్రస్తావిస్తాను.

## రుక్మిణి :

రుక్మిణి చిన్నతనంలోనే భర్తను కోల్పోయిన స్త్రీ. తన ఇంట్లోనే అద్దె కుంటున్న విశ్వేశ్వరరావుతో ఊరు వదలి వెళ్లి పోవటంతో నవల ప్రారంభమవుతుంది. రుక్మిణి తండ్రి ఈశ్వరరావు, ఒకప్పుడు బాగా బతికిన వాడే. అతనికున్న వేశ్యాలంపటంత్వం వల్ల ఉన్నదంతాపోగా మిగిలింది ఇల్లుమాత్రమే. కాని వయస్సుపైబడ్డా చంద్రమ్మను వొదులుకోలేకపోతాడు. రుక్మిణికి ఎనిమిది ఏళ్ల వయస్సున్నప్పుడు వాళ్లింటిముందు ఒక బ్రాహ్మణుడుండేవాడు. ఆ బ్రాహ్మడు వీళ్ల ఇంట్లోనే దేవతార్చనచేస్తు ఇంట్లోకి కావలిసిన నీళ్లు తెచ్చిపోస్తూ వుండేవాడు అప్పుడప్పుడు అతని కొడుకు రామకిష్టయ్య కూడ ఈ పనులు చేస్తూ వుండేవాడు. ఈశ్వర్‌రావు రామకిష్టయ్యకు తన కూతుర్నిచ్చి పెళ్లి చేస్తే తన కూతురు తన కళ్లముందే వుంటుందంటూ, ఎవ్వరెన్ని చెప్పినా వినకుండా పెళ్లిచేస్తాడు. పెళ్లైన ఆ ఇంట్లోకి అల్లుడు నీళ్లు మోస్తుంటే ఊళ్లో వాళ్లు గేలిచేస్తారు. రామకిష్టయ్యకు ఒక సారి తీవ్రమైన జ్వరం వచ్చి చనిపోతాడు. ఆరునెలల్లోనే రుక్మిణి విధవగా పుట్టింటికి తిరిగివస్తుంది.

రుక్మిణికి మొదటినుంచి సాంప్రదాయమంటే భయం, భక్తి, మడి ఆచారాలతో పెరగడం వల్ల పెద్దలు చెప్పిన ప్రతిమాటను నమ్ముతుంది. వాళ్ల కులదైవం నాగుపాము. వాళ్లింట్లోనే వుంటుంది. అది ఎవరికి హానిచేయదు. కాని ఇంట్లో ఏదో అపాయం జరుగబోయేముందు ఇంట్లోవాళ్లకు కనిపిస్తుంది. రుక్మిణి తల్లి రేపు మరణిస్తుందనగా కన్పించింది. వాళ్ల తాతయ్య ఇంట్లో నుండి వేరుపడేముందు కనిపించింది. మళ్లీ ఇన్నాళ్లకు రుక్మిణి విశ్వేశ్వర్‌రావుతో లేచిపోయే ముందు కన్పించింది. నమస్కారం చేస్తే వెళ్లిపోయె పాము వెళ్లిపోక తల రెండుసార్లు నేలకేసి బాదుకొంటుంది. ఏదో గొప్ప అపాయం తనకు జరుగుతున్నట్లు ఆమె గ్రహించినా జరుగవలసిన దుష్కృత్యం ఎన్నడో

తనకు ఒళ్లు తెలియకుండానే జరిగిపోయిందని, ఇంకా జరగేదేముందని మొండి ధైర్యంతో విశ్వేశ్వర్‌రావుతో ఆ ఇంటి గడప దాటుతుంది. రచయిత ప్రారంభంలోనే నాగుపాము ద్వారా రుక్మిణి జీవితం కష్టాలపాలవుతుందని తెలియజేస్తున్నాడు. రుక్మిణి హైదరాబాద్‌లో పాత బస్తీలో కాపురం పెట్టింది. విశాలమైన భవంతిలో ఉండడం అలవాటు పడ్డ రుక్మిణి చిన్నగా వున్న రెండు గదులలో ఉండడానికి ఇబ్బందిపడుతుంది. హైదరాబాదుకు రాగానే ఆర్య సమాజంవాళ్లు చేసే పెళ్లి కోసం ఉబలాటపడుతుంది. విశ్వేశ్వర్‌రావు రోజూ కల్లబొల్లికబుర్లు చెప్తూనే సమయాన్ని దాటేస్తుంటాడు. వచ్చిన వారంరోజుల్లోనే విశ్వేశ్వర్‌రావు తాగుతాడని, వ్యసనాలపుట్టని అర్థమవుతుంది. గట్టిగా పెళ్లికోసం ఒకరోజు నిలదీసినపుడు ఇంకా పెళ్లేందుకంటూ తిడతాడు. ఉంపుడు కత్తెలా ఉండాలా అన్న ప్రశ్నకు "**వొళ్లు కొవ్వెక్కి వచ్చిననీవు అలాకాక మరి ఇంకేలావుంటావనే**" జవాబువస్తుంది. నేను, నా ఇల్లు అని ఎన్నో కోరికలతో, తనను పెళ్లిచేసుకుంటాడన్న నమ్మకంతో మొదట తన శరీరాన్ని అప్పగించిన రుక్మిణి ఆశాసౌధాలు కూలిపోతాయి. విశ్వేశ్వర్‌రావుకు డబ్బుపిచ్చి. డబ్బుకోసం ఎంత నీచానికైన దిగజారుతాడు. విశ్వేశ్వరరావు అప్పిచ్చిన ఒక మిత్రుడు ఒకసారి వచ్చి విశ్వేశ్వర్‌రావుకు అంతకుముందే పెళ్లైనట్లు, అతను అప్పుల ఊబిలో ఇరుక్కుపోయాడని చెబుతాడు. ఒక్క తప్పటడుగుతో తన జీవితమంతా తారుమారైనట్లు అర్థంచేసుకుంది రుక్మిణి. ప్రపంచంలో చాలా మటుకు మానవులు ముందు ముందు ఏదో జరుగుతుందని ఆశతో జీవిస్తారు. నిస్తేజమైన జీవితాన్ని గడుపుతూ కమ్మని కలలు కంటుంటారు. ఎవరికో ఒకరికి తప్ప జీవితం సుఖవంతం కాదని గ్రహించరు. జీవితం ఒక సంఘర్షణ అని తెలిసినా దాన్ని తప్పించుకు తిరుగుతారు. సంఘర్షణ జీవితానికి ప్రాణ ప్రదమైందని గ్రహిస్తే జీవితాన్ని కొంత వరకు చైతన్యవంతం చేసుకోవచ్చు. లేకుంటే విషతుల్యమైన అలసత్వంలోని

జీవితంలోకి నెట్టబడి దుర్భరంగా తయారవుతుంది. సంఘర్షణకు తట్టుకోలేని రుక్మిణి జీవితం కూడా దుర్భరంగా తయారైంది.

విశ్వేశ్వర్‌రావు స్నేహితుడు రామనాథం తన అప్పుకు బదులుగా రుక్మిణిని ఇయ్యమంటాడు. ఎక్కడైన అప్పుకోసం స్వంత స్త్రీని తాకట్టు పెట్టుకుంటారా అని రుక్మిణి అడుగుతుంది. "నీవేమన్నా పుస్తెకట్టి పెళ్లి చేసుకున్నదానివా అంటూ, భార్య విషయంలోనే నాకా పట్టింపు లేనప్పుడు ఏదో మదమెక్కి నా వెంట బడిన మనిషి విషయంలో ఎందుకాలోచిస్తాను"అని విశ్వేశ్వర్‌రావు జవాబిస్తాడు. తన శీలం ఎలాగు చెడింది కాబట్టి అతనికి డబ్బు సమకూర్చడంలో తన కంటె ఇచ్చి సహాయపడుతుంది. కంటె తీసుకెళ్లిన నాటినుండి విశ్వేశ్వర్‌రావు పత్తావుండడు. వెండి, బంగారు వస్తువులను తాకట్టుపెట్టితే ఒకసారి కాకున్నా ఒకసారి విడిపంచుకోవాలనే తాపత్రయం ఉంటుంది. స్త్రీని తాకట్టు పెట్టితే అది విడిపించుకునే వస్తువుకాదని తాకట్టు పెట్టేవారికి, తీసుకున్నవారికి తెలుసు. వెండి బంగారాల ముందు మానవ జీవితానికి, ముఖ్యంగా స్త్రీకి విలువ లేదని తెల్సు. ఆ రకంగా విశ్వేశ్వర్‌రావు చేతిలో నుంచి, రామనాథం చేతుల్లోకి మారింది రుక్మిణి. విశ్వేశ్వర్‌రావుతో లేచి వచ్చినపుడు ఆమె హృదయంలో ఇంద్రధనస్సు వెలిగింది. జీవితమే చాకిరిగా భావించిన ఆమె హృదయపు వెలుగులో ఆశలు, ఆశయాలు చిగురించాయి. పత్నిగా గృహ యజమానురాలిగా సంఘంలో స్థానం లభిస్తుందని అనుకున్న రుక్మిణికి విశ్వేశ్వర్‌రావు వెళ్లిపోవడంతో కట్టుకున్న ఆశా సౌధాలు కూలిపోయాయి. తను పత్ని స్థానంనుంచి ఉంపుడుగత్తెగా మారడంతో ఆమె హృదయం స్పందించడం మానుకుంది. ఆరోజు నుంచి నిర్లిప్తత ఆమె జీవితంలో చోటుచేసుకుంది.

ఒకడు రుక్మిణిని గొడ్డును అమ్మినట్లు అమ్మితే, ఇంకొకడు ఆ గొడ్డును కొన్నాడు, గొడ్డు చేతులు మారింది. కొనుగోలుదారు

